తెలుగు అకాడమి ప్రచురణలు-(బి.ఏ.) 74



# కావ్యాలోకము

రచయిత

డా॥ ఎన్. వి. ఆర్. కృష్ణమాచార్యులు, ఎం.ఏ., పి.హెచ్‌డి.

ప్రిన్సిపాల్, డా॥ వి. యస్. కె. గవర్నమెంట్ కళాశాల, విశాఖపట్నము—10.






తెలుగు అకాడమి
హైదరాబాదు
1973

B. A. KAVYALOKAMU : Author : Dr N. V. R. Krishnamacharyulu, First Edition, 1973; pp; xii + 296







*First Published*, 1973
*Copies* 2,000

Published by TELUGU AKADEMI, HYDERABAD-500029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional languages at the University level, of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



**Price : Rs. 9-25**



PRINTED IN INDIA
Text at Viswabharathi Welfare Printing Press, Punjagutta Hyderabad-500004
Cover at the A P. Textbook Press Mint Compound, Hyderabad-500004.
Andhra Pradesh.

# భూమిక

భారత ప్రభుత్వంవారి ఆర్థికసహాయంతోను, ఆంధ్రప్రదేశ ప్రభుత్వమూ, రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలూ అందిచ్చిన సహాయ సహకారాలతోను, తెలుగు అకాడమి ఇంటర్మీడియట్ పాఠ్యగ్రంథాలను ప్రచురించి విద్యార్థుల, ఉపాధ్యాయుల ఆదరాభిమానాలు చూరగొన్నదని అందరికీ తెలుసు. అత్యల్పవ్యవధానంలో, రాష్ట్రాన్ని ఆవరించిన సంక్షోభ సమయంలో, మొట్టమొదటిసారిగా విశ్వవిద్యాలయస్థాయిలో తెలుగులో పాఠ్యగ్రంథ ప్రచురణ చేపట్టి సకాలంలో ఆ బృహత్కార్యాన్ని అకాడమి విజయవంతంగా నిర్వహించగలిగింది.

పాఠ్యగ్రంథాలను ప్రచురించటంతో తన బాధ్యత తీరినట్లు తెలుగు అకాడమి భావించలేదు. రాష్ట్రంలోని విభిన్న ప్రాంతాలలో ఉపాధ్యాయ ప్రతినిధులను సమావేశపరిచి ఆయా గ్రంథాలను కూలంకషంగా విమర్శింపజేసింది. చర్చాఫలితాలను నిపుణుల, సంపాదకుల, రచయితల దృష్టికి తెచ్చినమీదట ఆయా గ్రంథాలను పరిష్కరించి పునర్ముద్రించినాము. ఈ కార్యభారాన్ని కూడా అకాడమి సకాలంలోనే నెరవేర్చగలిగింది.

1970 సెప్టెంబరునెల మధ్యలో హైదరాబాద్‌లో జరిగిన సమావేశంలో రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులూ – డిగ్రీస్థాయిలోకూడా విద్యాబోధన తెలుగులో జరుగుతుంది కాబట్టి–విద్యార్థుల, ఉపాధ్యాయుల ఉపయోగార్థము డిగ్రీస్థాయి శాస్త్రగ్రంథప్రచురణ తెలుగు అకాడమి చేపట్టవలెనని తీర్మానించినారు. అంతేకాదు 1971 సెప్టెంబరులోగా ఒక్కొక్కశాఖలో కనీసం ఒక్కొక్క గ్రంథాన్ని అయినా అకాడమి ప్రకటించవలెనని ఆదేశించినారు. అక్టోబరునెల ఉత్తరార్ధంలో మూడు విశ్వవిద్యాలయాలలో ఆయా శాఖలకు అధిపతులుగా ఉన్నవారు, పాస్‌బోర్డ్సు అధ్యక్షులు అకాడమిలో ఏర్పాటైన సమావేశాలలో పాల్గొని మూడు విశ్వవిద్యాలయాల పాఠ్యప్రణాళికలను సమన్వయించి, సమగ్రపాఠ్యప్రణాళికను నిర్ణయించడంతోపాటు అనుభవజ్ఞులైన అధ్యాపకులు మొదలైనవారిని ఆయా గ్రంథాలకు రచయితలుగా సంపాదకులుగా ఎన్నిక చేసినారు. నవంబరు రెండోవారంనుంచి గ్రంథరచనతో సంబంధమున్న వారందరూ ప్రాథమిక సమావేశాలు జరిపి ఆయా గ్రంథాల రచనా విధానాలను నిర్ణయించుకొన్నారు.

1971 మే నెలనుంచి ప్రథమ సంవత్సరానికి కావలసిన గ్రంథాల వ్రాతప్రతులు అకాడమికి చేరడం ఆరంభమయింది. గ్రంథ రచనారంభానికీ పూర్తిచేయడానికీ

మధ్యకాలము ఆరునెలలు మాత్రమే. ఈ అల్పవ్యవధిలో అకాడమి అనేక నూతన సమస్యలను ఎదుర్కోవలసి వచ్చింది. పెక్కు ఇబ్బందులను అధిగమించవలసి వచ్చింది.

ప్రచురించవలసిన గ్రంథాలసంఖ్య (ఇంటర్మీడియట్‌లోని) 60 నుంచి (డిగ్రీ స్థాయిలో) రమారమి నాలుగింతలు పెరిగింది. సమగ్ర పాఠ్యప్రణాళికను అనుసరించి ఒక్కొక్క శాస్త్రంలోని భిన్నశాఖలలో ప్రతిదానిలోనూ కనీసం ఒక పుస్తకమైనా ప్రచురించవలసిరావటం ఇందుకు ప్రధానకారణము. శాస్త్రాల సంఖ్య (ఇంటర్మీడియట్‌లోని) 13 నుంచి (డిగ్రీస్థాయిలో) 20 కి పెరిగింది. వీటిలో మొదటిసారిగా ప్రాథమిక జీవికా విద్యలలో ఒకటైన బి కాం. చదువుకు కావలసిన గ్రంథాలనుకూడా ప్రచురించవలసి వచ్చింది. ఈ కార్యభారమెంతగా ఉన్నా, ఒక్కొక్క శాస్త్రంలో కనీసం రెండు గ్రంథాలనయినా సెప్టెంబరులోగా అందించటానికి ప్రయత్నించినాము. ఈ సందర్భంలో వచ్చిన బృహత్తర సమస్య పారిభాషికపదసంచయనము.

అకాడమి పారిభాషికపదాల విషయంలో మూడు ప్రధాననియమాలను పాటించింది : (1) సంకేతాలు, సమీకరణలు, రసాయనద్రవ్యాలు, జంతువృక్ష నామధేయాలు, మూలకాలు, మొదలైనవాటి విషయంలో అంతర్జాతీయపారిభాషిక పదాలను ప్రతిలేఖించటం (Transliteration), (2) ఇంతవరకూ వాడుకలో ఉన్న తెలుగుపదాలు పనికివస్తాయన్న వాటినే వాడటం; (3) భారతప్రభుత్వంవారు సంతరించినశబ్దజాలము తెలుగుభాషా లక్షణాలకు సరిపడినట్లయితే స్వీకరించటం. ఈ పారిభాషికపదాల సంఖ్య లక్షలలో ఉండటంవల్ల మూలభాషలలో వాటికున్న అర్థవిశేషాలను, వ్యుత్పత్తులను, నిర్వచనాలను పరిశీలించి చర్చించి అధికసంఖ్యాక నిపుణులు అంగీకరించినవిధంలో పట్టికలు తయారుచేయటం బహు కష్టసాధ్యమే అయింది. భిన్నశాస్త్రాలలో భిన్నార్థాలలోగాని ఏకార్థంలోగాని ఉపయోగపడే సమానపారిభాషికపదాల విషయంలో ఏకవాక్యతను ఏకరూపతను సాధించటానికి చాలా శ్రమించక తప్పలేదు.

ఈ గ్రంథంలో ఉపయోగించిన పారిభాషికపదాల విషయంలో మరి రెండు మూడు విశేషాలను ప్రత్యేకించి చెప్పవలసిఉంది. పూర్వగ్రంథాల ద్వారాగాని అకాడమి పాఠ్యగ్రంథాల ద్వారాగాని వాడుకకెక్కిన తెలుగు పారిభాషికపదాలను పునరుపయోగంలోకి తెచ్చినాము. తెలుగు భాషాస్వభావానికి విరుద్ధంకాని జాతీయ భాషాపదాలను కూడా ఉపయోగించినాము. ఇందుకు ప్రధానకారణము ఏనాటికైనా తెలుగుమాటలతోనే శాస్త్రబోధన చేయవలసివస్తే అప్పటి అవసరాలకు సరిపడినంత మూలపదసంపదను ఇప్పుడే సంతరించవలెనన్న ఆశయం మాత్రమే. ఇటువంటిపదాల పక్కన అంతర్జాతీయ పారిభాషిక పదాలను ఆంగ్లలిపిలో కుండలీకరించి ఇచ్చినాము. కాబట్టి పఠన పాఠనాలకు ఇబ్బంది కలగదని ఆశిస్తున్నాము. అంతర్జాతీయ పారిభాషికపదాలనే వాడి తెలుగు మాటలు వాడనప్పుడు ప్రతిలేఖనం (Transliteration) చేసి కుండలీకరణాలలో ఆంగ్లలిపిలో ఆయా పదాలను సమకూర్చినాము. తెలుగుమాటలను వాడినచోట్ల ప్రతిలేఖనం

చేయలేదు. గ్రంథమధ్యంలోనూ గ్రంథాంతపట్టికలోనూ ఆంగ్లంలో ఇచ్చిన పదాలను బట్టి ప్రతిలేఖనాలను పాఠకులు గ్రహించగలరన్న విశ్వాసమే అందుకు కారణము. కాబట్టి, ఈ సంధికాలంలో అంతటా అంతర్జాతీయ పారిభాషికపదాలనే వాడదలచు కొన్నవారు తెలుగు మాటలకుబదులు ప్రతిలేఖనాలనే వాడుకోవచ్చు.

అయితే పెద్దఎత్తున స్వల్పవ్యవధిలో చేసిన ప్రతికార్యాన్నీ పునర్విమర్శించి నప్పుడుగాని పరిష్కరించటం సాధ్యపడదు ఇంటర్మీడియట్ పుస్తకాల విషయంలోవలెనే డిగ్రీస్థాయిగ్రంథాల విషయంలోనూ చర్చలు జరుపుతున్నాము. అనుభవసంపాదనంవల్ల పునర్ముద్రణలో చాలా మెరుగులు పెట్టగలమని ఆశిస్తున్నాము.

శాస్త్రగ్రంథ ప్రచురణతోబాటు ఆంగ్లభాషలోని ప్రామాణికశాస్త్రీయగ్రంథా లను తెలుగులోకి అనువదించే కార్యభారంకూడా అకాడమి మీదనే ఉన్నది. భిన్న శాస్త్రాలకు చెందిన రమారమి 70 పుస్తకాలకు అనువాదాలనుకూడా ఇదేసమయంలో తలపెట్టినాము.

డిగ్రీస్థాయి గ్రంథాలను రచించటంలో కొద్దిపాటి మార్పులు చేసినాము. ఆయా గ్రంథాలను కొందరు రచింపగా మరికొందరు సంపాదకత్వంవహించి పరీక్షిస్తారు. కొన్ని సమయాలలో విశ్వవిద్యాలయాచార్యులే (వీరిని పూర్వం నిపుణులని వ్యవహరించినాము) సంపాదకులుగా ఉంటారు. సాధారణంగా ఒక్కొక్క గ్రంథానికి ఒకే ఒక సంపాదకు డుంటాడు రచయితలు మాత్రం సాధారణంగా ఒకరికి మించి ఉంటారు. సాధారణంగా ఆయా శాస్త్రాలలో విశేషపరిశోధన చేసినవారే ఆయా గ్రంథాలకు సంపాదకులు; బోధనలో బాగా అనుభవం ఉన్నవారే రచయితలు. డిగ్రీస్థాయి పుస్తకాలవిషయం కాబట్టి ఆధునిక విజ్ఞానావసరాలను గుర్తించి ఈ ఏర్పాటు చేయవలసివచ్చింది. ఈ స్థాయిలో ఒక శాస్త్రాన్ని కొందరు ప్రత్యేకవిషయంగాను, మరికొందరు సాధారణ విషయంగాను చదువుతారు. వీలయినంతవరకూ ఆ యా విద్యార్థుల అవసరాలకు అనుగుణంగానే ప్రత్యేక గ్రంథాలు ప్రచురిస్తున్నాము.

ద్వితీయ సంవత్సరానికి కావలసిన గ్రంథాలను చాలాముందుగా ప్రచురించ వలెనని ఎంతప్రయత్నంచేసినా వాటిప్రాత ప్రతులు 1972 ఏప్రిల్ నెల నుంచి మాత్రమే అకాడమికి చేరడం ఆరంభమైంది. అందుచేత ఈసారికూడా పుస్తకప్రచురణలో కొంత ఆలస్యము తప్పలేదు.

ప్రకృత గ్రంథరచనావిధానాన్ని, అందులోని విశిష్టతను, 'ప్రవేశిక'లో రచయి తలూ సంపాదకులూ వివరించినారు. విద్యార్థుల, అధ్యాపకుల ఉపయోగార్థము ఇంగ్లీషు-తెలుగు, తెలుగు-ఇంగ్లీషు పారిభాషికపదపట్టికలనుప్రత్యేకించి గ్రంథాంతంలో ఇచ్చినాము. గ్రంథంలో కూడా తెలుగులో పారిభాషికపదాలను మొదటవాడినప్పుడు అంతర్జాతీయ పర్యాయపదాలను కుండలీకరణాలలో పేర్కొన్నాము. ఈ గ్రంథప్రచురణకు కేంద్ర

రాష్ట్రప్రభుత్వాలు, విశ్వవిద్యాలయాలు, అకాడమి పాలకవర్గమూ, ఉద్యోగులు, రచయితలు, సంపాదకులు, నిపుణులు, ముద్రాపకులు, బ్లాక్ మేకర్సు మాకిచ్చిన సహాయ సహాకారాలకు మేము కృతజ్ఞులము.

ప్రకృత గ్రంథప్రచురణలో మాకు తోడ్పడిన నిపుణులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారికి, శ్రీ మిరియాల రామకృష్ణగారికి, ముఖచిత్ర రచయిత శ్రీ యమ్. ఆర్. బలరామాచార్యకు మేము కృతజ్ఞులము

ఈ గ్రంథము మా పూర్వప్రచురణ లన్నింటివలెనే అందరి ఆదరాభిమానాలు సంపాదించగలమని విశ్వసిస్తున్నాము. ప్రథమప్రయత్నం కాబట్టి ఏవైనా కొన్ని పొరపాట్లు వచ్చి ఉంటాయి పరిష్కృతపునర్ముద్రణలో ఆ యా లోపాలను పరిహరించ గలమని ఆశిస్తున్నాము.

# ప్రవేశిక

కావ్యాలోకము కావ్యశిల్పము, అలంకారశిల్పము, ఛందస్సులకు ముయ్యేలగుట్ట.

విశ్వకళాపరిషత్ కళాశాలలలో తెలుగును అభిమానవిషయముగా అధ్యయనము చేయు విద్యార్థులకు ఉపయుక్తమగు పాఠ్యగ్రంథమిది.

కావ్యశిల్పములో ప్రాచీన భారతీయాలంకారికుల కావ్యమీమాంసతోపాటు ప్రతీచీ సాహితీవేత్తల అభిప్రాయముల సమీక్ష-సమన్వయము గాననగును.

ఛందః ప్రకరణమున పూర్వలాక్షణికుల అభిప్రాయములు సోదాహరణముగ వివరింపబడినవి.

అలంకారప్రకరణమున ప్రాచీన సంస్కృతాలంకారికుల మతములు వివరించు టతో పాటు - తెలుగు కావ్యములలోని ఉదాహరణములు ప్రదర్శితములు.

కావ్యాలోకము - కావ్యమీమాంసలో - ఒక సర్వదర్శన సారసంగ్రహము. ఈ కృషి - సాహితీ పట్టభద్రులు కాగోరువారికేగాక - బహుళాంధ్రోక్తిమయ ప్రపంచములో సాహితీ ప్రాగల్భ్యము సముపార్జించదలపోయు సహృదయులకుగూడా ఉపకరించినచో రచయిత ధన్యుడు.

కావ్యజగత్తును అనుశీలించు సహృదయులకు "మనోనేత్రము"-వికసింపవలసి యున్నది. కావ్యాలోకము ఆ మనోనేత్రమునకు ఆలోకనము.

# విషయసూచిక

## ప్రథమ ఖండము

### కావ్యశిల్పము


1. కావ్యప్రయోజనములు 1-5

2. కవి-కావ్యాత్మ 6-17
   కావ్యనిర్వచనములు-సంస్కృతాలంకారికులు, అలంకార శాస్త్రములు, కాలములు:-.6

3. ధ్వనిసిద్ధాంతము 18-26

4. ప్రాచ్యప్రతీచీదృక్పథములు 27-33

5. కావ్యహేతువులు 34-36

6. కావ్యభేదములు 37-54
   (1) ప్రబంధము-37, (2) చతుర్విధ కవిత్వములు-38, (3) ముక్తకము-39, (4) ఖండకావ్యము-39, (5) లఘుకృతులు-41 (6) బిరుదావళి-42 (7) ఉదాహరణము-42, (8) శతకము-43, (9) దండకము, (10) ఆఖ్యాయిక, (11) ఉపాఖ్యానము (12) ఆఖ్యానము (13) ఇతిహాసము, (14) పురాణము-45, (15) మణిప్రవాళము (16) చాటువులు-46, (17) యక్షగానములు-51.

7. శయ్యాపాకములు 54-61
   శయ్య-54, పాకములు : ద్రాక్షాపాకము-57, కదళీపాకము-58, నారికేళపాకము-59.

8. నాయక నాయికా భేదములు 62-67
   నాయకభేదములు : ధీరోదాత్తుఁడు-62 ధీరోద్ధతుఁడు, ధీరశాంతుఁడు-63; ధీరలలితుఁడు, దక్షిణనాయకుఁడు-64, రాగిణి, రాధ, నాయికాభేదములు-65

9. గుణదోషములు 68-71
   కావ్యగుణములు-68, కావ్యదోషములు-69,

10. దృశ్యకావ్యములు 72-80
    నాటకము : నాంది-73 సూత్రధారి-74, ప్రస్తావన-75, అంకము, అర్థోపక్షేపకములు-76, భరతవాక్యము, పంచ

సంధులు, ప్రకరణము భాణము-78 ప్రహసనము, డిమము వ్యాయోగము, సమవకారము, వీథి, అంకము-79, ఈహామృగము, ఉపరూపకములు-80.

11. రససిద్ధాంతము 81–108
రసము, సహృదయుడు-81, రసము యన్నిష్ఠము ? రస సంఖ్య-85, రసస్వరూపము-89, విభావములు-90 అను భావములు, సాంత్త్వికభావములు, సంచారిభావములు-91, శృంగారచేష్టలు-92, మన్మథావస్థలు-94, రసాభాసము-94, శాకరససిద్ధాంతము. రససిద్ధాంతము - 95, శృంగార రసప్రాముఖ్యము-97, అద్భుతరసము, శాంతరసము-98, భయానకరసము, బీభత్సరసము, రౌద్రరసము, వీరరసము-99, కరుణరసము-100, హాస్యరసము - 101.

## ద్వితీయ ఖండము

## అలంకారశిల్పము

1. అలంకారములు-ప్రస్తావన 107–109
ఆలంకారిక మతసమన్వయము-107.

2. శబ్దాలంకారములు 110–116
(1) అనుప్రాసాలంకారము: - 110, ఛేకానుప్రాసము, వృత్త్యనుప్రాసము - 111, అంత్యానుప్రాసము - 112, లాటానుప్రాసము-113
(2) యమకాలంకారము : 113.
(3) ముక్తపదగ్రస్తాలంకారము-114.
(4) చిత్రాలంకారములు . నాగబంధము-115.

3. అర్థాలంకారములు,
వివిధాలంకారికుల మతములు 117–121
శబ్దాలంకారముల వైశిష్ట్యము-117 సంస్కృతవాఙ్మయము : అలంకారములు, అలంకారముల సంఖ్య అలంకారలక్షణ గ్రంథములు-118, అలంకారవర్గీకరణము: వివిధ మతములు : రుద్రటుని వర్గీకరణము-119, రుయ్యకుని వర్గీకరణము, విద్యానాథుని వర్గీకరణము-120.

4. ఉపమ అనన్వయము, ఉపమేయోపమ ప్రతీపము 122–134
(1) ఉపమాలంకారము : 122 ; ఉపమాలంకారము - ఆలంకారికులు-123 : ఉపమాభేదములు-దండి - 124 ;

ఉపమాలంకారము-రూపాంతరములు-127; లుప్తోపమా భేదములు : ఉపమానలుప్త, ధర్మలుప్త, వాచకలుప్త, ధర్మవాచకలుప్త-129, ధర్మోపమానలుప్త, వాచకోపమేయలుప్త. ధర్మోపమాన వాచకలుప్త, సర్వవస్తు విషయోపమ, మాలోపమ-130. ముఖపద్మముల సాదృశ్యము - 131. అలంకారాభాసములు (2) అనన్వయాలంకారము (3) ఉపమేయోపమాలంకారము- 132 (4) ప్రతీపాలంకారము : ఉపమానమునకు ఉపమేయత్వ కల్పన, ఉపమేయ తిరస్కారము - 133, ఉపమాన తిరస్కారము, ఉపమాన అనిష్పత్తి. ఉపమానకిమర్థత 134.

| | | |
|---|---|---|
| 5. | రూపకము పరిణామము | 135-138 |
| 6. | ఉత్ప్రేక్ష | 139-142 |
| 7. | స్వభావోక్తి, యథాసంఖ్యము | 143-145 |
| 8. | ఆక్షేపము, విరోధాభాసము | 146-147 |
| 9. | విభావన, అసంగతి, చిత్రము | 148-149 |
| 10. | అన్యోన్యము, ఉల్లేఖము | 150-151 |
| 11. | అపహ్నుతి | 152-153 |
| 12. | అతిశయోక్తి | 154-155 |
| 13. | తుల్యయోగిత, దీపకము | 156 |
| 14. | ప్రతివస్తూపమ, దృష్టాంతము, నిదర్శనము, పర్యాయము | 157-159 |
| 15. | అర్థాంతర న్యాసము | 160-162 |
| 16. | వక్రోక్తి, పర్యాయోక్తి | 163-164 |
| 17. | శ్లేష | 165-166 |
| 18. | అప్రస్తుత ప్రశంస, సమాసోక్తి, లలితము | 167-169 |
| 19. | వ్యతిరేకము, సందేహము, భ్రాంతిమంతము, స్మరణము | 170-175 |
| 20. | సహోక్తి, వినోక్తి, వ్యాజోక్తి, లోకోక్తి | 176-178 |
| 21. | పరికరము, పరికరాంకురము, ముద్ర | 179-180 |
| 22. | అర్థాపత్తి, తద్గుణము, అతద్గుణము, | 181-182 |
| 23. | విషమము, సమము, సారము, అధికము, ఏకావళి | 183-185 |
| 24. | విశేషోక్తి, కారణమాల, అనుమానము, కావ్యలింగము | 186-189 |
| 25. | వ్యాజస్తుతి, వ్యాజనింద | 190-191 |
| 26. | సంసృష్టి, సంకరము | 192-195 |
| 27. | సమీక్ష | 196 |

## తృతీయ ఖండము

### తెలుగు కవిత - ఛందస్సు


| | | |
|---|---|---|
| 1. | తెలుగు కవిత — ఛందస్సు | 199—201 |
| 2. | గురు లఘువులు | 202—204 |
| 3. | యతిస్వరూపము | 205—207 |
| 4. | ప్రాసవిశేషములు | 208—218 |
| 5. | సూర్య - ఇంద్ర - చంద్రగణములు | 219—220 |
| 6. | జాతులు | 221—228 |
| 7. | ఉపజాతులు | 229—237 |
| 8. | గేయములు | 238—243 |
| 9. | అక్షరమాత్రాగణములు | 244—246 |
| 10. | సంస్కృతాంధ్ర వృత్తములు | 247—249 |
| 11. | వృత్తలక్షణములు | 250—253 |
| 12. | వృత్తముల మార్పులు | 254—257 |
| 13. | మాలికా వృత్తములు | 258—261 |
| 14. | క్రౌంచపదవృత్తము | 262—264 |
| 15. | యతిభేదములు | 265—266 |
| 16. | స్వరయతులు | 267—270 |
| 17. | వ్యంజనాక్షరయతులు | 271—282 |
| 18. | ఉభయయతులు | 283—290 |
| 19. | ప్రాసయతి | 291—292 |
| 20. | ర ల యతి, ఋకారయతి, అఖండయతి | 293—296 |




# 1

# కావ్య ప్రయోజనములు

కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతర క్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే.

—మమ్మటుఁడు—కావ్యప్రకాశము

"కావ్యము యశస్సు కొఱకు ; ధనము కొఱకు ; వ్యవహార విజ్ఞానము కొఱకు ; అశుభనివారణము కొఱకు ; తత్క్షణము జీవన్ముక్తి ప్రదాయక మైన ఆనంద తన్మయత్వము కొఱకు ; కాంతా సమ్మితమైన కర్తవ్య ప్రబోధము కొఱకు "—సంస్కృతాలంకారికుడు, కావ్యప్రకాశకర్త మమ్మటుని నిర్వచనము మిక్కిలి అర్థవంతమైనది.

విశ్వ సాహితీ జగత్తులో కావ్య నిర్వచనమునుగూర్చి, కావ్య ప్రయోజన మునుగూర్చి చెలరేగిన బహుళ వాదోపవాదములను సమీక్షించి సూత్ర ప్రాయముగా సారాంశమును చిలికి వెన్నముద్దవలె సహృదయుల కందించు చున్నది మమ్మటుని కావ్య ప్రకాశములోని పై శ్లోకము.

ప్రాచ్య ప్రతీచీ సాహితీవేత్తలు పలువురు యుగ యుగాంతరములలో కావ్య నిర్వచనమునుగూర్చి, కావ్య ప్రయోజనమునుగూర్చి పలువిధములగు అభిప్రాయములను వెల్లడించి యున్నారు. పండితులలో కావ్యప్రయోజనమును గూర్చి ఏక వాక్యతగాని, కావ్యనిర్వచనమున ఏకగ్రీవాభిప్రాయము గాని ఏర్పడకపోవుట వింత గాదు. మమ్మటుని శ్లోకము ప్రస్తరించి సమీక్షింపదగినది.

కావ్యము యశస్సు కొఱకు :—

యుగయుగాంతరములనుండి కవీశ్వరులు సంపాదించుకొన్నది ప్రధాన ముగా యశస్సే. మిల్టను మహాకవి యశః ప్రలోభము మహాత్ములలో నుండు అంతిమ దౌర్బల్య మని వచించెను.[1] మానవ చరిత్రలో ఆచంద్రతారార్కమైన కీర్తి ఎవరికి లభించినది ? గ్రంథకర్తలకే.

జయంతి తే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్

—భర్తృహరి—నీతి శతకము—విద్వత్పద్ధతి

"జయము జయము
రస సిద్ధులు సుకృతులునైన కవీశ్వరులకు జయము.
జరామరణ విరహితమైన శాశ్వతకీర్తి వైభవ జీవితము వారికే దక్కినది"

అన్న ప్రశంస సార్థకమైనదే.

---

[1] **Fame - the last infirmity of noble minds—*Milton*.**

కావ్యము అర్థము కొఱకు :—

కావ్యము ధనార్జనమునకు తోడ్పడుననుట తేటతెల్లమైన సంగతి. ప్రపంచములో ధనార్జనమునకు ఉగ్గడింపదగిన ఉత్కృష్టమార్గము కావ్యసృష్టి. లేదా కావ్య పాండిత్య మనుట సహృదయులకు అనుభవ సిద్ధమైన విషయము. ఈషణత్రయము - దారేషణ, ధనేషణ, పుత్రేషణ — సమస్త సృష్టిని పరిపాలించునని పెద్ద లందురు. అందును మనుష్యులలో ధనేషణ ప్రబలమైనది. అయినను కావ్యవిషయమున మాత్రము శ్లోక కర్త యశస్సునకే ప్రాథమ్యము నొసగుట గుర్తింపదగినది. ధనార్జనమును తృణీకరించి కేవలయశస్సుకోసమే కావ్యోపాసన సల్పిన సత్కవీంద్రు లెందరు లేరు? వారికి ప్రపంచ చరిత్ర నేటికిని జేజేలు చెప్పుచున్నది.

కావ్యము వ్యవహార జ్ఞానముకొఱకు :—

కావ్యము లోకవృత్తాంతదర్శకము. సమాజమునకు సాహిత్యమునకు గల బింబ ప్రతిబింబభావము సుప్రసిద్ధము. కావ్యములు అనుభవనిక్షేపములు. సమకాలీన లోకానుభవము సంపాదించుటకే యేండ్లును పూండ్లు పట్టును. కావ్యములుమానవుల చిరకాలానుభవములను భద్రపఱచుచున్నవి. యుగ యుగాంతరముల అనుభవములను కొన్ని గడియలలో గ్రంథములు పాఠకునకు కరతలామలకము చేయుచున్నవి.

కావ్యము అశుభ నివారణము కొఱకు :—

అశుభ నివారణకు ప్రథమ ప్రధానాయుధము కావ్యమే.

కావ్యము సద్యః పర నిర్వృతికొఱకు :—

ఐహికమును విస్మరింపజేసి, పుడమి కవ్వలి వెలుగులు దర్శింపజేసి తత్క్షణము ఆనందతన్మయత్వము గల్పించునది కావ్యము. ఈ ఆనందమునే ఆలంకారికులు 'రసము' 'రసానందము' అన్నారు. కళ, కళ కొఱకే; కావ్యము రసానందము కొఱకే అని వాదించువారు గలరు. విశ్వశ్రేయః కావ్యమ్— కావ్యము విశ్వశ్రేయస్సుకొఱకు మాత్రమే; "జగద్ధితంబుగన్" కవులు కావ్యములు వ్రాయుదురు—వ్రాయవలెనను వాదము గలదు.

కావ్యము కాంతాసమ్మితమైన కర్తవ్య ప్రబోధము కొఱకు :—

వేదములు ప్రభు సమ్మితములు

పురాణములు మిత్ర సమ్మితములు.

కావ్యములు కాంతా సమ్మితములు.

కర్తవ్యోపదేశములో వేదములు ప్రభువువలె 'ధర్మంచర' — 'సత్యంవద'; ధర్మము నాచరింపుము; సత్యము వచింపుము—అనుచు అనుశాసించును.

పురాణములు మిత్రునివలె ఉదాహరణములతో, ఉపాఖ్యానములతో కథలు చెప్పి ప్రబోధము సల్పును.

కావ్యములు మనోహారియైన ప్రేయసి వలె హృదయంగమముగ కర్తవ్యమునకు ఉన్ముఖత కలిగించును. కాంతాసమ్మిత మనుటచేత, మొరటుగగాని, వాచ్యముగాగాని గాక వ్యంగ్య ఫణితిలో ధ్వని ప్రధానముగ కర్తవ్యోపదేశము కావ్యమున జరుగవలెనని నిర్దేశము.

నోరు తెరచి అడుగకయే ప్రేయసి తన కోరికను ప్రియునకు స్వయం వ్యక్తము చేయగల నిసర్గ నైపుణ్యము గలది కదా.

కాని — కావ్యములో నీతి బోధ అవసరమా ?

'కావ్యము కావ్యము కొఱకే—'అనువారును గలరు.

కాంతాసమ్మితముగానే గాక ప్రత్యక్షముగా ఉపదేశించుట గూడ కావ్యమర్యాదకు కళంకము గాదను వాదము లేకపోలేదు.

సుమతిశతకమును — భర్తృహరిసుభాషితములను కావ్యములుగనే లోకము పరిగణించుచున్నది.

కాంతా సమ్మితమైన ఉపదేశము కావ్యలక్షణమని తెలుగులో భట్టుమూర్తి కావ్యాలంకార సంగ్రహమున వివరణముతో అభివర్ణించెను.

వేదంబుల్ నృపశాసనంబులు ; సుహృద్విజ్ఞాపనంబుల్ పురా
ణాదిగ్రంథము; లంగనాజన విలాసాలాప లీలాసమ
ప్రాదుర్భావము లౌర కావ్యములు కర్తవ్యోపదేశక్రియా
వాద ప్రక్రియ నెన్న కావ్యమహిమల్ వర్ణింపఁగా శక్యమే.[2]

కావ్యమునకు—కావ్యకర్తయైన కవికిని గల యెనలేని గౌరవమును జగన్నాథ పండితరాయల శ్లోకము ప్రకటించుచున్నది.

వ్యాసతు సతు గౌతమతు వ్యాశేంద్రతు యస్య నాస్తి సాహిత్యం
తంప్రతి సంప్రతి కంప్రతి శిరోమమ తిరశ్చ న పురశ్చ న

"సాహితీవ్రతుడు కానివాడు వ్యాసుడు కానిమ్ము, గౌతముడుకానిమ్ము. పతంజలి కానిమ్ము. వానికి నాశిరస్సు తిరస్కారముగాని పురస్కారముగాని చూపక ఉదాసీనతనే ప్రకటించును!"

శాస్త్రపండితులు విద్వజ్జనాదరణము పొందవచ్చును. కావ్యము సర్వజన హృదయరంజకము గావున సంఘములో కావ్యకర్తకు విశిష్టస్థాన మేర్పడినది. కావున కావ్యస్వరూపమునుగూర్చి, కావ్య నిర్వచనమునుగూర్చి సాహితీ వేత్తల అభిప్రాయముల సమీక్షించుట సమంజసము.

---

[2]యద్వేదాత్ ప్రభుసమ్మితా దధిగతం శబ్దప్రధానాత్ చిరం
యచ్చార్థ ప్రవణాత్ పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్
కాంతాసమ్మితయా యయా సరసతా మాసాద్య కావ్యశ్రియా
కర్తవ్యే కుతుకీ బుధో విరచిత స్తస్మై స్పృహాం కుర్మహే.

—ప్రతాపరుద్రీయము

# 2

# కవి - కావ్యాత్మ

ప్రప్రథమమున, "కవి ర్మనీషీ పరిభూః స్వయంభూః" అని కవిశబ్దము బ్రహ్మకు పర్యాయపదముగా వైదిక మంత్రములందు గానవచ్చెడి.

పిమ్మట, స్రష్టను సందర్శించిన ద్రష్టగ, ఋషిపరముగ కవిపదము ప్రయుక్తము.

'నానృషిః కురుతే కావ్యమ్'—ఋషికానివాడు కావ్యస్రష్ట కాలేడు.

'కవయః క్రాంతదర్శినః'—కవులు క్రాంతదర్శులు.

తెలుగున గల 'రవి గాంచనిచో కవి గాంచును' అను లోకోక్తి ఇట అనుసంధేయము.

క్రాంతదర్శియైన ఋషి, తాను సందర్శించిన దానిని ప్రదర్శించినపుడు—అనగా వర్ణించి సహృదయులకు తెలిపినపుడు కవియగును. భట్టతౌతుని దృష్టిలో కవియన ద్రష్ట మాత్రమే కాడు. కవికి అవశ్యకర్తవ్యము "వర్ణన."

"నానృషిః కవిరిత్యుక్తమృషిశ్చ కిల దర్శనాత్
విచిత్రభావధర్మాంశతత్త్వ ప్రఖ్యాచదర్శనం
స తత్త్వదర్శనాదేవ శాస్త్రేషు పఠితఃకవిః
దర్శనాద్వర్ణనా చ్చాథ రూఢా లోకే కవిశ్రుతిః
తథాహిదర్శనే స్వచ్ఛే నిత్యేప్యాదికవేర్మునేః
నోదితా కవితాలోకే యావజ్జాతా నవర్ణనా"

వాల్మీకి ఆదిలో ఋషి. వర్ణనలు చేసి రామాయణము వ్రాసిన పిమ్మటనే (ఆది) కవి యయ్యెను.

"ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా
తదనుప్రాణనాజ్జీవే ద్వర్ణనా నిపుణః కవిః"

నవనవోన్మేషశాలినియగు ప్రజ్ఞయను ప్రతిభతో 'వర్ణన' సల్పగల నిపుణుడు కవి యని భామహుడు వక్కాణించెను.

"లోకోత్తర వర్ణనానిపుణ కవి కర్మ కావ్యమ్" —లోకోత్తర వర్ణన సలుపగల వాడు కవి. ఆ కవి కర్మము కావ్యము అని మమ్మటుడు నిర్దేశించెను. స్రష్టయైన కవి కాలక్రమమున నొక మెట్టుదిగి ద్రష్టయైన ఋషి యయ్యెను. పిమ్మట మఱియొక మెట్టుదిగి ఋషియైన కవి వర్ణనా నిపుణుడు కావలసివచ్చినది.

వర్ణన శబ్దార్థముల సమ్మేళనపూర్వకమైన రచన. కావున లౌకిక వాఙ్మయానుశీలకులైన ఆలంకారికుల కావ్యనిర్వచనము లన్నియు శబ్దార్థముల పరస్పర సంబంధ కేంద్రము చుట్టు పరిభ్రమించుట సహజము. అయినను ఆనంద వర్ధనుడు

"అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః"

అపారమైన కావ్య జగత్తునకు కవియే సృష్టికర్త అని చెప్పి, కవికే తొలి గౌరవమును పునః ప్రతిష్ఠించెను. ఆలంకారికులలో ప్రాతఃస్మరణీయుడైన భరతముని తన నాట్య శాస్త్రములో కావ్యమును పృథక్కరించి నిర్వచింపక పోయినను, కావ్యాత్మ రసమని చెప్పెను

"ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితమ్"

—భరతుని నాట్యశాస్త్రముప్రకారము కావ్య శరీరము కావ్యమందలి కథయే. భరతముని మతమున కావ్యాత్మ రసమని వేరుగ చెప్పనక్కరలేదు.

రసానంద మెట్లు కలుగుచున్నది ? ఈ ప్రశ్నకు సమాధానము నరయుటకు కళాస్వరూపము నన్వేషింపవలసియున్నది. సృష్టియొక్క తొలియుషస్సులలో శాఖామృగముగ వనచరుడుగనున్న ప్రాక్తనమానవుడు నేటినవనాగరకుడగుటకు యుగయుగాంతరములలో చేసిన కృషియంతయు 'కళ' గనే నిర్వచింపదగును. శిలలను ఆయుధములుగ రూపొందించుట కళ. పర్వతములను దొలిచి గుహ లేర్పరుచుట కళ. జీవితమును సుఖతరము, సుందరతరము చేయుటకై మానవు డొనరించిన సమస్తకృషియు కళయే. నాగరకతావికాసమున ఒకనాడు 'చతుష్షష్టి' కళలు ప్రసిద్ధములు. పిమ్మట అవియే చతుస్సహస్రషష్టి కళలయినవి. మానవ కృషియంతయు 'కళ' యే. కాని 'కళ' ను ప్రస్తరించినచో మానవ శరీరమువందువలె మూడు ముఖ్యాంగములు అభివ్యక్తమగును.

i శరీరము (పొట్ట, చేతులు, కాళ్లు మున్నగు అవయవములు) ii మెదడు iii హృదయము. పొట్ట పోసికొనుటకు చేతులు మున్నగు అవయవముల సాధనతో మానవుడు చేయు కమ్మరము కుమ్మరము మున్నగు పనులు అనగా శారీరక కృషియంతయు వ్యావహారిక కళ.

మెదడునకు సంబంధించినవి గణిత శాస్త్రము — భౌతిక రసాయనిక శాస్త్రములు మున్నగునవి విద్యలు. సృష్టికి మానవుని సార్వభౌముని చేసినది మేధయే. ఇవి విజ్ఞాన కళలు.

ఇక హృదయ సంబంధములైనవి సంగీతము, చిత్రలేఖనము, శిల్పము కవిత్వము. ఇవి లలితకళలు.

పొట్టకూటికై పనికివచ్చు శారీరకకళలకంటె, మేధావికాసమునకు తోడ్పడు విజ్ఞాన కళలు మేలైనవియు, వానికంటె హృదయ వికాసము గలిగించు లలిత కళలు ఉత్తమోత్తములనియు ప్రసిద్ధికెక్కినవి.

వ్యావహారిక కళలకు—విజ్ఞాన కళలకు—లలిత కళలకు గల భేదమును శీలింపదగినది.

ఆదిమ మానవుడు రాతిని తొట్టిగా తొలిచి, అందు నీటిని నింపినపు డది వ్యావహారిక కళ యైనది.

ఆ రాతితొట్టికి ప్రధానము ప్రయోజనము. సౌందర్యము అప్రధానము.

కాని, పాషాణమును తొట్టిగా గాక సరస్వతీ విగ్రహముగ చెక్కినపుడది శిల్పమైనది. అది లలిత కళ. అందు సౌందర్యము ప్రధానము. ప్రయోజనము అప్రధానమైనది.

అనగా ప్రయోజనము ప్రధానమై సౌందర్యము అప్రధానమైనచో అది వ్యావహారిక కళ.

ప్రయోజనము అప్రధానమై సౌందర్యము ప్రధానమైనచో అది లలిత కళ. ప్రయోజనాపేక్షతో మెదడున ఉద్భవించి శారీరక కృషి నపేక్షింపనివి విజ్ఞాన కళలు.

కావున లలితకళలకు అంతరాత్మ సౌందర్యమే. సౌందర్యమువలన లోకోత్తరమైన ఆనంద తన్మయత్వము కలుగును. సౌందర్యోపాసనవలన లభించు ఆనందమే—స్థూలముగ చెప్పవలె ననిన రసము. రసానందమే లలిత కళారాధనకు నిర్వికల్పమైన సద్యఃఫలము.

"A thing of beauty is a joy for ever"—"సౌందర్య సందర్శనము శాశ్వతానంద సంధాయకము" అని కీట్సు (Keats) కవి చెప్పిన చిరస్మరణీయ వాక్య మిట అనుసంధేయము. రసానుభూతికి కాళిదాస మహాకవి సుందరవస్తు సందర్శనముతోపాటు మాధుర్య శ్రవణమునుగూడ చేర్చెను.[3]

సౌందర్యారాధనతో రసానందము నుపాసించు లలితకళలలో కవిత్వమున కొక ప్రత్యేకస్థాన మున్నది. శిల్పము— భౌతికపదార్థములతో నిర్మింపఁదగినది. చిత్రలేఖనమున చిత్రకారునకు శిల్పికంటె ఎక్కువ స్వాతంత్ర్య మున్నను, మూడు కొలతలుగాక రెండు కొలత లేర్పడినవి. రంగులు సృష్టింప గల సౌందర్యమునకు అవధులున్నవి.

కల కల నవ్వినట్లు తెలిగమ్ముల నిక్కమ చూచినట్లు తోఁ
బలుకఁగడంగినట్లు వలు భావగభీరత లబ్బినట్లు పెం
పొలయఁదనర్చి జీవకళ యుట్టిపడన్ శివ వ్రాసియిచ్చెనా
చెలువున శాభిముఖ్యము భజింపఁ దలంకెను దాను కోటియున్

—పింగళి సూరన.—ప్రభావతీ ప్రద్యుమ్నము—ప్రథమాశ్వాసము

---

[3] రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం
భావ స్థిరాణి జననాంతర సౌహృదాని

—కాళిదాసు—అభిజ్ఞాన శాకుంతలము—పంచమాంకము

చిత్రలేఖనము నందలి మూర్తి కలకల నవ్వినట్లు పొడగట్టవచ్చును.

"తోఁ బలుకఁ గడంగినట్లు" తోచవచ్చును. అక్కడ ఆగక తప్పదు.

ఆ పాత్రలు అచలములు. అవి మాటాడనేరవు.

'సాహిత్య శిల్పసమీక్ష'లో ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతకవి వాక్కులు ఉదాహరింపదగినవి.

"కవిత్వము ఏదో ఒక మూర్తిని చిత్రించుటమాత్రమే గాదు. అనేక ప్రాణిప్రవర్తితమైన ఒక కథను వస్తువుగా గైకొని తత్తద్గుణ శీలానుసార వర్తనలతో జగత్ సృష్టికే ప్రతిసృష్టి చేయగలదు. ఈ సామర్థ్యము తక్కిన యేకళకును లేదు."

> చూచి ఝళంఝళత్ కటక సూచితవేగపదారవిందయై
> లేచి కుచంబులుం దుఱుము లేనడు మల్లలనాడ నయ్యెడం
> బూచిన యొక్క పోఁక నునుబోదియఁజేరి విలోకనప్రభా
> వీచికలం దదీయపదవీకలశాంబుధి వెల్లిఁగొల్పుచున్"

—మనుచరిత్ర-ద్వితీయాశ్వాసము

మనుచరిత్రలో అల్లసాని పెద్దన వర్ణించిన వరూధినిని ఏ చిత్రకారుడు చిత్రింపగలడు ? అని 'సాహిత్యశిల్పసమీక్ష'లో పింగళివారు వేసిన ప్రశ్న.

లలిత కళలలో కవిత్వమున కున్న విశిష్ట స్థానమునకు గల కారణము ఎన్న దగినది. శిల్పము, చిత్ర లేఖనము భౌతిక పదార్థముల సమ్మేళనము. సంగీతము కూడ మానవ శారీరక సాహాయ్యము నపేక్షించును.

కవిత—అపరసృష్టికర్తయగు కవికి మానస పుత్రిక.

**"Poetry is the most vital and the lasting achievement of man"**

**– Lane Cooper**

కవిత మానవ సృష్టిలో అత్యంత ప్రాధాన్యము గలది. మానవ సృష్టిలో కవితయే ఆచంద్ర తారార్కమై శాశ్వతముగా నిలువగలిగినదని కూపర్ మనీషి ప్రస్తుతించెను.

కవి అపర సృష్టికర్తగా ఆలంకారికులచే ప్రస్తుతి కెక్కినాడు.

కాని— నిజమునకు సృష్టికర్త సల్పిన సృష్టి, లోపరహితము కాదు.

కాళిదాస మహాకవి వాక్కులలో చెప్పిన రక్తి కట్టుట సహజము.

> "వర్ణప్రకర్షే సతి కర్ణికారం ధునోతి నిర్గంధతయా స్మ చేతః
> ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః."

కుమారసంభవములో కాళిదాసు అకాల వసంతోదయమును వర్ణించుచు, 'కర్ణికార పుష్పము రంగులతో వికసించినది. పరిమళము లేకపోవుటచే మనస్సు నలరించుట లేదు. పరిపూర్ణతను సృష్టించుటలో విశ్వశిల్పి విముఖుడు కాబోలు' అని వ్రాసెను.

కాని అపర సృష్టికర్తయైన కవి మాత్రము పరిపూర్ణతను సృష్టించుటకు విముఖుడు కాడు. అంతేకాదు. వాస్తవ సృష్టిలో గల అసమగ్రతను—

అసంపూర్ణతను పూరింపగల దిట్ట. వాస్తవ సృష్టిలో మెఱపుతీగలు చంచలములు. అయినను కవి స్థిరసౌదామనులను సృష్టించగలడు. వాస్తవ జగత్తులో లేకున్నను కావ్యజగత్తులో

'ఆఁకుల్ రాలని పూలు వాడని వసంతారామములు'

'రాకా చంద్ర సహస్రముల్ వెలుగు హర్మ్యాగ్రములు'

( సౌందర నందము )

కవి సృష్టింపగలడు.

ముట్నూరి కృష్ణారావుగారు 'సమితు'లో ఐహికమైన అసంపూర్ణత్వమును పూరించి – సంపూర్ణత్వము సృష్టించునది కళ యని నిర్వచించినారు. కళ ప్రకృతికి అనుకరణము గాదు. ప్రాచీన భారతీయుల మతములో కళ సృష్టికి ప్రతి సృష్టి.

కవి అపర సృష్టికర్త. 'అపారే కావ్యసంసారే కవి రేవ ప్రజాపతిః'.

కవి అపర సృష్టికర్త మాత్రమే గాదు. ఆలంకారికుల దృష్టిలో సర్వతంత్ర స్వతంత్రుడైన కవి, సృష్టికర్త కంటె ఒకమెట్టు పైకెక్కిన వాడు.

నియతికృత నియమరహితాం
హ్లాదైకమయీ మనన్య పరతంత్రామ్
నవరస రుచిరాం నిర్మితి
మాదధతీ భారతీ కవే ర్జయతు.

—మమ్మటుడు–కావ్యప్రకాశము–ప్రథమోల్లాసము

లోక నియతికి లోబడక, సర్వతంత్ర స్వతంత్రమై నవరసరుచిరమై ఆనంద తన్మయత్వముతో నిండిన కావ్యసృష్టిని చేయు కవివాణికి జయమగు గాక అని పైశ్లోక తాత్పర్యము.

పింగళి సూరన కళాపూర్ణోదయములో వ్రాసిన లయవిభాతిలో లోకోత్తర పరిపూర్ణత కావ్యజగత్తులో స్వయంవ్యక్తము కాగలదని ప్రవచించెను.

చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము
గలిగినను సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పురపుఁ బలుకులకుఁ గోమలత
నెలకొనిన సౌరభముఁ జలువ వసయుం గో
మలతయును గలిగి జనముల మిగులఁ బెంపెసఁగు
మలయ పవనంపుఁ గొదమలకు మధురత్వం
బలవడిన నీరుమటి కలదనఁగవచ్చుఁ గడు
వెలయఁగల యీ సుకవి పలుకులకు నెంచన్

—కళాపూర్ణోదయము-ప్రథమాశ్వాసము.

వాస్తవ జగత్తులో కొదువలన్నియు కవితాజగత్తులో తీరిపోవును.

వెన్నెలల చెలువునకు చలువ గలదు!

సౌరభము కూడ ఉన్నచో !! చలువ + సౌరభము కప్పురమున కున్నవి.

కోమలత్వము కూడ ఉన్నచో !!!

సౌరభము + చలువ + కోమలత్వము మలయానిలమునకు గలవు. మఱి మలయానిలమునకు మధురత్వమబ్బినచో అపుడు కవిత్వమగునట.

'అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః'—అను వాక్కు పింగళి సూరన లయవిభాతి చదివినచో సార్థక మనిపించును.

"ఆకలిగొనియున్న అన్నాతురునకు భగవంతుడు సాక్షాత్కరించుటకు సాహసించినచో, ఆతడు అన్నావతారము నెత్తవలసినదే"అని గాంధిమహాత్ముని అభిభాషణము. ఒకవేళ భగవంతుడు కవికే సాక్షాత్కరింప దలచినచో? అప్పుడు కవితా కళావతార మెత్తవలసినదే గద.

వసుధైక కవీశ్వరుడైన కాళిదాసు సాక్ష్యము కోర దగును.

కాళిదాసు

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ"

—రఘువంశము-ప్రథమాశ్వాసము

'వాగర్థముల వలె కలిసిపోయి, వాగర్థముల వలె ప్రత్యేకత గల్గి జగత్తునకు మాతా పితలగు పార్వతీ పరమేశ్వరులకు వాగర్థ ప్రతిపత్తికొఱకు నమస్కరించు చున్నాను.'' అని అభివర్ణించెను.

అనగా కవిత్వము అద్భుత కళ. కవితా కళ యుగళ కళ. అందు వాగర్థ ములు— శబ్దము; అర్థము రెండున్నవి. శబ్దార్థములకు పార్వతీ పరమేశ్వరుల దాంపత్యము వలె అవినాభావ సంబంధమున్నది. పరమేశ్వరుడు అర్ధనారీశ్వరుడు. అయినను పార్వతి వేరు. శివుడు వేరు. అట్లే శబ్దము వేరు. అర్థము వేరు. అయినను అర్ధనారీశ్వర యోగమట్లు పార్వతి లేనిదే శివుడు లేడు; శివుడు లేని పార్వతి లేదు.

పార్వతీ పరమేశ్వరుల మాటకేమి సాహితీ ప్రియంభావుకుల మనః ఫలక ములపై కాళిదాసు కవితా కళను ప్రసరించి హృదయంగమముగ సాక్షాత్కరింప జేసినాడు. ఈ శ్లోక మొక్కటి చాలు- కవితాకళా స్వరూపమును నిర్వచించిన కాళిదాసును ఆలంకారికులలో కొలికిపూసగ నిలుప గలదు.

భరతముని తరువాత ఎన్నదగిన ఆలంకారికుడు భామహుడు—

"శబ్దార్థౌ సహితౌ కావ్యమ్" అని నిర్వచించెను. ఇతని మతమున శబ్దార్థములు రెండును కావ్య శరీరము. అయినను, అలంకారములే కావ్య మునకు సౌందర్యాపాదకములని ప్రతిపాదించెను. అలంకారము లెల్ల వక్రోక్తి వికల్పము లని భామహ మతము. భరతుడు దృశ్య కావ్యములకు రసము ప్రధాన మనగా, భామహుడు శ్రవ్య కావ్యములకు అలంకారమే ప్రధాన మని భావించెను. ఇతని దృష్టిలో రసముగూడ ఒక అలంకారము. ఇతని గ్రంథమునకు "భామహా లంకారము" అను పేరు ఇతనికిగల అలంకార ప్రీతి నభివ్యక్త మొనరించుచున్నది.

కావ్యాదర్శమును వ్రాసిన దండి—

"శరీరం తావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ"— కావ్య శరీరము ఇష్టార్థ వ్యవచ్ఛిన్న మైన పద సమ్మేళనమని ప్రవచించెను. దండి నిర్వచనమునకు వ్యాఖ్యాతలు పలువిధములుగ అర్థమును చెప్పుచున్నారు. కావ్యాదర్శమునకు వ్యాఖ్యాత తరుణవాచస్పతి "ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ" అనగా— వివక్షితార్థ వ్యవచ్ఛిన్నః శబ్ద సందర్భః— చెప్పదలచిన అర్థముతో నలంకృతమగు శబ్దము— అని అర్థము వ్రాసెను.

'హృదయంగమ' వ్యాఖ్యాత— "వివక్షితార్థస్య అన్యూనానతిరేకతా స్వరూపేణ ప్రతిపాదనసమర్థా పదావళీ" — చెప్పదలచిన అర్థమును ప్రస్ఫుటముగా చెప్పు పదముల సముదాయమని చెప్పెను. దండి నిష్ఠ, పదముల కూర్పుపై గలదనుట తెల్లము. అంతేగాక— కావ్యశరీరము ఇష్టార్థవ్యవచ్ఛిన్నమైన పదావళి యన్న దండి, ఆ శరీర సౌందర్యమునకు గుణములు, అలంకారములు ప్రధానము లని వచించెను. ఈ రీతులు అలనాటి సంస్కృతమున కన్వయించినట్లు నేటి తెలుగున కన్వయింపవు.

ఎట్లైన దండి నిష్ఠ— పదావళిపై, రీతులపై, అలంకారములపై ననే. కావ్యాత్మను భామహుని వలెనే విస్మరించెను.

"రీతిరాత్మా కావ్యస్య" — అని ఎలుగెత్తి చాటినది కావ్యాలంకార సంగ్రహకర్త వామనుడు. కావ్యశరీరము భామహునివలె శబ్దార్థములని ప్రతిపాదించెను. వామనునిలో భామహుని అలంకార సిద్ధాంతము, దండి గుణవాదము సంగమించినవి. కావ్యాత్మ రీతి. రీతి గుణములచే ఏర్పడును. అలంకారములు కావ్యశరీర సౌందర్యమును వృద్ధిచేయునని ఇతని వాదము.

సంస్కృతభాషలో ఆలంకారిక చరిత్రలో భరతముని తరువాత క్రొత్త వెలుగుబాట తీర్చిదిద్దినవాడు ఆనందవర్ధనుడు.

ఆనందవర్ధనుని గ్రంథము "ధ్వన్యాలోకము" అలంకారశాస్త్ర చర్చలో విప్లవము తెచ్చినది.

### ఆనందవర్ధమని మతమున "ధ్వని" కావ్యమునకు ఆత్మ

ధ్వనిని వస్తుధ్వని, అలంకార ధ్వని, రస ధ్వని అని ఆనందవర్ధనుడు వింగడించి రస ధ్వని ఉత్తమోత్తమ మని నిర్వచించెను.

శరీరమునకు ఆత్మ యున్నచో అలంకారములు శోభనిచ్చును. అలంకారములు లేకున్నను రస ముండవచ్చును.

కావ్యస్వరూపనిరూపణమున ఆనందవర్ధనుడు తనకు పూర్వికులైన ఆలంకారికులు భామహ, దండి, వామనుల వాదముల సమీక్షించి క్రొత్తగా ధ్వని సిద్ధాంతమును ప్రతిపాదించెను. అంతేకాక రసధ్వనికే పట్టాభిషేకము కట్టి, ఆనందవర్ధనుడు భరతుని రస సిద్ధాంతమును శ్రవ్య కావ్యములకుగూడ వర్తింపజేసి సుప్రతిష్ఠితము నొనర్చెను. ఆనందవర్ధనుని పిమ్మట ఆలంకారికులు పలువురు అభినవగుప్తుడు, మమ్మటుడు, విశ్వనాథుడు, విద్యానాథుడు, పండితరాయలు మున్నగు

వారు ఆనందవర్ధనుడు తీర్చిన పథమును ఒజ్జబంతిగ అంగీకరించుట పేర్కొనదగినది.

అభినవగుప్తుడు, ధ్వన్యాలోకమునకు 'లోచన' మను వ్యాఖ్యానమును వ్రాసి రస సిద్ధాంతమునకు పరిపుష్టి గల్పించెను.

"రసేనైవ సర్వం జీవతి కావ్యం।
నహి రస శూన్యం కావ్యం కించిదస్తి।
రసఏవ వస్తుతః ఆత్మా."

'రసముచేతనే కావ్యము బ్రదుకును. రసము లేని కావ్యమే ఉండదు. రసమే కావ్యాత్మ' అని ప్రతిపాదించిన అభినవగుప్తుడు "వాక్యం రసాత్మకం కావ్యమ్" అన్న విశ్వనాథునకు పూర్వరంగప్రవర్తకుడుగా తోచును. కాని మహిమభట్టు అను ఆలంకారికుడు ధ్వనిసిద్ధాంతమును ఖండించుచు "వ్యక్తి వివేకము" ను వ్రాసెను. అభిధా లక్షణావృత్తులు చాలు. వ్యంజనావృత్తి కల్పన అనవసరమనియు అది 'అనుమానము'గనే యెంచనగు ననియు మహిమభట్టు వాదము. కాని ఆతడు రస సిద్ధాంతమును అంగీకరించి

"కావ్యస్యాత్మని సంజ్ఞిని రసాదిరూపే న కస్యచిద్విమతిః"

కావ్యాత్మ రసమనుటలో విప్రతిపత్తి లేదని ప్రకటించెను. అభినవ గుప్తునకు సమకాలీనుడైన కుంతకుడు

"వక్రోక్తిః కావ్యజీవితమ్"

అని ప్రతిపాదించెను. కుంతకుడు భామహుని వాదమును పునరుజ్జీవింప జేసి కవి వ్యాపారవక్రతయే వక్రోక్తి యని చెప్పి వక్రోక్తిని ఆఱు విధములుగ వింగడించెను.

1. వర్ణ విన్యాస వక్రత్వము 2. పద పూర్వ వక్రత 3. ప్రత్యయ వక్రత 4. వాక్య వక్రత 5. ప్రకరణ వక్రత 6. ప్రబంధ వక్రత.

1. వర్ణ విన్యాస వక్రత శబ్దాలంకార వివరణము.
2. పదపూర్వ వక్రత శబ్దశక్తి ప్రస్తరణ. ఇందు ధ్వని భేదము లన్నియు భావ వైచిత్ర్యాది వక్రతలుగా ప్రదర్శితములు.
3. ప్రత్యయ వక్రత తద్ధితాది ప్రత్యయ ప్రయోగ ప్రౌఢచారిమ.
4. వాక్యవక్రత — అర్థాలంకార వివరణము.
5. ప్రకరణ వక్రత — కథ మలుపు తిరుగుట. శాకుంతలమున దూర్వాసగాథ ఉదాహరణ ప్రాయము.
6. ప్రబంధ వక్రత — ఇతి వృత్తములో ఏర్పడు రసాంతర కల్పన. శాంతరస ప్రధానమగు కథ వేణీసంహారమున వీరరసముగ మారినది.

కాని, మహిమభట్టు — కుంతకుల మతములు అలంకార చరిత్రలో మాత్రమే నిలిచినవి గాని బహుళ ప్రచారమును బొందలేదు.

"అలంకారాస్త్వలంకారా గుణాఏవ గుణాస్సదా
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్"

—క్షేమేంద్రుడు—ఔచిత్యవిచార చర్చ

కావ్యానుభూతిని స్వతంత్ర మార్గమున వింగడించి ప్రదర్శించిన ఆలంకారికుడు క్షేమేంద్రుడు. ఇతని మతమున

ఔచిత్యమే కావ్యాత్మ.

"అలంకారములు అలంకారములే; గుణములు గుణములే. కావ్య జీవితము సుస్థిర మగునది ఔచిత్యము వలననే."

ఈ ఔచిత్యము పదమున, వాక్యమున, ప్రబంధమున, గుణమున, అలంకారమున, రసమున, క్రియ యందు, కారకమున, లింగవచన విశేషణోపసర్గల యందు, నిపాతమున, కాలమున, దేశమున, కులమున, వ్రతమున, తత్త్వమున సత్త్వమున, అభిప్రాయమున, స్వభావమున, సార సంగ్రహమున, ప్రతిభ యందు, అవస్థయందు, కామమున, ఆశీస్సున నెట్లుండునో ప్రస్తరించి సోదాహరణముగ ప్రదర్శించెను.

ఔచిత్య పరిపాలనకు కావ్య సృష్టిలో గల విశిష్టత ప్రాచీనాలంకారికులు గుర్తించినదే.

"అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్ పరా"

'అనౌచిత్యముకంటె రసభంగ హేతువు వేరుండదు. ఔచిత్య బంధము గల కావ్యము రసోపనిషత్తే' అను ధ్వనికారుని కారిక క్షేమేంద్రుని ఔచితీవిచార చర్చకు మూలబీజము. కాని కావ్యానుభూతిని క్షేమేంద్రుడు ప్రస్తరించిన పద్ధతి విలక్షణము. స్వతంత్రము. ఆనందవర్ధనుడు కావ్యాత్మ ధ్వనియనగా క్షేమేంద్రుడు ఔచిత్యమనెను.

ఔచిత్యవాదమును క్షేమేంద్రుడు హృదయంగమముగ పోషించెను. కంఠమునందు మేఖల, నితంబఫలకమునందు హారము, పాణియందు నూపురము, చరణమున కేయూరము, ప్రణతుడైన శత్రువుపై శౌర్యము లోకములో కూడ సౌందర్యావహములు గాక, అపహాస్య హేతువులే యగుచున్నవి.

మమ్మటుడు—

తదదోషౌ సగుణౌ వనలంకృతీ పునః క్వాఽపి

—ప్రథమోల్లాసము—సూత్రము 1.

—కావ్యప్రకాశమున మొట్టమొదటి సూత్రములో మమ్మటుడు చేసిన కావ్యనిర్వచనము అనుశీలింపదగినది.

దోషరహితములును, గుణసహితములును అవి యెచ్చటనేని అలంకార రహితములై యుండుగాక, శబ్దార్థయుగళము కావ్యశరీరము అనునది మమ్మటుని నిర్వచనము.

"తదల్ప మపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన
స్యాద్వపు స్సుందరమపి శ్విత్రేణైకేన దుర్భగమ్"

కావ్యమున అల్పదోషమునుగూడ ఉపేక్షింపరాదు. ఎంత అందమైన శరీరమున్ననేమి ? ఒక్కచో బొల్లియున్నచో సర్వము అసహ్యమే.

**'Never judge a work of art by its defects'** కావ్యకళా శిల్ప సౌందర్యమును— దొసగులను బట్టి నిర్ణయింప గూడదను ఆంగ్ల సుభాషితము అనుభవ పునరుక్తము. ప్రస్ఫుటదోషములున్నను మహాకావ్యములు మహాకావ్యములే.

మమ్మటునకు పూర్వపక్షము నెలకొల్పుచు విశ్వనాథుడు చేసిన నిర్వచనము సహృదయరంజకమైనది.

'వాక్యం రసాత్మకం కావ్యమ్'

—విశ్వనాథుడు–సాహిత్య దర్పణము

రసాత్మకమైన వాక్యమే కావ్యము.

జగన్నాథ పండితరాయల నిర్వచనము విశ్వనాథుని కావ్య నిర్వచనము కంటె విపులమైనది.

"రమణీయార్థ ప్రతిపాదక శ్శబ్దః కావ్యమ్"

—పండితరాయలు - రసగంగాధరము

రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దము కావ్యము

"శబ్దార్థౌ సహితౌ కావ్యమ్" శబ్దార్థయుగళ సమ్మేళనము కావ్యము అన్న భామహుని నిర్వచనమునే రమణీయతాస్ఫోరకముగ పండితరాయలు పునర్వచించెను. పండితరాయల నిర్వచనమున సర్వకళలకు అంతరాత్మయైన రామణీయకము నిక్షేపింప బడినది. లలిత కళయు సౌందర్య స్ఫోరకములు

సౌందర్యము శాశ్వతానంద సంధాయక మని చివరకు సారాంశము.

కావ్యానుభూతిని పలువురు ఆలంకారికులు పలు విధముల వింగడించి వెల్లడించి యున్నారు. "లోకో భిన్నరుచిః"అని సరిపెట్టుకో వచ్చును. యథార్థమునకు అందరి అనుభూతులు ఒకటే కావచ్చును. పెట్టిన పేరులు వేరు. ఒకే లెక్కను పలువిధముల చేయవచ్చును. శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు 'సాహిత్య శిల్ప సమీక్ష'లో చేసిన కావ్య నిర్వచన సమీక్ష ఉదాహరింపనగును.

"ఈ పూర్వపక్ష సిద్ధాంతముల పర్యాలోచించి, కావ్యలక్షణసారమును మనమిట్లు వివరించుకొనవచ్చును. సాధ్యమైనంతవరకు కావ్యమున దోషములను తొలగించుకొనుచు రమణీయములైన అర్థములను మాత్రమే గ్రహించి ఉచిత శబ్దములతో కావ్యరచన సాగింపవలెను. ఎక్కడనేని ఏదేని ఒక దోషమున్నంత మాత్రమున అది కావ్యము కాకపోదు. 'కావ్యమునకు రసము ఆత్మ' అనుమాట నిజమేకాని ప్రతిరచనయందును రససిద్ధి కలుగునని చెప్పలేము. అట్టిచో రమణీయత యున్నచో చాలును. అది కావ్యమేయగును."

ప్రాచీన సంస్కృతాలంకారికుల కావ్యనిర్వచనములు సూత్రప్రాయమైనవి గుదిగ్రుచ్చి సహృదయుల అనుశీలనసౌకర్యమునకై యొకచో చేర్పనగును.

**కావ్య నిర్వచనములు :**

కవిర్మనీషీ పరిభూః స్వయం భూః —వేదమంత్రము
కవయః క్రాంతదర్శినః —లోకోక్తి
నానృషిఃకురుతే కావ్యమ్ —లోకోక్తి
శబ్దార్థౌ సహితౌకావ్యమ్ —భామహుడు
ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యమ్—దండి
రీతి రాత్మా కావ్యస్య —వామనుడు
గుణాలంకారయుక్తార్థౌ కావ్యమ్ —వామనుడు
వక్రోక్తిః కావ్యజీవితమ్ —కుంతకుడు
ధ్వనిః కావ్యజీవితమ్ —ఆనందవర్ధనుడు
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్ —క్షేమేంద్రుడు
తదదోషౌ సగుణావనలంకృతీ పునఃక్వాపి —మమ్మటుడు
లోకోత్తర వర్ణనానిపుణకవికర్మ కావ్యమ్ —మమ్మటుడు
కావ్యస్యాత్మని సంజ్ఞిని రసాదిరూపే నకస్యచిద్విమతిః —మహిమభట్టు
రసేనైవ సర్వం జీవతి కావ్యమ్ —అభినవగుప్తుడు
నిర్దోషం గుణాలంకారరసవద్ వాక్యం కావ్యమ్ —వాగ్భటుడు
నిర్దోషం గుణాలంకార రీతివృత్తిమద్ వాక్యం కావ్యమ్ --పీయూషవర్షుడు
రసాదిమద్ వాక్యం కావ్యమ్ ---శౌద్ధోదని
వాక్యం రసాత్మకం కావ్యమ్ ---విశ్వనాథుడు
రమణీయార్థప్రతిపాదకశ్శబ్దః కావ్యమ్ ---పండితరాయలు
విశ్వశ్రేయఃకావ్యమ్ —ఆంధ్రశబ్దచింతామణి

**సంస్కృతాలంకారికులు, అలంకారశాస్త్రములు - కాలములు :**

భరతముని—నాట్యశాస్త్రము. క్రీస్తుపూర్వము 5వ శతాబ్దికి పూర్వము
భామహుడు—కావ్యాలంకారము. క్రీ.శ. ఆరవశతాబ్ది
దండి—కావ్యాదర్శము. క్రీ.శ. ఆరవ శతాబ్ది
ఉద్భటుడు—అలంకారసార సంగ్రహము. క్రీ.శ. ఎనిమిదవ శతాబ్ది
రుద్రటుడు—కావ్యాలంకారము. క్రీ.శ. ఎనిమిదవ శతాబ్ది
వామనుడు—కావ్యాలంకార సూత్రవృత్తి. ,,
ఆనందవర్ధనుడు—ధ్వన్యాలోకము. క్రీ. శ. 840-870

రాజశేఖరుడు—కావ్యమీమాంస. క్రీ. శ. 870-950
ముకులభట్టు—అభిధావృత్తి మాతృక. క్రీ. శ. తొమ్మిదవ శతాబ్ది
భట్టతౌతుడు—కావ్య కౌతుకము. క్రీ. శ. 950-980
భట్టనాయకుడు—హృదయదర్పణము. క్రీ. శ. 900-1000
కుంతకుడు—వక్రోక్తి జీవితము. క్రీ. శ. 925-1025
ధనంజయుడు—దశరూపకము. క్రీ.శ. 10 వ శతాబ్ది మధ్యభాగము
రాజానక మహిమభట్టు—వ్యక్తివివేకము. క్రీ శ. 1020-1060
భోజుడు—సరస్వతీ కంఠాభరణము. క్రీ.శ. 1000-1050
క్షేమేంద్రుడు—ఔచిత్య విచారచర్చ. క్రీ.శ. 1000-1068
మమ్మటుడు—కావ్యప్రకాశము. క్రీ.శ. 1050-1150
రుయ్యకుడు—అలంకార సర్వస్వము. క్రీ.శ. 1150 ప్రాంతము
హేమచంద్రుడు— కావ్యానుశాసనము. క్రీ.శ. 1150-1172
జయదేవుడు—చంద్రాలోకము. క్రీ.శ. 1200-1250
విద్యాధరుడు—ఏకావళి. క్రీ.శ. 1285-1325
విద్యానాథుడు—ప్రతాపరుద్ర యశోభూషణము. క్రీ.శ. 1296-1325
వాగ్భటుడు—కావ్యానుశాసనము. క్రీ.శ. 14 వ శతాబ్ది
విశ్వనాథుడు—సాహిత్యదర్పణము. క్రీ.శ. 14 వ శతాబ్ది
భానుదత్తుడు—రసమంజరి. ,,
రూపగోస్వామి—భక్తిరసామృత సింధువు. క్రీ.శ.1470-1554
కేశవమిశ్రుడు—అలంకార శేఖరము. క్రీ శ. 16 వ శతాబ్ది
అప్పయదీక్షితులు—కువలయానందము. క్రీ.శ. 16 శతాబ్ద్యంతము
జగన్నాథ పండితరాయలు—రసగంగాధరము. క్రీ.శ.1620-1660

# 3
# ధ్వనిసిద్ధాంతము

ధ్వనివాద ప్రవక్తగా ఆనందవర్ధనుడే ఆలంకారికజగత్తులో సుప్రసిద్ధుడైనను, ఆ వాద మంతకుముందే యున్నట్లు సుస్పష్టము[1].

'కావ్యస్యాత్మా ధ్వనిరితి బుధైర్యస్స మామ్నాతపూర్వ
స్తస్యాభావం జగదురపరే భాక్తమాహుస్తమన్యే
కేచి ద్వాచాం స్థితమవిషయే తత్త్వమూచు స్తదీయం
తేన బ్రూమ స్సహృదయ మనః ప్రీతయే తత్స్వరూపమ్ "

కావ్యాత్మ ధ్వనియని పూర్వవిద్వాంసులు చెప్పియున్నారు. కొందరు "ధ్వని" యే లేదన్నారు. కొందరది వాచామగోచరమందురు. కొందరది లక్షణాంతర్గతమందురు. సహృదయమనఃప్రీతికై ధ్వనితత్త్వమును నిరూపించెదను.

—ఆనందవర్ధనుడు

సంస్కృత కావ్యమీమాంసలో మిక్కిలి ప్రధాన స్థానమును వహించిన ధ్వని సిద్ధాంతమునకు మూలము స్ఫోట వాదమని పెద్దలందురు. వైయాకరణుల స్ఫోటవాద స్వరూపము ధ్వని సిద్ధాంతానుశీలనమునకు ఉపకరించును.

"రామాయణ గ్రంథమును తీసికొనిరమ్ము" అని చెప్పగనే రామాయణ గ్రంథమే వాచ్యార్థము. అభిధ లోకవ్యవహారనిష్ఠము. కావ్యసృష్టికి ఆద్యప్రకృతి.

లోక వ్యవహారములోగూడ, "ఆ వంకాయలను ఇటురమ్మని పిలువుము" 'ఆ గడ్డాలను ఇక పొమ్మనుము'—అన్నచో వంకాయలు అమ్మువారికి ఆహ్వానము, గడ్డాలుగల వారికి ఉద్వాసనము అని అర్థమేగద. అనగా వాచ్యార్థమును అతిక్రమించిన అర్థము వ్యక్తమగుచున్నది. దానికే లక్షణార్థమని పేరు. వాచ్యార్థమునకు అనుపపత్తి యేర్పడుట గమనింపదగిన సంగతి. లక్షణను జహల్లక్షణ, అజహల్లక్షణ అని రెండు విధముల వింగడించిన ఆలంకారికు లున్నారు.

'గాంధిమహాత్ముని నిర్యాణ వార్తకు భూమి విస్తుపోయి విలపించినది'—విలపించినది పర్వతారణ్య సరిత్ సంకీర్ణమైన మట్టికాదు. భూమిమీది ప్రజలందరు. అందుచే భూమిని వదలి ప్రజలను అర్థస్ఫూర్తిచే అది జహల్లక్షణ. 'ఆ వంకాయలను పిలువుము' అన్న వంకాయలను వదలకయే వంకాయలను అమ్మువారను అర్థస్ఫూర్తి గల్గుటచే అది అజహల్లక్షణ.

---

[1] 'పరిణిశ్చిత నిరపభ్రంశ శబ్ద బ్రహ్మణాం విపశ్చితాం మతమాశ్రిత్యైవ ప్రవృత్తోఽయం ధ్వనివ్యవహారః'

—ధ్వన్యాలోకము

ప్రాకరణికార్థమునేగాక, అభిధా, లక్షణార్థములకు అనుపపత్తి యేర్పడి హృదయంగమమగు వేరొక అర్థము స్ఫురించుట వ్యంజన. వ్యంజనాశక్తిచేత ఏర్పడు అర్థమునకు వ్యంగ్యమని పేరు.

"వర్ణాతిరిక్తః వర్ణాభివ్యంగ్యః అర్థ ప్రత్యాయకో నిత్యఃశబ్దః స్ఫోటః".

వర్ణములకంటె భిన్నమై, వర్ణముల వలన వ్యక్తమై అర్థప్రతీతి గల్గించు శబ్దము స్ఫోటము.

ఈ సిద్ధాంతమున వర్ణములు అనిత్యములు. ఉచ్చారణ జరుగగనే వర్ణములు నశించును. కాని స్ఫోటరూప శబ్దము నిత్యము.

"పూర్వ పూర్వ వర్ణానుభవాహిత సంస్కారసచివేన అంత్యవర్ణానుభవేన అభివ్యజ్యతే స్ఫోటః"-తరువాతి వర్ణముల నుచ్చరించుచున్నపుడు వానిముందు వర్ణములు లయమగుచున్నను, వాని సంస్కారము మనస్సులో నిల్చును. అంత్యవర్ణానుభవమైనవెంటనే స్ఫోటము వ్యక్తమగును. ఈ స్ఫోటమే శబ్దము. సంస్కార రూపమున సహృదయుని చిత్తమందు అట్టి శబ్దముయొక్క అర్థమే నిలిచియుండును.

ఆనందవర్ధనునకు ప్రాచీనులైన ఆలంకారికులు అభిధ-తాత్పర్యము-లక్షణ అను శబ్దవ్యాపారముల వివరించియుండిరి. ప్రతిశబ్దమునకు అర్థముండుట సహజము. అది నిఘంటువులోని లెక్కను. అది శబ్దము చెప్పు వాచ్యార్థము. వాచ్యార్థమునకు కావ్యమీమాంసలో "అభిధ" అని ఆలంకారికులు పెట్టిన పేరు.

ఒకే శబ్దమునకు రెండర్థము లున్నప్పుడు, తుల్యప్రాధాన్యముగల రెండు వాచ్యార్థముల యందును భాసించునది అభిధయే. దానికి శ్లేషము అనిపేరు.

శ్లేషము రెండు విధములు. అభంగ శ్లేషము. సభంగశ్లేషము.

రెండర్థములొకే పదగుంఫనమున విఱువ నవసరము లేకుండ సిద్ధించినచో నది అభంగశ్లేషము.

శ్రీకృష్ణదేవరాయల భువన విజయ సభా భవనమున కొకనాడు తెనాలి రామకృష్ణకవి ఆలస్యముగా నేగుదెంచెను. రాయలవారు

'కవివృషభులు ఆలస్యముగ విచ్చేసినారే!' అనెను. ఇచ్చట శ్లేషలో రెండర్థములున్నవి. వృషభశబ్దము శ్రేష్ఠవాచకము. కవిశ్రేష్ఠులు అనునది మొదటి అర్థము. రెండవ అర్థము ఆబోతు. రెండర్థములు ఉపపన్నములే. అభిధలే.

"కామధేనువు వంటి ప్రభువులుండగ, కవివృషభులకు కొదువ యేమి?" అను రామకృష్ణకవి సమాధానములో గల శ్లేషము సుగమము.

ఇందు గల వ్యంజనము అభిధకు అతీతమునై యున్నది కామధేను కవి వృషభ సంబంధము. అది సహృదయ హృదయైక వేద్యము. కావున నందుగల వ్యంగ్యమైన భవము అభిధకు, శ్లేషమునకు గూడ అతీతమైనది.

సభంగశ్లేషమునకు చక్కని యుదాహరణము శ్రీనాథుడు సర్వజ్ఞ సింగ భూపాలుని కొలువునకేగినప్పుడు చెప్పిన పద్యము.

'సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావు సింగ భూపాలునకే
యుర్వింజెల్లును; తక్కొరు
సర్వజ్ఞండనుట కుక్క సామజ మనుటే!'

కవి సార్వభౌముడు, తన్ను శత్రురాజు యొక్క ఆస్థాన కవిని ఆదరించి సన్మానించిన సర్వజ్ఞ సింగభూపాలుని సముచితస్తుతి సల్పెను. సింగభూపాలుడు సార్థకనాముడను అర్థము సుగమము.

తిరిగి, శ్రీనాథుడు రెడ్డిరాజుల ఆస్థానమును చేరగా - శత్రురాజు సంస్తుతి సల్పినందుకు అధిక్షేపణమునకు సముచిత సమాధానముగ నా పద్యమునే సభంగశ్లేషముతో చదివి వినిపించెను.

'సర్వజ్ఞ నామధేయము
శర్వునకే! రావుసింగ భూపాలున
కేయుర్వింజెల్లును??? తక్కొరు
సర్వజ్ఞండనుట కుక్క సామజ మనుటే.'

అని శత్రురాజును - అతని ఆస్థానమునందే కుక్కయని నిరూపించి వచ్చుట !!

పై పద్యము శ్రీనాథుని చమత్కారమునకు, సభంగశ్లేషమునకు ఆంధ్ర భాషా ప్రౌఢిమకు ముత్యాలగుట్ట.

శ్లేషములో రెండర్థములు స్ఫురించుట సహజము. రెండర్థములును 'అభిధ'లే కావున శ్లేషము వేరు; వ్యంగ్యము వేరు.

వ్యంగ్యములో రెండర్థములు స్ఫురించినను, అందు మొదటిదానికి అనుపపత్తి యేర్పడుట - రెండవ అర్థము మనోజ్ఞతరముగ సహృదయుల హృదయముల నావేశించుట గమనింపదగినది.

గాథాసప్తశతి వ్యంగ్యసుకుమార కావ్యము. అందలి ఒక గాథకు తెలుగు సేత ఉదాహరింపనగును. ఒక బాటసారితో లేజవరాలు చేసిన సంభాషణములో గల వ్యంగ్యము సహృదయ హృదయైక వేద్యము.

'పాంథకిశోర! నీ చిరుత ప్రాయము దెల్పెడి మోము; చేతి యుద్
గ్రంథము చూడ వైద్యుడవుగావలె; జ్యోతిష పండితుండవో!
అంధత మూర్ఖ నత్త గృహమందు సహోదను; వార్ధి దాటి సౌ
గంధిక వర్తకుండగు మగండరుదెంచు దినమ్ము తెల్పుమా!'

—అనువాదము స్వకీయము.

అతడు పాంథకిశోరుడు. అతని మొగములో నవయౌవనము ప్రతిఫలించుచున్నట్లామె గుర్తించి పలుకుచున్నది. అతని చేతిలో ఒక బృహద్గ్రంథమున్నది. అతడు వైద్యుడు కావచ్చు లేదా జ్యోతిష్కుడు కావచ్చు.

ద్రోణుడు సుదూరమునుండి చూచి గుర్తించినాడు. కాని శిష్యవత్సలుడైన గురునకు అజ్ఞాత వాసము పూర్తి అయినదా యను భయము పీడించుచున్నది. ద్రోణుడు, వ్యంగ్యముగా భీష్మునితో నన్న మాటలు.

'ఎవ్వరి గాక వీఁడు కురువీరులకుం బొడసూపువాఁడె య
చ్చెరు వొక మ్రానిపేర నిటఁ జేరఁగ వచ్చుచున్నవాఁ డహం
కరణమెగాని యొండొకటి గానఁడు మూర్తివిశేష మారయన్
సురపతియట్ల వీనిమది చొప్పది యెట్లొ యెఱుంగ నయ్యెడిన్.'

—భారతము—విరాటపర్వము

ఇందు అందరకు గోచరించు అర్థమొకటి.

'ఎవ డీ అవివేకి! కురు వీరులపై నెత్తి వచ్చెడివాడా? ఆ చెట్టు ప్రక్కనుండి కేవలము దుఃహాంకారముతో దేవేంద్రునివలె వచ్చుచున్నాడు. మదిలో ఏమని ఎంచుచున్నాడో యీ దుర్విదగ్ధుడు!' అనుట ప్రకృతార్థము.

భీష్మునకు స్ఫురించునది అర్థాంతరము.

"అయ్యో! పాపము—వీడు ఉపాయహీనుడుగా అజ్ఞాతవాసము ముగియకుండ ఈ విధముగ కౌరవులకు కన్పడవచ్చునా! మ్రానిపేరివాడు (అర్జున శబ్దమునకు మద్దిచెట్టను అర్థమును గలదు) అర్జునుడు కేవలము దురహంకృతి వహించి అకాలములో కనిపించి సమయభంగమునకు పాల్పడునా? అచ్చముచ్చు అర్జునుడే యీతడు దేవేంద్రునివలె ఉన్నాడు — వీని మదిలోని ఆంతర్యమేమై యుండనోపు"

ఇందలి రెండర్థములును ఉపపన్నములే. అందలి వాచ్యార్థమును గ్రహించినది కౌరవభటులు. వ్యంగ్యార్థమును గ్రహించినది భీష్ముడు.

భీష్ముడు చెప్పిన సమాధానమును వ్యంగ్య గర్భితమైనదే. అతడు ద్రోణుడడిగిన ప్రశ్నకు, దుర్యోధనునితో సమాధానము చెప్పెను.

'తలవఁగ రిపులకు నిమ్మగు
కొలఁదిఁ గడచి వచ్చితిమి అతులిత బాహా
బలము నెఱపఁదఱియయ్యెను
చలింపవల దింక మనకు శత్రులవలనన్'

అందరకు స్ఫురించు అర్థము—

మనము శత్రువుల సరిహద్దులు దాటివచ్చినాము. ఇది మనబల పరాక్రమములు చూపవలసిన తరుణము. శత్రువులవలన మనము చలింపనవసరములేదు.

ద్రోణుడు గ్రహించినవ్యంగ్యార్థము వేరు. భీష్ముని మాటలలో 'అజ్ఞాత వాసము ముగిసినది.గడువుతీరినది, ఇదిపరాక్రమమును ప్రదర్శించుటకు మంచి అదను' అనుఅర్థాంతరస్ఫూర్తి సుగమము.

ఇందు రెండు అర్థములు శ్లేషలోవలె తుల్యోపపన్నములుగావు. ఒకటి కథానుసంధాయకము. అర్థాంతర స్ఫూర్తి యున్నది. మొదటి అర్థము లేనిచో

కథ నడువదు. రెండవ అర్థము అందుచేత గుణీభూతమైనదనియు అందుచే ఇది గుణీభూత వ్యంగ్యమనియు ఆలంకారికుల అభిప్రాయము.

అసలు వ్యంగ్యముగాని ధ్వనిగాని లేదని వాదించు ఆలంకారికుల మాట ఇట అప్రస్తుతము.

అట్లే విరాట పర్వమున కీచకవధ ఘట్టమునందలి పద్యమును వ్యంగ్యమున కుదాహరణముగ స్వీకరింపనగును. అది విరాటసభ. కీచకుడు ద్రౌపదిని పరాభ వించుట చూచిన భీముడు ఉగ్రుడైనాడు. సమయభంగమగు ప్రమాదమును గుర్తించి కంకరూపముననున్న ధర్మరాజు వలలుడైన భీముని వారించెను.

'వలలుండెక్కడ చూచె నొండెడ ననేవ్యక్ష్మాజముల్ గల్గవే
ఫలితంబై వరశాఖ లొప్పుచు ననల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రిత ప్రతతికిన్ విశ్రాంతిఁ గావింపఁగాఁ
గల యీ భూజము వంట కట్టియలకై ఖండింపఁగా నేటికిన్'

ఇందలి అర్థము సుగమము.

'వ్యంగ్యము ప్రధానతను ధ్వనియగును, దాని
గుణతను గుణీకృత వ్యంగ్యమని యగుసుధి'

'వ్యంగ్యార్థము ప్రధానమైన ధ్వనియు, నది అప్రధానమైన గుణీభూత వ్యంగ్యమనియుఁ గావ్యము రెండువిధములు ప్రసిద్ధములే'

—ఆంధ్ర ధ్వన్యాలోకము

అని శ్రీ వేదాల తిరువేంగళాచార్యులవారు ధ్వనికిని గుణీభూత వ్యంగ్యమునకును గల భేదమును నిరూపించి యున్నారు.

వాచ్యార్థిమే — శబ్దశక్తికి మూలమైనను, వాచ్యార్థమునకు కేవలము భిన్నమైన అర్థము ధ్వనిలో సిద్ధించుట గమనింపదగినది.

'అదిగో! గోదానదీ కచ్ఛమందు కుంజ
మందు వసియించు దృప్త సింహంబె యా శు
నకము నీ వేళనే మారణంబొనర్చెఁ
దిరుగుమాయింక ధార్మికా! దిగులుదీరి'

—ధ్వన్యాలోకము - శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారి అనువాదము.

నాయికా నాయకులకు ధార్మికుడగు సన్యాసి గోదావరీతీర నికుంజ విహారమునకు అడ్డుగనున్నాడు. అతడక్కడకు రాకుండ జేయుటెట్లు? అచటకు రావలదనిన అతడు మానునా? అతనిని భయపెట్టుటకు ఒక కుక్కను ప్రయోగించి చూచిరి. లాభము లేక పోయినది. అతనితో నాయకుడన్న మాటలే పై పద్యము.

"తిరుగుమా ఇంక ధార్మిక దిగులు తీరి" — అన్నాడు. ఏలన, "ఆ" కుక్కను సింహ మా వేళనే చంపినదట — అనగా ఇక అతడు భయపడవలసినది ఏను ఒక కుక్కకుగాదు. సింహమునకే. తిరుగుమా అనుమాటకు తిరుగవద్దు మాదో! తిరిగిన సింహము నిన్ను చంపును అను భావము సుస్పష్టము.

'అస్తమేతి గతస్తిమాన్'—'సూర్యుడస్తమించెను' —అలంకారికులు ఇచ్చెడి సుప్రసిద్ధమైన ఉదాహరణము అనుశీలింపదగినది.

సూర్యు డస్తమించెను — అనువాక్యము సూర్యాస్తమయ వర్ణన యైనచో నది వాచ్యార్థము. అందలి అభిధ సుగమము. కాని ప్రకరణమునుబట్టి ఆ వాక్యమునకు అనేకార్థములు స్ఫురించును. ఆశ్రమవాసియైన బ్రహ్మచారికి సంధ్యార్చన స్ఫురించును.

దొంగవానికి కర్తవ్యము స్ఫురించును.

నవోఢకు — తాను వాసకసజ్జికయై ప్రియసందర్శనమునకై నిరీక్షించు తహతహ స్ఫురించును.

అతిథులు ఇంట నున్న ఇల్లాలికి వంటకై అయత్తపడవలసినట్లు స్ఫురించును.

ఇన్ని వ్యంజకవిశేషములలో ప్రకరణానుబద్ధమైనది ధ్వనియని చెప్పనగును. ధ్వనిలో వాచ్యార్థమునకు అనుపపత్తి యేర్పడు ననుట స్పష్టము.

ధ్వని లక్షణామూలము, అభిధామూలము అని రెండువిధములు.

మొదటిదానికి అవివక్షిత వాచ్యము రెండవదానికి వివక్షితాన్యపరవాచ్యము అని పేరులు. లక్షణామూలధ్వని అత్యంత తిరస్కృత వాచ్యము, అర్థాంతర సంక్రమిత వాచ్యము అని రెండు విధములు.

వీనిలో మొదటిది జహల్లక్షణ. రెండవది అజహల్లక్షణ.

వివక్షితాన్యపరవాచ్యము, 'అసంలక్ష్యక్రమము, సంలక్ష్యక్రమము అని రెండు విధములు. సంలక్ష్యక్రమము 'శబ్దశక్తిమూలము' 'అర్థ శక్తిమూలము' అని రెండు తెరగులు. ఇట్లు శుద్ధ భేదములు 51. వీనివే మిశ్రధ్వనులు 1326. ఈ ధ్వనులన్నియు త్రివిధ సంకరమువలన 5304 అగును. వీనిలోని ముఖ్య భేదములు 25, 26 పుటలలో పట్టికల రూపమున చూపుట జరిగెను.


ధ్వని
లక్షణామూలధ్వని
అవివక్షిత వాచ్యము
అభిధామూలధ్వని
వివక్షితాన్యపరవాచ్యము
అత్యంత తిరస్కృత వాచ్యము
జహల్లక్షణ
అర్థాంతర సంక్రమితవాచ్యము
అజహల్లక్షణ
వాక్యగతము
పదగతము
వాక్యగతము
పదగతము
సంలక్ష్య క్రమవ్యంగ్యము
(చూ. పుట–26)
అసంలక్ష్య క్రమవ్యంగ్యము
(1) పదగతము
(2) వాక్యగతము
(3) వర్ణగతము
(4) రచనాగతము
(5) పదైకదేశగతము
(6) ప్రబంధగతము


సంలక్ష్య క్రమ వ్యంగ్యము
శబ్దశక్తి మూలము
అర్థశక్తి మూలము
ఉభయశక్తి మూలము
వస్తు రూపము
అలంకార రూపము
వాక్యగత
పదగత
వాక్యగత
పదగత
స్వతస్సిద్ధము
కవిప్రౌఢ వచన సిద్ధము
సుకవినిబద్ధోక్తిసిద్ధము
వస్తుకలితవస్తువు
వస్తుభవ దలంకృతిమయము
అలంకృతి నిరూఢ వస్తువు
అలంకృతి స్తుతాలంకృతి
పదగత
వాక్యగత
ప్రబంధ గత
డిటో
డిటో
డిటో

# 4
# ప్రాచ్య ప్రతీచీ దృక్పథములు

ప్రతీచీ సాహితీ జగత్తులో కూడ కావ్య మీమాంస సల్పిన పలువురు విద్వాంసులు కావ్యతత్త్వమును పలు విధముల నుల్లేఖించినారు.

జాన్ స్టూఅర్ట్ మిల్ (John Stuart Mill)—

*'What is poetry but the thought and words in which emotion spontaneously embodies itself'.

'కవిత్వము భావావేశము తనంతతాను తాల్చెడి సహజశబ్దార్థ స్వరూపము గాక మరేమి?' అన్నాడు

ఇందు శబ్దార్థౌ సహితౌ కావ్యమ్, అన్న భామహుని నిర్వచనముతో పాటు భరతముని రససిద్ధాంతచ్ఛాయలు నున్నవి.

ఆంగ్ల నిఘంటుకారుడైన జాన్సన్ (Johnson) మనీషి నిర్వచనమున—

*'Poetry is metrical composition.

It is the art of uniting Truth with Pleasure by calling forth imagination to the help of reason.'

'కవిత్వము ఛందోబద్ధమగు రచన. అది బుద్ధియు భావనయు సాధనములుగా ఆనంద సత్యముల యైక్యమును సంఘటించు కళ.'

జాన్సన్ నిర్వచనమునందు గల మూడు ముఖ్యవిషయములు :

1. కవిత్వము ఛందోబద్ధ మగు రచన
2. ఆనంద సత్యములకు ఐక్య సంధానము కావించునది కవిత
8. బుద్ధి — భావనల సహకారము

కవితలో అంతర్భాగములుగా కన్పించు చున్నవి

సంస్కృతాలంకారికులు కంఠోక్తిగ కవితకు ఛందస్సు అపరిహార్య మైన ధర్మమని నుడువలేదు. పైగా 'గద్యం కవీనాం నికషం వదంతి' — గద్యము కవుల యొక్క రచనల విలువగట్టుటకు నికషోపల (గీటురాయి) మనుమాటయు గలదు.

*'Poetry in its best form may exist without metre'

'ఉత్తమోత్తమ కవిత ఛందోవిరహితముగా వెల్లి విరియ వచ్చు'నని కోల్‌రిడ్జి అభిభాషణము. ఛందస్సు కవితకు అవసరమా అనునది వాదోపవాదములకు దారి తీసినది.

---

*నక్షత్రఖచిత మైన ఆంగ్లోదాహరణములు—తెలుగు అనువాదములు శ్రీ పింగళి లక్ష్మీకాంత కవి 'సాహిత్యశిల్ప సమీక్ష'నుండి గైకొనబడినవి.

సమస్త వాఙ్మయములలో కవిత బహుళముగా ఛందోబద్ధమైన రచనయే. సర్ ఫిలిప్ సిడ్నీ—కవులు అధికసంఖ్యాకులు తమ రచనలను ఛందోబద్ధముగ గ్రథించినప్పటికిని, ఛందస్సు ఆహార్యము మాత్రమే యన్నాడు.

*'The greatest part of poets have apparelled their poetical inven -tions in that numerous kind of writing called verse. Indeed verse is an apparel only being but an ornament and no cause to poetry since there have been most excellent poets that have never versified and now swarm many versifiers that need never answer to the name of poets.'

'కవులలో బహుసంఖ్యాకులు తమ రచనలకు పద్యమని చెప్పబడు గణాత్మకమైన ఆచ్ఛాదనము తొడిగిరి. ఇది ఆచ్ఛాదన మాత్రమే. అది కవిత్వమున కొక బహిరలంకరణము కాని మూలకారణము కాదు. పద్యములో రచియింపని మహాకవులెందరో యున్నారు. ఇటీవల కవి నామార్హత లేని పద్య రచయిత లెందరో మూగుచున్నారు.'

కాని మాథ్యూ ఆర్నాల్డ్ కవిత్వమునకు ఛందస్సునకు అవినాభావ సంబంధము కలదని నిరూపించెను.

* 'The rhythm and measure of poetry elevated to a regularity, certainity of force, very different from that of the rhythm and measure which can pervade prose are also a part of its perfection.'

'గద్యము నందలి శ్రుతి లయల కంటె మిక్కిలి భిన్నమై గద్యమునందు లేని నియతత్వము, నిశ్చితత్వము శక్తిమహత్త్వము సంపాదించుకొని ఉత్కర్ష నందిన కవిత్వములోని శ్రుతిలయలు ఆ కళా పరిపూర్ణతలో ఒక అంగము.'

లీ హంట్ (Leigh Hunt) ఛందస్సు లేనిదే కవితయే లేదని కంఠోక్తిగ పలికెను.

*'This opinion is a prosaic mistake. Fitness or unfitness for song or metrical excitement makes all the difference between a poetical and a prosaic subject and the reason why verse is necessary to the form of poetry is that the perfection of poetical spirit demands it, that the circle of its enthusiasm, beauty and force is incomplete without it.'

'ఈ అభిప్రాయము ఒక నీరస దుర్వాదము.

ఛందోఽర్హానర్హతలే రసవద్వస్తువునకును, నీరసవస్తువునకును గల ప్రధానభేదము. కవిత్వము ఛందోరూపముగానే యేల యుండవలెనన్నచో కవితాత్మ స్వసిద్ధికై ఆ రూపమునే అపేక్షించును గనుక; ఆవేశము, సౌందర్యము, ఓజస్సు మొదలగు కవితా గుణమండలి ఛందస్సు లేనిచో సమగ్రము కానేరదు.'

ఈ సమస్య సాహిత్య పరులు గాక మనోధర్మశాస్త్రవేత్తలు తీర్పదగినదని ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారి నిర్దేశము! జాన్ స్టూఆర్ట్ మిల్ అను ప్రఖ్యాత మనోధర్మ శాస్త్రజ్ఞుడు చెప్పిన తీర్పు గమనింప దగినది.

***'Ever since man has been born, all deep and sustained feeling has tended to express itself in rhythmical language, and the deeper the feeling the more characteristic and decided the rhythm.'**

'నిశితము నిర్భరమునైన భావావేశమెల్లప్పుడును లయాన్విత భాషలోనే స్వయం వ్యక్తమగుచుండును. ఆ భావమెంత నిశితమైయున్న ఆ లయాత్మకతయు అంత వైలక్షణ్యము దాల్చును. ఇది ఈ విశ్వమున మానవుడు జన్మించినప్పటి నుండియు జరుగుచున్నది.'

ఈ వివాదమునకు పరిష్కార రూపకమైనది ఆదికవి వాల్మీకి ప్రాచీన గాథ; కవిత్వావిర్భావ చరితగ రామాయణ పీఠికలో గల కథ.

మహోల్లాసములో మునిగి యున్న క్రౌంచమిథునము నందలి మగపక్షిని బోయవాడు కొట్టగా ఆ సన్నివేశమును చూచి శోకసంతప్తుడైన వాల్మీకి నోటినుండి శ్లోకము శాపరూపమున వెలువడినది.

'మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీస్సమాః
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్'

తదనంతరము వాల్మీకియే శ్లోకావిర్భావమునకు ఆశ్చర్య వివశుడయ్యెను.

పాదబద్ధోఽక్షరసమః తంత్రీలయ సమన్వితః
శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా.

ఈ వింతను గూర్చి వాల్మీకిశిష్యుడైన భారద్వాజుడు సహపాఠులతో అన్న వాక్యములు ఉదాహరింపదగినవి.

'సమాక్షరై శ్చతుర్భిర్యః పాదైర్గీతో మహర్షిణా
సోఽనువ్యాహరణా త్తస్య శోకః శ్లోకత్వమాగతః'

మహర్షి పొందిన శోకము వెంటనే నోట వెలువడి సమాక్షరములైన నాలుగు పాదములతో శ్లోకత్వమును పొందినది.

ఆలంకారికులలో ప్రాతః స్మరణీయుడైన భరతముని నిర్దేశము గమనింప దగినది.

ఛందోహీనో నశబ్దోస్తి
నచ్ఛందశ్శబ్ద వర్జితమ్
—నాట్యశాస్త్రము.

ఛందోహీనమైన శబ్దము లేదు.
శబ్ద వర్జితమైన ఛందస్సు లేదు.
ప్రతి శబ్దమునందును అంతర్గర్భితముగ సహజమైన ఛందస్సుండును.
ఛందస్సులేని శబ్దమే లేదు. అంతేకాక శబ్దము లేని ఛందస్సు లేదు.

'ఛందస్సు' లేకుండ వ్రాయుచున్నామనుకొను వారి రచనలలో కూడ అంతర్వాహినిగ ఛందస్సుండుట సహజము.

నిజమునకు భాషకు వ్యాకరణమెట్టిదో శబ్దమునకు ఛందస్సును అట్టిదే. 'నేను ఇన్నినాళ్లు మాటాడునది వచనమని నాకు తెలియదే' అని విస్తుపోయినాడట ఒక ఆంగ్లేయ పౌరుడు. వ్యాకరణము వెలుగు వెంటనుండు నీడవలె భాషతో నుండును. అది వ్యక్తము గాకపోవచ్చును. అట్లే శబ్దము నంటి ఛందస్సుకూడా అంతర్గర్భితముగ నుండుట సహజము. ఈ సత్యమును ఆలంకారిక ప్రాగ్రసరుడు భరతముని యే నిరూపించి పల్కెను.

కావ్య మీమాంసలో వాల్మీకి గాథలో స్వయంవ్యక్త మగుచున్న ముఖ్య విషయము కవిత్వమునకు, ఛందస్సునకు గల అవినాభావసంబంధము మాత్రమే గాదు.

'తస్య శోకః శ్లోకత్వమాగతః'

కావ్య సృష్టికి 'అనుభూతి' 'హృదయము కరగుట' ముఖ్యము.

**'Poets teach in verse what they learn from suffering'**

'కావ్యసృష్టిలో కవులు ఉపదేశించునది వారు శోకసంతప్తులై లోకములో అనుభూతి వలన నేర్చుకొన్నదే' అని షెల్లీకవి ప్రవచనము.

'ఆమె పేరు కవిత ; అతిలోక సుకుమారి
సవతి తల్లి జగతి చావగొట్టు
కారు కంటి నీరు మారు ముత్యాలుగా
రమ్య హాస లోల రామకృష్ణ '[1]

కవితా కుమారి అత్యంత సుకుమారి. కట్టు కథలోని సవతితల్లి ఆ సుకుమారిని చావగొట్టును. అతిలోకసుకుమారికి ఐహికజగత్తు కఠోరహృదయురాలైన సవతి తల్లియేగద. అయితే ఆమెకార్చు కన్నీటి బిందువులు ముత్యములుగా మారుననుట అనుభవ పునరుక్తము. 'తస్య శోకః శ్లోకత్వమాగతః'.

ఆంద్రే పండితుని వాక్యములు ఇప్పట్టున స్మరణీయములు.

**'Poetry is the sister of sorrow.**

**Every man that suffers and weeps is a poet.**

**Every tear is a verse.**

**And every heart a poem.'**

'కవిత శోకమునకు ప్రియ సహోదరి.

దుఃఖ పరవశులై, కష్టానుభూతిలో విలపించు శోకసంతప్తులెల్లరు కవులే. ప్రతి బాష్పబిందువు ఒక పద్యమే. శోకపరితప్తమైన ప్రతి హృదయము ఒక మహా కావ్యమే.'

---

[1] ప్రగతి గీతలోని పద్యము. స్వకీయము.

జాన్సన్ చేసిన కావ్యనిర్వచనమునందలి ఆనందసత్యముల గూర్చి ప్రాచీనాలంకారికులును ప్రస్తావించిరి. కవితా హేతువులుగా జాన్సన్ పేర్కొనిన భావన—బుద్ధి సంస్కృతాలంకారికులు చెప్పిన ప్రతిభావ్యుత్పత్తులతో సంవదించును.

**'Best words in their best order is poetry.'**

'ఉత్తమోత్తమశబ్దములు రీతిసుభగమగు శయ్యతో గ్రథించుటయే కవిత'యని కోల్ రిడ్జ్ వచించెను. ఈ నిర్వచనము దండి చెప్పిన 'ఇష్టార్థ వ్యవచ్ఛిన్నమైన పదావళి కవిత'యను భావముతో సంవదించుచున్నది.

కార్లైల్, **'Poetry we call musical thought'**— 'కవిత్వము సంగీత తరంగితమైన అర్థసమ్మేళన'మనగనే విశ్వనాథుని 'వాక్యం రసాత్మకం కావ్యమ్' జ్ఞప్తికి వచ్చును.

మాథ్యూఆర్నాల్డ్, **'Poetry is the interpretation of life'** 'కవిత్వము పురుషార్థములకు అర్థవివరణ'మనుమాట, 'కావ్యం కాంతా సమ్మితతయా ఉపదేశ యుజే' అను వాదముతో సంవదించును.

కావ్యమీమాంసలో రస్కిన్ లోతునకు పోయి, సమస్తకళలకు సౌందర్యారాధనమే ప్రధానమని కళాత్మ రసానందమేయని ప్రవచించెను.

'లయాన్వితమై ఛందోబద్ధమైన రచనయని కవిత్వమును నిర్వచించుట అవ్యాప్తిదోష భూయిష్ఠము. కావ్య నిబద్ధరచన— మాటాడు కవిత — శ్రవ్య కావ్యము. శిల్పవిగ్రహము, చిత్రలేఖనము, నాదబిందుప్రస్తారము కవితాభినయములు. యథార్థముగా వ్యాసపీఠములముందు కూర్చున్న మిల్టన్, గోథే మహాకవులే. వారితోపాటు ఉలితో లోకోత్తర శిల్ప విగ్రహములను చెక్కిన ఫిడియాస్ గాని, కుంచెతో చిత్రలేఖనముల సృష్టించిన రేఫెల్ గాని తాను వినలేని నాదబిందుకృతులను పయానోవాద్రితముపై నొరగి సృష్టించిన బధిరుడు బీథోవెన్ గాని మహాకవులే సుమా.'

***'It is shallow criticism that would define poetry as confined to literary productions in rhyme and metre. The written poem is only poetry talking, and the statue, the picture and the musical composition are poetry acting. Milton and Goethe at their desks were not more truly poets than Phidias with his chisel, Raphael at his easel or deaf Beethoven bending over his piano, inventing and producing strains which he himself could never hope to hear.'**

కావున కళలన్నిటికిని సౌందర్యారాధన— ఆ సౌందర్యారాధనమున నభివ్యక్తమగు ఆనందమే పరమావధి యని భరతమునివలె ప్రతిపాదించినవారు లేకపోలేదు. కావ్యపరమావధిగ ప్రతీచీ సాహితీ జగత్తులో ఆదిమాలంకారికులలో

నొకడైన అరిష్టాటిల్ ప్రవచించిన 'Catharsis of Emotions' భావముల ప్రక్షాళనము — భావితాంతఃకరణము గల్పించు రసవాదముతో సంవదించు చున్నది.

కాని, ఈ కావ్యానుభూతి నిష్ప్రయోజనమైన వృథాకాలహరణమని అధిక్షేపించు వారును లేకపోలేదు.

'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' కావ్యాలాపములు వర్జింపవలెను— అను ప్రవచనము ఈ అధిక్షేపవాక్యములలో తలమానికము.

'Nobody can be a poet, nor appreciate poetry without a certain unsoundness of mind' - Macaulay.

మెకాలే (Macaulay) కవులనుగూర్చి చెప్పిన వాక్యములు సంస్కృతములోని అధిక్షేపమున కెనయైనవి.

'కవిత వ్రాయలేరు కవిత చదువలేరు
వేపకాయ యంత వెఱ్ఱి లేక' —అని మెకాలే తాత్పర్యము

'విశ్వశ్రేయః కావ్యమ్'— అని ఆంధ్రశబ్ద చింతామణి ప్రవచనము. కావ్యమును తాము జగద్ధితంబుగ విరచించితిమని ఆంధ్రకవుల అభిభాషణపౌనః పున్యము తెలుగు వారికి సుపరిచితము.

'గురువు లఘువు చేసి కుంచించి కుంచించి
లఘువు గురువుచేసి లాగి లాగి
కవిత చెప్పినట్టి కవి గులామునుబట్టి
ముక్కు గోయవలయు ముక్కుపట్టి.'

అను తెలుగు పద్యమును గలదు.

'కొండవీటిలో గాడిద' నీవునుంగవివి కావుగదా అనుమానమయ్యెడిన్!' అని శ్రీనాథ కవియే అధిక్షేపించిన పద్యమును గలదు.

ఇట్టి అధిక్షేపణ అసత్ కావ్య పరమైనదనియు, సత్ కావ్యము జగద్ధితమైన దేయనియు విద్వాంసులు సమర్థించుచున్నారు.

సమర్థనకేమి గాని, కావ్యము ఎంతవరకు ఉపాదేయము అనునది అడుగదగిన ప్రశ్నయే.

మేధావులలో మేలుబంతియనదగు ప్రాన్సిస్ బేకన్ మనీషి అధిక్షేపణ పరిశీలింపదగినది.

*'Poetry lends some shadow of satisfaction to the mind of man in those points where in the nature of things doth deny it. It is the theatre of the mind to which we may repair for relaxation and plea—sure, but in which it is not good to stay too long, because it only feigneth while science is concerned with Reality and Truth.'

'కవిత్వము మానవుని మనస్సునకు వాస్తవజగత్తున లభింపని సంతృప్తిని ఛాయామాత్రముగా ఆభాసమాత్రమైన సంతోషము) ఇచ్చును. అది చిత్త విశ్రాంతి వినోదములకొరకు మెట్టదగిన విలాసభవనము. దానియందు దీర్ఘకాలము గడపుట మంచిదిగాదు ఏమన ఆ సంతోషాభాసమైనను కల్పితమేగాని సత్యము కాదు. ఇక శాస్త్రమో, ప్రత్యక్ష ప్రకృతికి సంబంధించిన సత్యము.'

**బుభుక్షితై ర్వ్యాకరణం న భుజ్యతే**
**పిపాసితైః కావ్యరసో న పీయతే**—

వ్యాకరణమును మెసవి ఆకలి దీర్చుకోలేము.
కావ్యరసమును త్రాగిన దప్పిక తీరదు. —నిజమే

**Man does not live by bread alone. — Bible**

అన్నము తిని— ఆకలి తీర్చుకొనుటయేనా మానవజీవితపరమార్థము. బైబిలులో చెప్పినట్లు మానవుడు భోజనముతో మాత్రమే బ్రదుకజాలడు.

మానవజీవితమున లలితకళలకున్న స్థానము లలితకళలకున్నది. విజ్ఞాన విద్యలకున్న స్థానము విజ్ఞానవిద్యల కున్నది.

మానవశరీరములో హృదయమునకును, మెదడునకునుగూడ సముచిత స్థానమున్నదని మానవజీవితసమగ్రశిల్పమును అనుశీలించిన వారందరకు సులభముగ వ్యక్తమగు విషయమే.

లే హంట్ (**Leigh Hunt**) సమన్వయము అనుశీలింపదగినది—

*** Poetry begins where matter of fact of Science causes merely to be such and tries to exhibit a further truth— the connection it has with the world of emotion and its power to produce imaginative pleasure It is thus atonce the antithesis and complement of science.**

'వైజ్ఞానికశాస్త్రముల పదార్థవిమర్శయు, తత్త్వనిరూపణమును ముగిసిన పిమ్మట కవిత్వము ఆ శాస్త్రములకు దుర్లభమైన వేరొక ఉన్నతసత్యమును ప్రకటించుటకు పూనుకొనును. ఆ సత్యము పదార్థములకును రసభావ జగత్తునకును గల సంబంధము, అది కలిగించు భావనాహ్లాదము ఈ విధముగా కవిత్వము ప్రకృతిశాస్త్రములకు విరుద్ధమగుటయేగాక పూరకమును అగుచున్నది.'

జగదనుశాసకులలో కవికి గల స్థానము విస్మరింపరానిది. భూమండలమందు పరోక్షశాసననిర్మాతలు కవులే అని షెల్లీకవి అభిభాషణము. **'Poets are the unacknowledged legislators of the world.'**

మానవమనస్సును క్షీరసాగరమువలె మథించిన మహాకవి భర్తృహరి **'సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్'** —కవిత గల్గిన రాజ్యాధికారమేల ? — యని యెలుగెత్తి చాటెను. ప్రజాహృదయములను తరతరాలు నిర్వికల్పముగా నేలు చున్న పరోక్షసార్వభౌములు కవులు.

5

# కావ్య హేతువులు

చ॥ 'నిరుపహతి స్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
వ్పురవిడె మాత్మకింపయిన భోజన మూయెల మంచ మొప్పుతి
వ్పరయు రసజ్ఞులూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే

శ్రీకృష్ణదేవరాయలతో అల్లసానిపెద్దన చెప్పినదిగా బహుళప్రచారమునందిన పై పద్యములో పేర్కొనిన కవితాహేతువులు కవులెల్లరకును లభ్యమగునవికావు. అది చమత్కారముగ చెప్పిన పద్యము గాని కవిహృదయము కాజాలదు.

పోతన మహాకవి భాగవతము రచించుటకు పై భోగముల నాకాంక్షించి యుండలేదు.

క॥ పలికెడిది భాగవత మట
పలికించెడువాడు రామభద్రుండట నే
పలికిన భవహర మగు నట
పలికెద వేరొండు గాథ పలుకఁగ నేలా

అను పద్యము సుప్రసిద్ధము.

పోతన తన కవితా హేతువుగా శ్రీరాముని పేర్కొనెను. తానా మహాకావ్యమును వ్రాసినది ?

యథార్థమునకు ప్రతికావ్యమును ఒక దృష్టితో చూచిన అపౌరుషేయమే.

ప్రకృతి సిద్ధమైన సహజశక్తిగల కొందరు మాత్రమే కావ్యములు వ్రాయగలరు. అందరును కవులు కాలేరు.

ఆలంకారికులు కవితాహేతువులుగా పేర్కొనినవి: ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసము.

ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా

—భామహుడు

ప్రతిభ నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞ. ఆ ప్రజ్ఞగలవాడు కవి. మమ్మటుడు చెప్పిన లోకోత్తర వర్ణనానిపుణతకు ప్రతిభను పర్యాయపదముగ నెంచ

వచ్చును. లోకోత్తర చమత్కార జనకమైన ప్రజ్ఞ కవిచేతిలోని పరసువేది.

రమ్యం జుగుప్సిత ముదార మథాఽపి నీచ
ముగ్రం ప్రసాది గహనం వికృతం చ వస్తు
యద్వాఽప్యవస్తు కవిభావుకభావ్యమానం
తన్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే.[1]

'రమ్యము గానిండు; రోత గొలుపునది గానిండు ; ఉత్తమము గానిండు అధమము గానిండు; భయంకరము గానిండు; ప్రసన్నము గానిండు; గంభీరము గానిండు; వికృతము గానిండు; వస్తువుగానిండు; అవస్తువు గానిండు; లోకమున కవిచే భావ్యమానమై రసభావమును గల్గింపనిది లేదు.'

షెల్లీ కవి **'Poetry turns all things to loveliness. It exalts the beauty of that which is beautiful and it adds beauty to that which is deformed**[2]**'** 'కవిత్వ మెల్ల వస్తువులను సుందర మొనర్చును. సుందరవస్తువులను, సుందరతరము లొనర్చును. వైరూప్యములను గూడ సుందరముగా మార్చును.' అని వాక్రుచ్చెను.

రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో ప్రతిభను భావయిత్రి, కారయిత్రి అని ప్రస్తరించెను. భావయిత్రి అనగా కవికిగల మనోనేత్రము. ఇదియే మాచ్యూ ఆర్నాల్డ్ భాషలో **(The vision, the faculty divine.)** అతిలోకదివ్యదృష్టి.

పద్మము పుష్పవిశేషముగ మాత్రమే సామాన్యునికి గోచరించును. కాని కవి యయినవాడు ఆ పద్మమును చూచి —

ప్రత్యూషపవనాల పద్మిని పులకించి
చిందెను చిన్నారి చిలిపినవ్వు [3]

అని అభివర్ణింపవచ్చును. భౌతిక నేత్రమున కందని సౌందర్యము కవిప్రజ్ఞా నేత్రమునకు గోచరించును. భావయిత్రి కవికి, శిల్పికి, చిత్రలేఖకునకు సమానమే. కారయిత్రి అనగా తాను సందర్శించిన సౌందర్యమును పునఃసృష్టిసల్పి ప్రదర్శించు శక్తి. ఈ రెండు శక్తులకు మధ్య 'సమాధి' యుండును. వర్డ్సువర్తుకవి ***'Emotion recollected in tranquility'**. (అనుభవించిన భావావేగమును అనుస్మరణపూర్వకమైన నిదిధ్యాసలో పునఃసృష్టి చేయుట కవితాకృషిలో నంతర్భాగము) అని వచించెను. వర్డ్సువర్తు సిద్ధాంతము రాజశేఖరుని కావ్యమీమాంసలో చెప్పబడిన సమాధితో సంవదించుచున్నది.

---

[1], [2] శ్రీ స. సు. శాస్త్రిగారి కావ్యాలంకారసంగ్రహ వివరణములో ఉదాహృతములు – ( పుట 128 ) మొదటిది దశరూపకము లోనిది.

[3] తారాతోరణము — నండూరి రామకృష్ణమాచార్య

కవి తాను భావయిత్రిలో సందర్శించిన దంతయు కారయిత్రిలో పెట్టుట సామాన్యముగా సాధ్యము గాదు అందుచేతనే కవిభావనకు అతని కావ్యము ఎంతటి ఉత్కృష్ట ప్రతిసృష్టి యైనను ఒక క్రీనీడవంటిదని షెల్లీ అభిప్రాయము. **Even the best poem, is after all a shadow of the original conception of the poet .1'**

క్లైవ్ బెల్ అను ఆంగ్లేయవిమర్శకుని అభిభాషణము మిక్కిలి అర్థవంత మైనది.

* **'Between the moment of inspiration and the finished work of art, there is room for many a slip. Feeble or defective emotion is at best only one explanation of an unsatisfactory form. But we cannot be sure that because the forms are wrong the state of mind of the artist in the beginning is also wrong. Right forms imply right feelings, but wrong forms do not necessarily imply wrong feelings. The latter may be due to lack of concentrating his energies.'**

'కవికి భావావిష్టత కల్గినది మొదలు కావ్యనిర్మాణము పూర్తి యగులోపల పెక్కుభంగములు కలుగు నవకాశమున్నది. కావ్యరసహీనతకు నీరసమైనట్టిగాని దోషజుష్టమైనట్టిగాని కవియొక్క భావనయే కారణమని చెప్పుకొందుము. కాని కావ్యనిర్మాణము బాగుండకపోవుటకు ఆదిలో కవియొక్క చిత్తస్థితి బాగు లేకుండుట ఒకటే కారణము గాదు. రసవంతమైన కావ్యము కవిభావుకత్వమునకు నిదర్శనమే కాని, రసవిహీనమైన కావ్యము విధిగా అతని భావుకతాలోపమునకు నిదర్శనముకాదు. ఈ రెండవది అతని సమాధిలోపమువలన కలుగవచ్చును.'

కావ్యహేతువులలో రెండవది వ్యుత్పత్తి. ప్రతిభకు కావ్యకళలో ఆలంబము వ్యుత్పత్తియే. వ్యుత్పత్తి యనగా శబ్దపాండిత్యము మాత్రమే గాదు. శబ్దపరి జ్ఞానముతోపాటు లోకవృత్తము, మానవచిత్తము నెఱుంగుట - వ్యుత్పత్తిలో చేరును. వ్యుత్పత్తిపరిధిలో విజ్ఞాన సర్వస్వమంతయు నిముడును.

అభ్యాసము మూడవ కావ్యహేతువు ఆలంకారికులు కావ్యహేతువులలో ప్రతిభావ్యుత్పత్తులతోపాటు అభ్యాసమునకు ప్రక్కపీటవేయుట ఆశ్చర్యము గొల్పవచ్చును. అభ్యాసము లేనిదే ప్రతిభావ్యుత్పత్తులు రాణింపవు.

కావ్యహేతువులలో రాజశేఖరుడు ప్రతిభకే ప్రాధాన్యము నొసంగినాడు.

> * ప్రతిభైవ చ కవీనాం కావ్యకారణకారణమ్;
> వ్యుత్పత్త్యభ్యాసౌ తస్యాఏవ సంస్కారకారకౌ
> న కావ్యహేతూ.

ప్రతిభావ్యుత్పత్తులలో ప్రతిభయే గరీయసి' అన్న ఆలంకారికులే అధిక సంఖ్యాకులు. వ్యుత్పత్తియే గరీయసి యనువారును లేకపోలేదు.

---

[1] ముద్దుకృష్ణ గారి 'వైతాళికులు' పీఠికలో ఉదాహృతము

# 6

# కావ్య భేదములు

## 1 ప్రబంధము

శ్రవ్యకావ్యమును పద్యకావ్యమని, గద్యకావ్యమని విభజింపనగును. గద్య పద్యోభయమయమైన కావ్యమునకు చంపువని పేరు. తెలుగులో భారత రామాయణాది గ్రంథములు చంపువులే.

తిక్కన నిర్వచనోత్తరరామాయణమును కేవలపద్యకృతిగ విరచించెను. ఇంకను, బహుభంగుల కావ్యవిశేషములు వెలసియున్నవి. తెలుగుకావ్యములలో ప్రబంధము సుప్రసిద్ధము. ప్రబంధమనిన ప్రకృష్టమైన బంధము కలది అని అర్థము చెప్పవచ్చును అనగా ఆద్యంతముల నందుకొని అంతర్వాహినిగా ప్రసవించు వస్త్వైక్యము కలదియని వ్యాఖ్యానము చేయవచ్చును. తెలుగులో ప్రబంధమన రూఢార్థమున వర్ణనాత్మకమైన నిబద్ధకావ్యము. అందు కథకు, పాత్రపోషణకు, భావసంపదకు సముచితస్థాన మున్నను వర్ణన లన్నిటిని మించి ప్రాధాన్యము వహించును. అష్టాదశవర్ణనలలో క్వాచిత్కముగ కొన్ని కొరవడినను ప్రబంధమున వర్ణనాబాహుళ్యము అపరిహార్యము.

అష్టాదశవర్ణనలను విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణియందు పేర్కొనియున్నాడు—

మ. 1పుర 2వారాశి 3 మహీధర 4ర్తు 5 శశభృ
6త్సూర్యోద 7 యోద్యాన 8పు
ష్కర కేళీ 9 మధుపాన 10 మోహన 11 వియో
గ 12 క్షేమయాన 13 స్వయం
వర 14 పుత్త్రోత్సవ 15 మంత్ర 16 దూత్య 17 రణ 18 దో
ర్వైభవ కాంతి సంకీర్తనా
కర మష్టాదశ వర్ణనాన్వితము త
త్కావ్యంబు భవ్యంబిలన్[1]

అష్టాదశవర్ణన లనుట సుప్రసిద్ధసాహిత్యసంప్రదాయమే యైనను అందు

---

[1] కావ్యాలంకార చూడామణి-తృతీయోల్లాసము. 92వ పద్యము.

ఆయాప్రబంధములందు కొన్నికొన్ని కొఱవడుట కద్దు.

ప్రబంధమున ఇరువదిరెండు వర్ణనలుకూర్చి చెప్పవలెనని అప్పకవి నిర్దేశించి యున్నాడు—

సీ॥ పురమును ఋతుషట్కమును ప్రయాణమ్మును
శైలంబు వేటయు సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు
ద్యూతంబు పిదప నద్భుతరణంబు
విజయంబు మద్యపానజ వికారంబును
వనవిహారంబును వారికేళి
కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోచితంబు

గీ. పద్మమిత్రోదయంబును బరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననగ నిరువదిరెండు వర్ణనలుగూర్చి
చెప్పవలయు ప్రబంధంబు శ్రీనివాస [1]

కావ్యములను దృశ్యకావ్యములనియు శ్రవ్యకావ్యములనియు ఆలంకారికులు విభజించియున్నారు.

కావ్యమునందలి వస్తువు ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము అని మూడు తెరంగులు. పురాణ ప్రసిద్ధమైన కథ ప్రఖ్యాతము. ఉదా : రామాయణ మహాభారతాదులు.

ఉత్పాద్యము కవి కల్పితగాథ. మిశ్రము ప్రఖ్యాతోత్పాద్య సమ్మిళితము.

ఉ కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరి పుట్టు రత్నము లవారితసత్కవి కల్పనావిభూ
షావహపూర్వవృత్తములు సానలఁదీరిన జాతిరత్నముల్
గావున నిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్. [2]

రామరాజభూషణుడు కేవలకల్పనాకథలను కృత్రిమరత్నములని నిరసించెను. అయినను, కళాపూర్ణోదయమువంటి ఉత్పాద్యకథ లలనాడే ఉద్భవించినవి.

## 2. చతుర్విధకవిత్వములు

ప్రాచీనలాక్షణికులు చతుర్విధకవిత్వములను పేర్కొనిరి. ఆశు, మధుర,

---

[1] అప్పకవీయము : ప్రథమాశ్వాసము 28 ప.

[2] వసుచరిత్ర:అవతారిక 1–19

చిత్ర, విస్తరములు చతుర్విధకవితలు.

నవీనులు విభజించు చతుర్విధ కవితారీతులు—

1. ఆఖ్యానరీతి - The Epic style
2. నాటకీయరీతి - The Dramatic style
3. ప్రబంధరీతి - The Descriptive style
4. భావకవితారీతి - The Lyrical style

ప్రాచీనకాలమునుండి బహుభంగుల వెల్లివిరిసిన కావ్యవిశేషములలో కొన్ని ప్రఖ్యాతములైనవానిని గూర్చి ప్రస్తావింపనగును.

## 3. ముక్తకము

ముక్తకమనగా ఒకపద్యము మాత్రమే.

స్వయంసంపూర్ణమైన ఒక పద్యములో ఒక గాథ విన్పింపవచ్చును. గాథాసప్తశతి ఏడువందల ముక్తకముల ముత్యాలహారము.

ఆ॥వె॥ పరసకవితయన్న సంగీతకళయన్న
వ్యంగ్యమన్న లలితహాస్యమన్న
అవని విముఖులున్న అవియె వారికి శిక్ష
రమ్యహాసలోల రామకృష్ణ[1].

## 4. ఖండకావ్యము

కావ్యభేదములలో ఖండకావ్య మొకటి.

భారత రామాయణ పురాణప్రసిద్ధములగు కథలను గ్రహించి, అష్టాదశ వర్ణనలతో పెంపొందించి తెలుగున ప్రబంధములు ప్రాచీనకవులు వ్రాసినట్లే నవీన కవులు పురాణప్రబంధములనుండి, చరిత్ర నుండి, సమకాలీనసంఘమునుండి వస్తువును గ్రహించి కవిత అల్లుచున్నారు. నవీనులలో జాషువకవిగారి ఖండ కావ్యములు సుప్రసిద్ధములు. ఖండకావ్యములలో 'శీర్షిక' కే ప్రాధాన్యముగాని పూర్వోత్తర కథలతో సంధానము అవసరము లేదు. 'కర్ణుడు' అను శీర్షికలో కర్ణునిపై కవికి కలిగిన భావపరంపర ఖండకావ్యమగును. శ్రీ కృష్ణదేవరాయలపై జాషువగారు వ్రాసిన ఖండకావ్యములో ఒకపద్యము—

ఆ॥ వె॥ తొల్లి నిన్ను గన్న తుంగభద్రానది
బ్రదికియున్న దిపుడు పార్థివేంద్ర
నేటి తుంగభద్ర నిన్నెరుంగనియట్లు
నడచుచుండె నంగనాచివోలె!

---

1. ప్రగతిగీత—మదీయము.

ఇట్టి పద్యపరంపరలే ఆశీర్షికలో. ఇందలి వస్త్వైక్యపరిధికి శీర్షికయే కేంద్ర బిందువు.

ఖండకావ్యమున ఇతివృత్తము కవిభావపరంపరయే. ఉదాహరణకు- జాషువగారి ఖండకావ్యసంపుటిలోని 'శ్మశానవాటి' శీర్షిక వనుశీలింపనగును.

సీ॥ 'ఇచ్చోటనే సత్కవీంద్రుని కమ్మని
కలము నిప్పులలోన కరగిపోయె
ఇచ్చోటనే భూము లేలు రాజన్యుల
అధికారముద్రిక లంతరించె
ఇచ్చోటనే లేతయిల్లాలి నల్లపూ
సలసౌరు గంగలో కలిసిపోయె
ఇచ్చోట నెట్టి పేరెన్నికం గనుగొన్న
చిత్రలేఖకుని కుంచియ నశించె

గీ ఇది పిశాచులతో నిటాలేక్షణుండు
గజ్జెఁగదలించి యాడు రంగస్థలంబు
ఇది మరణదూత తీక్ష్ణమౌ దృష్టు లొలయ
నవనిఁబాలించు భస్మసింహాసనంబు

వేదుల సత్యనారాయణశాస్త్రిగారి దీపావళియను ఖండకావ్య సంపుటిలో 'కాంత' యను శీర్షికలో ఒక 'పువ్వు' యొక్క భావపరంపర అభివ్యక్త మయినది.

ఈ సుమజన్మ మెట్లో ఘటియిల్లెను నా కొకనాటిపాటిదై

చ॥ పేదల రక్తమాంసములఁ బెంపు వహించి దయారసామృతా
స్వాదదరిద్రులైన ధనవంతుల పెద్దటికమ్ముకై మతో
న్మాదము పెంచు దేవునకు మాలుగ నిల్చిన రాతిబొమ్మలం
దూదరవోవు పాడుబ్రదు కొక్క నిమేషము సైప నాహృదిన్.

ఉ॥ నాకు తలంపు లేదు లలనాజనతాకబరీభరైకభూషాకలనన్
ద్వారతోరణాస్థానమునం దురిఁబడఁ జాలను

ఉ॥ నీచపుదాస్యవృత్తి మననేరని శూరత మాతృదేశ సే
వాచరణమ్మునం దసువు లర్పణచేసినవారి పార్థివ
శ్రీచెలువారుచోట తదసృగ్గుచులన్ విరసించి వాసనల్
వీచుచు వాడిపోవగవలెం దదుదాత్తసమాధిమృత్తికన్

ఖండకావ్యమునకు ముక్తకమునకు గల భేదము గుర్తింపనగును. ముక్తకము ఒకే ఒకపద్యము. ముక్తకము స్వయంసంపూర్ణమైనది. ఖండకావ్యము

నందు అనేక పద్యములుండును. ఉదాహరణకు జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి 'కుంతీకుమారి' గైకొనవచ్చును.

చ అది రమణీయపుష్పవన మావనమం దొక మేడ. మేడపై
అదియొక మారుమూలగది అగదిముందట ఇంచుమించుగా
పదునయిదేండ్ల ఈడు గల బాలిక, పోలిక రాచపిల్ల జం
కొదవెడి కాళ్లతోడ దిగుచున్నది క్రిందికి మెట్లమీదుగన్[1]

ఎవరా రాచపిల్ల ? అంతకుముం దేమి జరిగినది? ఖండకావ్యకర్త కా కథ అనవసరము. 'గాలితాకున జలతారు మేలిముసుగు' నొకింత జార్చిన, ఆమె నెమ్మోము గానిపించినది. ఆమె "స్నిగ్ధసుకుమారి కుంతీకుమారి". ఆమె కానీను డైన కర్ణుని ఎత్తుకొని గంగ కడకేగినది చివరకు ఒక పెట్టెలో "ఒత్తుకొనకుండ పూలగుత్తులు" పెట్టి నదీప్రవాహములో విడిచిపెట్టి, "నిశ్చలనిర్నిమేష నయనాలతో" చూచుచు నిల్చిపోయినది. తరువాతి కథ ఏమైనది ? ఆ ప్రశ్న ఖండకావ్య కర్త నడుగరాదు !

## 5. లఘుకృతులు

తెలుగుదేశమున "పంచరత్నములు", "నవరత్నములు", "నక్షత్రమాలికలు" నిత్యవ్యవహారనిష్ఠములే! అట్టి లఘుకృతులను అప్పకవి ఒక సీసపద్యములో గుది గూర్చి చెప్పినాడు.

సీ॥ ఒనరు ముక్తకమన నొక్కపద్యము, ద్వికం
 బగు రెండు, త్రికము మూడైన, బంచ
రత్నంబులైదు, వారణమాల యెనిమిది,
 నవరత్నములు పద్యనవకమైన,
భాస్కర మాలిక పండ్రెండు. శశికల
 పదియారు నక్షత్రపంక్తి యిరువ
దియునేడు, త్రింశదాహ్వయము ముప్పదిగాన
 సంఖ్యవెండియు మెండు సాగెనేని

గీ వరుస పంచాదశాఖ్య మవ్వల శతకము
నష్ట సమధిక శతకంబు ననగ వెలయు
నేబదియునూరు నూటిపై నెనిమిదియును
సప్తశతి సప్తశతమైన శార్ఙ్గపాణి[2]

---

1 'ఉదయశ్రీ' ఖండకావ్యము లోనిది

2 అప్పకవీయము ప్రథమాశ్వాసము—31.

దొనరంగఁ బట్టముగట్టిన
వెనుకటి గుణ మేల మాను వినరా సుమతీ

ఎవరికి రాదు ?

ప్రౌఢ ప్రయోగములు శతకములలో ఉన్నను సౌకుమార్యమధురమే. సుమతి శతకములో ప్రబోధము లోకవృత్తానుభవదర్పణము.

క॥ కమలములు నీటఁ బాసిన
కమలాప్తుని రశ్మి సోఁకి కమలిన భంగిన్
తమతమ నెలవులు దప్పిన
తమమిత్రులె శత్రులగుట తథ్యముసుమతీ

శతకములలో తెలుగు నుడికారపు వంపులు,, సొంపులు తామరతంపరలు. శతకములు అలంకారబహుళములు.

'ఉపమా కాళిదాసస్య'- అని సంస్కృత సూక్తి. అట్లే''అలంకారములకు తెలుగుశతకములు పుట్టినిండ్లు'' అనవచ్చును.

భాస్కరశతకములోని పద్యము శతకములందలి ప్రబోధమునకు నికషోపలము.

ఉ వందితులైనవారు దిగువందగమండగ నల్పుఁ డొక్కఁడు
ద్దండత పీఠమెక్కిన బుధప్రకరంబుల కేమి యెగ్గగున్ ?
గొండొకకోతి చెట్టు కొనకొమ్మల నుండగ క్రింద గండభే
రుండ మదేభసింహనికురుంబము లుండవె చేరి భాస్కరా.

'కాంతా సమ్మితతయోపదేశయుజే' అను మాట శతకములపట్టునసార్థకము.

శతకమునందు కవి వ్యక్తిత్వముద్ర ప్రతిఫలించినట్లు మరి యే కావ్యమునందును గానము.

''శ్రీ కాళహస్తీశ్వర శతకము' ధూర్జటి వ్యక్తిత్వమునకు మణిదర్పణము.

శా॥ రాజుల్ మత్తులు వారిసేవ నరకప్రాయంబు వారిచ్చు నం
భోజాక్షీ చతురంతయాన తురగీభూషాదు లాత్మవ్యథా
బీజంబుల్ తదపేక్ష చాలు పరితృప్తింజెందితిన్ జ్ఞాన ల
క్ష్మీజాగ్రత్ పరిణామ మిమ్ము దయతో శ్రీకాళహస్తీశ్వరా !.

కావ్యస్రష్టయైన కవికి— కొంత ఆత్మప్రత్యయము ఉండుట సహజము. ఆ అహంకృతి లేనిచో కవి కావ్యమునే వ్రాయజాలడు కాని శ్రీ కాళహస్తీశ్వర శతకములో కవి అహంకారమును ఉజ్జగించి ఆత్మార్పణము సలిపెను.

శా ఏ లీలన్ నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షాధ్వనివ్యంగ్య శ
బ్దాలంకార విశేషభాషల కలభ్యంబైన నీ రూపమున్

జాలు జాలు కవిత్వముల్ నిలుమనే సత్యంబు వర్ణించుచో
ధీ । లజ్జి పరుగాక మాన్యుకవుల్ శ్రీ కాళహస్తీశ్వరా

## 9. దండకము

తెలుగులో దండకము పద్య గద్యకావ్యముల మధ్య సేతువు వంటిది దండకము సామాన్యముగ తగణబద్ధము. తెలుగులో గల దండకములు ప్రాయికముగ దైవస్తుతి రూపములు.

పోతన 'భోగినీ దండకము' శృంగారప్రధానమైనది. రాయలసీమలో బహుళప్రచారము గల భాషీయ దండకము హాస్యరస సంభరితమైనది.

## 10. అఖ్యాయిక

ఆఖ్యాయిక ఉచ్ఛ్వాసవిభాగములు గలిగి నడుమనడుమ ఇతరుల పద్యము లుండు గద్యకృతి.

## 11. ఉపాఖ్యానము

ప్రధాన కావ్యములో నానుషంగికముగా ప్రసక్తమగు చిరుకథ. ఇతరుల వలన విన్న కథను చెప్పుటయు ఉపాఖ్యానమగును.

## 12. ఆఖ్యానము

ఆఖ్యానమనగా కవి తాను స్వయముగా సందర్శించిన సన్నివేశమును వర్ణించుట.

## 13. ఇతిహాసము

ఇతిహాసమనగా పూర్వరాజన్యుల చరిత్ర. భారతాదులు ఇతిహాసములుగ సుప్రసిద్ధములు.

## 14. పురాణము

1. సర్గము (ప్రపంచోత్పత్తి)
2. ప్రతిసర్గము (బ్రహ్మాదులు చేసెడి ఉత్పత్తి)
3. వంశము (దేవాసురాదివిభేదోత్పత్తి)
4. మన్వంతరము (మనువుల వృత్తాంతము)
5. వంశానుచరితము (సూర్యచంద్రవంశరాజుల వృత్తాంతము) అను

అయిదు అంశములతో నున్న బృహద్రచన పురాణము. "పురాఽపి నవం" అనగా పూర్వకథయైనను క్రొత్తదిగా భాసించునది అని వ్యుత్పత్త్యర్థము. అష్టాదశపురాణములు సంస్కృతవాఙ్మయమున సుప్రసిద్ధములు.

## 15. మణిప్రవాళము

సంస్కృతాంధ్రములను-విభక్తులతో తిలతండులన్యాయమున గుదిగ్రుచ్చుట. పాల్కురికి సోమనాథుడు 'వృషాధిపశతకము'న మణిప్రవాళమునకు ఉదాహరణముగ నొక పద్యము వ్రాసెను.

ఉ॥ వాయువు పొందు యా విగత పావఅమావరహంబ శౌ (?)
న్యాయవిధేయమీశతరి యన్యునబాబు కొలిచంచు 'వా
గ్ధేయమణిప్రవాళమున' 'రెల్లము నిన్ను నలంకరింతుఁదే
వా ! యమిబృందవంద్య ! బ వా ! బ వా ! బసవా! వృషాధిపా! [1]

ఆధునికుల భాషణములో ఆంధ్రాంగ్లములు కలిసిన మణిప్రవాళము నిత్యజీవితయాత్రలో అనుభవవేద్యమే.

## 16. చాటువులు

కవితాజగత్తులో సద్యోయోవనముతో ఉద్భవించు ఏకైకపద్యము చాటువు. చాటువులు గ్రంథస్థములు కాకపోయినను రసజ్ఞుల హృదయస్థములై యుగయుగాంతరములు చిరంజీవములై వర్ధిల్లుచున్నవి

చాటువు అను శబ్దమునకు మనోహరమైనది అని అర్థము. చాటువులు - పాతాళగంగ పైకుబికినట్లు – కవిహృదయమునుండి ఆశువుగా వెలువడెడి ముక్తకములు.

చాటుపద్యము స్వయంసంపూర్ణమైనది.

ప్రాచీనాంధ్ర వాఙ్మయము బహుళముగా అనువాదమయమని, స్వతంత్ర ప్రతిపత్తి లేనిదని ఆంగ్లవిద్యాధికులు సాధారణముగా చేయు విమర్శ. చాటు పద్యములు స్వతంత్ర ప్రతిపత్తి కలవై, ఆ విమర్శను వరాస్తము చేయగలిగినవి.

ఆంధ్రకవుల స్వచ్ఛందకవితాప్రతిభకు, సర్వతంత్రస్వతంత్రప్రతిపత్తికి తెలుగుచాటువులు నికషోపలములు. ఒక్కొక్కచాటువు చాలు ఒక మహాకావ్యముతో సరితూగుటకు.

ఈ చాటువులు గ్రంథనిబద్ధములు గాకపోయినను - కాలమహాస్రవంతి కెదురీది బ్రదుకు సాహితీమార్కండేయ ఖండికలు. తెలుగులో వెలసిన చాటువులు అసంఖ్యాకములు. అవి నవరససంభరితములు. నిత్యప్రత్యగ్రములు.

చమత్కారము చాటువునకు అంతరాత్మ. వస్తులాఘవము గమనింపదగినది. ఝటితిస్ఫూర్తి చాటురచనలోని విశేషము. ఉదాహరణమునకు—

ఆ॥వె॥ చాకివానితోడ జగడాలు పడలేక
సిరిగలాడు పట్టుచీర గట్టె ;

---

[1] శతకసంపుటము—1వ భాగము. సాహిత్యఅకాడమి ప్రచురణ.

శివుడు తోలు గప్పె సీ యని మది రోసి
భైరవుండు చీర పారవేసె [1]

క॥ శివుఁ డద్రిని శయనించుట
రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం
డవిరతము శేషుపైఁ
బవళించుట నల్లిబాధ పడలేక సుమీ. [2]

శ్రీనాథుని చాటువులు సుప్రసిద్ధములు. ఉదాహరణమునకు—

సీ॥ కాశికావిశ్వేశుఁ గలసె వీరారెడ్డి
రత్నాంబరం బేరాయ డిచ్చు?
రంభఁ గూడెఁ దెలుంగు రాయరాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు?
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలుగు?
కైలాసగిరిఁ బండె మైలారువిభుఁ డేగి
దినవెచ్చ మేరాజు దీర్పఁగలఁడు?

గీ॥ భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగె
కలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి
దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ

సీ॥ కవిరాజు కంఠంబు కౌఁగిలించెను గదా
పురవీథి నెదురెండ పొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెను గదా
నగరివాకిట నుండు నల్లగుండు
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెను గదా వెదురుగడియ
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ
దగిలియుండెను గదా నిగళయుగము

గీ॥ బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలు పెసలు
కృష్ణవేణమ్మ గొనిపోయె నింతవఱకు.
బొడ్డుపల్లెమ గొడ్డుమోపవోరి.
వెట్టిఁ బెల్లింతుఁ దంకమ్ము లేడువార్లు

1, 2 చాటువులు

సీ॥ ఎదురైనచోఁ దనమదకరీంద్రము డిగ్గి
కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె;
మనుచరిత్రం బందుకొను వేళఁ బురమేఁగఁ
బల్లకి తనకేలఁ బట్టి యెత్తె
పిరుదైన కవి గండపెండేరమున కీవె
తగుదంచుఁ దానె పాదమునఁ దొడిగె;
గోకట గ్రామాద్యనేకాగ్రహారంబు
లడిగినసీమలయందు నిచ్చె;

గీ॥ ఆంధ్ర కవితా పితామహ ; యల్లసాని
పెద్దనార్య ! యనుచు నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగలేక
బ్రదికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు

తెలుగు చాటువులలో పేర్కొనదగినది అల్లసాని పెద్దన ఆశువుగా చెప్పిన పెద్ద ఉత్పల మాలిక.

అది శ్రీకృష్ణదేవరాయల భువనవిజయసభ. ఆ సాహితీసమరాంగణ సార్వభౌముడు వీరలాంఛనమైన గండపెండేరము కవి పాదమునకు తొడుగుటకు సంసిద్ధుడై కవితాకళనుగూర్చి ఆశువుగా చెప్పుడని ఆహ్వానించుచు—

ఉ॥ ముద్దుగ గండపెండియరమున్ గొనుఁడంచు బహూకరింపఁగా
నొద్దిక నాకొసంగుమని యొక్కరు గోరగలేరు లేరొకో;

అని శ్రీకృష్ణదేవరాయలు అనగా

పెద్దనబోలు సత్కవులు పృథ్విని లేరని నీవెరుంగవే
పెద్దన కీదలంచినను బేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా ;

అని పెద్దన ఆ పద్యమును పూరించినాడు. పర్యవసానముగా అల్లసాని పెద్దన ఆశువుగా చెప్పిన చాటువు ఒక కావ్యాలోకము.

ఉ॥ పూతమెఱుంగులుం బసరుపూపబెడంగులుఁ జూపునట్టి వా
కైతలు ? జగ్గునిగ్గునెనగావలెఁ గమ్మనగమ్మనన్వలెన్
రాతిరియుంబవల్ మఱపురాని హొయల్ చెలియారజంపు ని
ద్దాతరితీపులంబలెను దారసిలన్వలె లోఁదలంచినన్ !
బ్రాతిగఁ బైకొనన్వలెను బైదలిగుత్తుకలోని పల్లటీ
కూతలనన్వలెన్ ; సొగసుకోర్కులు రావలె నాలకించినన్ !
చేతికొలందిఁ గౌఁగిటను జేర్చిన కన్నియచిన్నిపొన్నిమే
ల్మూతలచన్నుదోయివలె ముచ్చటగావలెఁ బట్టిచూచినన్ !

దాకొడమన్నమన్నలమిటారపు ముద్దులగుమ్మకమ్మనౌ
వాతెఱ దొండపండువలె వాచవిగావలెఁ బంటనూదినన్ !
గాతలదమ్మిచూలిదొర కై వసపుంజవరాలి సిబ్బెపు
న్మేతెలియబ్బురంపుఁజిగినిబ్బర పుబ్బగు గబ్బిగుబ్బపొం
బూతల నున్నకాయ సరిపోదిమి కిన్నెరమెట్లబంతి సం
గాతపు సన్నబంతి బయకారపుఁగన్నడ గౌళపంతుకా
పాతతతానతానల పసం దివుటాడెదు గోటమీటుచల్
మ్రోతలనుంచలెన్ హరువు మొల్లము గావలె ! నచ్చతెన్గు రీ
రీతిగ, సంస్కృతంబు పచరించినపట్టున భారతీవధూ
టీ తపనీయగర్భనికటీభవదాననపర్వసాహితీ
భౌతికనాటకప్రకరభారతభారతసమ్మతప్రభా
పాతసుధాప్రపూరబహుబంగఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతకతాళయుగ్మలయసంగతిచుంచువిపంచికామృదం
గాతతసేహిత త్రహితహాధితదంధణుధాణుధింధిమి
వ్రాతలయానుకూలపదవారకుహూర్ద్వహహారికింకిణీ
నూతన పల్లవాచరణ నూపుర ఝూళఝుళీమరంద సం
ఘాతవియద్ధునీచకచకద్వికచోత్పలసారసంగ్రహా
యాతకుమారగంధవహహారిసుగంధవిలాసయుక్తమై
చేతము చల్లఁజేయ వలెఁజిల్లనఁజల్లవలె న్మనోహర
ద్యోతక గోస్తనీఫలమధుద్రవగోఘృతపాయసప్రసా
రాతిరసప్రసారరుచిరప్రసరంబుగ సారెసారెకున్.

చాటువులను సమీక్షించి లక్ష్యలక్షణసమన్వయము సాధింపనగును.

చాటువు లక్షణములుగా (i) తాత్కాలికప్రేరేపణ (ii) స్వయం సంపూర్ణత (iii) చమత్కారము (iv) ఝుటితిస్ఫూర్తి (v) ఇతివృత్త సౌలభ్యము అని యెన్నవచ్చును.

## 17. యక్షగానములు :

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సుగ్రీవవిజయ యక్షగాన పీఠికలో యక్షగానము అళు, మధుర, చిత్ర, విస్తర నామక చతుర్విధకవితలలో [illegible] శాఖకు చేరునని తెలిపిరి. యక్షగానము 'దేశి' రూపక[illegible] [illegible] గానములందు పలలు, జోలలు, సువ్వాలలు, అరతులు, ధవళములు, చందమామ సుద్దులు, వెన్నెలపదములు, తుమ్మెదపదములు, త్రిభంగులు, ద్విపదలు, చౌపదలు, షట్పదులు, కందార్థములు, సీసార్థములు మున్నగునవి చేరియున్న[illegible]



ముద్రను భద్రపరచిన దేశిసాహిత్యప్రక్రియలకెల్ల తలమానికము యక్షగానము' అని డాక్టర్ యస్వీ జోగారావుగారి ప్రవచనము.

కీర్తింతు వెవ్వానికీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగానసరణి

అని శ్రీనాథుడు భీమఖండములో యక్షగాన ప్రశంస చేసెను క్రీ॥ శ॥ 1480 ప్రాంతమున రచితమైన భీమఖండమునందే ఈ ప్రశంస తొలుత గన్పించుచున్నది. కాని మనవాఙ్మయమున మొట్టమొదట యక్షాది నేపథ్యములతోడి ఆటపాటలప్రసక్తి పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమున గలదు. కావున యక్షగానసరణి బీజప్రాయముగ పాల్కురికి సోమకాలమున నారంభమై శ్రీనాథునికాలమున మారాకు వేసినదని విద్వాంసులు వాదించుచున్నారు క్రీ శ 15వ శతాబ్ది ప్రథమపాదమున వెలసిన క్రీడాభిరామమున జక్కులపురంధ్రి గానకళా ప్రావీణ్యము ప్రస్తుతింపబడినది అందు 'యక్షకన్యల' నృత్యము గూడ ప్రసక్తమైనది. కొందరు విద్వాంసులు జక్కులపాటయే తెలుగునుండి సంస్కృతమునకు అధిరోహించి యక్షగానమైనదని ఊహించుచున్నారు. పదునారవశతాబ్దిలోని చిత్రభారతమున 'యక్షకామినుల నాట్యము', 'యక్షవనితలపాట' పేర్కొనబడినవి.

జక్కులశబ్దము యక్షశబ్దముగా మారుట భాషాసంప్రదాయానుగుణ్యమే. క్రీ శ 17వ శతాబ్దని తంజాపురాన్నదాన నాటకమున జక్కులరంగసాని సత్రములో 'పదకేళిక' పట్టినట్లు కలదు.

తే॥ గీ॥ సముచితానేకవిధ తాళసంగతులను
నవరసాలంక్రియా సవర్ణనలగుచు

యక్షగానము లలరారుచుండెడివని తాళ్ళపాక అన్నమాచార్యుల వారి అభిభాషణముగ నెన్నుదురు.

యక్షగానములలో ప్రధానరచనాంగములు మూడు. (1) రగడవికారము-తాళ ప్రధానమైనరేకు, (2) ద్విపద, (3)ఏలలు - అర్ధచంద్రికలు - ధవళ శోభనములు.

క్రి. శ. 1550 ప్రాంతమునాటి చిత్రకవిపెద్దన లక్షణసార సంగ్రహమున యక్షగానలక్షణప్రసక్తి వచ్చినది. అనగా అంతకుముందే లక్ష్యమైన యక్షగాన వాఙ్మయము విలసిల్లెననుట భావార్థము. ఇపుడు లభించుచున్న యక్షగానములలో మొదటిది కందుకూరి రుద్రకవి 'సుగ్రీవవిజయము.' "ఎట్టి ఛందోబంధములైనను తనలో నిముడ్చుకొనగల్గునది యక్షగానము" అని యక్షగానములలో విశేష పరిశ్రమ చేసిన డాక్టర్ యస్వీ జోగారావుగారి అభిప్రాయము. తొలుత యక్షగానములలో వచనభాగము స్వల్పము. రానురాను వచనసంభాషణలు చేరినవి. దరువు, ద్విపద, గద్యపద్యములు యక్షగానాంశములుగా చివరకు రూపొందినవి.

'సుగ్రీవవిజయము' చూచినచో అది ప్రదర్శన సౌలభ్యముగల రచన యనియే తోచును.

19వ శతాబ్దిలో యక్షగానములు కోకొల్లలుగా వెల్లివిరిసినవి. యక్షగాన మేళము లనేకములు వెలసినవి. గుజ్జువాడలక్ష్మణమూర్తి; సంతవేలూరు- కుశలవ; పాతపట్టణము - బాణాసురనాటకము మొదలైనవి హరికథలనుగూడ ఆదిభట్ల నారాయణదాసు మున్నగువారు యక్షగానప్రబంధములని వ్యవహరించినారు.

"అటునిటు చెరియొకరిచే పట్టుకొనబడిన తెల్లనిగుడ్డయే తెర. తెరకటునిటు నూనెదివిటీలు తెరవెనుక హంగుదారులు, వంతపాటగాండ్రు. హంగుతి త్తి,మద్దెల, తాళపుచిప్పలు, తెరముందు సూత్రధారుడు. అతడే ప్రదర్శన ప్రవర్తకుడు. ప్రార్థనాదికము, కథాసందర్భవివరణము, పాత్రప్రవేశ సూచన, పాత్రలను పలుకరించుట, పాత్రలకు వంతపాటలకు పల్లవుల నందించుట, అభినయానుకూలముగ తాళము వేయుట, సంధివచనములు చదువుట, అప్పుడప్పుడు హాస్యప్రసంగములు నెరపుట మున్నగునవి అతనిపనులు. ప్రదర్శనములు రాత్రి ప్రారంభమై తెల్లవారు సరికి అంతమగుచుండును."[1]

తంజావూరు రాజ్యము యక్షగానములకు స్వర్ణయుగము కల్పించినది. రాజైన విజయరాఘవనృపాలుడు అనేక యక్షగానములను రచించినట్లు ప్రఖ్యాతి కెక్కెను తరువాత తంజావూరు నేలిన మహారాష్ట్రులును యక్షగానములను ప్రోత్సహించిరి.

విద్వత్కవి కంకంటి పాపరాజుకూడ విష్ణుమాయావిలాసమను యక్షగానమును వ్రాయుటచేత ఆ వాఙ్మయమున కానాడు ఏర్పడిన గౌరవప్రపత్తుల నెన్నవచ్చును. ఆనాడు శాఖోపశాఖలుగా వెలసిన యక్షగానములు పరశ్శతములు. త్యాగరాజు, నారాయణతీర్థులు, మేలత్తూరు వేంకటరామశాస్త్రి మున్నగు వారును యక్షగానముల వ్రాసియున్నారు.

---

1. తెలుగు విజ్ఞాన సర్వస్వము : యక్షగానములు - డా॥ యస్వీ జోగారావు.

# 7

# శయ్యాపాకములు

## శయ్య

"శయ్యా యన బదమైత్రి ఇది శబ్దధర్మము...ఈ శయ్యను దండి, వామన, ధ్వనికార, మమ్మట, విశ్వనాథ, జగన్నాథాదులు దెలుపలేదు. ప్రతాపరుద్రీయకర్తయే తెలిపెను. దీనికి మైత్రి, ముద్ర యనియు నామాంతరములు అగ్నిపురాణమునఁ గనబడుచున్నవి. ఈ శయ్యను విశ్వనాథాదులు రీతులలోనే అంతర్భవింపఁజేసిరి" అని శిరోమణి శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారు కావ్యాలంకార సంగ్రహ వివరణమున వ్రాసినారు.

శయ్య యను పదము ఆంగ్లమునందలి 'స్టైల్' (Style) అను పదముతో సంవదించును. ఒక రచయితకు ఒక ప్రత్యేకమైన శయ్య యుండును. ఆధునికులు పలువురు 'స్టైల్' అను పదమునకు 'శైలి' ని పర్యాయపదముగ ప్రయోగించుచున్నారు. 'Style is the man'—శైలి రచయిత ప్రత్యేకముద్ర.

> ఆ పెద్దన్న అల్లసానివాని అల్లిక జిగిబిగి
> ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు
> పాండురంగవిభుని పదగుంఫనమ్మును

ప్రాచీనులు గుర్తించినవే

> పొసఁగ ముత్తెపుసరుల్ పోహళించినలీలఁ
> దమలోనఁ దొరయు శబ్దములు గూర్చి

అను కళాపూర్ణోదయమందలి వర్ణన 'శయ్య'కు అన్వర్థకము.

> మాలాకారో రచయతి యథా సాధు విజ్ఞాయ మాలాం
> యోజ్యం కావ్యే ష్వవహితధియా తద్వదేవాభిధానమ్।

---

1. స సూ. శాస్త్రిగారి కావ్యాలంకారసంగ్రహవివరణము—పుట 179లో ఉదాహృతము - వామనుడు.

పూలమాల గట్టువాడు ఏ పువ్వు నేపువ్వుతో జోడించినచో బాగుండునో నిర్ణయించుకొనునట్లు, కావ్యరచయితయైన కవిగూడ నేపదముతో నేపదము సంధింపవలెనో తెలిసికొని రచింపవలెను.

ఛందస్సు సరిపోయినను, సమానార్థకములైనను, కవి యేరుకొని ప్రయోగించు పదములకు ఆంతరంగికకారణముండును. యథార్థమునకు పద్యమందేగాక గద్యమందుగూడ 'శయ్య' గలదు.

"అల్లసానివాని అల్లికజిగిబిగి" యని పేరువచ్చినది. ఒక కవి కథానుగుణముగ పాకమును మార్చవచ్చును. కాని 'శైలి' సర్వసాధారణముగ మారునదిగాదు. కవి ఆత్మీయతాముద్ర శైలిలో ప్రతిఫలించును.

పోతన కవితాగానమునకు అతని యతిప్రాసలు, అనుప్రాసలు మృదంగవ్యాపారమును నిర్వర్తించును. అది పోతనశైలి. ఆ శైలిలో అనన్యసాధారణమైన పోతనముద్ర సాక్షాత్కరించును.

ఉ॥ స్వస్తి జగత్త్రయీభువనశాసనకర్తకు హాసమాత్ర వి
ధ్వస్తనిలింపభర్తకు మదారవదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుతమంగళాధ్వరవిధానవిహర్తకు విర్జరిగళ
న్యస్తసువర్ణసూత్రపరిహర్తకు దానవలోక భర్తకున్[1]

వామనమూర్తినోట వెలువడిన స్వస్తివాచనములోని శబ్దశిల్పమే గజేంద్రమోక్షకథారంభమున నున్న పద్యమునగూడ సాక్షాత్కరించును.

అలతియలతి మాటలతో కావాళసంధించినవిధమున కవిత చెప్పవలెనని నిర్వచనోత్తరరామాయణమున తిక్కన నిర్దేశము.

క॥ మమ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు
నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు వా
క్యమ్ములపద్ధతి నెఱుఁగుదు
పొమ్మెవ్వర నేమ నీకు బుద్ధులుచెప్పన్[2]

అని ధర్మరాజు రాయబారిగా శ్రీకృష్ణుని కౌరవసభ కంపును. అచ్చట శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రునితో పల్కిన మాటలు—

ఉ॥ వారలు శాంతశూరులు భవచ్చరణంబులు గొల్వవచ్చి యు
న్నా రటుగాక నీ కది మనంబున కప్రియమేని వింతకుం

---

[1] పోతన భాగవతము–అష్టమస్కంధము–545

[2] తిక్కన భారతము–ఉద్యోగపర్వము–13–34

బోరికి వచ్చుచుండెదరు భూవర! రెండుతెరంగులందు నీ
కారయ పథ్య మేదియగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమీ[1]

పై పద్యములందు తిక్కన ఆత్మీయతాముద్ర, శైలి తొణికిసలాడుట సహృదయహృదయైకవేద్యము.

'శైలి'ని నిర్వచించుట కష్టము. 'శైలి' అనిర్వచనీయమైనది. సంగీత విద్వాంసులు రాగమును సులువుగా గుర్తింపగలరు. అన్యుల కది అగమ్య గోచరము. అట్లే సహృదయులు సులభముగా ఆ యా కవుల శైలులను గుర్తింప గలరు.

కావ్యాలంకారసంగ్రహమున శయ్యను భట్టుమూర్తి యిట్లు నిర్వచించెను.

క। కదిసి పదంబులు ముందటి
పదములతోఁ బరమమైత్రిఁ బరగి వరసదా
స్పద మనకుండిన గతులం
దది శయ్య; తదీయలక్ష్య మాపాదింతున్[2]

కం రతిపతివో చెలువున భా
రతిపతివో? మతగుణాభిరామత రామ
క్షితిపతివో। ధరనోబ
క్షితిపతినరసింహ। శౌర్యజితనరసింహా![3]

పై ఉదాహరణ భట్టుమూర్తిశయ్యకు ఉదాహరణయే! అనుప్రాసభూయిష్ఠమైనదే శయ్యయని భ్రమింపరాదు. తిక్కనశయ్యలో అనుప్రాసమ్మృగ్యము.

నాచనసోముని శైలికి ఉదాహరణప్రాయమైన పద్యమున - సత్యభామ నరకాసురునితో యుద్ధము చేయుసన్ని వేశమున-అనుప్రాసమున్నది.

మ। అరిఁ జూచున్, హరిఁ జూచుఁ జూచుకము లందంద-మందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందంబు లందమ్ముగై
తొరఁగం బయ్యెదకొం గొకింత తొలఁగం దోర్దోశరాసారమున్
దరహాసామృతపూరముం గురియుచుం దన్వంగి హేలాగతిన్[4]

అనుప్రాససాధర్మ్యమున కేమిగాని భట్టుమూర్తి, నాచనసోమనల శైలుల లోని భేదము సహృదయులు గుర్తింపలేనిది గాదు.

---

[1] తిక్కన భారతము-ఉద్యోగపర్వము-3-284

[2] కావ్యాలంకారసంగ్రహము-2-88

[3] కావ్యాలంకారసంగ్రహము-2-89

[4] ఉత్తరహరివంశము-1-162

## పాకములు

ప్రాచీనాలంకారికులు శబ్దార్థనిబంధనమును 1. ద్రాక్షాపాకము 2. కదళీ పాకము 3. నారికేళపాకము అను మూడు పాకములుగా విభాగించిరి.

పాకమనగా రసోచిత శబ్దార్థముల సముచితసమ్మేళనము. పదములకూర్పు భావానుగుణముగ నుండవలెను పదగుంఫనము పాకములో ముఖ్యమైనది.

## ద్రాక్షాపాకము

ద్రాక్షాపాకమనిన, పక్వద్రాక్షవలె నుండు కవితానుగుంఫనము. పక్వ ద్రాక్షలో చిరుగింజతప్ప అంతయు స్వీకరింపదగినదే నాలుకపై బడుటయే తడవు ఆహా! ఏమి ఆసద్యోమాధుర్యము ! పద్యముగూడ అటులే యున్నచో అది ద్రాక్షాపాకము అన్ని రసములకు అన్ని పాకములు నప్పవు. శృంగారమున కనువైనది ద్రాక్షాపాకము వీరమునకు కదళీపాకము కొండొకచో నారికేళము. బీభత్సభయానకములకు నారికేళపాకము నప్పవచ్చును.

ఈ పాకములను నిర్వచించుట సులభమేగాని ఉదాహరణము లెత్తి చూపుట కష్టము ఒకేకావ్యములో ఎడనెడ ద్రాక్షా కదళీ నారికేళ పాకము లుండును. ఒకపద్యములోగూడ సాంత మొకే పాక ముండునని చెప్పుటకు వీలులేదు. దిఙ్మాత్రమగు ఉదాహరణములు చూపనగును.

ద్రాక్షాపాకమునకు ప్రాచీన నవీన కావ్యములనుండి కొన్ని ఉదాహరణ ములు :

ఉ॥ ఇంతలు కన్నులుండ దెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర! యే
కాంతమునందు నున్న జవరాండ్రనెపంబిడి పల్కరించులా
గింతియెగాక నీవెరుగవే మునువచ్చిన త్రోవచొప్పు నీ
కింతభయంబు లేకడుగ నెల్లిదమైతిమె? మాటలేటికిన్.[1]

ఉ। నాయకురాలి మాయకదనమ్మున మా పలనాటిపౌరుష
శ్రీ యడుగంటి గడ్డి మొలిచెన్ బులిచాటలగద్దెమీద గెం
జాయమొగానఁ గ్రమ్మ జలజప్రమదామణి నాగులేటిపై
వ్రాయుచు నున్న దిప్పటికి బాలునిశౌర్యకథాప్రబంధముల్[2]

ఆ। వె భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన; తమ్మిచూలికైన

[1] మనుచరిత్ర (వరూథిని ప్రవరునితో)2 -41

[2] ఖండకావ్యము-జాషువ

విబుధజనులవలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱుతు 1

*కదళీపాకము*

కదళియన అరటిపండు ద్రాక్షను అప్రయత్నముగా నోటిలో వేసికొనవచ్చును. అరటిపండు ముందు పైతొక్కు నొలిచి పిమ్మట నోటిలో వేసికొనవలె. అయినను ప్రయత్నసౌలభ్యము గమనింపదగినది ద్రాక్షరుచి వేరు. కదళిరుచి వేరు ద్రాక్ష ఎంత ఆపాతమధురమైనప్పటికి-కొంతసేపటికి తీపి మొగము మొత్తవచ్చును. కదళి ద్రాక్షవలెగాక కొంత పంటిక్రిందికి అగును. కదళీపాకమును సయితము దిఙ్మాత్రముగనే ఎన్నవగును.

కదళీపాకమునకు కొన్ని ఉదాహరణములు.

మ. విపరీత ప్రతిభాషలేమిటికి నుర్వీనాథ! యీ పుత్ర గా
త్రపరిష్వంగసుఖమ్ము సేకొనుము ముక్తాహారకర్పూరపాం
డ్రవరాగప్రసరంబుఁ జందనముఁ జంద్రజ్యోత్స్నయుం బుత్ర గా
త్రపరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కదున్ శీతమే 2

ఇందలి పదగుంఫనములు మాత్రమేగాక ఆపదములకూర్పు తెలుపు భావములుగూడ కదళీపాకస్ఫోరకములు.

క॥ ఒరు లేయవి యొనరించిన
నరవర! అప్రియము దనమనంబునకగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్ 3

శా. విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రవర సంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితిభారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్ 4

1 పోతనభాగవతము-ప్రథమస్కంధము-19
2 నన్నయభారతము-ఆదిపర్వము (శకుంతల దుష్యంతునితో) 4-91
3 తిక్కనభారతము-శాంతిపర్వము
4 తిక్కనభారతము-విరాటపర్వము-1-3

శా। నానానేకపయూథముల్ వనములోనం బెద్దకాలంబు స
న్మానింపం దశలక్షకోటికరిణీనాథుండనై యుండి మ
ద్దానాంభఃపరిపుష్టచందనలతాంతచ్ఛాయలం దుండలే
కీనీరాస యిటేల వచ్చితి భయం బెల్లోకదే యీశ్వరా![1]

*నారికేళపాకము*

నారికేళమన కొబ్బరికాయ కొబ్బరికాయలోని నీరు త్రాగుటకు, గుంజు తినుటకు వలయు విశేషప్రయత్నము ఎల్లరెరిగినదే అట్టిదే నారికేళపాకము ఇందు పడినశ్రమకు మించిన ఫలితము దక్కుట గమనింపదగినది నారికేళపాకము క్లిష్టతకు పర్యాయపదము కాదు

నారికేళపాకమున కుదాహరణము.

మ॥ ఇది కర్ణాటధరాధృతి స్వభుజాహేవాకలబ్ధేధరా
దుదయోర్వీధరతత్ పితృవ్యకృతనవ్యోపాయనోష్ణీషర
త్నదృగంచత్పదకృష్ణరాయ వసుధాధ్యక్షోదితాముక్తమా
ల్యదనాశ్వాసము హృద్యపద్యముల నాద్యంబై మహింబొల్పగున్[2]

శ్రీకృష్ణదేవరాయలచే రచింపబడిన ఆముక్తమాల్యదలోని పద్యమిది. ఈ పద్యతాత్పర్యము: శ్రీకృష్ణదేవరాయలు కర్ణాట భూరాజ్యభారమును స్వీయభుజాహేవాకముచే భరించువాడు. ఉదయగిరిదుర్గాధిపతి - గజపతి పినతండ్రి-యుద్ధమున ఓడి సరిక్రొత్త కానుకగా సమర్పించిన కిరీటకాంతులు సోకిన పాదములు గల ధీరోదాత్తవీరుడు, శ్రీకృష్ణదేవరాయలు రచించిన ఆముక్తమాల్యదలోని మొదటి ఆశ్వాసము.

దుర్గమమైన ఉదయగిరిదుర్గమును విజయనగరసేనలు నాలుగునెలలు ముట్టడించి విజయము సాధింపలేకపోవుట, చివరకు శ్రీకృష్ణదేవరాయలు ఒకనాడు తాను దుర్గాధిపతి-గజపతిపినతండ్రి-శిరము తన్నిగాని స్నానము చేయనని ప్రతిన బూనుట, కాని దుర్గాధిపతి ఓడిపోయి శరణాగతివేడుట-ఆతనిశిరమునకు బదులు కిరీటమును తన్ని రాయలవారు ప్రతిన నెరవేర్చుకొనుట-ఈ అద్భుత వృత్తాంతమంతయు ఈపద్యమున ప్రసక్తానుప్రసక్తము. ఎత్తిన కత్తి దింపకుండ కటకము నుండి కన్యాకుమారివరకు అప్రతిహతముగ దిగ్విజయయాత్ర సాధించిన శ్రీకృష్ణదేవరాయల వ్యక్తిత్వము ప్రతిఫలించు అద్దాలమేడ ఈపద్యము. అయితే ఈమేడ చుట్టునున్న సప్తప్రాకారములు అతిక్రమించి లోనికి పోవలసియున్నది. ఇందు భావము భాష తొలుత క్లిష్టముగానున్నను, చివరకు మిక్కిలి మనోజ్ఞ మనిపించును.

---

1 పోతనభాగవతము-అష్టమ స్కంధము-72

2 ఆముక్తమాల్యద-1-89

# 8

# నాయకనాయికా భేదములు

**నాయక భేదములు**

భారతీయాలంకారికులు నాయకుడు సమస్తకల్యాణ గుణసంపన్నుడు కావలెనని ప్రతిపాదించిరి. ప్రతీచీసాహితీ జగత్తులో-ముఖ్యముగా విషాదాత్మక రూపకములలో-నాయకుడు బహుసద్గుణ సమేతుడైనప్పటికి ఏదోయొక అల్ప దుర్గుణవశమున అవశ్యభవితవ్యమైన దుర్గతికి పాల్పడును.

దశరూపకమందు నాయకలక్షణములు దెల్పు శ్లోకము ఉదాహరింపనగును.

> నేతా వినీతో మధుర స్త్యాగీ దక్షః ప్రియంవదః ।
> రక్తలోక శ్శుచి ర్వాగ్మీ రూఢవంశస్స్థిరో యువా ॥
> బుద్ధ్యుత్సాహ స్మృతిప్రజ్ఞా కలామానసమన్వితః
> శూరో దృఢశ్చ తేజస్వీ శాస్త్రచక్షుశ్చ ధార్మికః ।

నాయకుడు వినీతుడును, మధురదర్శనుడును, త్యాగియు, దక్షుడును, ప్రియవాదియు, లోకమునకు ప్రేమపాత్రుడును, వాక్చతురుడును, కులీనుడును, స్థిరుడును, యువకుడును, బుద్ధిశాలియు, ఉత్సాహశాలియు, జ్ఞాపకశక్తి గలవాడును, ప్రజ్ఞావంతుడును, కళావిదగ్ధుడును, అభిమానవంతుడుడును, శూరుడును, తేజస్వియు, శాస్త్రజ్ఞుడును, ధార్మికుడును అయి యుండవలెను.

ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరశాంతుఁడు ధీరలలితుఁడు, అనువారు ఆలంకారికులు పేర్కొనిన కావ్యనాయకులు.

***ధీరోదాత్తుఁడు***

> అవికత్థనః క్షమావా నతిగంభీరో మహాసత్త్వః
> స్థేయా న్నిగూఢమానో ధీరోదాత్తో దృఢవ్రతః కథితః[1] ॥

ఆత్మశ్లాఘము లేనివాడు, క్షమావంతుడు, గంభీరుడు, బలశాలి; గూఢమాని, దృఢవ్రతుడు అయినవాడు ధీరోదాత్తుడు.

---

[1] కావ్యాలంకార సంగ్రహవివరణములో ఉదాహృతము-సాహిత్యదర్పణము.

కావ్యాలంకార సంగ్రహమున ధీరోదాత్తుని వర్ణించు ఉదాహరణ పద్యము మనోజ్ఞమైనది.

సీ. చలిచీమనేనియుఁ జాఁద్రొక్కఁగాఁజాలఁ
  డేరీతి గెలిచెనో వైరివరులఁ
గలనైన నిజవర్ణనలు సేయ వినఁజాలఁ
  డెట్లందుకొనియెనో కృతిచయంబుఁ
జెలువొందు నాకారచేష్ట లెయ్యెడఁ గానఁ
  డెట్లు నవ్వెనో యాత్మహితులతోడఁ
బరుషాక్షరంబులు వలుకఁ డెక్కాలంబు
  నెట్లు భర్జించెనో హీనమతుల

గీ. బరులఁ జేపట్టఁ దెలిమిఁ జేపట్టి విడువఁ
దలయఁ దేమఱఁ దరినైన నవగుణంబు
లెన్నఁ డోబయనరసధాత్రీశతిలక
మరియ నరలోకభాగధేయమ్ముగాదె। [1]

## *ధీరోద్ధతుఁడు*

ధీరోద్ధతుఁడనగా ధీరత్వముతోపాటు నుద్ధతత్వమును గలవాడు. ప్రతాపరుద్రీయమున ఆంధ్రభటులు ధీరోద్ధతులుగా వర్ణింపబడిరి.

రేరే! ఘూర్జర! జర్జరోఽసి సమరే లంపాక! కింకంపసే।
వంగ! త్వంగసి కింముధా? బలరజః కాణోఽసి కిం? కోంకణ!
హూణ! ప్రాణపరాయణో భవ, మహారాష్ట్రాపరాష్ట్రోఽస్యమీ
యోద్ధారో వయ మిత్యరీ నభిభవంత్యంధ్రక్షమాభృద్భటాః

ఈపద్యమునకు ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము నందలి తెలుగుసేత-

శా. ఓరీఘూర్జర! ఆజిజర్జరుఁడవైతో హోయి లంపాక! మే
లేరా! కంపము, వంగ! సంగతియు! యౌ దే! కాణుఁడో కోంకణా?
పోరా! పో! వెస హూణ! ప్రాణములకై : పోయెన్‌మహారాష్ట్రిడా!
పీరాష్ట్రింబని యాంధ్రయోధు లవి నెంతే సేయుదు ర్గేలలన్ [2]

## *ధీరశాంతుఁడు*

సమబుద్ధిభూషణుడు శాంతప్రసన్నుడునగు ద్విజుడు ధీరశాంతుడు.

---

[1] కావ్యాలంకారసంగ్రహము—౨-౫

[2] ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము-శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు నాటక ప్రకరణము-ప్రతాపరుద్రకళ్యాణము. 3 అం.14ప.

*ధీరలలితుఁడు*

రాజకార్యములను దక్షులైన మంత్రులకు వదలి నిశ్చింతగా భోగలాలసు డైన రాజన్యుడు ధీరలలితుడు.

ధీరలలితునకు ఉదాహరణముగ భట్టుమూర్తి రచించిన పద్యము—

**ఉ॥ కుంతల గౌళ చోళ కురు ఘూర్జర హూణ శకాది మేదినీ
కాంతులు సంతతంబు నిజగాఢ బలశ్రుతిమాత్ర భీతులై
యింతుల, రత్నహారముల, నెల్ల ధనంబుల నిచ్చి కొల్వ ని
శ్చింతతఁ దాల్చు నోబయనృసింహుడు భోగకళాప్రవీణుఁడై** [1]

ఆంధ్ర ప్రతాపరుద్రయశోభూషణమునందు శ్రీ చెలమచెర్ల రంగాచార్యులుగారిచ్చిన ఉదాహరణము—

**మ॥ ఎదురే లేదు ప్రతాపవహ్ని కరిభూమీశుల్ వశంబైరి, సం
పదుదారంబగు రాజ్యలక్ష్మిపతిదైవంబయ్యెఁ, ద్రోచున్ శివుం
డెదఁ గారుణ్యమునిండ, రుద్రయువరాజే భారముం దాల్చు, నిం
పొదవం దేలను వృద్ధకాకతివిభుం డోలిం గళాసేవలన్**[2]

శృంగార నాయకులు నలుతెఱగులు దక్షిణుడు, అనుకూలుడు, ధృష్టుడు శఠుడు, వీరిలో దక్షిణనాయకుడు పేర్కొనదగినవాడు.

*దక్షిణనాయకుఁడు*

అనేక నాయికలయందు తుల్యానురాగము గలిగి సంతుష్టలనుగా నేలుకొనువాడు దక్షిణనాయకుడు.

కావ్యాలంకారసంగ్రహమందు ఉదాహృతమైన పద్యము.

**ఉ॥ సాగరమేఖలాసతికిఁ జారు భుజాపరిరంభ మిచ్చె: వా
ణీ గగనావలగ్నకును నేర్పుమెయిన్ మొగమిచ్చె: వీర ల
క్ష్మీ గజరాజగామిని కమేయ భుజాంతర మిచ్చె: సంతత
త్యాగి నృసింహభూవిభుఁడె దక్షిణనాయకుఁ డెన్ని భంగులన్** [3]

అబ్ధి ఒడ్డాణముగాగల భూసతికి కౌగిలి నిచ్చెనట ! (శూన్యమధ్యయైన) సరస్వతికి మొగమిచ్చెనట !! గజరాజగామిని వీరలక్ష్మికి భుజాంతర మిచ్చెనట !!! కృతిభర్తయైన నరసభూపాలుడు. అందుచే అనేక నాయికలను సమానురాగముతో లాలింప నేర్పుగలిగిన నరసభూపాలుడు-దక్షిణనాయకుడు.

భారతీయ సాహిత్యమున దక్షిణనాయకుడుగా సుప్రసిద్ధుడు శ్రీకృష్ణుఁడు.

---

[1] కావ్యాలంకారసంగ్రహము-2-8

[2] ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము-1-33

[3] కావ్యాలంకార సంగ్రహము-2-11

అది యమునాతీరము ; బృందావనము, శరజ్జ్యోత్స్నా విలసితమైన నిండు పున్నమరేయి. రాధ, రాగిణి యను గోపిక శ్రీకృష్ణుని రాకకై నిరీక్షణ సల్పుచున్నారు. అంతలో మురళీనాదము. శ్రీకృష్ణుడు పొంచియున్న పొదరింటినుండి వేంచేసి వెనుకనుండి గోపిక రాగిణి కన్నులు మూసి, రాధను ముద్దిడి లాలించును.

రాగిణి :

మురళి మ్రోగించి ఆ జగన్మోహనుండు
నెచ్చెలీ ! చూచినావుగా వచ్చి యెట్లు
నన్ను లాలించి పోయెనో కన్నుమూసి
అవవి నా కంటె ధన్యురాలెవతె గలదు ?[1]

అని ఆనందతన్మయత్వముతోఁ బలుకును.

రాధ :

మురిసి పోవుచునుంటివో ముద్దరాల !
ఏల నీ కనుల్ మూసెనో యెరుగ గలవె !
ఏల పిందెతో పండు వాదింపవలయు ?
ఎవరి అనుభూతి వారె గ్రహింపవచ్చు.[2]

అని తానును పరవశత్వముతోఁ బలుకును. నాయకుఁడు అనేకనాయికల యెడ తుల్యానురాగము చూపవచ్చును. ఆ నాయికలుగూడ తుల్య సంతుష్ట లగుట ముఖ్యము దక్షిణనాయకత్వము రాణించుటకు – అటు చాతుర్యము, ఇటు తుల్యసంతుష్టి అవసరము.

## నాయికా భేదములు

ఆలంకారికులు ఉదాహరించిన స్వీయ, పరకీయ, కన్య, సామాన్య, ముగ్ధ, మధ్య, ప్రౌఢ మున్నగు నాయికల లక్షణములను ఆ పేరులే తెల్పుచున్నవి. వీరుగాక స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక అను అష్టవిధశృంగార నాయికలును గలరు.

సీ॥ వరుఁడు కైవస మైన వనిత స్వాధీన భ
ర్తృక; ప్రియాగమవేళ గృహముఁ, దనువు
సవరించు వింతి వాసకసజ్జ; పతిరాక
తడవుండ నుత్కంఠఁ దాల్చు వింతి

[1], [2] నృత్యనాటికలు – జ్యోత్స్నాభిసారిక. రచన : నందూరి రామకృష్ణమాచార్య

విరహోత్క: సంకేత మరసి నాథుఁడు లేమి
వెస నార్తయౌ కాంత విప్రలబ్ధ;
విభుఁ డన్యసతిఁ బొంది వేఁకువ రాఁ గుందు
వెలది ఖండిత; యల్క నదిపుఁ దెగడి

గీ॥ యనుశయముఁ జెందు సతి కలహాంతరిత; వి
భుఁడు విదేశగతుఁడైనఁ గృశతఁ దాల్చు
సతివ ప్రోషితపతిక; కాంతాభిసరణ
శీల యభిసారికాఖ్యయై చెలువు మెఱయు [1]

పై నాయికలందరు వేరువేరు నాయికలు గా నక్కరలేదు. ఒకచో ఒకే నాయిక స్వాధీనపతికగా, మరొకచో వాసకసజ్జికగా భాసింపవచ్చును. కూచిపూడి వారి 'భామాకలాపము'లో ఏకైక నాయిక 'సత్యభామ' ఎడనెడ స్వాధీనపతికగా, వాసకసజ్జికగా, విరహోత్కంఠితగా, విప్రలబ్ధగా, ఖండితగా, కలహాంతరితగా సాక్షాత్కరించును.

అట్లే పారిజాతాపహరణములోను 'సత్యభామ' ఎడనెడ స్వాధీనపతికగా, విరహోత్కంఠితగా, విప్రలబ్ధగా, ఖండితగా, కలహాంతరితగా, వాసకసజ్జికగా కన్పించును. పారిజాత కుసుమమును శ్రీకృష్ణుడు రుక్మిణి కిచ్చినసంగతి విని కోపించిన సత్యభామననునయించుటకై ఆమెకు "ఆ జగన్నాటక సూత్రధారి యదునందనుఁడర్మిలిమ్రొక్కె, మ్రొక్కినన్"—

మ॥ జలజాతాసనవాసవాది సురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిర మచ్చో వామపాదంబునన్
దొలఁగం ద్రోచె లతాంగి; యట్లయగు నాథుల్ నేరముల్ సేయఁ బే
రలుకం జెందిన యట్టి కాంత లుచితవ్యాపారముల్ నేర్తురే.[2]

కాని, శ్రీకృష్ణుని సాంత్వనము రసికతకు పరాకాష్ఠ.

ఉ॥ నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తా
చిన యది నాకు మన్ననయ చెల్వగు నీ పదపల్లవంబు మ
త్తనువులకాగ్రకంటకవితానము నీ మెయి సోకి నొచ్చు నం
చని యెద నల్కమానవుగదా యికనైన వరాళకుంతలా । [3]

సత్యభామ తన్నిన, శ్రీకృష్ణున కది మన్ననయట. కాని పాపము! ఆమె సుకుమార పాదములు నొచ్చునని ఆ శ్రీకృష్ణుని బాధ. సత్యభామ పాదతాడ

---

[1] కావ్యాలంకార సంగ్రహము-2-40

[2] పారిజాతాపహరణము : నంది తిమ్మన - 1 - 121

[3] పారిజాతాపహరణము-1-123

నముచే శ్రీకృష్ణుని శరీరమున పులకాంకురప్రకరములు గ్రమ్మినవి. అవి కంటక ప్రాయములట! శ్రీకృష్ణునికంటె అస్వాధీనపతి యెవరు? కాని, దక్షిణనాయకుఁడు గద! అయినను సత్యభామ 'స్వాధీనపతిక'యే యైనది!

విప్రలబ్ధ, విరహోత్కంఠిత, ప్రోషితపతిక విరహిణికి పర్యాయములే! భారతీయ సాహిత్యమున విరహిణికి ఎంతటి ప్రాముఖ్యము లభించినది! ప్రియాగమనను జాగైన- విరహోత్కంఠిత నిరీక్షణ దుర్భరము. ఇక ప్రియుఁడు సంకేత స్థలమునకు రాకుండ తనను వంచించుటచే స్మరార్తి ననుభవించు విప్రలబ్ధ దురవస్థ వర్ణనాతీతము. విదేశగతుఁడైన భర్తకొరకు కృశించు లేజవరాలైన ప్రోషిత భర్తృక మానసికావస్థ ఊహించుకొనవలసినదే.

*అభిసారిక*

అభిసారిక ఆలంకారికుల అభిమాన నాయిక సంకేతస్థలమునకు తెరువరి, తెరువరియై ప్రియాసమాగమమునకై ఏగెడి నాయిక అభిసారిక. చిమ్మచీకటి ఆమెదారి గ్రమ్ముగాక; మెరపుతీగలు దారి చూపింపగలవు!

అభిసారికలలో జ్యోత్స్నాభిసారికను పేర్కొనకతప్పదు. ఆమె వెన్నెలలో విచ్చలవిడిగా విహరించుచు ప్రియాసమాగమమునకు నిర్భయముగా నరుదెంచు సాహసురాలు.

ఉ॥ తెల్లని చీరగట్టి వెలదీ! జడ మల్లెల చెండువెట్టి, ప్రే
పల్లెను వీడినావు, వలవంతలు కమ్మని పిల్లతెమ్మెరల్
పిల్లనగ్రోవి మోవి కను పేదురు వెన్నెల పాలవెల్లి నీ
యుల్లములోన నెట్టి నెర ఉప్పెన రేపినవో వచింపవే![1]

అను పద్యమును జ్యోత్స్నాభిసారికకు ఉదాహరణముగ నెన్ననగును.

[1]నృత్యనాటికలు - జ్యోత్స్నాభిసారిక. రచన: నండూరి రామకృష్ణమాచార్య

**కావ్యదోషములు**

ప్రాచీనాలంకారికులు కావ్యము అదోషముగ, సగుణముగ, సాలంకారముగ నుండవలెనని నిర్దేశించియున్నారు. దోషరాహిత్యము కావ్యనిర్వచనమున నపరి హార్యలక్షణముగ పలువు రెన్నియున్నారు.

**త దల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన**
**స్యా ద్వపుః సుందరమపి శ్విత్రేణైకేన దుర్భగమ్.**[1]

కావ్యమున నల్పమైన దోషమును గూడ నుపేక్షింపరాదు. శరీర మెంత సుందరమైనను ఒక్కబొల్లిమచ్చచాలు ఆ అందము నంతటిని పాడుచేయుటకు, అని దండి తన కావ్యాదర్శమున నొక్కివక్కాణించియున్నాడు. దోషరహితత్వము వాంఛనీయమే. కాని అది సృష్టిలో సాధ్యము కాదు. ఈ తీవ్రవాదమును అంగీ కరించినచో సుప్రసిద్ధ మహాకావ్యములు సైతము కావ్యములు గాకపోవును. ఏ దోషమును లేనికావ్యము లోకములో లేదు. వానిలో దోషములను మరుగుపరచు మహిమ ఉండుటచేతనే ఆ కావ్యములు యుగయుగాంతరములు నిలిచియున్నవి. అయినను దోషములు ఉపేక్షింపదగినవికావని అందరు నంగీకరింపవలసిన విషయమే.

కావ్యమునందలి దోషములు మూడు విధములు. 1. శబ్దగత దోషములు. 2. అర్థగత దోషములు. 3. రసాపకర్షక దోషములు.

విద్యానాథుడు (దోషః కావ్యాపకర్షస్య హేతుః) కావ్యాపకర్షమునకు హేతువైనది దోషమనియు, ఆ దోషములు శబ్దార్థగోచరములనియు ప్రతి పాదించెను. శబ్దార్థగతములైన దోషములు ఎన్నదగినవే. వానితోపాటు రసాప కర్షకదోషములును ముఖ్యము లని వేరుగ నుడువనక్కరలేదు. సాహిత్య దర్పణ కారుడు (రసాపకర్షకాః దోషాః) రసాపకర్షకములు దోషము లని ప్రతిపా దించెను. శబ్దదోషములకంటెను, అర్థదోషములకంటెను ముఖ్యార్థహాతి పెద్ద దోషము.

ఆలంకారికులు పలువురు దోషములను పలువిధముల వర్గీకరించిరి. సాహిత్య దర్పణకారుడు పదునాలు పద, వాక్యదోషములను పేర్కొనెను. అవి

1. దుశ్శ్రవత్వము 2. అశ్లీలత (ఇది త్రివిధము) 3. అనుచితార్థము 4. అప్రయుక్తత 5. గ్రామ్యత 6. అప్రతీతత్వము 7. సందిగ్ధత 8. నేయార్థత 9. నిహతార్థత 10. అవాచకత 11. క్లిష్టత్వము 12. విరుద్ధమతికారిత్వము 13. అవిమృష్టవిధేయాంశత 14. నిరర్థకత 15. అసమర్థత 16. చ్యుత సంస్కా రత్వము.

పై వానిలో చివరిమూడును కేవల పదదోషములు. తక్కినవి పదవాక్యో భయ దోషములు. అర్థదోషములు ఇరువదియొకటి. అవి—

---

[1] దండి-కావ్యాదర్శములోనిది కావ్యాలంకారసంగ్రహవివరణములో ఉదాహృతము.

1. అపుష్టత్వము 2. దుష్క్రమత 3 గ్రామ్యత 4. వ్యాహతత్వము 5. అశ్లీలత 6 కష్టత్వము 7. అనవీకృతత్వము 8. నిర్హేతుత్వము 9. ప్రకాశిత విరుద్ధత 10. సందిగ్ధత 11. పునరుక్తత 12. ప్రసిద్ధ విరుద్ధత 13. విద్యావిరుద్ధత 14. సాకాంక్షత 15. సహచర భ్రష్టత 16. అస్థానయుక్తత 17. అవిశేషవిశేషత్వము 18. అనియమనియమత్వము 19. విశేషావిశేషత్వము 20. నియమానియమత్వము 21. నిర్ముక్తపునరుక్తత్వము

రసదోషములు పదునైదు అవి—

1. రసమును స్వశబ్దవాచ్య మొనరించుట 2. స్థాయిభావమును స్వశబ్ద వాచ్యము సల్పుట 3. సంచారిభావమును స్వశబ్దవాచ్య మొనరించుట 4. విరోధి రసముల కంగములగు విభావాదుల గ్రహించుట 5. అనుభావవిభావముల ఆక్షేపము 6. అనుభావవిభావకష్టకల్పనము 7. అకాండప్రధానత 8. అకాండచ్ఛేదత 9. రసదీప్తి పౌనఃపున్యము 10. అంగిరసమును పోషింపకుండుట 11. రసాంతర వర్ణన (అంగిరసముకాని రసమును కీర్తించుట) 12. అంగరస విస్తారణము 13. దివ్యాదివ్య ప్రకృతి విపర్యయము 14. అర్థానౌచిత్యము 15. దేశకాలాద్యనౌచిత్యము[1]

ఇవిగాక వేరుదోషములు కనబడినచో వానిని గుర్తింపవలె నని సాహిత్య దర్పణకారుని హెచ్చరిక కావ్యదోషములను గూర్చి విద్యానాథుడు వేరుపట్టికల నిచ్చెను. దోషముల పట్టిక నెవరు సమకూర్చినను, అది అసమగ్రమైన ఆకృతి గణమే కాగలదు.

[1] సాహిత్యసోపానములు — ఆచార్య దివాకర్ల వేంకటావధాని.

# 10

# దృశ్య కావ్యములు

కావ్యములు శ్రవ్యకావ్యములు, దృశ్యకావ్యములు-అని రెండు విధములు. శ్రవ్యకావ్యములు పురాణేతిహాస ప్రబంధాదులు. దృశ్యకావ్యములు నాటకాది రూపకములు.

సంస్కృత వాఙ్మయమున రూపకసృష్టికి ఎనలేని గౌరవము గలదు. 'నాటకాంతం హి సాహిత్యమ్', 'కావ్యేషు నాటకం రమ్యమ్' వంటి సాహితీసూక్తులీయర్థమునే ప్రవచించుచున్నవి. సంస్కృతకవులు శ్రవ్యకావ్యరచనలో పరిపక్వత నొందిన తరువాతనే లోకవృత్తాంత దర్శకములైన దృశ్యకావ్యములను రచించియుందురు.

"కావ్యేషు నాటకం రమ్యమ్" (కావ్యములలో నాటకము రమ్యమైనది) అను సంస్కృత సూక్తి సాహితీప్రియంభావుకుల హృదయములలో నాటకమున కెట్టిస్థానమున్నదో అభివ్యక్తము చేయుచున్నది

శ్రవ్యకావ్యము వినుటకు, చదువుకొనుటకు మాత్రమే ఉపయోగపడును. దృశ్యకావ్యమున శ్రవణేంద్రియముతో పాటు నేత్రేంద్రియము గూడ రసస్నిగ్ధమై సద్యోరసప్రతీతి గల్గించును. ఇక్కడ, మానవమన స్తత్త్వములోని ధర్మ సూక్ష్మమొకటి అనుశీలింపనగును. వినుట వేరు; చూచుట వేరు. ఒక వృత్తాంతమును వీనులార వినవచ్చును, గాని కనులార చూచినప్పుడు ఒక దృశ్యము సహృదయులపై చెరిగిపోనట్టి ముద్రవేయుటసహజము. అందువలననే 'కావ్యేషు నాటకం రమ్యమ్' అని అభిజ్ఞుల అభిప్రాయము.

పాశ్చాత్యాలంకారికులుగూడ సాహిత్యప్రక్రియలలో నాటకమునకు - ముఖ్యముగా విషాదాంత నాటకమునకు - మిక్కిలి ప్రాధాన్యమునొసంగియున్నారు అరిస్టాటిల్ "**Tragedy is nobler than romance**" (విషాదాంత రూపకము కాల్పనిక కావ్యముకంటె మేల్తరము) అని ప్రవచించెను.

నాటకము సర్వకళాసమాహారము. అందు చతుర్విధాభినయములు మాత్రమేగాక చిత్రలేఖనము, గానము, శిల్పము మున్నగు కళలును అపరిహార్యములు.

సమస్తకళలకు ఆద్యప్రకృతి ఆదిమమానవుని హృదయము. ప్రాక్తన మానవుని హృదయము రసతరంగితమైనపుడు, అతడు ఆడుచు పాడుచు చిందులు త్రొక్కెను. ఆ ఆటవికతాండవమును విన్యాసవిశేషాత్మకమైన నృత్తము, తాళలయాన్వితమైన నాదము, భావార్థసమన్వితమైన శబ్దము అని మువ్విధముల

ప్రస్తరింపవచ్చును. కాలపరిణామక్రమమున విన్యాసవిశేషాత్మకమైన నృత్తము 'నాట్యము', తాళలయాన్వితమైన నాదము 'గానము', భావార్థసమన్వితమైన శబ్దము 'కవిత' అను మూడు కళలుగా అభివ్యక్తమైనది. తిరిగి ఈ మహాకళా త్రితయము యుగ యుగాంతరముల పిమ్మట నొకచో సంగమించినది నాటక కళయందే. అందుచేత "కావ్యేషు నాటకం రమ్యమ్" అనుట సార్థకమైనదని ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి వివరణము.[1]

## నాటకము

"లోకవృత్తాంత దర్శకం నాటకమ్"-నాటకము లోక వృత్తాంతదర్శకము. ఏనాటకమైనను ఈ జగన్నాటకములో ఒక అంతర్నాటకమే. ఈ అనుభూతిని లేశమాత్రముగనైన సామాజికులు పొందగల్గినచో వారు ఆ క్షణమాత్రమైన జీవన్ముక్తులే. వారు కావ్యపరమావధియైన సద్యఃపరనిర్వృతి అందుకొని రససాక్షాత్కారము పొందిన వారు కాగలరు

"ఇందుగలఁడందులేఁడని సందేహమువలదు". విశ్వస్రష్ట సర్వాంతర్యామి యని వేదాంతుల ప్రవచనము. నాటకకర్త అపరసృష్టికర్త. అతడు తన నాటక సృష్టిలో సర్వాంతర్యామిగా నున్నను "కలఁడు కలండనెడి వాఁడు కలఁడో లేఁడో" అనునట్లే తటస్థుడుగా నుండును.

నాటకశిల్పమున ఉత్తమపాత్రచిత్రణము, సజీవపాత్రచిత్రణము ఉండ వచ్చును. హృదయంగమమైన సంభాషణప్రౌఢి యుండవచ్చును. చతుర్విధాభినయ వినీతమైన సన్నివేశకల్పనము ఉండవచ్చును. కాని, అంతమాత్రమున అది నాట కము కాజాలదు. నిజమైన నాటకము జగన్నాటకమునకు ప్రతిబింబము కావలెను.

ప్రాచీన నాటకశిల్పమును ప్రస్తరించినచో నాంది-ప్రస్తావన-అంకములు-అర్థోపక్షేపకములు-భరతవాక్యము-పంచసంధులు మున్నగు కొన్ని ప్రధానాంగ ములను పృథక్కరించి వివరింపవచ్చును. అవి నాట్యశరీరమునకు అవయవములు మాత్రమే. నాటకమునకు ఆత్మ లోకోత్తరమైన-బ్రహ్మానంద సదృశమైన రసమను భరతముని ప్రవచనము చిరస్మరణీయము.

### నాంది

నాటకప్రయోగారంభమున యవనికాంతరమున రంగవిఘ్నోపశాంతికై నటీనటులు సల్పు మంగళాచరణము పూర్వరంగము. ఈ పూజాంతమున పూర్వ రంగప్రవర్తకుడైన సూత్రధారుడు పఠించు ఆశీర్నమస్క్రియారూపమగు శ్లోక మునకు నాందీ శ్లోకమనిపేరు. సంతోషార్థము నిచ్చు 'నంద్' ధాతువు నుండి నాంది అనుమాట నిష్పన్నమైనది. నాందియనగా సంతోషప్రదమైనది. అటు నటీ నటులను, నాటక కర్తను, ఇటు సామాజికులను సంతోషింపజేయునది గావున

---

[1] గౌతమవ్యాసములు - ఆంధ్రనాటక పరిషత్తు - అధ్యక్షోపన్యాసము.

నాందియని కొందరు అర్థము చెప్పుచున్నారు. "దేవతలను సంతోషపెట్టునదిగావున నాంది" యని యొక మతము. జగద్ధితమైన కార్యము దేవతలకు ప్రీతిఘటించునని ప్రాచీనులనమ్మకము. వినోదమును, విశ్రాంతిని కాంక్షించి నిత్యజీవితములో మిక్కిలి పరిశ్రాంతులై డస్సి, రోసియున్న సామాజికులకు నాటకకళ ఆనందామృతమును పంచిపెట్టగలదు. నాటకారంభము నాంది. నందీశ్వరుని పేరుమీద వెలసినది గావున నాందియని కొందరు. ప్రతిదివసాంతమున ఆదిమనటుడైన నటరాజు నిరాలంబ మైన ఆకాశరంగమున కేళీతాండవలోలుడై వర్తించునని భారతీయ కవి సమయము. ఆ లీలాతాండవలోలునకు తన వీపును రంగముగా నిలిపినది నందీశ్వరుడు. అందుచే ప్రాతః స్మరణీయుడైన నందికేశ్వరుని పేరుమీద నాంది వెలసినదని కొందరు ప్రవచించుచున్నారు.

ఆలంకారికజగత్తులో "నాంది" యన కావ్యార్థసూచనము. ఈ కావ్యార్థ సూచన సల్పువాడు సూత్రధారుడు. సూత్రధారుడనగా సూత్రమును ధరించు వాడు. సూత్రమనగా కావ్యార్థసూచన సల్పుట యని అర్థము. నాంది ఆశీ ర్నమస్క్రియారూపమున ఉండవలెనని ఆలంకారికనిర్దేశముగదా ! ఇక అందు కావ్యార్థసూచన యెట్లు పొసగును ? అను సందేహము రావచ్చును. దానికి "అర్థతశ్శబ్దతో వాపి మనాక్ కావ్యార్థసూచనమ్" (అర్థముచేగాని శబ్దముచేగాని కావ్యార్థసూచన రేఖామాత్రముగ ధ్వనించిన చాలును.) అని ప్రతాపరుద్రీయ మున నున్న వాక్యమే సమాధానము. ఉదాహరణమునకు భాసుని స్వప్నవాసవ దత్తలోని నాందిని చూడదగును.

> ఉదయనవేందు సవర్ణా వాసవదత్తాబలౌ బలస్య స్వామ్
> పద్మావతీర్ణపూర్ణౌ వసంతకమ్రౌ భుజౌ పాతామ్.

ఇది బలరాముని గూర్చిన ప్రార్థనయైనను ఇందు నాటకమునందలి ఉదయన వాసవ దత్తా పద్మావతీ వసంతకపాత్రలు శబ్దతః సూచితములు.

పూర్వరంగ ప్రవర్తకుడైన సూత్రధారుడు నాందీశ్లోకమును పఠించి నిష్క్రమించిన పిమ్మట, ఆకారరేఖాగుణ విశేషములం దతనినే పోలు మరియొక సూత్రధారుడు ఉత్తరరంగప్రవర్తకుడు ప్రవేశించి ప్రస్తావనాదికమును నడపును.

### సూత్రధారి

'సూత్రధారి'కి నాటకకళలో గల విశిష్టత ఎన్నదగినది. వేదాంతులు విశ్వ శిల్పిని జగన్నాటకసూత్రధారిగ నుల్లేఖించిరి. నాటకకళలో సూత్రధారి అపర సృష్టికర్త.

ప్రాచీనాలంకారికులు సూత్రధారి లక్షణములను వివరించిరి. అతడు కవి, ఛందశ్శాస్త్ర పారంగతుడు, నటుడు, నాట్యవిద్యాకుశలుడు, పౌరేషణవిచ క్షణుడు, పండితోత్తముడు, సకల విద్యాపారంగతుడు. ఒక్కమొక్కలో చెప్ప

వలెననిన 'సర్వజ్ఞుడు'- అయి యుండవలెను.

ప్రస్తావన

ఉత్తరరంగ ప్రవర్తకుడైన సూత్రధారి నటితోగాని, పారిపార్శ్వకునితో గాని కలిసి రంగమున ప్రవేశించి చిత్రోక్తులతో తాము ఆనాడు ప్రదర్శింపబోవు నాటకమును గూర్చి, కవినిగూర్చి, సామాజికులను గూర్చి వివరించును. ఇదియే ప్రస్తావన. ఇందు కవి గోత్రనామాది కథనము, ప్రరోచనము (ఉన్ముఖీకరణము) ఋతువర్ణనము, పాత్రప్రవేశసూచన అను అంగములుండును.

ఉదాహరణమునకు శ్రీహర్షుని రత్నావళిలోని ప్రస్తావన (ప్రరోచన) చూడదగును.

'శ్రీహర్షో నిపుణః కవిః పరిషద ప్యేషా గుణగ్రాహిణీ
లోకే హారి చ వత్సరాజచరితం నాట్యే చ దక్షా వయమ్
వస్త్వేకైక మపీహ వాంఛితఫలప్రాప్తేః పదం కిం పునః
మద్భాగ్యోపచయా దయమ్ సముదితః సర్వో గుణానాం గణః'

శ్రీహర్షుడా, నిపుణుడైన మహాకవి! పారిషదులా, గుణగ్రహణ పారీణులు! ఇతివృత్తమా, మనోజ్ఞమైన వత్సరాజచరిత్రము! నాట్యమున మేము దక్షులము! ఈ మూడింటిలో ఏ యొకటి సమకూడినను నాటకము రక్తికట్ట వచ్చును. ఇప్పుడు అన్నియు నా భాగ్యవశమున సమకూడినవి. ఇక చెప్పనేల?

ప్రస్తావన మధ్యలో ఋతువర్ణనముండును. నాటకము నందలి ప్రధానరస మైన వీరమునకుగాని శృంగారమునకుగాని నప్పునట్టి ఋతువునుగూర్చి గానమును చేయవలెను. శృంగార రసానుగుణముగ వసంతఋతువును, వీరరసానుగుణముగ శరదృతువును వర్ణనముసలుపుట కద్దు. ఈ ఋతువర్ణనము సామాజికులను కావ్యేతి వృత్తమునకు ఉన్ముఖులను చేయుటకు ఉద్దేశింపబడినది.

ప్రస్తావనలోని చివరియంశము ప్రథమాంకమునందు ప్రప్రథమముగ ప్రవేశింపబోవు పాత్రను పరిచయము చేయుట. ఈ పాత్రప్రవేశ సూచనలో ఉద్ఘాత్యకము, అవలగితము, ప్రయోగాతిశయము, ప్రవర్తకము, కథోద్ఘాతము అనెడి ఐదు పద్ధతులు గలవు.

అభిజ్ఞానశాకుంతలమున 'ప్రయోగాతిశయము' కలదు. ప్రయోగాతిశయమనగా ప్రవేశింపబోవు పాత్రను ప్రత్యక్షముగ సూచించుట. శాకుంతల ప్రస్తావనలో నటి ఋతుగానము చేయుచుండగా సూత్రధారి—

తవాస్మి గీతరాగేణ హారిణా ప్రసభం హృతః
ఏష రాజేవ దుష్యంతః సారంగేణాతిరంహసా. [1]

---

[1]కాళిదాసు-అభిజ్ఞానశాకుంతలమ్-ప్రస్తావన.

"నీ గీతరాగమున లేడిచే ఆకృష్యమాణుఁడైన ఈ దుష్యంతునివలె అపహృత చిత్తుఁడనైనాను."

నవీనులలో తిరుపతి వేంకటేశ్వరకవులు వ్రాసిన పాండవజనననాటకమున 'కథోద్ఘాతము' హృదయంగమముగ నిర్వర్తింపబడినది. ప్రస్తావనలో సూత్రధారి—

క॥ పారాశర్యమునీంద్రుఁడు
భారతమును వ్రాసె; తెలుఁగు పరచిరి కవితా
స్వారాజ లొక్క ముువ్వురు
వీరిరువురు నాటకముగ వెలయించిరిలన్[2]

అని చదువునప్పుడు, 'ఎవఁడురా పుట్టని బిడ్డలకు పేరు పెట్టుచున్నాఁడు?' అనుచు తెరలోపలినుండి పరాశర మహర్షి ప్రవేశించుటతో ప్రథమాంక మారంభించును.

### అంకము

నాటకమందలి ఇతివృత్తము దృశ్యమనియు, సూచ్యమనియు రెండువిధములు. అందు దృశ్యభాగము అంకములుగా, సూచ్యభాగము అర్థోపక్షేపకములుగా విడివడును. అంకలక్షణము—

ఏకైక దివసం వృత్తమ్ ఏకనేతృప్రయోజనం
బహుపాత్ర ప్రవేశార్హం అంక మాసన్ననాయకమ్.

వివిధాలంకారికులు చెప్పిన అంకలక్షణముల నీక్రింది విధముగా క్రోడీకరింపనగును—

(1) అంకము బహుపాత్ర ప్రవేశార్హమై యుండవలెను. (2) ఏకనాయకాశ్రయమై యుండవలెను (3) అంకమునందలి కథ మధురోదాత్త రసభావ నిరంతరమై యుండవలెను. (4) అంకమునందు జరిగెడికథ ఏకైకదివసప్రవృత్తము అనగా ఒకరోజులోపలనే జరిగినదై యుండవలెను (5) అంకమునందు కథ బీజానుగుణముగా బిందువ్యాప్తిపురస్కృతమై, నీటిమీది తైలబిందువువలె విస్తరింపవలెను. (6) అంకమునందు దూరప్రయాణము, వధ, రాజ్యదేశాది విప్లవము, యుద్ధము; అనుచితములైన భోజనానులేపన వస్త్రధారణ శయనాలింగన చుంబనాదులు ప్రదర్శింపరాదు.

### అర్థోపక్షేపకములు

నాటకములో అంకములు ఏడు నుండి పదివరకు నుండును. ప్రత్యంకము

---

[2]తిరుపతి వేంకటేశ్వర కవులు-పాండవజనన నాటకము-ప్రస్తావన

నందును ఒకదినములో జరిగిన కథయే యుండును. అనగా నాటక కథయంతయు పది దినములు దాటరాదని అర్థముకాదు, అంకములందు ప్రదర్శించుటకు వీలు కానట్టి కథాభాగమునంతయు, ఎన్నో వత్సరాలలో జరిగిన సంగతులైనప్పటికి అర్థోపక్షేపకములతో సూచింపనగును. అంకములో ప్రదర్శించుటకు వీలుగాని యుద్ధాదులు అంకములో సూచ్యములు కావచ్చును.

అర్థోపక్షేపకములు—విష్కంభము, ప్రవేశకము, చూళిక, అంకాస్యము, అంకావతారము అని ఐదు విధములు.

సంస్కృతనాటకములలో సంస్కృతమున మాటాడు పాత్రలు ఉత్తమ మధ్యమ పాత్రలు. ప్రాకృతమున మాటాడు పాత్రలు నీచపాత్రలు. ఇందు ఉత్తమ నీచత్వములు భాషాసంబంధములుగాని పాత్రచిత్తవృత్తినిరూపకములు గావని మరువరాదు.

విష్కంభమునకు, ప్రవేశకమునకు ఈషద్భేదము గలదు. ప్రవేశకము నీచపాత్ర ప్రయోజితము, రెండంకముల మధ్యనే వచ్చును. ఇందు ప్రాకృతమున రెండు పాత్రలు ప్రవేశించి వృత్తవర్తిష్యమాణ కథాంశములను సామాజికులకు సూచించి నిష్క్రమించెదరు. విష్కంభము, ఏ అంకమునకు ముందైన ఉండ వచ్చును. అనగా ప్రథమాంకము ముందుండనగును. విష్కంభముతో నారంభించు నాటకములున్నవి. విష్కంభము నందలి పాత్రలు మధ్యమపాత్రలైనచో నది శుద్ధవిష్కంభము నీచ మధ్యమ పాత్రలు రెండును ప్రయుక్తములైనచో అది మిశ్రవిష్కంభము.

అంకాస్యము, అంకావతారము అంకముల చివరనుండును. ఆ అర్థోపక్షేపకము లందలి పాత్రలు తరువాతి అంకమున నున్నచో నది అంకావతారము.

చూళిక యనగా ఆకాశభాషణము. వృత్తవర్తిష్యమాణ కథాంశమును సామాజికులకు తెలుపుటకు సాధనము. పాండవవిజయ మందలి చూళిక ఉదాహరణముగ స్వీకరింపనగును. కురుక్షేత్రసంగ్రామము ముగిసినది. కౌరవులలో మిగిలినది ఒక్క దుర్యోధనుడు మాత్రమే. భారతీయసంప్రదాయము ననుసరించి యుద్ధము రంగమున ప్రదర్శించుటకు వీలులేదు. అందుచేత చూళిక ప్రయుక్తము.

ఉ. ఆరని లోతు నీటికొల నక్కట పూచినతమ్మికిన్ విధి
ప్రేరణ రాలిపోయినవి రేకులు తొంబదితొమ్మి దింక నా
నీరజ మందుఁ దా మిగులునే? యొకరేకు లుండెనో! అలం
కారము లౌనె యాకొలనుగాని సరోజముగాని భూమికిన్ [1].

అది ఆరని నీటికొలను. అందు శతపత్రమైన పద్మము విరబూచినది. కాని విధిప్రేరణచే ఆ నీరజమున తొంబదితొమ్మిది రేకులు రాలిపోయినవి. ఒక్కొక రేకు మిగులునా? మిగిలినచో ఆ పూవుగాని ఆకొలనుగాని భూమికి అలంకార

---

[1] తిరుపతివేంకటేశ్వరకవులు – పాండవోద్యోగనాటకము

మగునా?

ఈపద్యము విన్న సామాజికులకు కౌరవవంశమునకు పట్టిన దుర్గతి వెంటనే భాసించును. దుర్యోధనుడు ఒక్కడే మిగిలినాడనియు అతనికి మృత్యువాసన్న మైనదనియును స్ఫురించును.

నాటకాంతమున అద్భుత రసము ఉండవలెను.

### *భరతవాక్యము*

నాటకము భరతవాక్యముతో ముగియును. భరతవాక్యము విశ్వకళ్యాణో దర్కమైనది. 'సర్వేజనాః సుఖినోభవంతు' అను భారతీయసంస్కృతినే ప్రతి భరత వాక్యము ప్రతిఫలించును.

### *పంచ సంధులు*

నాటకమునందలి ఇతివృత్తమును ప్రాచీనాలంకారికులు బీజము, బిందువు, పతాక, ప్రకరి, కార్యము, అను అయిదు అర్థప్రకృతులుగా విభాగించిరి. బీజమనగా కథాబీజము. ఆబీజము నీటిమీది తైలబిందువువలె వ్యాపించుట బిందువు. కథలో మధ్యకలిసి అంతమువరకు నుండునది పతాక. మధ్యలో వచ్చిపోవు అవాంతరగాథ (రామాయణములో శబరికథ వంటిది) ప్రకరి.

కథా సంవిధానమున ఐదు కార్యావస్థలు గలవు. అవి ఆరంభము, యత్నము, ప్రాప్త్యాశ, నియతాప్తి, ఫలాగమము.

పై ఐదు అర్థప్రకృతులును, కార్యావస్థలైదింటితో క్రమముగా కలియుట వలన పంచ సంధులేర్పడును. పంచ సంధులు క్రమముగా (1) ముఖ సంధి, (2) ప్రతి ముఖ సంధి, (3) గర్భసంధి, (4) అవమర్శ సంధి, (5) నిర్వహణ సంధి.

ఏనాటకమునందైనను, పంచ సంధులను మనము ఊహించుకొనవలసినదే. వానిని దిఙ్మాత్రముగ నిర్దేశింపనగును. అయినను శ్రీ పింగళి లక్ష్మీకాంతంగా రన్నట్లు "సంధులు చెడిన నాటకము కీళ్లు సడలినబొమ్మ".

## ప్రకరణము

ఈ రూపకమున పది అంకములుండును. శృంగారరసప్రధానము, వస్తువు ఉత్పాద్యముగాని, ప్రఖ్యాతముగాని కావచ్చును. నాయకుడు ధీర శాంతుడై యుండవలెను. నాయిక కులటగాని, వేశ్యగాని కావచ్చును. మాలతీమాధవము, తరంగదత్తము, మృచ్ఛకటికము సుప్రసిద్ధప్రకరణములు.

## భాణము

ఇందు ఇతివృత్తము ఉత్పాద్యము. ఇది ఏకపాత్రాశ్రయము. ఆ ఏకపాత్ర

సమర్థుడు, విద్యావంతుడునై ఆకాశభాషితమున ఇతివృత్తమును నడుపును. ఇందు ముఖ, నిర్వహణసంధులుండును. గేయాది దశలాస్యాంగములుండును. శృంగార వీరరసములు సూచింపదగును.

## ప్రహసనము

ప్రహసనము హాస్యరసప్రధానమైనది. వస్త్వంక సంధి తదంగ లాస్యాంగముల విషయమున నిది భాణసమము, ఇది శుద్ధము, వికృతము, సంకీర్ణము అని మూడు విధములు. ఈ భేదములు పాత్రలను బట్టి యేర్పడినవే.

## డిమము

ఇందు ఇతివృత్తము ప్రఖ్యాతమై యుండవలెను. దేవ, కిన్నర, గంధర్వ, యక్ష, రాక్షస, భుజగ, భూత, ప్రేత, పిశాచాదులగు పదునార్గురు ధీరోద్ధత నాయకులుండవలెను. అవమర్శసంధిగాక మిగిలిన నాలుగు సంధులు, నాలుగంకములు ఉండును. ప్రధానరసము రౌద్రము. అంగరసములుగ మిగిలిన రసములు— హాస్య శృంగారములు తప్ప— ఉండవచ్చును. ఇందు ఇంద్రజాల మహేంద్రజాలాదులు, క్రోధము, అద్భుతము మున్నగు చేష్టలు వర్ణింపదగును.

## వ్యాయోగము

ఇది ఏకాంకిక. బహుపాత్రప్రయోజ్యము. ప్రఖ్యాత వస్తుకము. నాయకులు ధీరోద్ధతులు పలువురుందురు. గర్భావమర్శములుగాక మిగిలిన మూడు సంధులుండును. స్త్రీనిమిత్తముకాని యుద్ధము, వర్ణన ఉండవలెను.

## సమవకారము

ఇందు ఇతివృత్తము ప్రఖ్యాతము; మూడంకములుండనగును; ప్రధానరసము వీరము; కపటము, శృంగారము, ఉపద్రవము ప్రత్యంకమున నుండవలెను. అవమర్శ సంధిగాక మిగిలిన సంధి చతుష్టయముండును. తొలిగడియల కాలములో ప్రవృత్తమైన ఇతివృత్తము ఉండవలెను.

## వీథి

ఇతివృత్తము కల్పితము. ఏకాంకిక. ముఖనిర్వహణసంధు లుండును. ఒకటి కాని రెండుకాని పాత్రలుండును. తెలుగులో క్రీడాభిరామము 'వీథి'కి ఉదాహరణము. అంగిరసము శృంగారము. నవరస సంభరితముగా నుండును.

## అంకము

దీనికి ఉత్సృష్టికాంకము అని నామాంతరము. ఇందు ఇతివృత్తము ప్రఖ్యాతము. ప్రాకృతపురుషులు నాయకులు. ప్రధానరసము కరుణము. ఇది సంధి

నృత్త్యాదులందు భాణతుల్యము.

### ఈహామృగము

ఇందలి వస్తువు ప్రఖ్యాత-కల్పిత-మిశ్రము. అంకములు నాలుగు. గర్భావమర్శములుగాక మిగిలిన మూడు సంధులుండవచ్చును. ధీరోద్ధతులైన నరదివ్యులలో ఒకడు నాయకుడుగ, మరియొకడు ప్రతినాయకుడుగ నుండవచ్చును. దివ్యస్త్రీబలాత్కారము గర్హితగాథ గాదగును. మృగమువలె, అలభ్యయగు నాయిక రూపకమునకు కేంద్రము గావున ఈ రూపకమునకు ఈహామృగమను పేరు వచ్చినది.

### ఉపరూపకములు

దశరూపకములుగాక సంస్కృతవాఙ్మయమున ఎన్నియో ఉపరూపకములున్నట్లు ఆలంకారికగ్రంథముల వలన తెలియనగును[1]. అందు కొన్నిటిని పేర్కొనదగును.

(1) నాటిక (2) త్రోటకము (3) గోష్ఠి (4) సట్టకము (5) నాట్యరాసకము (6) ప్రస్థానకము (7) ఉల్లాప్యము (8) కావ్యము (9) ప్రేంఖణము (10) రాసకము (11) సంలాపకము (12) శ్రీగదితము (13) శిల్పకము (14) విలాసిక (15) దుర్మల్లిక (16) ప్రకరణి (17) హల్లీసకము (18) భాణిక (19) హాసిక (20) వ్యాయోగిని (21) డిమిక (22) కల్లోత్సావావతి (23) చిత్ర (24) జుగుప్సిత (25) చిత్రశా(తా)ల (26) డోంబిక (27) షిద్గకము (28) రామా (మ) క్రీడము (29) రాగకావ్యము (30) నృత్తపారము (31) భాణము (32) పారిజాతకము (33) నర్తనకము (34) ప్రేరణము (35) కల్పవల్లి (36) మల్లిక.

[1] నాట్యశాస్త్రము- గుప్తభావప్రకాశిక-డా పోణంగి శ్రీరామ అప్పారావు

# 11

# రస సిద్ధాంతము

విశ్వసాహితీజగత్తులో భారతీయులు కావ్యమీమాంసకు ప్రసాదించిన విశిష్టవివేచన రససిద్ధాంతము.

### రసము-సహృదయుడు

రససిద్ధాంతమునకు భారతీయ సంస్కృతికి అవినాభావసంబంధముగలదు లలిత కళానుభూతినిసమగ్రముగప్రస్తరించి, వివరించిన విశిష్టత రససిద్ధాంతమునకుదక్కినది ఈ సిద్ధాంతము ప్రపంచమునందలి విద్వాంసులను పలువుర నాకర్షించినది రసమును గూర్చి ప్రాచీనభారతీయాలంకారికులు పలువురు సాంగోపాంగముగ చర్చించి వివిధవాదములను లేవదీసినారు. అలంకారికులలో భేదాభిప్రాయములును ప్రాయిక ముగ పొడసూపినవి. సంస్కృతాలంకారిక ప్రపంచమున రసప్రకరణము మిక్కిలి గహనమైనదయ్యు హృదయంగమమై జిజ్ఞాసువుల నుత్సాహ లూగించును.

రససిద్ధాంతప్రవక్త భరతముని. భరతుడు రసప్రవక్తగ నందికేశ్వరుని పేర్కొనెను. రసశబ్దము వేదవేదాంగ ప్రయుక్తమైనదే. రసో వై సః—అతడు రసస్వరూపుడు-అనునది వేదకాలమునాటి సూక్తి.

రసానందము బ్రహ్మానందసహోదరము; లోకోత్తరచమత్కారభాజనము; విగళితవేద్యాంతరము; అనిర్వచనీయము; వాచామగోచరము-అని పెక్కుభంగుల అలంకారికులు వివరించినారు.

లౌకికసంతోషము వేఱు; ఆనందము వేఱు. మానుషసంతోషానుభూతి కంటె ఎన్నిలక్షలరెట్లో ఆనందానుభూతి గొప్పదని అలంకారిక ప్రవచనము.

తైత్తిరీయోపనిషత్తునందలి ఆనందవల్లిలో ఆనందమీమాంస గలదు. మానుషానందమనగా యువకుడు, సాధువు, ద్రఢిష్ఠుఁడు, బలిష్ఠుఁడునైన మహారాజనుభవించు ఆనందము. బ్రహ్మానందమనగా ఆనందవల్లి గణితము ప్రకారము—

| | | |
|---|---|---|
| 100 మానుషానందములు | = | ఒకమనుష్యగంధర్వానందము |
| 100 మనుష్యగంధర్వానందములు | = | ఒక దేవగంధర్వానందము |
| 100 దేవగంధర్వానందములు | = | ఒకపితృదేవతానందము |
| 100 పితృదేవతానందములు | = | ఒక అజానదేవతానందము |

| | | |
|---|---|---|
| 100 అజానదేవతానందములు | = | ఒక కర్మదేవతానందము |
| 100 కర్మదేవతానందములు | = | ఒక దేవానందము |
| 100 దేవానందములు | = | ఒక ఇంద్రానందము |
| 100 ఇంద్రానందములు | = | ఒక బృహస్పత్యానందము |
| 100 బృహస్పత్యానందములు | = | ఒక ప్రజాపత్యానందము |
| 100 ప్రజాపత్యానందములు | = | ఒక బ్రహ్మానందము |

పై గణితమును బట్టి 100000000000000000000 మానుషానందములు (ఒక లక్షకోటి కోట్ల మానుషానందములు) = ఒక బ్రహ్మానందము.

ద్వంద్వ బద్ధమైన ప్రాణికోటిని, వికారమయమైన జీవితమును, అవ్యవస్థితమైన సృష్టిని అనుశీలించి, ఆ అనేకత్వములో అంతర్వాహినియైన ఏకత్వమును సాక్షాత్కరింప జేసికొని 'జగత్తుమిథ్య, బ్రహ్మ సత్యము' అను అనుభూతిని పొందగలిగిన యోగీశ్వరుడు మాత్రమే ఆ బ్రహ్మానందమును పొందగలడు. రసానందము ఆలంకారిక ప్రవచనము ప్రకారము బ్రహ్మానందసహోదరము. అందుచేతనే "నానృషిః కురుతే కావ్యమ్"అని ప్రాచీనభారతీయాలంకారికుల మతము 'అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః'. 'ఆనందో బ్రహ్మ' అను ఉపనిషదుక్తి ఇట అనుసంధేయము.

'A thing of Beauty is a joy forever'. సుందరవస్తుసందర్శనము సంతతానందసంధాయక మనిన ఆంగ్లకవి కీట్స్‌వచనము తైత్తిరీయోపనిషత్తులోని ఆనందవల్లికి సుదూర ప్రతిధ్వని.

రససిద్ధాంతమునకు సూత్రప్రాయమైన సారాంశసంగ్రహము—కాళిదాసు శ్లోకము కీట్సుకవి అభిభాషణమునే కాక, రససిద్ధాంతహృదయమును హృదయంగమముగ నభివ్యక్త మొనరించుచున్నది. దుష్యంతుడు రాణి హంసపదిక పాడిన పాటను వినుచున్నాడు —

> **అభినవమధులోలుప స్త్వం**
> **తథా పరిచుంబ్య చూతమంజరీమ్**
> **కమలవసతిమాత్రనిర్వృతో**
> **మధుకర విస్మృతోఒస్యేనాం కథమ్** [2]

"క్రొంగ్రొత్తతేనెలను ఆరగించుటకు మరగినట్టి ఓ తుమ్మెద కుమారుడా! నీవు ఆవిధముగా చూతమంజరిని చుంబించి ఇప్పుడు కమలమందు అధివసించి వెనుకటి చూతమంజరిని ఎట్లువిస్మరించితివి?"

---

[1] మహాకవి కీట్స్ "ఎండిమియాన్" తొలిపంక్తి

[2] అభిజ్ఞానశాకుంతలము—అం-౫; శ్లో-1.

ఈ పాట విన్న దుష్యంతుడు పొందిన అనుభూతి ఎట్టిది ?

'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్ సుఖితోఽపి జంతుః
త చ్చేతసా స్మరతి నూన మబోధపూర్వమ్
భావస్థిరాణి జననాంతర సౌహృదాని[1]

'రమ్యాణి వీక్ష్య' అను పై శ్లోక మందలి ఏకదేశంమునదే కీట్స్‌కవి ప్రవచించిన సుందరవస్తుసందర్శనము సంతతానందసంధాయకమను (**A thing of Beauty is a joy forever**) సూక్తి గతార్థము. కాళిదాసుశ్లోకము రససిద్ధాంతము పతిఫలించిన మాణిక్యమకుటము.

"సుందరరూపములను చూచినప్పుడును, మధురశబ్దములను విన్నప్పుడును సుఖముగా నున్న ప్రాణి కూడ పర్యుత్సుకత్వమును పొందుట సహజము. మనస్సులో సుస్థిరములైన జననాంతరసౌహృదములను అతడు అనుకోనకుండ స్మరించుటయే దానికి కారణము

పై శ్లోకములోని ముఖ్యాంశములను వింగడింపనగును—

1. సౌందర్యసందర్శనము ఒక అపూర్వానుభూతిని గల్పించును.
2. అట్లే మాధుర్యశ్రవణమును అట్టి అనుభూతిని గల్పించును.
3. ఆ అనుభూతి పర్యుత్సుకత.
4. సంతోషముతోనున్న ప్రాణికి కూడ ఆ పర్యుత్సుకత కలుగును.
5. భావస్థిరములైన జననాంతరసౌహృదములను ఆప్రాణి అతుణమున స్మరించుటయే దానికి హేతువు.

పై భావము నేటి మన తత్త్వశాస్త్రజ్ఞులు ప్రవచించుచున్నసుప్తచైతన్యము (**sub-conscious**) తో సంవదించుచున్నది అంతేకాక జననాంతరసౌహృదములు అనుటలో ఆ అనుభూతిలో పైకుబుకునవి పూర్వజన్మవాసనలు. 'పునర్జన్మ'—ప్రాచీన భారతీయసంస్కృతికి అపరిహార్యమైన విశ్వాసమగుట ఎన్నదగినది. కాళిదాసు ప్రవచించిన అనుభూతి ఆలంకారికుల రససిద్ధాంతముతో హృదయంగమముగ సంగమించుచున్నది.

షెల్లీకవి "**our sweetest songs are those which tell us of saddest thoughts**" —మన విషాదతరంగితములైన భావములు మధురాతిమధురములైన గేయములుగా పరిణవిల్లునని ప్రవచించెను. 'పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః' అన్న కాళిదాసు వాక్యము షెల్లీకవి భావముతో సంవదించునదే. ఆనందము సుఖదుఃఖాతీతమైనదని భారతీయుల మతము. ఈ రసానందమెట్లు

---

[1] అభిజ్ఞానశాకుంతలము—అం-5; శ్లో-2.

కలుగును?

లలితకళానుభూతి వేళ, సహృదయుని మనస్సులో లోలోపల నణగియున్న భావము ధరించు విశ్వరూపప్రదర్శనమే రసము. అనగా అన్నిరసములు అందరిలో నుండకపోవచ్చు. ఆ భావము, వాసనారూపమున నిద్రాణముగా సహృదయునిలో నుండును. అది పూర్వజన్మసంస్కారము కావచ్చును. కొందరకు వీరరసాభి నివేశము మెండు. మాటవరుసకు ఒక చమత్కారగాథ ఉదాహరింపనగును. ఆనాడు బొబ్బిలియుద్ధనాటక ప్రదర్శనము ఒక ప్రేక్షకుడు[1] మహోత్సాహముతో రెపరెపలాడుచున్నాడు. ప్రక్కవాడెంత వారించినను, ఆ సహృదయుడు కూర్చుండక "పూనకము" నెక్కించుకొనుచున్నాడు. "ఏమయ్యా! నీకా వీరుల పూనకమెత్తినట్లున్నదే! నీకెందుకు మధ్య ఈ వీరాంగమని" నివారింపబూనినాడు ప్రక్కవాడు. ఆ సహృదయుడు "నేను పూర్వజన్మమున బొబ్బిలి వీరులలో ఒకడను. నేను కత్తిధరించి, గుఱ్ఱమునెక్కి ధీరోద్ధతుడనై యుద్ధము చేసినాడ"నని పల్కినాడు "ఓహో—అయితే పూర్వజన్మములో నేనెవరినని నీఊహ. నాకే ఆవేశమును కలుగుటలేదే"అన్నాడట ప్రక్కవాడు. సహృదయుని సమ్యక్సమాధానము చూడుడు— "నీవు నాగుఱ్ఱపు కళ్లెములు పట్టి మాలీసుచేసిన మనుష్యుడవు కాబోలు". పరిహాసవిజల్పితమైన ఈ సమాధానములో పరమార్థము లేకపోలేదు జన్మజన్మాంతరములలో వాసనారూపముగనైన వీరరసాభినివేశము లేనిచో ఈనాడు సహృదయునకు వీరరస ప్రతీతి గలుగదని ప్రాచీనాలంకారికుల మతము రససిద్ధాంతమునకు సహృదయుడే పునాది. యథార్థమునకు కావ్య మీమాంసకును పునాది సహృదయుడే!

> యేషాం కావ్యానుశీలనాభ్యాసవశాత్
> విశదీభూతే మనోముకురే
> వర్ణనీయతన్మయీభవనయోగ్యతా
> తే స్వహృదయసంవాదభాజః సహృదయాః[2]

వివిధకావ్యములను పరిశీలించుటచే, తనమనస్సును తళతళలాడుచున్న అద్దమువలెచేసికొని, కావ్యమునందలి వస్తువుతో తాదాత్మ్యమును బొందగలిగి కవిహృదయముతో శ్రుతిగల్పుకొనగల్గువాడే సహృదయుడు. సహృదయుని హృదయము స్వచ్ఛమై తళతళలాడుచున్న అద్దమైనచో అందు కవిహృదయము

---

[1] అలంకారికులు నేటి ప్రేక్షకశబ్దమునకు బదులు సామాజికశబ్దమును వాడియున్నారు. ఆనాటివారు, చూచుటకుమాత్రమేకాక వినుటకు వినోదముతోపాటు విజ్ఞాన సముపార్జనకు నాటకప్రదర్శనమునకుబోయెడివారు నేటివారు తామువినరు, ప్రక్కవారినిగూడ విననీయరు, గావున ప్రేక్షకశబ్దమే సముచితమని చమత్కరింపవచ్చును.

[2] అభినవగుప్తుడు.

ప్రస్ఫుటముగ ప్రతిఫలించును.

రంధ్రాన్వేషణపరాయణులు (తప్పులనే వెదకువారు.) కావ్యవిమర్శకు పూనుకొనుట శోచనీయమని ఆలంకారికుల మతము. **Never judge a work of art by its defects**— తప్పులను మాత్రమే ఎంచుచు కళానుశీలనము సలుప వద్దని ఆంగ్లమున నొక హెచ్చరిక కలదు. **You find poetry nowhere unless you have poetry in you**—కవితకై ప్రపంచమునంతయు అన్వేషింపనేల? నీలో కవిత లేనిచో జగత్తులోనే లేదు—అన్న ఆంగ్లవాక్యము మిక్కిలి అర్థవంతము.

## రసము యన్నిష్ఠము?

రసమునుగూర్చి, భారతీయాలంకారికులు బహుళచర్చలు నెరపినారు. వివిధమతములు విలసిల్లినవి. భట్టలోల్లటుడు రసము నాయికానాయకని ష్ఠమని ప్రతిపాదించెను. శ్రీ శంకుమతమున రసము అనుకర్తృనిష్ఠము. ఉదాహరణకు భట్టలోల్లటుని మతమున రసము అభిజ్ఞానశాకుంతలమున శకుంతలాదుష్యంత నిష్ఠము. కాని భట్టనాయకుడు రసము సామాజికనిష్ఠ మని నిరూపించెను.

రసము నాయికానాయకనిష్ఠమైనచో — సహృదయుల నెట్లు కావ్యము రంజింపజేయగలదో సుస్పష్టముకాదు.

రసము నటనిష్ఠమైనచో నృసింహపాత్రధారి హిరణ్యకశిపుని రంగస్థలమున వాస్తవముగ చంపనగును.

రసము సామాజికనిష్ఠమగుట చేతనే కావ్యము చిరస్థాయిగ నిల్చి సహృద యుల నానందతన్మయత్వమున ముంచుచున్నది. ఈ మతమే ఆలంకారికులు అధిక సంఖ్యాకులు ఆమోదించినది.

## రససంఖ్య

అనంతా వై రసాః— రసములు అనంతములు. యథార్థమునకు ప్రతి భావమును రసమే. ప్రతిరసమును ప్రాథమికదశలో భావమే. బీజము అంకురమై ఆకుతొడిగి మారాకువేసి రెమ్మలతో, కొమ్మలతో మహావృక్షమగు పగిది బీజ ప్రాయమైన భావము రసముగా పరిణతి చెందును.

> న భావహీనోఽస్తి రసో న భావో రసవర్జితః
> పరస్పరకృతాసిద్ధి స్తయోరభినయే భవేత్॥

భావహీనమగు రసముగాని, రసవర్జితమైన భావముగాని లేదు. అయినను అన్నిభావ ములకు నిల్వదొక్కుకొని స్థాయిభావములయి రసముగ పరిణమించుశక్తి యుం

[1] డాక్టర్ పోణంగి శ్రీరామఅప్పారావుగారి నాట్యశాస్త్రము ఆరవఅధ్యాయము పుట–199లో ఉదాహృతము.

డదు. అందుచేతనే అనంతములగు రసములలో కొన్నింటికిమాత్రమే ప్రాముఖ్యము లభించినది. రసములెన్ని? ఆ రసములకు స్థాయిభావములేవి? రససిద్ధాంతప్రవక్తయైన భరతముని అష్టరసములను, వానికి స్థాయి భావములను పేర్కొనెను.

శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుతసంజ్ఞౌచేత్యష్టౌ నాట్యే రసాః స్మృతాః.
రతి ర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సావిస్మయశ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః[1].

నాట్యమున శృంగారహాస్యకరుణరౌద్రవీరభయానక బీభత్సాద్భుతము లను నెనిమిదిరసములు గలవు. వానికి రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము అనునవి స్థాయిభావములు భరతముని శాంతమును విడిచి పెట్టెను.

భట్టోద్భటుడు రసములను తొమ్మిదిగా పేర్కొనెను.

శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుతశాంతాశ్చ నవ నాట్యే రసాః స్మృతాః.
రతి ర్హాస శ్చ శోక శ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సావిస్మయశమాః స్థాయిభావాః ప్రకీర్తితాః[2].

ఈ శ్లోకములో భరతముని పేర్కొనిన అష్టరసములతోపాటు, శాంతము రసముగ, శమము స్థాయిభావముగా పేర్కొనబడినవి

రుద్రటుఁడు దశమో రసః ప్రేయాన్ (పదియవ రసము ప్రేయస్సు)అని ప్రతిపాదించెను. ప్రేయోరసమునకు స్థాయిభావము స్నేహము.

దశరూపక కర్తయగు ధనంజయుడు నాట్యమున శాంతరసమునకు పుష్టి లేదనెను. ధనికుడునాట్యమున శాంత రసము లేకపోయినను, శ్రవ్యకావ్యమున నుండవచ్చుననెను.

భరతుడు ఋజుమార్గమున శాంతరసము నంగీకరింపకున్నను వక్రమార్గమున నంగీకరించెననుట స్పష్టము అని శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు కావ్యాలంకార సంగ్రహవివరణమున వివరించుచు నిట్లు వ్రాసిరి. "భరతుడు శాంతరసము నంగీకరింపకున్నచో నాట్యము త్రైలోక్యానుకరణమని యెట్లుచెప్ప గలుగును ?

---

[1] డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావుగారి నాట్యశాస్త్రము ఆరవఅధ్యాయము 192- 93పుటలలో ఉదాహృతము.

[2] శ్రీ స. సూ. శాస్త్రిగారి కావ్యాలంకార సంగ్రహవివరణలో ఉదాహృతము.

నానాభావోపసంపన్నం నానావస్థాంతరాత్మకం
లోకవృత్తానుకరణం నాట్య మేతన్మయాకృతమ్
— — — — — — — —
న హ్యద్వీపానుకరణంనాట్యేఽహ్యస్మిన్ ప్రతిష్ఠితమ్.

అని కదా కలదు! ఇంతేకాక నాట్యాంగముగాని దేదియు లేదని యిట్లు తెలిపెను.

న తద్ జ్ఞానం న త చ్ఛిల్పం న సా విద్యా న సా కళా
న స యోగో న తత్ కర్మ నాట్యేఽస్మిన్ యన్న దృశ్యతే.[1]"

'నిర్వేదాదులుగూడ శృంగారాదులవలెఁ బరిపుష్టములైనయెడల రసత్వమును బొందు'నని భట్టలోల్లటుడు తొలుత ప్రతిపాదించెను.

రసనా ద్రసత్వ మేతేషాం మధురాదీనా మివోక్త మాచార్యైః
నిర్వేదాదిష్వపి త న్నికామ మస్తీతి తేఽపి రసాః

'రస్యమానత్వరూపధర్మమును బురస్కరించుకొని శృంగారాదులకు రసత్వమును నాచార్యులు దెలిపిరి ఆ రస్యమానత్వము నిర్వేదాదులందును గలదు. కావున నవియు రసములే' అని రుద్రటునివాదము. అభినవగుప్తుడీవాదము నంగీకరింపలేదు[2].

శాంతరసము భరతముని సమ్మతమను వాదమున్నట్లే, సాహిత్యదర్పణకారుడు—

అథ మునీంద్రసమ్మతో వత్సలో రసః

అని ప్రతిపాదించి వత్సలరసమును భరతమునికి అంగీకారమగునని నుడివెను. భరతుడు—

హాస్యశృంగారయో స్స్వరితోదాత్తైః వీరరౌద్రాద్భుతేషు ఉదాత్తకంపితైః
కరుణవాత్సల్యభయానకేషు అనుదాత్తస్వరితకంపితైః వర్ణైః పాఠ్యమువపాదయతి

అనుచో వాత్సల్యమును పేర్కొనె నను సాక్ష్యమును జూపెను. వత్సలరసమునకు స్థాయిభావము వాత్సల్యము.

ఉజ్జ్వలనీలమణికర్త రూపగోస్వామి, పరివ్రాజకాచార్యుడైన మధుసూదనసరస్వతి భక్తిని రసముగా పేర్కొనిరి.

"పృథగేవ భక్తిరసరాట్ సవిస్తరే ణోచ్యతే మధురః"

అని రూపగోస్వామి ప్రవచనము. ప్రత్యేకముగా భక్తిరసము మధురము; భక్తి రసరాజమని రూపగోస్వామి వాదము.

రసతరంగిణీకర్తయగు భానుదత్తుడు మాయారసమును పేర్కొనెను.

---

[1] కావ్యాలంకారసంగ్రహవివరణము 293-94 పుటలు.

[2] కావ్యాలంకారసంగ్రహవివరణము 304 పుట.

అసలుఇన్ని రసములు లేనేలేవనియు ఒకటే రసమున్నదనియు దానికి స్థాయి భావము ఆనందమనియు కవికర్ణపూరగోస్వామి ప్రతిపాదించెను. స్ఫటికము జపాకుసుమాది నానాపదార్థముల సంయోగము వలన నొకతఱి నెఱ్ఱగా, నొకతూరి పచ్చగాను, నొకతూరి నల్లగా గోచరింపవచ్చును. అట్లే ఒకటేయగు స్థాయి, ఉత్సాహాదులుగా కన్పింపవచ్చునని యతనివాదము.

ఆలంకారికుల వాదములన్నియు సమీక్షించిన పిమ్మట సారాంశముగ నెన్న దగినది:—రసము లనంతములైనను, అందు కొన్ని రసభావములు మాత్రమే స్థాయి భావములుగ నిలబడి రసప్రతీతి కల్పించును. అన్ని భావములకు రససిద్ధి లేదు. కాని, యేభావమైనను, కవి సామర్థ్యమువలన రససిద్ధి గాంచ వచ్చును. ఇది సహృదయ హృదయైకవేద్యము.

ఆలంకారికులు పలువురు—

క. ధర శృంగారము, హాస్యము,
కరుణము, వీరము, భయానకము, బీభత్సం,
బురు రౌద్ర, మద్భుతము, శాం
తరసంబును రసము లనఁగఁ దనరుం గృతులన్ [1]

అను వాదమునే అంగీకరించిరి.

కవి సమర్థుడైనచో ఏ భావమునకైనను రససిద్ధి కలుగవచ్చును. రామాయణమున లక్ష్మణుడు మూర్ఛితుడైనప్పుడు, రాముని భ్రాతృవాత్సల్యము తొణికిసలాడెడి శ్లోకము ఉదాహరింపదగినది. సీతారాముల శృంగారము విశ్వమోహనమైనదే, సీతకై సేతువుగట్టి లంకాపురి చేరినాడు వానరసైన్యముతో శ్రీరాముడు. రామరావణయుద్ధము జగత్ ప్రసిద్ధము. అది ఘోరసంగ్రామభూమి. తమ్ముని, లక్ష్మణుని-యుద్ధభూమిలో మూర్ఛితుని చూచిన శ్రీరాముడు విలపించుటను వాల్మీకి వర్ణించెను—

'దేశేదేశే కళత్రాణి దేశేదేశే చ బాంధవాః
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః [2]

దేశదేశములలో భార్యలు లభింపవచ్చును. ఏదేశములోనైన బాంధవులుండవచ్చును. ఒకే గర్భమునుండి ఉద్భవించిన తమ్ముడు ఎక్కడ లభించునని శ్రీరాముడు వాపోయెను. శ్లోకమున వాల్మీకి వాత్సల్యమును రసస్థాయికి తీసికొని పోగలెనను విద్వాంసు లున్నారు.

ఇట్లే మృగయాతుక్రీడాదులును రసములే యని వాదించువారున్నారు. అన్నిభావములకు రససిద్ధి లేదనుట పూర్వపక్షములేని సిద్ధాంతము. అయినను, కవి సామర్థ్యమునుబట్టి రసము కాజాలని భావమునులేదు. న భావో రసవర్జితః అను మాట సత్యము.

[1] కావ్యాలంకార సంగ్రహము-3-6

[2] రామాయణము—యుద్ధకాండ.

## రసస్వరూపము

విభావానుభావవ్యభిచారిసంయోగా ద్రసనిష్పత్తిః [1]

విభావానుభావవ్యభిచారిసంయోగమువలన రసనిష్పత్తియగునను భరతముని నిర్వచనము సుప్రసిద్ధము.

విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయిభావో రసః స్మృతః [2]

అని దశరూపకకారుని నిర్వచనము.

కావ్యాలంకారసంగ్రహమున భట్టుమూర్తి రసస్వరూపమును అభివర్ణించుచు తొలుత చెప్పినపద్యము—

క॥ పులకండంబులు గలిపిన
నలువగు సలిలము రసాయనంబగు పగిదిన్
లలిత విభావాదులచే
నలఘుతరస్థాయిభావ మమరున్ రసమై.[3]

పై పద్యమునకు శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి వివరణము—

'కండచక్కెఱ కలుపఁగా జలము పానకమగు విధమున విభావ, అనుభావ, సంచారి భావములచేఁ బరిపుష్టమై యధికముగా నాస్వాద్యమైన స్థాయి భావము రసము. జలము తన జలరూపముతో నున్నప్పుడెక్కువగా నాస్వాద్యముగా నుండదు. అట్లే సహృదయుల హృదయమున వాసనారూపమున నున్న స్థాయిభావము గూడ నాస్వాద్యముగానుండదు. కాని యాజలము కండచక్కెర, ఏలకులు, మిరియపుపొడి మొదలగువాని యొక్క కలయికచేఁ బానకరూపమును బొంది కడుంగడునాస్వాద్యమాన మగుచున్నది. అట్లే యా సహృదయుల స్థాయియు విభావ, అనుభావ, సంచారిభావములచేఁ బరిపుష్టమై మిక్కిలియు నాస్వాద్యమగుచున్నది.'[4]

లలితకళానుభూతిలో సహృదయుని హృదయమున అనేకభావములు భాసించును. సూర్యుడ స్తమించెను—అను వాక్యము అనేకులలో అనేకభావముల నుద్బోధించుట సహజము. అందు వాసకసజ్జిక ఆలంబనమైన, సహృదయునిలో శృంగారరసస్ఫోరకమైన 'రతి' యను స్థాయిభావము నిలుచును. నాయకుని రాకకై నిరీక్షణ సహజము. నాయికానాయకులు ఆలంబనవిభావములు; చంద్రోదయ చంద్రికాదులు ఉద్దీపనవిభావాదులు. నాయకుడు వచ్చునా? వచ్చి నాయికను

1. 2 సాహిత్య శిల్పసమీక్షలో ఉదాహృతములు

3 తృతీయాశ్వాసము–4

4 కావ్యాలంకారసంగ్రహవివరణము–పుట 279

లాలించునా? ఎన్నో భావపరంపరలు. ఇవి సంచారిభావములు. వీనికి వ్యభిచారి భావములనియు (వి + అభిచారి-విశేషముగా చరించుభావములని) పేరు.

తే॥గీ॥ గరిమ నదు లెన్ని గలిసినఁ గప్పికొనుచు
జలధిఁ గనుపట్టురీతి సంచారిభావ
సంచయము లెన్ని గలిసిన మించనీక
తాన కనుపట్టు భావంబు స్థాయి దలఁప [1]

సముద్రము నదులనన్నిటిని తనలో నిముడ్చుకొని సుస్థిరమగునట్లు స్థాయి భావము సంచారాది భావసంచయములచే పరిపుష్టమై సుస్థిరముగ నిలుచును.

## విభావము

రసోత్పత్తికి కారణమైనది విభావమనబడును.[2] విభావము ఆలంబనవిభావ మనియు, ఉద్దీపన విభావమనియు ద్వివిధము.

"ఆయారసములనుబట్టి ఆయా ఆలంబనవిభావములు వేర్వేరుగనుండును. సామాన్యముగ శృంగారమున తరుణులగు స్త్రీ పురుషులు, హాస్యమున వికృత వేషభాషాచేష్టలు గలవారు; కరుణమున బంధునాశాదులు; రౌద్రమున అపరాధము చేసినవారు; వీరమున ధిక్కరింపబడినవారు; భయానకమున త్రస్తులగు శత్రులు, తత్క్రాంతాదులు, బీభత్సమున శవాదులు, అద్భుతమున వేనిని చూచిన ఆశ్చర్యము కలుగునో ఆయా వస్తువులు, శాంతమున ప్రపంచమంతయు ఆలంబన మగును" [3]

ఉద్దీపన విభావములు, సూక్ష్మరూపమున నున్న అగ్నికణములను గాలి రాజజేసినట్లు స్థాయిభావములను ప్రజ్వరిల్ల జేయును.

ఉద్దీపన విభావములు నాలుగువిధములని 'శృంగారతిలకమున' చెప్పబడినది. (1) గుణములు (2) చేష్టలు (3) అలంకారములు (4) తటస్థములు. వీనిని ఉదాహరణకు శృంగారరసపరముగా ప్రదర్శింపనగును. నాయికానాయకుల రూపము, ప్రాయము మున్నగునవి గుణములు. హావభావాదులు చేష్టలు. హార నూపురాదులు అలంకారములు. చంద్ర, మలయమారుతాదులు తటస్థములు.

---

[1] కావ్యాలంకార సంగ్రహము-తృతీయాశ్వాసము-6

[2] రసశబ్దమును ఆలంకారికులు ప్రయోగించినవిధము అరయదగినది. రసము స్థాయి భావము యొక్క పరిణామదశ. దానికి వారి సమాధానము - ఓదనం పచతివత్- "అన్నమువండుము" అనుటకద్దు. "బియ్యము వండుము" అనము. అట్లే పరిణామ దశకే అన్వర్థమైన రసశబ్దము ఆరంభదశకు చెందు భావమునకు పర్యాయపదముగా ప్రయుక్తము.

[3] ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము

ఉద్దీపనవిభావము ఆంగ్లవిమర్శకులు ప్రతిపాదించు సముచితవాతావరణ కల్పనము (**atmosphere setting**)తో సంవదించును.

కావ్యాలంకార సంగ్రహమున ఉద్దీపన (తటస్థ) విభావమునకు ఉదాహరణముగ నిచ్చిన పద్యము—

చ॥ చిగురుకటారితోఁ జిలుకసింగిణితో నలరంపగుంపుతో
నిగనిగమించు చెంగలువనేజముతో వడిఁ జిల్కతేజిపై
మగఁటిమి నెక్కి శూరుఁడయి మారుఁడు కోకిలకంఠకాహళుల్
నెగడ లతాంగిపై వెడలె నేడు నృసింహ. యెఱుంగఁజెప్పితిన్[1]

విభావమునకు (ఆలంబనవిభావమునకు ఉద్దీపనవిభావమునకును కలిపి) నన్నయ భారతమందలి నలోపాఖ్యానములోని పద్యము ఉదాహరింపనగును—

చ నలదమయంతు లిద్దఱు మనఃప్రభవానల దహ్యమానులై
సలిపిరి దీర్ఘవాసరనిశల్ విలసన్నవనందనమ్ములన్
నళినదళంబులన్ మృదుమృణాళములన్ ఘనసారపాంసులం
దలిరులశయ్యలన్ సలిలధారలఁ జందనచారుచర్చలన్[2]

### అనుభావములు

క్రేగంటిచూపులు మొదలైనవి శృంగారరసమునకు అనుభావములు.

### సాత్త్వికభావములు

క॥ పరగత సుఖదుఃఖాదుల
నరయఁగ భావించి యట్ల యలరుట సత్త్వ
స్ఫురణము; తద్భవభావము
లరయఁగ సాత్త్వికము లయ్యె నవి యెట్లన్నన్[3]

పరుల కష్టసుఖములను పలుమారు భావించుటవలన సహృదయునిలో ఏర్పడు చిత్తసంస్కారము సాత్త్వికభావము. ఈ భావములు శృంగారరసమున ఎనిమిది— 1. స్తంభము 2. ప్రళయము 3. రోమాంచము 4. స్వేదము 5. వైవర్ణ్యము 6. కంపము 7. వైస్వర్యము 8. అశ్రువు.

### సంచారిభావములు

సంచారిభావములకే వ్యభిచారి భావములని పేరు స్థాయిభావ సముద్రముపై

---

[1] తృతీయాశ్వాసము-33
[2] అరణ్యపర్వము 2-24
[3] కావ్యాలంకార సంగ్రహము-తృతీయాశ్వాసము-36

నిరంతరము లేచిపడెడి కెరటాలు సంచారిభావములు. శృంగారరసమున సంచారి భావములు ముప్పదిమూడు—

(1) నిర్వేదము (2) గ్లాని (3) శంక (4) అసూయ (5) మదము (6) శ్రమము (7) ఆలస్యము (8) దైన్యము (9) చింత (10) మోహము (11) స్మృతి (12) ధృతి (13) వ్రీడ (14) చాపల్యము (15) హర్షము (16) ఆవేగము (17) జాడ్యము (18) గర్వము (19) విషాదము (20) ఔత్సుక్యము (21) నిద్ర (22) అపస్మారము (23) సుప్తి (24) విబోధము (25) అమర్షము (26) అవహిత్థము (27) ఉగ్రత (28) మతి (29) వ్యాధి (30) ఉన్మాదము (31) మరణము (32) త్రాసము (33) వితర్కము.

వ్యభిచారిభావము ఉదయాద్యుపాధి చతుష్టయము వలన నాలుగువిధము లగుచున్నది— (1) భావోదయము (2) భావశాంతి (3) భావసంధి (4) భావ శబలత.

## *శృంగార చేష్టలు*

(1) భావము (2) హావము (3) హేల (4) మాధుర్యము (5) ధైర్యము (6) లీల (7) విలాసము (8) విచ్ఛిత్తి (9) విభ్రమము (10) కిలికించితము (11) మోట్టాయితము (12) కుట్టమితము (13) బిబ్బోకము (14) లలితము (15) కుతూహలము (16) చకితము (17) విహృతము (18) హసితము.

వీనిలో భావ, హావ, హేలా, మాధుర్య, ధైర్యములు మానసిక చేష్టలు. తక్కిన లీలాదులు కాయిక చేష్టలు. మొత్తము మీద అన్నియు అనుభావములే[1].

1. భావమనగా రసజ్ఞాన యోగ్యత. (ఇది బాల్యయౌవనసంధిలో ఏర్పడును)

2. అంగవికారము ఒకింత గన్పట్టుభావమే హావము.

3. హావము సుస్పష్టముగ వ్యక్తమగుట హేల.

4. తొడవులు లేకున్నను అందముగనే యుండుట మాధుర్యము.

5. సంప్రదాయము, సౌశీల్యము మున్నగువాని నుల్లంఘింపకుండుట ధైర్యము.

6. నుడులను, నడలను ప్రియుననుకరించుట లీల.

7 నాయకునిసమ్ముఖమున నాయికకు కలుగు అంగవికారము విలాసము.

8. అలతి తొడవులతో నున్నను అందముఁ గన్పట్టుట విచ్ఛిత్తి.

9. నాయకాగమనవేళ సంతోషమువలన తారుమారుగా అలంకరించు

---

[1] ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము-రసప్రకరణము.

కొనుట విభ్రమము.

10. రోషము, దుఃఖము, భీతి, సిగ్గు మున్నగునవి కలసియుండుట కిలికించితము.

11. నాయకుని గుణగణనవేళ నాయిక అభిలాష తెల్లమగుట మోట్టాయితము.

12 కేశాదిగ్రహణము వలన కలుగు బాధను సరకుగొనకుండ సుఖ మనుభవించుట కుట్టమితము.

13. ప్రణయకోపవశమున ప్రియుని గుణగణముల యెడ సైతము అనాదరము సూపుట బిబ్బోకము.

14. సుకుమారమైన అంగవిన్యాసము లలితము.

15. సుందర వస్తుసందర్శనాభిలాషము కుతూహలము.

16. వెరపుచేఁ గలత నొందుట చకితము.

17. లజ్జావశమున అదనులో మాటాడలేక పోవుట విహృతము.

18. యౌవనోద్రేకమున నిష్కారణముగ నేర్పడు నవ్వు హసితము.

రసప్రకరణము నందలి లక్షణములన్నింటిని, - ఆలంకారికులు తమతమ గ్రంథములలో సోదాహరణముగ వివరించియున్నారు అంతేగాక సాహితీ ప్రియంభావుకులు — కావ్యానుశీలనమున సులభముగా లక్షణములకు లక్ష్యములను నిరూపించు కొననగును. ఉదాహరణమునకు — అభిజ్ఞానశాకుంతలమున దుష్యంతుడు శకుంతలను గాంచి 'ఆశ్రమవాసమున నీమె నారచీరలు కట్టుకొన్నప్పటికి సహజసౌందర్యముతో అలరారుచున్నదే' అనును.

సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యమ్

పద్మము నాచుతో చుట్టుకొనబడియున్నప్పటికిని అందమైనదే. నారచీరను గట్టినను శకుంతల అందక త్తెయే—అనునప్పుడు సహృదయులకు శృంగారచేష్టా భేదమైన మాధుర్యము స్ఫురించును. నిజమునకు, కాళిదాసాదుల లక్ష్యములను చూచిన పిమ్మటనే ఆలంకారికులు లక్షణముల నేర్పరచిరను సంగతి విస్మరింప రానిది.

ఆ.వె ప్రొద్దుగ్రుంకె నంచుఁ బొలతుక చెలినోట
వినెడునంతమాత్ర వేగిరించి
కేలఁదొడుగు గోల కాలియందియలను
గంకణములు పెట్టెఁ గాళ్లకొలసి.

ప్రియుని రాకకై నిరీక్షించు వాసకసజ్జిక ఆ సంబరమున కాళ్లకు ధరింప వలసిన అందెలను చేతులకును, చేతులకు వేయవలసిన కంకణములను కాళ్లకును తొడిగినదట. కావున ఇది 'విభ్రమము'. దీనికి హృదయంగమమైన మరొక ఉదాహరణము రాధాకృష్ణుల శృంగారమును చిత్రించు సంస్కృతచాటువు-

రాధా పునాతు జగదచ్యుతదత్తచిత్తా
మంథాన మాకలయతీ దధి రిక్తపాత్రే
తస్యాః స్తనస్తబక చంచలలోలదృష్టిః
దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్.

ఉ॥ తా ధరియించు కంకణవితానరుణంరుణతోఁ జలించుచున్
రాధిక కవ్వముంగొలిపి త్రచ్చెడి ఆ దధిరిక్తభాండమున్
సాధనమీర పాల్ పితుకసాగె వడిన్ వృషభమ్మునిల్పి యా
మాధవదేవుఁ డా విరహమాధురిఁ బ్రోచుత ప్రేమజీవులన్ [1]

## మన్మథావస్థలు

శృంగారరసము విప్రలంభమనియు, సంయోగమనియు రెండు విధముల ఆలంకారికులు అభివర్ణించియున్నారు. విప్రలంభశృంగారము నాయికానాయకుల తాత్కాలిక వియోగసూచకము. బీజము తొలుత మొలకెత్తి, పిమ్మట చిగిర్చి, తరువాత పూచి, కడపట ఫలించినట్లు శృంగారస్థాయిభావముకూడ క్రమపరిణామ వికాసముల నొందును. ఆ పరిణామదశలకు మన్మథావస్థలని పేరు. అవి——

1. చక్షుఃప్రీతి, 2. మనస్సంగము, 3. సంకల్పము, 4. ప్రలాపము, 5. జాగరము, 6. కృశత, 7. అరతి, 8. లజ్జాత్యాగము, 9. సంజ్వరము, 10. ఉన్మాదము, 11. మూర్ఛ, 12. మరణము.

ప్రాచీనభారతీయాలంకారికులు విశ్వజనీనమైన శృంగారమును ఒక మధురమనోజ్ఞ మంజులకళగా తీర్చిదిద్దినారు. విశ్వసాహితీజగత్తులో ఏవాఙ్మయమునందునను శృంగారరసమును గూర్చిన అనుశీలన ఇంత వైదగ్ధ్యముతో జరుగలేదని చెప్పనగును.

## రసాభాసము

ప్రాచీనాలంకారికులు రసమునేగాక రసాభాసమును గూర్చి గూడ ముచ్చటించియున్నారు. ఏకత్రానురాగము, తిర్యగ్జంతుగతమైన శృంగారము రసాభాసమేగాని రసము గాదని ప్రాచీనభారతీయాలంకారికుల మతము. మనుచరిత్ర యందలి వరూధినీప్రణయము ఏకత్రానురాగము గావున ఆలంకారికుల మతమున నిస్సందేహముగ రసాభాసము.

కాళిదాసు కుమారసంభవములో మహావృక్షములను ఆలింగనముచేసికొనిన సుకుమారలతాలలనలను వర్ణించెను. తుమ్మెదదంపతులు కుసుమైకపాత్రలో మధుపానమును సల్పినవి. అభిజ్ఞాన శాకుంతలనాటకమున సహకారవృక్షము ప్రక్క

[1] తెలుగు అనువాదము - స్వకీయము.

కణ్వాశ్రమమున మాలతీ లతను నాటినారు. శకుంతల గాంధర్వవిధిని దుష్యంతుని వివాహమాడినది. మాలతీలత పుష్పవతియైన పిమ్మట సహకారమును పెనవేసి కొని కౌగిలించుకొనినది. ప్రపంచమందెల్లెడ మహాకవులు సైతము తిర్యగ్జంతు గతమైన శృంగారమును అభివర్ణించి యున్నారు. కాళిదాసమహాకవి వర్ణనలు చూడనగును—

మధుద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వా మనువర్తమానః
శృంగేణ సంస్పర్శ నిమీలితాక్షీం
మృగీ మకండూయత కృష్ణసారః
దదౌ రసాత్ పంకజరేణుగన్ధి
గజాయ గండూషజలం కరేణుః
అర్ధోపభుక్తేన బిసేన జాయాం
సంభావయామాస రథాంగనామా [1]

మగతుమ్మెద పుష్పమను ఏకపాత్రలో ప్రేయసితో పాటు మధుపానము సల్పెను. మగలేడి ఆడులేడిని తనకొమ్ములతో గోకెను. ఆడులేడి ఆ స్పర్శ సుఖమునకు పరవశయై నిమీలితలోచన యయ్యెను. ఆడేనుగు తామరపూల పుప్పొడిపరిమళముతో గుబాళించు నీటిని తనతొండముతో మగఏనుగు నోటి లోని కందించెను. మగచక్రవాకము సగము కొరికి తినిన తామరతూడును ప్రేయసికొసగెను అని పైశ్లోకముల భావము.

కావ్యము నవరససంభరితమై యుండవలెనని, అంగిరసముగా నొక రసమున్నప్పుడు తక్కినవి అంగరసములుగా నుండదగునని ఆలంకారికుల మతము.

అప్పుడప్పుడు తుల్యప్రాధాన్యము గలిగిన రసములు సంగమించుటచే రస సాంకర్య మేర్పడుటయు కద్దు. శృంగారవీరములు గంగాయమునలవలె సంగ మించిన నాటకములు పెక్కులున్నవి

## శాసనసిద్ధాంతము : రససిద్ధాంతము

రసానుభూతి ఆత్మాశ్రయమైన సత్యమా? లేక సర్వసాధారణమై ప్రమాణ బద్ధముగ నిరూపింప దగినదా ? ఆలంకారికుల రసమీమాంస యంతయు సహృ దయ హృదయైక వేద్యమై ఆత్మాశ్రయమైన రసానుభూతిని ప్రమాణబద్ధముగ కొంతవరకు నిరూపింపవచ్చునని రుజువు చేయుటకే. ఆ అనుభవము ప్రత్యక్షమే గనుక ఆత్మాశ్రయమైనను సత్యమేయని ఆలంకారికులు నిరూపించినారు.

ఈ అనుభూతినిగూర్చి పాశ్చాత్యసాహితీజగత్తులో చర్చించిన ఆలంకారికు లలో ప్రాతఃస్మరణీయుడు అరిస్టాటిల్. అరిస్టాటిల్ 'ట్రాజెడీ' అను విషాదాంత కావ్యమును గూర్చిన చర్చలో ఈఅనుభూతినిట్లు వివరించెను—

---

[1] కుమారసంభవము - అకాలవసంతోదయవర్ణనము.

* Tragedy not only rouses these emotions (pity and fear) but also by the way it rouses them effects a Catharsis of emotions.

విషాదాంత రూపకము సామాజికునిలో శోకభయము లనెడి భావములను ఉద్రేకింపజేయుచు ఆ వ్యాపారమున వానికి క్షాళనము గల్గించును.

ప్రామాణికవిమర్శకుడైన క్రోంబీ ఈ అనుభూతిని వివరించెను.

* Aristotle regarded the function of tragedy as something medical; the pity and fear of tragedy were the doses with which the tragic poet homeopathically purges his audience into emotional health. Tragedy certainly does produce an enjoyable and wholesome effect by rousing in us emotions which in real life would be unpleasantly and perhaps dangerously disturbing Thus the emotions roused by the spectacle of the evil in life are by tragedy deprived of evil effect and even made beneficial· So something like purification (though not exactly in the religious sense) also may be alleged.

"అశుభాంత నాటకప్రయోజనమును అరిస్టాటిల్ కొంతవరకు వైద్యవిధానమునకు సదృశముగాభావించెను. అశుభాంతనాటకకర్త శోకభయములనెడి మందు మోతాదులను హోమియోపతివైద్యుడు రోగికివలె సామాజికున కొసగి, అతనిలోని ఆ శోకభయములను క్షాళితమొనర్చి, వైద్యుడు శరీరారోగ్యమును వలె, భావారోగ్యమును చేకూర్చుచున్నాడు. యథార్థజీవితమున విచారహేతువులును, ఆందోళనకరములును అయిన తీవ్రభావములను మనయందు ఉద్రేకింపజేయుచు, అశుభాంతనాటకము సంతోషదాయకము, శుభప్రదమును అగు ఫలమును కలిగించుచున్నది ఈ క్షాళనమునకు, మతసంబంధమైన పాపక్షయప్రాయశ్చిత్తముతో కొంత పోలిక కలదనియు చెప్పవచ్చును."

పై సమీక్షవలన అరిస్టాటిల్ కెథార్సిస్ (Catharsis - క్షాళనసిద్ధాంతము) భారతీయుల రససిద్ధాంతముతో సంవదించునని తేలుచున్నది.

సత్యహరిశ్చంద్ర నాటకములోని కాటికాపరి రంగమును దీనికి ఉదాహరణముగా గైకొనవచ్చును. చతురంభోధిపరీతమైన భూవలయ సామ్రాజ్యమేలిన సార్వభౌముడు విధివిపర్యయమున, కాటికాపరియైనాడు. శ్మశానమున శవము చితిలో కాలుచున్నది.

శా॥ మాయామేయజగంబె నిత్య మని సంభావించి మోహంబునన్
నా యిల్లాలని నాదు పుత్రుఁడని ప్రాణంబుండునందాక యెం
తో యల్లాడిన యా శరీర మిపు డిందున్ గట్టెలన్ గాలుచో
నా యిల్లాలును రాదు నా సుతులు తోడై రారు తప్పింపఁగన్[1]

[1] శ్రీబలిజేపల్లి లక్ష్మీకాంతంగారి సత్యహరిశ్చంద్ర నాటకము (శ్మశానరంగము).

సామాజికులలో ఈ పద్యము అరిస్టాటిల్ పేర్కొనిన కెథార్సిస్‌చే భావ క్షాళన మొనరించి, భారతీయాలంకారికులు పేర్కొనిన భావితాంతఃకరణ ప్రవృత్తిని కల్పించును. పాశ్చాత్యులలో విషాదాంత కావ్యములు కొల్లలు. భారతీయాలంకారికులు — కావ్యము మంగళారంభముగ, మంగళ మధ్యముగ, మంగళాంతముగ నుండెవలెనని అనుశాసించినారు.

కావ్యాంతమున పఠితగాని, నాటకాంతమున సామాజికుడుగాని నిర్వేదముతో క్రుంగిపోరాదని, అలౌకికానందమును పొంది దివ్యత్వమును కొంత కొంత తనలో ఆవిష్కరించుకోవలెనని భారతీయాలంకారికుల ఆశయము.

సమస్తభావములు వాస్తవజగత్తును ఆశ్రయించినవే, అయినను వాస్తవజగత్తు వేరు; రసాత్మకమైన కళాజగత్తు వేరు. వాస్తవలోకమందు పుత్రశోకార్త నడివీధిలో మృతకళేబరముపై బడి యేడ్చుచున్న వేళమును తిలకించిన సహృదయుని గుండెపగులును. అట్టిదృశ్యమునందే హరిశ్చంద్రనాటకమున చంద్రమతి పుత్రశోకార్తయై, సర్పదష్టుడై మరణించిన లోహితాస్యునిపై బడి విలపించునపుడు, సామాజికుని గుండె కరగును అది లౌకికదుఃఖము. ఇది కరుణరసము.

కావ్యము నవరససంభరితమై యుండనగును. అయినను "లోకో భిన్నరుచిః". కావున ఆయారసములందు ఆయాసహృదయులకు విశేషమైన అభిముఖ్య మేర్పడుట సహజము.

## శృంగారరసప్రాముఖ్యము

"శృంగార ఏవ ఏకో రసః" శృంగార మొక్కటే రసమని భోజుడు సిద్ధాంతీకరించెను. విశ్వసృష్టికి ఆధారభూతమును, విశ్వజనీనమును, సకలప్రాణికోటికి సమానధర్మమును నయిన శృంగారము పలువుర నాకర్షించుట వింతగాదు. ధ్వన్యాలోకకారుడు-శృంగారమునందును విప్రలంభశృంగారమే మేల్తరమని నిర్దేశించెను.

శృంగారరసికులు నాయికానాయకసంయోగమును జీవాత్మపరమాత్మ సంయోగముతో పోల్చి, భక్తినిగూడ శృంగారప్రభేదముగనే పరిగణించుచున్నారు. కేవల కామోద్రేకమే శృంగారముకాదు. కామాతీతమైన అనుబంధము పవిత్రదాంపత్యజీవితములో అనిర్వచనీయమైన దివ్యానుసంధానము.

సంయోగశృంగారమునకు దశరూపకములో నిచ్చిన ఉదాహరణము ఉత్తరరామ చరిత్రములోని సుప్రసిద్ధశ్లోకము ఇప్పట్టున అనుసంధేయము.

> వినిశ్చేతుం శక్యో న సుఖమితి వా దుఃఖమితి వా,
> ప్రమోహో నిద్రా వా కిము విషవిసర్పః, కిము మదః ?
> తవ స్పర్శే స్పర్శే మమ హి పరిమూఢేంద్రియగణో
> వికార శ్చైతన్యం భ్రమయతి సముస్మీలయతి చ ।

[1] భవభూతి : ఉత్తరరామచరిత్ర. అం. 1 శ్లో. 35 సాహిత్యశిల్ప సమీక్షలో ఉదాహృతము.

'నీశరీరస్పర్శ కలిగినపుడెల్ల నా యింద్రియములు పరిమూఢము లగుచున్నవి. నా చైతన్యమును భ్రమింపజేయుచు మూర్ఛలో ముంచుచున్న యీ వికారము సుఖమో, దుఃఖమో, మోహమో, నిద్రయో, విషప్రసారమో, మదమో నేను చెప్పలేకున్నాను.'

శృంగార రసమునకు రతి స్థాయిభావము. నాయికానాయకులు ఆలంబన విభావములు.

## అద్భుతరసము

అద్భుతరసముకు స్థాయిభావము విస్మయము. అసాధారణ వస్తుసందర్శనము వలన కలుగు చిత్తవిస్తారము విస్మయము. లోకోత్తర వస్తువులు లేదా లోక విలక్షణమైన వస్తువులు ఆలంబనములు. ఆ వస్తుగుణములు ఉద్దీపనవిభావములు.

1. స్తంభము 2. ప్రళయము 3 రోమాంచము 4. స్వేదము 5. వైవర్ణ్యము మున్నగునవి అనుభావములు. వితర్కము, ఆవేగము, ఉన్మాదము, హర్షము, ఔత్సుక్యము మున్నగునవి సంచారిభావములు.

పోతనభాగవతములో వామనమూర్తి విశ్వరూపప్రదర్శనము అద్భుతరసమునకు ఉదాహరణప్రాయము.

శా॥ ఇంతింతై, వటుఁడింతయై, మఱియుఁ దానింతై, నభోవీథిపై
నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రుని కంతయై, ధ్రువునిపై నంతై, మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంపర్థియై !

వామనుడు వామనుడు గాడు. ఎంతగా ఆతడు ఎట్లు ఎదిగెనో ! నభోవీథిపై మేఘమండలముపై చంద్రునిపై ధ్రువునిపై ... ఆతడు సత్యపదోన్నతుడై నాడట ! అంతేగాదు ఆతని పెరుగుదలను ఊహించుకొనుటకు రవిబింబము మొదట గొడుగుగా భాసించినది. క్రమక్రమముగ శిరోరత్నము, కుండలము, గ్రైవేయము, కేయూరము—చిట్టచివరకు పదపీఠమైనది ! చూడుడు—

మ॥ రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై,
శ్రవణాలంకృతియై, గళాభరణమై, సౌవర్ణ కేయూరమై,
ఛవిమత్కంకణమై, కటిస్థలి నుదంచద్ఘంటయై, నూపుర
ప్రవరంబై, పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.[2]

## శాంతరసము

శాంతమునకు స్థాయిభావము శమము శమమన విషయోపభోగ విము

[1,2] పోతన - శ్రీమదాంధ్రమహాభాగవతము - అష్టమస్కంధము - కావ్యాలంకార సంగ్రహవివరణమున ఉదాహృతములు (443 పుట)

ఖత వలన ఏర్పడిన వైరాగ్యము. 'సర్వంఖల్విదం బ్రహ్మ','సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అను జ్ఞానమే శాంతరసపరమార్థము అదియే శమము. అశేషవస్తునిస్సారత ఆలంబన విభావము పుణ్యాశ్రమ వనవర్ణనములు ఉద్దీపన విభావములు.

సర్వేంద్రియవ్యాపారములు శమించిన పిమ్మట ఏర్పడునది శనము గావున అదియే శుద్ధమైన ఆనందప్రకృతి యనియు, అందుచే అన్నిరసములును శాంతముననే పర్యవసించుచున్న వనియు, కావున శాంతమే ఏకైకరసమనియు వాదించు వారును గలరు.

## భయానక రసము

భయానకరసమునకు భయము స్థాయిభావము, భయోత్పాతము గల్గించునవి ఆలంబనములు ఘోరతర చేష్ట లుద్దీపనములు

వైవర్ణ్యము, స్వేదము, రోమాంచము, కంపనము మున్నగునవి అనుభావములు. జుగుప్స, ఆవేగము, సంత్రాసము, గ్లాని మున్నగునవి సంచారిభావములు.

## బీభత్సరసము

బీభత్సరసమునకు స్థాయిభావము జుగుప్స. అనిష్టవస్తుసందర్శనము వలన కలుగు ఏవగింపు, దుర్గంధము, మాంసము, క్రొవ్వు మున్నగునవి ఆలంబనములు. నిష్ఠీవనము, ముఖసంకోచాదులు అనుభావములు. మోహము, అపస్మారము, వ్యాధి, మరణము మున్నగునవి సంచారిభావములు. భీముడు కీచకుని చంపి శవమును, అవయవములును గానరాకుండ మాంసపుముద్దగ చేయుట ఉదాహరణము.

## రౌద్రరసము

రౌద్రమునకు క్రోధము స్థాయిభావము. శత్రుకృతధిక్కారమువలన కలుగు మనఃప్రజ్వలనము క్రోధము. ఆలంబన విభావము శత్రువు. శత్రుకృతాపకారములు ఉద్దీపన విభావములు. భ్రూభంగము, ఆవేగము, ఉగ్రత్వము, స్వేదము మున్నగునవి అనుభావములు. కీచకుడు ద్రౌపదిని పరాభవించు సందర్భమున భీముని వర్ణించుచు తిక్కనవ్రాసిన పద్యము ఉదాహరణముగ స్వీకరింపనగును.

చ॥ కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల నంగము
ల్గనలఁగ సాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ నితాంతదంతపీ
డనరట దాస్యరంగ వికట భ్రుకుటీ చటుల ప్రవృత్త న
ర్తనఘటనా ప్రకార భయదస్ఫురణా పరిణద్ధమూర్తియై [1]

## వీరరసము

వీరమునకు స్థాయిభావము ఉత్సాహము. ఉత్సాహమనగా లోకోత్తర

---

[1] తిక్కన : భారతము-విరాటపర్వము-ద్వితీయాశ్వాసము-133

కార్యనిర్వహణకు స్థిరసంకల్పముతో చేయు నిర్విరామప్రయత్నము. ప్రతినాయకు డాలంబనవిభావము. వాని యుత్కర్ష ఉద్దీపనవిభావము. చాతుర్యము, ఆమంత్రణము (మిత్రాదులతో నాలోచించుట) మొదలగునవి అనుభావములు. క్రోధము, అభిమానము మున్నగునవి వ్యభిచారి భావములు.

మ॥ కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండన్ మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు సేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నవి నాస్వాదింతు నుగ్రాకృతిన్[1]

అనుచో వీరరసము భాసించుచున్నది. ఇందు ప్రతినాయకుడు దుశ్శాసనుడు. లోకోత్తర కార్యనిర్వహణదీక్షతో కూడిన ఉత్సాహము స్థాయిభావమైనది.

వీరమును ఆలంకారికులు, దానవీరమని, ధర్మవీరమని, యుద్ధవీరమని, దయావీరమని నాలుగు తెరగులుగ విభజించిరి. నాగానందమున ఆత్మార్పణము గావించుకొనిన జీమూతవాహనునిలో దానవీరమును, బుద్ధభగవానునిలో దయావీరమును భాసించుచున్నవి.

స్నేహం దయాం తథా సౌఖ్యం యది వా జానకీమపి,
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా[2] ॥

స్నేహమునుగాని, దయనుగాని, సుఖమునుగాని, అవశ్యకమైనచో జానకిని సైతము లోకారాధనకై విడుచుటకు వెనుదీయనన్న ఆ శ్రీరామునిలో ధర్మవీరము భాసించినది. ప్రాణములను లెక్కసేయక యుద్ధ మొనరించినయుద్ధ వీరము. అట్టియుద్ధవీరమునకు భారతమున యుద్ధపంచక మంతయు ఉదాహరణమే.

## కరుణరసము

కరుణరసమునకు స్థాయిభావము శోకము. ఆప్తజనవియోగము వలన నేర్పడు దుఃఖాతిశయము శోకము. భవభూతి—

ఏకో రసః కరుణ ఏవ నిమిత్తభేదా
ద్భిన్నః పృథ క్పృథగి వాశ్రయతే వివర్తాన్
ఆవర్త బుద్బుదతరంగమయా న్వికారా
నంభో యథా సలిల మేవ హి తత్సమస్తమ్[3]

---

[1] నన్నయభారతము, సభాపర్వము : 2-233

[2] భవభూతి ఉత్తరరామచరిత్ర : అం. 1: శ్లో 5.

[3] భవభూతి : ఉత్తరరామ చరిత్ర: అం. 3; శ్లో. 42.

కరుణరస మొక్కటియే రసము. జలము సుడులుగా బుడగలుగా కెరటాలుగా వివిధరూపములతో భాసించునట్లు నిమిత్తభేదమునలన ఆ కరుణమే భిన్న భిన్నములుగా గోచరించును అని ఉత్తరరామచరిత్రలో ప్రతిపాదించెను.

విప్రలంభశృంగారము కరుణరస ప్రభేదమనియు దానికి పేరు కరుణ విప్రలంభమనియు కొందరాలంకారికుల మతము. అందు ఇష్టజనవియోగము చాలును. ఇష్టజననాశము శుద్ధకరుణము. శోచ్యులగు బంధుమిత్రాదు లాలంబనములు. తత్సంబంధ గృహవాహన, దర్శనాములు ఉద్దీపనములు. దైవనింద, భూపాతము, ఆక్రందనము, ప్రలాపము, నిర్వేదము మున్నగునవి వ్యభిచారి భావములు.

## హాస్యరసము

హాస్యరసమునకు స్థాయిభావము హాసము 'స్వభావవిరుద్ధములగు వేష భాషా చేష్టాదుల వలన మనమునఁ బొడము చిత్తవికారము హాస'మని ప్రతాపరుద్రీయ నిర్వచనము. హాసమును నిర్వచించుట అంతసులభముగాదు. పరిహాస రసికులు హాస్యమే ఏకైకరసమని వాదించు వారున్నారు. సద్యోరసప్రతీతి ఒక్క హాస్యము వల్లనే సాధ్యమనియు హాస్యమువలన తత్‌క్షణము జీవన్ముక్తిప్రదమైన సద్యః పరనిర్వృతి యేర్పడుననియు కొందరి వాదము. వికృతాకారము, వికృతమైనభాష, వికృతమైన వేషము, వికృత చేష్టలు గలవారు ఆలంబనవిభావములు. వారి చేష్టలు ఉద్దీపన విభావములు. అక్షిసంకోచము, వదనస్మేరత మున్నగునవి అనుభావములు. హర్షము, ఆవేగము, అవహిత్థ మున్నగునవి సంచారి భావములు.

అన్ని రసములలో సులభమైనది హాస్యమే. అన్ని రసములలోకెల్ల కష్టమైనదియు హాస్యమే. హాస్యరసములో ఆరు విభేదములను ఆలంకారికులు గుర్తించినారు. ఉత్తములకు స్మితహసితములు, మధ్యములకు విహసిత, అవహసితములు, నీచులకు అపహసిత అతిహసితములు గలుగునని ఆలంకారికు లనినారు.

"కొలదిగా చెక్కిళ్లు వికసింపఁజేసి మృదువుగా గటాక్షములను నిగుడ్చుచు, దంతములు వెలికిఁగనరాని చందమున నవ్వినచో నది మధురమైన హాసము. దీనికి స్మితమనిపేరు.

లెస్సగా మొగము, కన్నులు, చెక్కిళ్లును వికసింపఁజేసి కొలదిగా దంతములు గనవచ్చునట్లు నవ్విన నది హసితమనబడును.

కంఠగతము కాగానే (వెలుపలికి రానీక) [illegible] ముఖరాగమును జూపుచు నోరగంటఁ జూచుచు [illegible] మనబడును.

భుజములును, శిరస్సును గదలునట్లును, [illegible] జూచుచు ముక్కు [illegible] ములను లెస్సగా వికసింపజేయుచు నవ్విన నది అవహసితమ [illegible]



తగినంత కారణము లేకయుఁ గలిగినదియుఁ గన్నీరు వెలువరించుచు, భుజములును, వెండ్రుకలును నదరిపోవునట్లు చేయునదియు నగు నవ్వు అపహసిత మనబడును.

స్థూలమైనదియుఁ, గన్నులనుండి బాష్పపూరమును ప్రవహింపఁజేయు నదియు డొక్కలదురునట్లు జేయునదియు నగు నవ్వు 'అతిహసిత'మనబడును[1]."

ఆలంకారికులు నవ్వులలో నెన్ని భేదములు గుర్తించినారో! అదృశ్య దశనమైన (అనగా దంతములు కనిపించని) నవ్వే మధురమైన స్మితమనుమాట సహృదయులు విస్మరింపరానిది.

తిక్కన భారతమున ఎన్నో విధములైన నవ్వులను ప్రయోగించెను[2]. హాస్యము ఉద్భవించు తీరు అరయదగినది. అది శబ్దముచే ఉద్భవింపవచ్చును; సన్నివేశము వలన ఉద్భవింపవచ్చును. వాచ్యమైన హాస్యము కంటె శ్లేషవిరుపు వలన కంటె, సన్నివేశకల్పన వలన జనించు హాస్యము ఉత్తమోత్తమ మని విజ్ఞుల అభిప్రాయము. ఉదాహరణమునకు మహాభారతములోని గృధ్రజంబుకోపాఖ్యానము గైకొనదగును. పుత్రశోకార్తులైన దంపతులు శ్మశానమున బాలకుని మృత కళేబరమునుంచి విలపించుచుందురు అది కరుణరసాన్వితమైన ఘట్టము. కాని అచ్చట చేరిన గృధ్రము సూర్యాస్తమయ మగులోపల ఆ దంపతులను, బంధువులను అచటినుండి తరలింపజూచును. అప్పుడు తా నా శవమును భక్షింపవచ్చును. ఇఁక రాత్రియగు వరకు వారున్నచో నక్క శవభక్షణ చేయవచ్చును. గృధ్రజంబుకములు రెండును దంపతులకు లోకవృత్తము, వేదాంతము ఎంతెంతయో బోధ సల్పును ఆ శవభక్షణము అటు గ్రద్ద-ఇటు నక్క చెప్పు వేదాంతముల పరమార్థము. కరుణరసాంతర్గతమగు హాస్యము మిక్కిలి విలువైనది. నవ్వినవ్వించుట తేలిక. అది చవకబారుహాస్యము.

"నిజమైన హాస్యరసమునందలి ప్రత్యక్షరము వెనుక వేడికన్నీటిబిందువులు మారువేషములో దాగియుండును" అనుమాట మరువ రానిది. నా ప్రగతిగీతము లలో సునిశితహాస్య మట్టికోవకు చెందినది.

ఆ॥వె. దీన సేవ చేయు దేశభక్తు డొకడు
బక్కచిక్కపేదవాని గాంచి
ఎన్నికలకుముందు ఎక్కెక్కియేడ్చెరా
రమ్యహాసలోల రామకృష్ణ.

కన్నీటితో తడిపిన నవ్వు నిజమైన హాస్యము కావచ్చును. హాస్యరసస్ఫూర్తికి అనేకోదాహరణములు గలవు తిరుమలదేవరాయలు ఏకాక్షుడు. అతనిపై రచిత మైన చాటువు ఉదాహరింపనగును. రాణిని గూడినచో ఆతడు పరమేశ్వరు

---

1. కావ్యాలంకారసంగ్రహవివరణము-తృతీయాశ్వాసానుబంధము.
2. డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్య : తిక్కనభారతదర్శనము-తిక్కన నవ్వులు.

డట-లేనిచో శుక్రాచార్యుడట. ఉన్న ఒక్కకన్నుగూడా లేనిచో ధృతరాష్ట్రుడట.

కం॥ అన్నాతిఁ గూడ హరుఁడవు
అన్నాతిని గూడకున్న అసురగురుఁడ వీ
వన్నా తిరుమలరాయా!
కన్నొక్కటి కలదుగాని కౌరవపతివే!

తిరుమలరాయలు + రాణి = పరమేశ్వరుడని ప్రశంసించినను అది హాస్యము కాకపోదు.

# 1

# అలంకారములు - ప్రస్తావన

అలంకారములు—అను మాటకు అందమైన ఆభరణవిశేషములు (నగలు, సొమ్ములు) అని వ్యవహారభాషలో అర్థము సుగమము. కావ్యమీమాంసలోగూడ అలంకారములన కావ్యశరీరమునకు అందము చేకూర్చు రచన లని అర్థము.

భామహుడు అలంకారములు కావ్యశరీరసౌందర్యమును పెంపొందించునని చెప్పుటయేగాక, అలంకారములే కావ్యరచనకు అపరిహార్యములైన ఆలంబనము లనియు ప్రతిపాదించెను. సౌందర్య మలంకారః అను వామనుని సూత్రము సుప్రసిద్ధమై, ఆలంకారిక మీమాంసకు ఆద్యప్రకృతిగా అవతరించినది. సౌందర్యా రాధనవలన సంక్రమించు రసానందతన్మయత్వమే లలితకళలకు అంతరాత్మ కావున, భామహుని ప్రతిపాదనలో ఆలంకారికపరిభాషాసంప్రదాయమున సర్వ జనామోదమువడిసిన ఉక్తివైచిత్రితో పాటు సాహితీప్రియంభావుకులకు అనుభవ పునరుక్తమైన సౌందర్యదిదృక్షకూడ అంతర్లీనమైయున్నది. భామహుడు రూపకాద్యలంకారములచే అలంకృతముగాని కాంతాముఖమెంత సుందరమైన దైనను ప్రకాశింపదని చెప్పెను.

అలంకారసంప్రదాయమువారు కావ్యమున కలంకారములే ప్రధానములని చెప్పుదురు. అతిప్రాచీనాలంకారికు లీ మతమువారే. వీరి మతమున రసము, ధ్వని అలంకార విశేషములు మాత్రమే.

### ఆలంకారికమతసమన్వయము

శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు ప్రాచీనాలంకారిక మతముల సమీక్షించి క్రింది సమన్వయమును నెలకొల్పినారు—

"ధ్వని ఉత్తమకావ్యమునకు ప్రాణమువంటిది. అదిలేనిది ఉత్తమ కావ్యము కానేరదు. కావ్యమున కాత్మ రసము. శబ్దార్థములు శరీరము. ఓజో మాధుర్యాదిగుణములు శౌర్యాదులవంటివి. అలంకారములు హారములవంటివి. రసము అంగి. శబ్దార్థము లంగములు. మాధుర్యాదిగుణము లెప్పుడును రసమును విడుచునవిగావు. అనగా రసమున్నచోట నవి యుండును; అవి యున్నచోట రసము పుట్టును. అలంకారము లట్టివిగావు. ఇవి అంగద్వారమున మాత్ర మొకప్పుడు రసమును అభివృద్ధిచేయును; ఒకప్పుడు చేయకపోవచ్చును.

రసమును ఉత్కర్షింపచేయునపుడు అలంకారములు కేవలము ఉక్తి వైచిత్ర్య పర్యవసాయులుగ నుండును. ఇది కావ్యప్రకాశకర్త మమ్మటుని మతము (12వ శతాబ్ది). దీనినే ఏకావళీకారుడు (13వ శతాబ్ది), ప్రతాపరుద్రీయకారుడు (14వ శతాబ్ది), అప్పయ్య దీక్షితులు (16వ శతాబ్ది), జగన్నాథ పండితరాయలు (16వ శతాబ్ది) మొదలైన వారందరు ఒప్పుకొనిరి. ఇదియే యాధునికాలంకారికుల మతమని చెప్పవలసియున్నది. ధ్వనియెద్ది ? అలంకారమెద్ది ? రసమనునది కావ్యమునకు నాత్మగ తీసికొనవలెను. ఉత్తమకావ్యము ధ్వని ప్రధానము. ఎందు వాచ్యార్థమునకంటె వ్యంగ్యార్థ మెక్కువ రమణీయముగ నుండునో అది ఉత్తమ కావ్యము. ఎందు వ్యంగ్యార్థము వాచ్యార్థమునకంటె నధికరమణీయముగ నుండదో అది మధ్యమకావ్యము. దీనినే గుణీభూతవ్యంగ్య మందురు. ఎందు వ్యంగ్యార్థ ముండదో, ఉండినను స్పష్టముగ నుండదో యది అధమకావ్యము. శబ్దార్థ చిత్రాదు లిట్టివి. కావున నలంకారములలోఁ జేరిన చిత్రకావ్యము వీరి మతమున నధమము. ఎందువలన ? ధ్వనిలేదు గనుక. ఇది ఇట్లుండ కొన్ని అలంకారములలో ధ్వని కనబడుచున్నది. కొన్ని ధ్వని భేదములలో అలంకారములు కానవచ్చుచున్నవి. కావున రెండుపక్షముల వారికిని వాదవివాదములు జరిగి తేలిన దేమనగా వాచ్యార్థమును కొంతవరకును పరిత్యజించుటయే 'ధ్వని' యొక్క విశేషము. అది వస్తురసాలంకార ధ్వనులు అని మూడు విధములు. ఈ మూడు విధముల ధ్వనికిని వాచ్యముతో పనిలేదు. వాచ్యార్థమువలన అలంకారము సిద్ధించెనా యది 'అలంకార' కోటిలో చేరును. అనగా అది అలంకారధ్వనికాదు. అలంకారమే ; వ్యంగ్యార్థమున అలంకారము సిద్ధించెనా అది ధ్వనిగాని అలంకారము గాదు. వలయునెడల దానిని అలంకార ధ్వని యనుడు గాని అలంకార మనవలదు!! ఉపమాద్యలంకారము లన్నియు వాచ్యార్థమువలన సిద్ధింపవచ్చును ; వ్యంగ్యార్థము వలన సిద్ధింపవచ్చును. కాని ధ్వనివాదుల మతమున మొదటిదానిని మాత్ర మలంకార మనవలెను. రెండవదానిని 'ధ్వని' అనవలెను."[1]

కావ్యశిల్పమున అలంకారములకు గల స్థానము సహృదయులు గుర్తింపదగినది. అలంకారములు ఆభరణప్రాయములు. అవి లేకపోయినను రసము ఉద్భవింపవగును. రసస్ఫూర్తికి అలంకారములు దోహదము కల్పింపవచ్చును. సౌందర్యము లేనిచో ఆభరణములు నిష్ప్రయోజనము లైనట్లే, రసపుష్టిలేని కావ్యమునకు అలంకారములు శోభను చేకూర్చలేవు. అంతేగాక సహజసౌందర్యమున్నచో అలంకారము లేల ? అలంకారములు సహజసౌందర్యమును అతిశయింపఁజేయవచ్చును. అంతేగాక అలంకారాతిశయము కొండొకచో, సహజసౌందర్యమునకుగూడ కృతకత్వము నాపాదించి ఏవగింపు గల్గింపవచ్చును. అందుచే అలంకారములు చక్కగా ప్రయుక్తములైనప్పుడే శోభనిచ్చుననుమాట మరువరాదు లక్ష్య లక్షణములతోగూడి, కేవలాలంకారమయమైన అలంకార

[1]ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము - అలంకారములు.

సంగ్రహము కావ్యము కాజాలదు. అసలు, కవి అనిర్వచనీయమైనదానిని, వాచామగోచరమైనదానిని, మాటలలో చెప్పలేనిదానిని మాటలలో చెప్పవలసి యుండుట కవితాకళలో స్వయంవ్యక్తమగుచున్న ఒక విచిత్రవిరోధాభాసము. అందుచేత అలంకారములు శబ్దార్థశక్తులను పెంపొందించు మహనీయసాధనములని మరువరాదు.

అలంకారములు, శబ్దాలంకారములని అర్థాలంకారములని ప్రధానముగా రెండువిధములు. ఉభయాలంకారములని మూడవతరగతిని గూడ కొందఱు పేర్కొనిరి కాని అన్ని అలంకారములును శబ్దాలంకారములే. అయినను ప్రాధాన్యవివక్షచే శబ్దాలంకారములని, అర్థాలంకారములని చేసిన విభజన అధిక సంఖ్యాకులు ఆమోదించినది.

# 2

# శబ్దాలంకారములు

## 1. అనుప్రాసాలంకారము

హల్లులపునరుక్తి అనుప్రాసాలంకారము. అనగా వచ్చిన హల్లే తిరిగి వచ్చునట్లు రచించుట. అనుప్రాసము శ్రవఃపేయమనుట అనుభవపునరుక్తము. రచనకు ఆత్మ రసము. ధ్వని ప్రధానమైన కవితవలన రసప్రతీతి కల్గునని ఆలంకారికు లందరు ముక్తకంఠముతో చాటియున్నారు. అంతేగాక అనుప్రాసప్రలోభము రచనలలో రసస్ఫూర్తికి అంతరాయము కల్గించునని ఆలంకారికుల భావము. అయినను పలువురు తెలుగుకవులు అనుప్రాసలాలసులు మహాకవులైన వారలును, రచనను రసవంతముగ ధ్వనిప్రధానముగ తీర్చిదిద్దినవారును - క్వాచిత్కముగ అనుప్రాసలాలసకు లోనైనవారే. అయితే సమ్యక్ప్రయుక్తములైన అనుప్రాసాలంకారము రసపుష్టి కల్గించునదే యను వాదముగూడ కొందరాలంకారికులు ప్రతిపాదించియున్నారు. అనుప్రాసమునకు ప్రాచీనకావ్యములందు అనేకోదాహరణములు లభించును.

(1) చ॥ అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠ దభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనానురూప పరిఫుల్ల కలాప కలాపి జాలమున్
గటక చరత్కరేణు కరకంపితసాలము శీతశైలమున్[1]

(2) మ॥ వనితా! చూచితె మాల్యవంతముఁ, బ్రభావంతంబు, నానామణీ
జనకోదంచిత సానుకాంతము, మరుత్ సంపూర్ణ చంద్రాననా
జనకేళీ పద చంద్రకాంతము, నభఃప్రాంబాధ కృత్యూత్కట వ
ర్ధన దుర్దాంతము, సర్వపర్వత కథా ప్రాగ్వర్ణితోదంతమున్।[2]

(3) మ॥ ప్రణతుల్ సేయుచుఁగాంచెఁ గుంభజుఁడు లోపాముద్రతోఁగూడి, ద
క్షిణ కైలాసము, నంబికాహరకృతశ్రీ పాదుకాన్యాసమున్,
మణి మంత్రౌషధి వాసమున్, భవమహామాయా వివర్యాసమున్,
గణనాతీత నటీవిలాసము, సమగ్రశ్రీ సముల్లాసమున్[3]

---

[1] మనుచరిత్ర-2-3

[2] తెనాలిరామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్యము 1 - 130

[3] ధూర్జటికవి శ్రీ కాళహస్తి మాహాత్మ్యము - 1 - 109

(4) కనన్ సుభద్రకున్ సమంబుగాఁగ నే మృగీ విలో
కనన్ : నిజంబుగాఁగ నే జగంబునందుఁ జూచితా
కనన్ : దదీయ వర్ణనీయ హావభావ ధీ వయః
కన న్మనోజ్ఞ రేఖ లెన్నఁగాఁదరంబె గ్రక్కునన్[1]

## ఛేకానుప్రాసము

"పలుకుఁగమ్మదనము నెఱింగిన విద్వాంసులు ఛేకులనబడుదురు. అట్టి వారికి ఇష్టమైనది గావున దీనిని ఛేకానుప్రాసమందురు. ఇందు రెండేసి వ్యంజన ముల జంటలు వ్యవధానము లేకుండగ ఆవృత్తములు గావలెనని సంఖ్యానియ మము గలదు[2]"

ఛేకానుప్రాసమునకు కావ్యాలంకార సంగ్రహమునందలి ఉదాహరణము —

స్ఫురత్ కృపాబల ప్రతాపభూతి ధైర్య భూభరా
ర్పిరంగదానబుద్ధి వైఖరిన్ హరిన్ హరిన్, సుధా
హరున్ హరున్, గిరిన్ గిరిన్, మహానలున్ నలున్ రమా
గురున్ గురున్, జయింతువౌఁ దగున్ నృసింహభూవరా![3]

ఇట స్వరవ్యంజనములు రెండింటి కావృత్తి యుండుటచే నిది యమకోదా హరణమని కొందఱి అభిప్రాయము.

## వృత్త్యనుప్రాసము

ఒకహల్లుగాని, పెక్కుహల్లులుగాని పలుమారులు ప్రయుక్తములగుచో నది వృత్త్యనుప్రాసము. ఇందు సంఖ్యానియమములేదు. ఛేకానుప్రాసమువలె అవ్యవహితముగ నుచ్చరింపబడవలెనను నియమమును లేదు. ఉదాహరణమునకు— కమలాలోలుడు—ఇందు లకారము ముమ్మారు ప్రయుక్తము. వృత్త్యనుప్రాస మునకు భాగవతములోని సుప్రసిద్ధపద్యము ఉదాహరణముగ స్వీకరింపనగును.

క॥ అడిగెదనని కడువడిఁజను
నడిగినఁదన మగుడ నుడుగఁడని నడ యుడుఁగున్
వెడ వెడ చిడిముడి తడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్.[4]

వృత్తియనగా నియమితవర్ణములం దుండునట్టిదియు, రసవిషయకమై నట్టిదియు నగు రచన. అట్టి వర్ణ రచనకు సంబంధించినది గనుక నిది వృత్త్యను ప్రాసమని పేరు కెక్కినది.

[1] విజయవిలాసము - 1 - 97. పంచచామర వృత్తము
[2] ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము - పుట 410
[3] కావ్యాలంకార సంగ్రహము - 4 - 74. పంచచామర వృత్తము.
[4] శ్రీ మదాంధ్ర మహాభాగవతము - 8 - 103.

"ఓజః ప్రకాశములైన వర్ణములుగల వృత్త్యనుప్రాసమునకు 'పరుష'యని పేరు. దీనినే గౌడీరీతి యందురు. ఇతరవర్ణములుగల వృత్త్యనుప్రాసము కోమల యనబడును వామనుడు దీనిని పాంచాలీరీతి యనెను. దీనినే గ్రామ్య యని కొందఱందురు.[1]"

తెలుగుఛందస్సులోని ప్రాసము అనుప్రాసాంతర్భాగమనుట సుగమము.

## అంత్యానుప్రాసము

అనుప్రాసాలంకారము పాదాంతముల నున్నచో నది అంత్యానుప్రాసము.
ఉదాహరణములు:—

(1) క॥ అనుదిన సంతోషణములు
జనిత శ్రమతాప దుఃఖ సంశోషణముల్
తనయుల సంభాషణములు
జనకులకుం గర్ణయుగళసద్భూషణముల్.[2]

(2) కూచిపూడి అగ్రహారం ।
మేముండేదే ఒకవారం ।
కులమున బ్రాహ్మణవారం ।
నివసించేది కృష్ణాతీరం ।
కోరేది మీ మెడలోని చంద్రహారం ।[3]

(3) సీ॥ లలనాజనాపాంగ వలనావసదనంగ
తులనాధికా భంగదోఃప్రసంగ
మలసానిల విలోల దళసాసవ రసాల
ఫలసాదరశుకాలపనవిశాల
మలినీ గమదళీక మలినీకృతధునీక
మలినీ సుఖిత కోకకులవధూక
మతికాంతసలతాంత లతికాంతర నితాంత
రతికాంతరణతాంత సుతను కాంత
మకృత కామోద కురవకా వికల వకుల
ముకుల సకల వసంత ప్రమోద చలిత
కలిత కలకంఠ కులకంఠ కాకలీ వి
భాసురము పొల్చుమధుమాస వాసరంబు.[4]

---

[1] శ్రీ కొ. వేం. లక్ష్మణరావుగారు.

[2] శ్రీమదాంధ్రమహాభాగవతము-7-140.

[3] కూచిపూడి భాగవతుల వచనగీతము.

[4] వసుచరిత్ర — 1-126.

ఈ సీసపద్యమున ప్రతిపాదమునందును నాలుగు అంత్యానుప్రాసము లున్నవి.

### లాటానుప్రాసము

ఒక్క అర్థము గల పదములు తాత్పర్యభేదము కలుగునట్లు పునరావృత్తములయినచో లాటానుప్రాసము. ఉదాహరణమునకు-

కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ[1]

ఇచ్చట మొదటి కరములకు జాతివాచకమైన చేతులని, రెండవ కరములకు యోగ్యమైన చేతులని అర్థము. ఇట్లే రెండు జిహ్వలకును అర్థవైశిష్ట్యము గమనింపదగును.

అనన్వయాలంకారమునకును లాటానుప్రాసమునకును గల భేదసామ్యములు అనుశీలింపదగును. 'రాముడు రాముడే' అను వాక్యమునందలి రాముడు - రాముడే యన అనన్యసామాన్యుడని అర్థము స్ఫురించును. మొదటి రామునకు రెండవరామునకు ఒకటే అర్థము. ఇది అనన్వయము. రాముడు దాశరథియే యన్నను అర్థభేదము రాదు. కాని లాటానుప్రాసమున మొదటిపదమే పునరావృత్తము కావలెను. తాత్పర్యభేదము కలుగవలెను. అనన్వయాలంకారమున రెండు పదముల సమానార్థకత ముఖ్యము. లాటానుప్రాసమున - రెండుపదముల సమానోచ్చారణము ముఖ్యము.

## 2. యమకాలంకారము

స్వరవ్యంజన (అచ్చుల మరియు హల్లుల) సముదాయ పౌనరుక్త్యము యమకాలంకారము. అసమార్థకములయిన సమానవర్ణముల యేకక్రమమున ఆవృత్తి యమకమని కావ్యప్రకాశకారుని మతము. ఉదాహరణము—

ఆ సైనికనికాయము కాయంబు మరచి పోరాడుచున్నది.

ఇందు మొదటి కాయము 'నికాయశబ్దము' లోనిది. రెండవకాయమునకు శరీరమని అర్థము.

ఛేకవృత్త్యనుప్రాసములందు హల్లులసామ్య మున్న చాలు. అచ్చుల సామ్య మానుషంగికము. యమకమున అచ్చులు మరియు హల్లులు రెండింటి సామ్యమును ఆవశ్యకమే. లాటానుప్రాసమున ఏకపదము ఏకార్థమున భిన్న తాత్పర్యముతో వచ్చును. యమకమున నేకశబ్దములు భిన్నార్థమున రావలెను. పూర్వలాక్షణికులు బహువిధములగు యమకములను పేర్కొనియున్నారు. యమకము పాదయమకమనియు, పాదభాగయమకమనియు రెండు విధములు. పాదయమకము పదకొండు విధములు

---

1 శ్రీ మదాంధ్ర మహాభాగవతము - 7 - 169.

1. ముఖ 2. సందంశ 3. ఆవృత్తి 4. గర్భ 5. సందష్ట 6. పుచ్ఛ 7. పంక్తి 8. యుగ్మక 9. పరివృత్తి 10. సముద్గక 11. మహాయమకములను యమకములు ప్రసిద్ధములు.

కః ఔరా! యోబన్నృపాల కు
మారా! మను మదనసమరమాధుర్యంగదా
ధీరా! నృసింహ కూడితి
మా రామను సదనసమరమాధుర్యంగదా[1]

ఇందు ద్వితీయ చతుర్థ పాదములు సమములు. కావున దీనిని సందష్ట యమకముగ భట్టుమూర్తి పేర్కొనెను.

నాలుగు పాదములును సమానమైనచో నది పంక్తియమకము. ఇట్లే అనేకములైన ఉదాహరణముల నెన్నసగును.

సీ॥ తనభవ్యధామంబు తనభవ్యధామంబు
కరణి మిత్రోన్మేషకరము గాంగ[2]

ఉ॥ లింగ విషిద్ధంగల్వల చెలింగని మేచకకంధరుం ద్రిశూ
లిం గని సంగతాళి లపలింగని కర్దమ దూషితన్ మృణా
లిం గని కృష్ణచేలుని హలింగని నీలకచన్ విధాత్ర నా
లిం గని రామలింగకవిలింగని కీర్తి హసించు దిక్కులన్[3]

ప్రతాపరుద్రయశోభూషణమునందు యమకము ఆదిమధ్యాంతయమకము లని త్రిధా విభక్తము.

## 3. ముక్తపదగ్రస్తాలంకారము

ముక్తపదగ్రస్తమును శబ్దాలంకారములలో నొకటిగ లాక్షణికులు ఎన్నినారు. ముక్తమనగా విడిచిపెట్టిన పదమును గ్రస్తమనగా తిరిగి పట్టుకొనుట. ఇది పునరుక్తిగాని, శబ్దప్రయోగపౌనఃపున్యముగాని గాదు. ఇందు ప్రయోగించినపదము అర్థపుష్టితో సొంతమైనపిదప తిరిగి అదేపదము సార్థకముగ నారంభము కావలెను.

పలువురు తెలుగుకవులు ప్రయోగించిన ముక్తపదగ్రస్తములను సహృదయులు మురిసిపోవుచు మాటిమాటికి చదువుకొనుట కద్దు. ముక్తపద గ్రస్తమునకు మనుచరిత్రమునందలి ఉదాహరణము—

1 కావ్యాలంకార సంగ్రహము - 4-80
2 వసుచరిత్ర - 6 - 103
3 చాటువు

సీ॥ తీర్థసంవాసు లేతెంచినారని విన్న
నెదురుగా నేగు దవ్వెంతయైన
నేగి తత్పదముల కెఱఁగి యింటికిఁదెచ్చుఁ
దెచ్చి సద్భక్తి నాతిథ్యమిచ్చు
నిచ్చి యిష్టాన్న సంతృప్తులగాఁ జేయుఁ
జేసి కూర్చున్నచోఁ జేరవచ్చు
వచ్చి యిద్ధరగల్గు పనధి పర్వత సరిత్
తీర్థమాహాత్మ్యముల్ దెలియ నడుగు
నడిగి యోజనపరిమాణ మరయు నరసి
పోవలయుఁ జూడననుచు నూర్పులు విగుడ్చు
ననుదినము తీర్థ సందర్శనాభిలాష
మాత్మనుప్పొంగ నత్తరుణాగ్నిహోత్రి

ముక్తపదగ్రస్తము యమకములో నంతర్భూతమైనదే.

మ॥ దృఢబాహాబలభీమ ! భీమ సమర ప్రేంఖ జ్జయ శ్రీపతి
ప్రథిమా ధౌకితధామ ! ధామహిత తూర్యధ్వాన దత్తైకధా
కృథమత్కార వినామ నామకథన క్లామ్యన్మహా ఢిల్లికా
గధరాడాద్యరిధామ ! ధామగరిమ గ్రస్తగ్రహాధీశ్వరా ![1]

## 4. చిత్రాలంకారములు

పద్యవర్ణములు పద్మము, చక్రము, సర్పము మున్నగు ఆకారములు వచ్చునట్లు కూర్పబడెనేని చిత్రాలంకారమగును. పద్మబంధాదులు అక్షరములతో చేయు సాముగరిడీలుగాని, యందు కవిత్వ మేముండునని మూతిముడుచువారు లేకపోలేదు. యమకమునందును చిత్రకవితయందును సాధారణముగ రసపుష్టి కనుపింపదు- అని ఏకావళిలో విద్యాధరుడు ప్రవచించెను.

### *నాగబంధము*

"ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు" అని కవితామాధురికి పేరుమ్రోగిన వంది తిమ్మనగూడ పారిజాతముల నడుమ చివరకు కొన్ని నిర్గంధకుసుములఁ జేర్చెను. అట్టివానిలో ప్రసిద్ధమైన నాగబంధమునిట ఉదాహరింపదగును. ఈ చంపకమాలా పద్యమున నాగబంధమెట్లమరియున్నదో చిత్రపటమున పరిశీలింపదగును.

---
[1] వసుచరిత్ర - 6 - 101

చ॥ జలదవితాన నీల ఖలపాల కులక్షితి వారణేశ ని
శ్చల మునివారిపాల సుర చారణ యక్ష నవానుకూల కుం
డలి వరహారలోల నరి నారద తత్పర భూవిధేయ యు
జ్వల మను నీతిశీలిత వశంవద శక్రరమా నికేతనా ![1]



నాగబంధము

[1] పారిజాతాపహరణము - 5 - 95

# 3

# అర్థాలంకారములు - వివిధాలంకారికుల మతములు

## శబ్దార్థాలంకారముల వైశిష్ట్యము

శబ్దాలంకారములకంటె అర్థాలంకారములే కావ్యమునకు ఎక్కువ ఉత్కర్ష కల్పించునవని పలువురు ఆలంకారికులు తలపోసియున్నారు. రమణీయార్థ ప్రతిపాదకత్వము శబ్దాలంకారములందు కొఱవడుటచే వానికి కావ్యత్వసిద్ధిని పండితరాయలు అంగీకరింపలేదు.

అర్థాలంకారములకంటె శబ్దాలంకారములే మిన్నయనువారున్నారు. శబ్దాలంకారములు సద్యోరసప్రతీతికి హేతువులని కొందరి అభిప్రాయము. అర్థాలంకారములు అర్థప్రతీతియైన పిమ్మటగాని చిత్తము నాకర్షింపజాలవు. శబ్దాలంకారములు సంగీతమునకు దగ్గరచుట్టములు; ఆపాతమధురములు. అర్థాలంకారములు సాహిత్యబాంధవములు; ఆలోచనామృతములు.

అలంకారములు భాషతో పుట్టినట్టివే. లలితకళలన్నిటికిని అంతరాత్మయని చెప్పదగిన సౌందర్యమే అలంకారములకు ఆద్యప్రకృతి. భాష ప్రయోజనమేమి ? వక్తభావములను శ్రోతలకు అందించుటయే. అందు ఆప్రయోజనమే ప్రాధాన్యము వహించినచో అది వ్యావహారికమైన సాధారణకళ. ఆ భాష విన సొంపుగ నున్నచో, సౌందర్యమే ప్రాధాన్యము వహించినచో అది సాహిత్యమగును. అలంకార రచనమన్న సౌందర్యస్ఫోరకమైన ఆహార్యధారణమే.

క్రాంతదర్శియైన ప్రతిభాశాలి తన మనోనేత్రముతో దర్శించినదానిని కవనములో, శిల్పములో, చిత్రలేఖనములో ప్రదర్శించుటకు యత్నించుట సహజము. ఉత్తమోత్తమకవిత యైనను ఆ క్రాంతదర్శనమునకు ఒక నీడ, క్రీనీడ మాత్రమే. శిల్పపరిధి పరిమితము. అట్లే చిత్రలేఖనము. అలంకారములు — ఆ పరిమిత పరిధిని విస్తృత మొనరించుటకు సాయమొనర్పగలవు.

అరణ్యములో పంచపాండవులమధ్య నడచుచున్న ద్రౌపది యథార్థమునకు వర్ణనాతీతవస్తువు. కాని కవి, ఆమె అయిదు కొండల మధ్య త్రుళ్లింతలాడుచున్న నదీ సుందరి అని అభివర్ణింపగనే సాహితీప్రియంభావుకుని మనః

ఫలకముపై ఆ చిత్తరు వేర్పడి మాటలు చెప్పలేని - అనుభవైకవేద్యమైన - రసప్రతీతిని కల్పించుట సహృదయగమ్యము. శబ్దాలంకారములుగూడ నాద ప్రస్తారమున అనిర్వచనీయమును అనుభవ సిద్ధము చేయుటకు తోడ్పడును.

## సంస్కృతవాఙ్మయము : అలంకారములు

సంస్కృతమున అలంకారములు ఋగ్వేదములందలి ఋక్కులలోగూడ కన్పించుచున్నవి. ఋగ్వేదములో ఉపమ, రూపకము, అతిశయోక్తి అలంకారములు గలవు.

మహాభారతము నందును రామాయణమునందును హృదయంగమములైన అలంకారములు పెక్కు గలవు. పాణినీయమునందు ఉపమాన - ఉపమేయ - సామాన్య పదములు ప్రయుక్తములు నిరుక్తమునందు యాస్కాచార్యుడు ఉపమాలంకారప్రస్తావము తెచ్చి అశ్వినీదేవతలను దొంగతలతో పోల్చుట నీచోపమ యని తర్కించెను. అగ్నిపురాణమున అలంకారములు సోదాహరణముగ వివరింపబడినవి.

భాసుని నాటకములలో అలంకారములు కొల్లలు. కాళిదాసు కావ్యములు అలంకారఖనులు. "ఉపమా కాళిదాసస్య"— ఉపమాలంకారము కాళిదాసుచేతిలో సిద్ధిపొందినది. కాళిదాసు ఉపమాలంకారమునేగాక ఉత్ప్రేక్ష, రూపకము మున్నగు అనేకాలంకారములను ప్రయోగించియున్నాడు. కాళిదాస మహాకవి చేతిలో ఉపమాలంకారముతోపాటు సిద్ధిపొందిన అలంకారము అర్థాంతరన్యాసము.

## అలంకారముల సంఖ్య

భరతుడు నాట్యశాస్త్రమున నాలుగు అలంకారములను చెప్పెను. యమకము అను శబ్దాలంకారముతోపాటు భరతముని పేర్కొనిన అర్థాలంకారములు— 1. ఉపమ 2. రూపకము 3. దీపకము.

దండి సంకీర్ణముగాక 34 అర్థాలంకారములను చెప్పెను. మమ్మటుడు సంకర సంసృష్టులుగాక 56 వరకు అర్థాలంకారములను నిరూపించెను. విద్యానాథుడు 66, చంద్రాలోకకర్త జయదేవుడు 100, కువలయానందకారుడైన అప్పయ్య దీక్షితులు 124 అర్థాలంకారములను నిరూపించిరి.

## అలంకార లక్షణగ్రంథములు

కావ్యమీమాంసకై ఉద్భవించిన లాక్షణికగ్రంథములలో అలంకార చర్చ ప్రాయికముగ నొక ప్రకరణమగును. కేవల మలంకారముల మీమాంసకొరకే ఆవిర్భవించిన గ్రంథములలో రాజానకరుయ్యకకృతమైన 'అలంకార సర్వస్వము' మిగుల ప్రామాణిక గ్రంథము. ఈ గ్రంథమునకు జయరథుడు టీక వ్రాసెను. సముద్రబంధుని టీక మరియొకటి కలదు.

అప్పయ్యదీక్షితులవారి 'కువలయానందము' కూడ కేవల మలంకారముల కొరకే పుట్టిన గ్రంథము. విశ్వేశ్వరపండిత విరచితమైన అలంకార కౌస్తుభము గూడ కేవలము అలంకారముల గూర్చిన గ్రంథమే. జయదేవుని చంద్రాలోకమును అలంకారశాస్త్ర గ్రంథమే.

తెలుగులో మొదట కావ్యమీమాంసపై గ్రంథము వ్రాసినవాడు విన్నకోట పెద్దన. 14 వ శతాబ్దివాడు. ఇతని కావ్యాలంకార చూడామణికి దండి కావ్యాదర్శము మాతృక. పిమ్మట పేర్కొనదగిన గ్రంథము - కావ్యాలంకారసంగ్రహము. దీనికి నరస భూపాలీయమను నామాంతరము గలదు. ఇందు కావ్యమీమాంసతోపాటు అలంకారప్రకరణ మున్నది. దీని కర్త భట్టుమూర్తి. ఇతడే రామరాజభూషణుడని విమర్శకులు నిరూపించినారు. దీనికి మాతృకలు ఏకావళియు ప్రతాపరుద్రీయమును. జయదేవుని చంద్రాలోకములోని ఐదవ మయూఖము నాధారముగగొని 18 వ శతాబ్ది వాడయిన అడిదము సూరకవి ఆంధ్ర చంద్రాలోకము రచించెను. ఇందు 100 అర్థాలంకారములు గలవు. టి. ఇ. శ్రీనివాసాచార్యులుగారు సాహిత్య చింతామణి లేక అలంకారశాస్త్ర సంగ్రహము రచించిరి. శ్రీ వీరేశలింగముగారి అలంకారసంగ్రహమునకు మాతృక చంద్రాలోకము.

## అలంకార వర్గీకరణము — వివిధమతములు

వక్రోక్తి వాక్కున కలంకారత్వమును కల్పించును. వక్రోక్తి వలననే అంతట అర్థము శోభావంతమగును. కవులు యత్నించి దీనిని సాధింపవలెను. ఇది లేనిది ఏ అలంకారము సిద్ధించును?" అని భామహుని వాదము. మమ్మటు డతిశయోక్తియే సర్వాలంకార బీజప్రాయమని వచించెను. అతిశయోక్తికిని వక్రోక్తికిని మమ్మటమతమున భేదములేదు.

*రుద్రటుని వర్గీకరణము*

తొమ్మిదవశతాబ్దినాటి రుద్రటుడు అలంకారములను 1. వాస్తవము 2. ఔపమ్యము 3. అతిశయము. 4. శ్లేషము అని నాలుగు విధముల విభజించి అలంకారము లన్నియు నీ నాలుగింటిలో అంతర్గతములని ప్రతిపాదించెను.

(1) ఎయ్యది అర్థమును బలపరచి స్వరూపమును ఉన్నదున్నట్లు చెప్పునో అది వాస్తవము లేక స్వభావోక్తి.

(2) ఎందు వస్తు స్వరూపము చక్కగ దెల్ప నిమిత్తము దానితో సమానమైన వస్తువును వక్త చెప్పునో అది ఔపమ్యము (ఉపమ).

(3) ఎందు నర్థము లోకములోనిదానికి విలక్షణముగ అతీతముగ నుండునో అది అతిశయము (అతిశయోక్తి).

(4) ఎందు ఏకార్థముగల పదములచే ఒక్క వాక్యమునకు రెండర్థములు సంక్రమించునో అది శ్లేషము.

రుద్రుటుడు అలంకార వర్గీకరణమును శాస్త్రీయముగా చేసినవారిలో ప్రథముడు. అతని వర్గీకరణముననుసరించి అర్థాలంకారములు అన్నియు నాలుగు వర్గములు

(1) వాస్తవ వర్గము—సహోక్తి, సముచ్చయము మొదలగునవి. ఇవి 23.

(2) ఔపమ్య వర్గము—ఉపమ, ఉత్ప్రేక్ష మొదలగునవి. ఇవి 21.

(3) అతిశయవర్గము—విభావన, తద్గుణము మొదలగునవి. ఇవి 12.

(4) శ్లేషవర్గము—శ్లేష, విరోధాభాసము మొదలగునవి. ఇవి 12.

మొత్తము 68. పై నాలుగువర్గములు అలంకార ప్రపంచమునకు నాలుగు దిక్కులుగా భాసించుచున్నవి.

**రుయ్యకుని వర్గీకరణము**

అలంకారసర్వస్వకారుడగు రుయ్యకుడు అర్థాలంకారములను 7 ప్రధాన వర్గములుగా విభజించియున్నాడు.

అవి-

(1) సాదృశ్యవిచ్ఛిత్తి—ఉపమ మొదలగునవి.

(2) విశేషణ విచ్ఛిత్తి—సమాసోక్తి మొదలగునవి.

(3) గమ్యార్థతావిచ్ఛిత్తి—పర్యాయోక్తము మొదలగునవి.

(4) విరోధ విచ్ఛిత్తి—విరోధము మొదలగునవి.

(5) శృంఖలావిచ్ఛిత్తి—కారణమాల మొదలగునవి,

(6) న్యాయవిచ్ఛిత్తి—కావ్యలింగము మొదలగునవి.

(7) గూఢార్థపరతావిచ్ఛిత్తి—సూక్ష్మము మొదలగునవి.

వీనిలో మరల ఎన్నో ఉపభేదములనుగూడ రుయ్యకుడు పేర్కొనెను. రుయ్యకుని అనంతరకాలమందలి ఆలంకారికులందరును-విద్యాధర విశ్వనాథాదులు -ఈ వర్గీకరణమును అనుసరించిరి.

**విద్యానాథుని వర్గీకరణము**

ప్రతాపరుద్రీయకర్తయగు విద్యానాథుడును - విద్యానాథుని అనుసరించిన భట్టుమూర్తియు ఈ వర్గీకరణము ఆధారముగా అర్థాలంకారములను తిరిగి క్రింది విధముగా వర్గీకరించిరి–

1. సాధర్మ్యమూలకములు—

(i) భేదప్రధానసాధర్మ్యము గలవి-దీపకము, తుల్యయోగిత, నిదర్శనము, దృష్టాంతము, ప్రతివస్తూపమ, సహోక్తి, ప్రతీపము, వ్యతిరేకము.

(ii) అభేదప్రధాన సాధర్మ్యముగలవి - రూపకము, సందేహము పరిణామము, భ్రాంతిమంతము, అపహ్నుతి.

(iii) భేదాభేద ప్రధాన సాధర్మ్యముగలవి - ఉపమ, ఉపమేయోపమ, అనన్వయము, స్మరణము.

2. అధ్యవసాయ మూలకములు—
అతిశయోక్తి - ఉత్ప్రేక్ష

3. విరోధమూలకములు—
విషమము - అసంగతి - చిత్రము - అతద్గుణము - అన్యోన్యము-భావికము - విశేషము - వ్యాఘాతము.

4. వాక్యన్యాయ మూలకములు—
సముచ్చయము - వికల్పము - పరిసంఖ్య — యథాసంఖ్యము - అర్థాపత్తి.

5. లోకన్యాయ మూలకములు—
పరివృత్తి - ప్రత్యనీకము - తద్గుణము - సమాధి - వినోక్తి - సమము - స్వభావోక్తి.

6. తర్క-న్యాయ మూలకములు—
కావ్యలింగము - అనుమానము - అర్థాంతరన్యాసము.

7. శృంఖలా వైచిత్ర్య మూలకములు—
కారణమాల - ఏకావళి - మాలాదీపకము - సారము.

8. అపహ్నవ మూలకములు—
వ్యాజోక్తి - వక్రోక్తి - మీలనము.

9. విశేషణ వైచిత్ర్య మూలకములు—
సమాసోక్తి - పరికరము.

# 4

# ఉపమ, అనన్వయము, ఉపమేయోపమ, ప్రతీపము

## 1. ఉపమాలంకారము

"ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికా భేదాన్
రంజయతి కావ్యరంగే నృత్యంతీ తద్విదాంచేతః"

ఏకైక నర్తకి రంగస్థలమందు భిన్నభిన్న చిత్ర విచిత్ర భూమికలు దాల్చి వివిధవేషధారిణియై సామాజికులను అలరింపజేసి నృత్యము చేయునట్లు ఒక్క ఉపమాలంకారమే కావ్యరంగస్థలమున అనేకాలంకారములుగా ఉద్భాసించుచున్నదని అప్పయ్యదీక్షితులుగారి అభివర్ణన

ఆలంకారికులు - ఎందరో మేధావులు - సౌందర్యమీమాంస సాంగోపాంగముగా సల్పి ఎన్నో కక్ష్యలుగ, కక్ష్యాంతరములుగ అలంకారములను విశ్లేషించియున్నారు. అలంకార జగత్తును ఏకైకకక్ష్యగ వింగడింపవలెనన్నచో పట్టమహిషీత్వము ఉపమాలంకారమునకే దక్కుట తథ్యము.

ఒక వస్తువును మరియొక వస్తువుతో పోల్చి చెప్పుట ఉపమాలంకారము.

ఉదాహరణమునకు—

ఆ వయస్వినిముఖము చంద్రబింబమువలె అందముగా నున్నది.

అను వాక్యమును పరిగ్రహింపవచ్చును. ఇందు నాలుగు భాగము లున్నవి.

1. ఉపమేయము—అనగా వర్ణ్యవస్తువు. ప్రస్తుతము, ప్రకృతము నైనది విషయము.

2. ఉపమానము— ఉపమేయమును దేనితో పోల్చుచున్నామో ఆ వస్తువునకు ఉపమానమని పేరు. అవర్ణ్యము, అప్రస్తుతము, అప్రకృతము నైనది విషయి.

3. సమానధర్మము—ఉపమేయమునందును, ఉపమానమునందును గలపోలిక.

4. ఉపమావాచకము— సమానధర్మమును సూచించు శబ్దము.

పై ఉదాహరణమున వయస్వినిముఖము - ఉపమేయము. చంద్రబింబము - ఉపమానము. అందము - సమానధర్మము. వలె — ఉపమావాచకము.

*ఉపమాలంకారము - ఆలంకారికులు*

ఉపమాలంకారలక్షణము లనేకలాక్షణికు లనేకవిధములఁ జెప్పియున్నారు.

దేశకాల క్రియాదులచే వేఱైన ఉపమానమునకును ఉపమేయమునకును గుణలేశము చేతనైనను సామ్యము చెప్పబడినయెడల ఉపమాలంకారము అని భామహుడు ప్రవచించెను. కాలాదికముచే భిన్నములగు ఉపమానోపమేయములను రెండు శబ్దములకు గల మనోహరమైన సాధర్మ్యము ఉపమ అని ఉద్భటుడు వచించెను. ఎంతమాత్రము సాధర్మ్యము గోచరించినను నది ఉపమఅని దండి వచించెను గుణలేశమువలన ఉపమానముతో ఉపమేయమునకు సామ్యము గల్పించుట ఉపమ అని వామనుని అభిప్రాయము. భేదముగల పదార్థములకు సాధర్మ్యము చెప్పుట ఉపమ అని మమ్మటుని ప్రవచనము. ఉపమానోపమేయముల సాధర్మ్యమునందు భేదాభేదములు సమానముగనున్న ఉపమ అని రుయ్యకుని అభిప్రాయము. వాక్యార్థమునకు నుపస్కారమును సుందరమునునైన సాదృశ్యము ఉపమఅని జగన్నాథపండితరాయల అభిప్రాయము. సహజముగ, ఉపమేయముకన్న భిన్నమై రసికసమ్మతమైనట్టిదియు, అప్రకృతముతో ప్రకృతమునకు గుణక్రియారూపములగు ధర్మములతో దేనినిబట్టయైనను పోలికను ఒకతూరి మాత్రమే వాచ్యముగ చెప్పునది ఉపమ అని విద్యానాథుడు వివరించెను.

క॥ గుణధర్మకర్మముల మ
ల్పుణ మయ్యెడు వస్తువునకుఁ బరుపడిఁ దుల్య
ప్రణయనముఁ జేయు నెయ్యది
గణుతింతురు దాని నుపమగా బహువిధులన్

అని విన్నకోట పెద్దన వివరించెను.

సీ॥ ఉత్ప్రేక్షవలె నసిద్ధోపమకా కన
న్వయము కైవడి నభిన్నంబుగాక
హీనోపమయుఁబోలె నిల నహృద్యముగాక
యుపమాన మనఘమై యుండెనేవి
శ్లేషంబువలెఁ బదశ్లిష్ట మాత్రముగాక
సార్థమైయల రూపకాదులక్రియ
వ్యంగ్యంబుగాక సామ్యము వాచ్యమగునేవి
నౌపమ్యము ప్రతీప మట్లుదలఁప

తే.గీ॥ క్రమ విపర్యాస సహితంబుగాక యున్న
నలరు నుపమేయకోపమ యట్లు సామ్య
ధర్మమిరుమాఱు వరుసలం దడవకున్న
నుపమయగు దీని భేదంబు లుగ్గడింతు —

అని కావ్యాలంకార సంగ్రహమున (5-7) భట్టుమూర్తి వివరించెను. ఆలంకారికుల నిర్వచనములన్నియు సమీక్షించిన పిమ్మట - ఉపమాలంకారమునకు మమ్మటుని నిర్వచనము (సాధర్మ్య ముపమా భేదే— భేదమున్న వానికి సాధర్మ్యము చెప్పునది ఉపమ అని) అంగీకరింపనగును. ఉపమ సర్వాలంకార బీజమని వామన మతము. సాదృశ్య గర్భములైన వన్నియు ఉపమాభేదములే యని కొందరి మతము.

***ఉపమాభేదములు-దండి***

ఉపమాలంకార భేదములను ఆలంకారికులనేకులనేక విధముల వివరించిరి. దండి సమానధర్మభేదములను బట్టి ఉపమను 32 విభాగములుగ విం గడించి సోదాహరణముగ నిరూపించెను.

(1) ధర్మోపమ :
ఓ ముద్దరాల ! నీ అరచేయి పద్మమువలె నెఱ్ఱగ నున్నది.

(2) వస్తూపమ :
నీ ముఖము పద్మమువలె నున్నది.
(ఇందు సమాన ధర్మము ప్రతీయమానము).

(3) విపర్యాసోపమ :
నీ ముఖమువలె అరవిందము వికసించి యున్నది.
(దీనిని కొందరు ఆలంకారికులు ప్రతీపాలంకారమనిరి).

(4) అన్యోన్యోపమ :
నీ ముఖము పద్మమువలెను, పద్మము నీ ముఖమువలెను ఉన్నది.
(దీనిని ఉపమేయోపమ యని కొందరాలంకారికుల వ్యపదేశము).

(5) నియమోపమ :
నీ ముఖము కమలమునే పోలుచున్నది. మరి దేనిని పోలదు.

(6) అనియమోపమ :
నీ ముఖము పద్మమును అనుకరించుచున్నది. దానిని అనుకరించు మరి వేరు వస్తువులుండుగాక.

(7) సముచ్చయోపమ :
కాంతిచేతనేగాక ఆహ్లాదకరత్వమున గూడ నీ ముఖము చంద్రుని బోలును.

( 8) **అతిశయోపమ :**
నీ ముఖమును నీ యెడనే చూచినాను. చంద్రుని ఆకసమందే చూచినాను.

( 9) **ఉత్ప్రేక్షితోపమ :**
ఈమె ముఖశ్రీ నా యందే యున్నదని చంద్రుడు గర్వపడ నక్కరలేదు. పద్మమునందుగూడ నది కలదు.

(10) **అద్భుతోపమ :**
పద్మము విభ్రాంతనయనమైన యెడల నీ ముఖశ్రీని బొందవచ్చును.

(11) **మోహోపమ :**
కృశాంగి ! చంద్రునిఁజూచి నీ ముఖమనుకొని దానివై పునకు బోయినాను.

(12) **సంశయోపమ :**
ఇది లోలఁదిరుగుచున్న భ్రమరములు గల పద్మమా ! లోలేక్షణములు గల నీ ముఖమా ? యని నా మనస్సు డోలాయమాన మైనది.

(13) **నిర్ణయోపమ :**
చంద్రునిచేతను నిగ్రహింపబడిన పద్మముయొక్క కాంతి చంద్రునకు సిగ్గు కల్గించునదిగ నుండదు. ఇట్టి కాంతిగలది గావున ఇది నీ ముఖమే.

(14) **శ్లేషోపమ :**
నీ ముఖము పద్మమువలె శశిరాంశుప్రతిస్పర్ధియు, శ్రీ గలదియు, సురభిగంధియు నగును.

(15) **సమానోపమ :**
ఈ ఉద్యానమాల బాలికవలె సాలకానన శోభిని.
సాల + కాననశోభిని - సాలవృక్షములతోకూడిన అడవితో శోభించునది.
స + అలక + ఆననశోభిని - ముంగురులతోడి ముఖముతో శోభించునది.

(16) **నిందోపమ :**
కమలము పరాగపూర్ణము ; చంద్రుడు క్షయశీలుడు. నీ ముఖము వానితో సమానమైనను వానికంటె ఉత్కర్ష కలిగినది.

(17) **ప్రశంసోపమ :**
బ్రహ్మకు పుట్టినిల్లయిన పద్మమును, శివునిచే శిరస్సున ధరింపబడిన చంద్రుడును నీముఖముతో సమానములు.

(18) **ఆచిఖ్యాసోపమ :**
నీ ముఖము చంద్రునితో సమానమని నేను ప్రతిపాదించుచున్నాను. అది గుణమో ! దోషమో !

(19) **విరోధోపమ :**
శతపత్రము - శరచ్చంద్రుడు - నీ ముఖము - ఈ మూడునుపరస్పర విరోధము కలవి.

(20) ప్రతిషేధోపమ :
కళంకియు, జడుడును అగు చంద్రునకు నీ ముఖముతో స్పర్ధవహించు శక్తిలేదు.

(21) చాటూపమ :
నీ ముఖము మృగేక్షణాంకితము, చంద్రుడో మృగాంకుడు; అయినను నీతో సమానుడేగాని అధికుడుగాడు.

(22) తత్త్వాఖ్యానోపమ :
ఇది పద్మము కాదు; ముఖమే! ఇవి తుమ్మెదలు కావు; కన్నులే!

(23) అసాధారణోపమ :
చంద్రారవిందముల కాంతి నతిక్రమించి నీ ముఖము తనకు తానే సాటియాయెను.

(24) అభూతోపమ :
నీ ముఖము, ఒక చోటను సంగ్రహించి రక్షించబడిన అన్ని పద్మముల కాంతిపుంజమువలె శోభించుచున్నది.
(దీనిని ఉత్ప్రేక్షగ కొందరు భావింతురు).

(25) అసంభావితోపమ :
నీ ముఖమునుండి కఠినవాక్యములు వచ్చుట చంద్రబింబమునుండి విషము వచ్చుటవలెను, చందనమునుండి అగ్ని వచ్చుటవలెను ఉండును.

(26) బహూపమ :
చందనోదక చంద్రాంశు చంద్రకాంతాదికమువలె నీ స్పర్శ అధికశీతలముగ నుండును.

(27) విక్రియోపమ :
తన్వంగి! నీ ముఖము చంద్రబింబమునుండి త్రవ్వి తీసినట్లు, పద్మగర్భము నుండి లాగి తీసినట్లు నున్నది.

(28) మాలోపమ :
సూర్యునియందు ఎండవలెను, పగటియందు సూర్యునివలెను, ఆకసము నందు పగటివలెను, విక్రమము నీయందు లక్ష్మిని గూర్చెను.

(29) వాక్యార్థోపమ :
ఒక వాక్యార్థమును మరియొక వాక్యార్థముతో పోల్చిన నది వాక్యార్థోపమ. ఇది రెండు విధములు— 1. ఏకేవశబ్ద ఘటితము 2. అనేకేవ శబ్ద ఘటితము.

(i) చంచల నేత్రములు కలదియు, ఆవిర్భవించిన దంతకాంతికలదియునగు నీ ముఖము భ్రమద్భృంగమును, ఈషల్లక్ష్య కేసరమునగు పంకజము వలె దోచుచున్నది.

(ii) తామరతీగవంటి యాతన్వంగియొక్క పద్మమువంటి మోము మధుకరమువంటి నాచే మరలమరల ద్రాగబడెను.

(30) ప్రతివస్తూపమ :
పుట్టిన రాజులలో నీవంటివాడు లేనేలేడు. పారిజాతమువంటి పాదపము రెండవది లేదుగదా.

(31) తుల్యయోగోపమ :
ఓనృపా! ఇంద్రుడు స్వర్గరక్షణకు, నీవు భూరక్షణకు మేల్కొని యుందురు. అతనిచే అసురులు, నీచే గర్వితులు చంపబడుదురు.

(32) హేతూపమ :
రాజా! కాంతిచే చంద్రుని, తేజస్సుచే సూర్యుని, ధైర్యముచే సముద్రుని అనుకరించుచున్నావు.

*ఉపమాలంకారము–రూపాంతరములు*

ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికా భేదాన్
రంజయతి కావ్యరంగే నృత్యంతీ తద్విదాం చేతః[1]

"ఉపమ ఒకనటి. అదియే చిత్రవిచిత్రములైన వేషములను ధరించి కావ్యరంగమున లాస్యమాడుచు కావ్యవేత్తల మనస్సును రంజిల్లచేయుచున్నది."

ఒక్క ఉపమాలంకారమే, ఆహార్యభేదమున నానాలంకారములుగా) భాసించునని అప్పయ్యదీక్షితులుగారి అభిప్రాయము. ఎట్లనగా—

(1) ఉపమ :
ముఖము చంద్రునివలె నున్నది.

(2) ఉపమేయోపమ :
ముఖము చంద్రునివలె నున్నది; చంద్రుడు ముఖమువలె నున్నాడు.

(3) అనన్వయము :
ముఖము ముఖమువలె నున్నది.

(4) ప్రతీపము :
చంద్రుడు ముఖమువలె నున్నాడు.

(5) స్మరణము :
చంద్రునిఁజూడ ప్రియాముఖము జ్ఞప్తికి వచ్చెను.

(6) రూపకము :
ముఖమే చంద్రుడు.

(7) పరిణామము :
ముఖచంద్రునిచేఁ దాపము శమించును.

---

(1) కావ్యాలంకారసంగ్రహవ్యాఖ్యలో ఉదాహృతము – అప్పయ్యదీక్షితకృతమగు శ్లోకము.

(8) సందేహము :
ఇది ముఖమా ? చంద్రుడా ?

(9) భ్రాంతిమంతము :
చంద్రుడని చకోరములు నీముఖము వైపునకు పరుగులిడుచున్నవి.

(10) ఉల్లేఖము :
చంద్రుడని చకోరములు, కమలమని తుమ్మెదలు నీ ముఖమును ఆశించుచున్నవి.

(11) అపహ్నుతి :
ఇది నీ ముఖముగాదు ! చంద్రుడే !

(12) ఉత్ప్రేక్ష :
ఇది చంద్రుడుకాబోలు !

(13) అతిశయోక్తి :
ఇది చంద్రుడే

(14) తుల్యయోగిత :
నీ ముఖముచే చంద్రకమలములు జయింపబడెను.

(15) దీపకము :
రాత్రులందు చంద్రుడును, నీ ముఖమును ప్రకాశించుచుండును.

(16) ప్రతివస్తూపమ :
నీ ముఖమునందే నేను ఆనందము ననుభవింతును. చంద్రునియందే చకోరములు ఆనందము ననుభవించును.

(17) దృష్టాంతము .
ఆకాశమునందు చంద్రుడు ! భూమిపై నీ ముఖము !

(18) నిదర్శనము :
నీ ముఖము చంద్రకాంతి వహించుచున్నది.

(19) వ్యతిరేకము :
నీ నిష్కళంకముఖము చంద్రుని మించెను.

(20) సహోక్తి :
నీ ముఖముతో గలసి రాత్రి చంద్రుడు శోభించును.

(21) సమాసోక్తి :
నీ ముఖము స్మితచంద్రికలతోఁ దిలక కళంకముతో శోభిల్లుచున్నది.

(22) శ్లేషము :
నీ ముఖము అబ్జతుల్యము.
(అబ్జ = చంద్రుడు; పద్మము)

(23) అప్రస్తుత ప్రశంస :

నీ ముఖమునెదుట చంద్రుడు వెలవెలబారుచున్నాడు.

పై ఉదాహరణములనుబట్టి, ఉపమా ప్రాశస్త్యమేకాక వివిధాలంకారముల అంతస్తత్త్వముకూడ నెరుగవచ్చును.

## లుప్తోపమాభేదములు

ఉపమాలంకారమున అవయవములగు ఉపమేయము, ఉపమానము, సమాన ధర్మము, ఉపమావాచకములలో నేదేని లోపించిన నది లుప్తోపమ యగును.

నాలు గంగములు ఒకసారి లోపించుట జరుగదుకదా! ఇక 1. ఉపమానలుప్త 2. ధర్మలుప్త 3. వాచకలుప్త 4. ధర్మవాచకలుప్త 5. ధర్మోపమానలుప్త 6. వాచకోపమేయలుప్త 7. ధర్మోపమానవాచకలుప్త అని లుప్తోపమ ఏడు విధములు.

### ఉపమానలుప్త

లోకోత్తరమైన వర్ణమును, పరిమళమును గల చంపక పుష్పమా! నీకు ఏది సమానమో మే మెరుగము.[1]

ఇందు ఉపమానము లుప్తము.

### ధర్మలుప్త

నీ ముఖము చంద్రునివలె నున్నది

ఇందు సమానధర్మము చెప్పబడలేదు.

### వాచకలుప్త

అతడు నలాభిరాముడు.

అనగా నలునివలె అందమైన వాడు. 'వలె'- ఉపమావాచకము లుప్తము.

### ధర్మవాచకలుప్త

శత్రురాజుల మనోరాజ్యశతము చేతగూడ దురాక్రముడైన యీ రాజ కుంజరుడు యుద్ధప్రవృత్తుడయ్యెను.

ఇందు రాజ కుంజరశబ్దము ఉపమితసమాసము. ఇందు వాచకము, ధర్మము లోపించినవి.

---

1 రసగంగాధరము

ధర్మోపమానలుప్త

మధువనమునంతయు గాలించితిని. చెట్లన్నింటిని చూచితిని. కాని ఓ సహకారమా ! నీవంటి చెట్టుమాత్రము కనుపింపలేదు.[1]

ఇందు ఉపమానము కనుపింపలేదు. సమానధర్మము చెప్పబడలేదు.

వాచకోపమేయలుప్త

కాయజవల్లభాయిత—

ఇందు కాయజవల్లభ— ఉపమానము. ఉపమావాచకము, ఉపమేయము లుప్తములు. కాయజవల్లభాయిత అనగా తనను కాంతిచే రతీదేవిగా ప్రకటించు కొన్నరమణి అని అర్థము.

ధర్మోపమానవాచకలుప్త

ఆమె భీతహరిణేక్షణ.

ఆమె భయముచెందిన లేడికన్నులవంటి కన్నులు గలది అని అర్థము. ఇందు నయనచాంచల్యము — సమాన ధర్మము లోపించినది. విభీతహరి ణేక్షణ ఉపమేయపరము. ఉపమానము లేదు. ఉపమావాచకము లోపించినది.

సర్వవస్తు విషయోపమ

తే॥ గీ॥ ఉర్వి దివి వోలెఁ దనరారు ; నోరుగల్లు
క్రాలు నమరావతీ నగరంబురీతి ;
పౌరులల దేవతల భంగిఁ బ్రథ వహింత్రు
వీరరుద్రుండు హరిమాడ్కి వెలయు సిరుల[2]

మాలోపమ

(1) తెల్లకలువ లటుల, మల్లెల భంగియు
హరుని మాడ్కిఁ దళుకుసరములట్లు
వెండికొండ పోల్కి వెలివెల్గు రీతివి
ప్రథఁ దలిర్పు రుద్రు స్వచ్ఛయశము[3]

---

[1] రసగంగాధరము

[2] ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము పుట 454

[3] ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము పుట 454

మాలోపమకు తిక్కన భారతములోని ఉపమానములు—

(2) సీ. కడుబెట్టిదంబగు గాలిచేఁ గూలిన
మహనీయసాల భూరుహము పోల్కిఁ
ప్రబల కిరాత మార్గణములఁ ద్రెళ్లిన
రాజిత వన్యవారణము మాడ్కిఁ
గల్పాంత వాయునఖ స్ఫురణంబున
వివిరిపోయిన మహార్ణవము కరణిఁ
గాల పర్యయమునఁ దూలి మేదిని మీఁదఁ
బడిన పూర్ణేందు బింబంబు పగిదిఁ
దుఃస్థుడై యుండియును నొప్పు దొరుగ కున్న
యన్నరేశ్వరుఁ గనుగొని యడలు నెడల
తోఁద మేనులు దూలఁగఁ ద్రొబ్బు వడుచుఁ
జేరి యాతని చుట్టు నాసీనులైరి.[1]

ఒకే ఉపమేయమునకు అనేకోపమానములు నివహిత మైనచో అది మాలోపమాలంకారముగ ప్రసిద్ధము.

ముఖపద్మముల సాదృశ్యము

సుందరీ ముఖమునకు పోలికయైన పద్మము ఉపమానములలో మిక్కిలి ప్రాచీనమైనది. అయినను అందలి ఉపమానము నిత్యప్రత్యగ్రముగా గోచరించు నది. నన్నయ భారత మందలి పద్య మిందు కుదాహరణముగా స్వీకరింపదగును.

ఋష్యశృంగుని కడకు ఒక లేజవరాలు వచ్చి వెళ్లినది. అతడు తన తండ్రితో చెప్పినమాట—

ఉ. నన్నను గౌఁగిలించుకొని నా వదనంబునకున్ నిజాస్య మా
సన్నముఁజేసి యొక్క మృదుశబ్దము సేసె మనోహరంబుగా
వెన్నడు నట్టి శబ్దము మునీశ్వర ము న్విని యే నెఱుంగ న
య్యన్నువ బ్రహ్మచారి ముఖమంబురుహంబు సమంబు చూడఁగన్

ఆ జవ్వనిని గూడ లింగభేదము నెఱుగని ఆ ఋషికుమారుడు (ఋష్యశృంగుడు) బ్రహ్మచారి యనియే అభివర్ణించుచున్నాడు. ఋష్యశృంగుని నోట వెడలిన "అయ్యన్నువ బ్రహ్మచారి ముఖ మంబురుహంబు సమంబు"

[1] తిక్కన — భారతము-శల్యపర్వము - 2 - 399

అన్నమాట అలంకార ప్రపంచమునకు జీవనాడి. నన్నయగారి ఆ అంబురుహ ములో, సృష్టిలో మొట్టమొదట వికసించిన తొలి పద్మముయొక్క సౌందర్య సౌకుమార్యములు నిక్షిప్తములై యున్నవి.

### అలంకారాభాసములు

అన్ని అలంకారములకు మూలమైన ఆద్యప్రకృతి సౌందర్య ప్రదీప్తియే. ఉపమానోపమేయములుగా భాసించునవి ఉన్నంతమాత్రమున అలంకార ప్రకర్ష యేర్పడదు. కావున అలంకారాభాసములను అలంకారములుగా నెన్నరాదు

"కంచర గాడిద గాడిద వంటిది" అనిన ఉపమయనియు; "బాహ్లీకుడు గోవు" అన రూపకమనియు "మొద్దా — మనుజుడా"యన సందేహము అనియు; "ఇది వెండి"యని ముత్తెపు జిప్పను జూచి భ్రమపడిన భ్రాంతిమంతము అనియు; "ఇది వెండికాదు" అనిన - అపహ్నుతియనియు; "బలిసిన దేవదత్తుడు పగలు భోజనముచేయడు" అనిన పర్యాయోక్తియనియు; "వీడు ఆ దేవదత్తుడు"అనిన స్మరణము అనియు, "వారువారు వారివారి గృహములకేగిరి" అనిన యథా సంఖ్యము అనియు; "కొడుకుతో కలిసి తండ్రి వచ్చెను" అనిన సహోక్తి యనియు; "వాడు లేకుండ వీడు వెళ్ళెను" అనిన వినోక్తి యనియు తలంప రాదు. ఇట్టివి అలంకారాభాసములేగాని అలంకారములు గావని ప్రాచీనాలంకారికులు చేసిన హెచ్చరిక విస్మరింపరానిది.

## 2. అనన్వయాలంకారము

ఒక వస్తువు నిరుపమానమని చెప్పుటకు ఆ వస్తువును ఆ వస్తువుతోడనే పోల్చిన అనన్వయాలంకారము. దండి మతమున నిది యుపమాభేదమే గాని ప్రత్యేకాలంకారము గాదు.

> గగనం గగనాకారం సాగరస్సాగరోపమః
> రామరావణయోర్యుద్ధం రామరావణయో రివ

ఆకసము ఆకసమువలె నున్నది. సాగరము సాగరమువలె నున్నది. రామ రావణయుద్ధము రామరావణ యుద్ధమువలెనున్నది-అనిన అనన్వయమే. అనన్వయ మునకును లాటానుప్రాసమునకును గల భేదము ప్రకరణాంతరమున సమీక్షింతము.

## 3. ఉపమేయోపమాలంకారము

రెండు వస్తువులు పరస్పరముతప్ప అసదృశములని వర్ణించుట ఉపమే యోపమ. దండిమతమున నిది ఉపమాభేదము.

ఉదాహరణములు—

(1) సజ్జనుల మనస్సు మేఘోదకమువంటిది; మేఘోదకము సజ్జనుల మనస్సు వంటిది.

(2) మన్మథుడు చంద్రునివలెను, చంద్రుడు మన్మథునివలెను విరహుల బాధిం చుటయందు దక్షులు [1]

(3) క॥ శరణాగత శరణంబున
నరసింహుని సాటివచ్చు నరసాహసు(డీ
నరసింహు( డితడె కెన యా
నరసింహుడెకాక యితర నరులకు వశమే[2]

## 4. ప్రతీపాలంకారము

ఉపమేయమె చాలును ధర
నుపమానంబేల ? యనగ నొనరు( బ్రతీపంబు

అని భట్టుమూర్తి కావ్యాలంకార సంగ్రహము (5-178)లో అభివర్ణించెను. ప్రతీపాలంకారము ఉపమాలంకారమునకు ప్రతిద్వంద్వి. చంద్రాలోకములో ప్రతీపము 5 విధములుగా విభక్తము.

(1) ఉపమానమునకు ఉపమేయత్వ కల్పన.
(2) ఉపమేయ తిరస్కారము.
(3) ఉపమాన తిరస్కారము
(4) ఉపమాన అనిష్పత్తి.
(5) ఉపమాన కిమర్థత.

ఉదాహరణములు—

### ఉపమానమునకు ఉపమేయత్వకల్పన

ఉదాహరణము—

పద్మములు నీ కన్నులతో సమానములు.

కన్నులు వర్ణ్యములైనను ఇచ్చట ఉపమానములైన పద్మములనే వర్ణ్యములుగా మార్చి కన్నులకు ఉపమానత్వము కల్పింపబడినది. కనుక ఇది ప్రతీపము. ఇచట ఉపమేయత్వ కల్పన విశేషము.

### ఉపమేయ తిరస్కారము

ఉదాహరణము —

ఓ మొగమా ! కాంతియందు నిన్ను బోలినవాడు చంద్రుడున్నాడు. ఏల గర్వపడెదవు ?

[1] ఆంధ్రచంద్రాలోకము – సూరకవి.
[2] నరసభూపాలీయము–పంచమాశ్వాసము – 32

### ఉపమాన తిరస్కారము

ఉదాహరణము—

ఓ మృత్యువా! నీతో సమానములైన కాంతాజనములు కలరు. క్రౌర్యదర్పము నీ కేల?

### ఉపమాన అనిష్పత్తి

ఉదాహరణము—

ఓ కాంతా! పద్మము నీ మొగముతో సమానమైనదట! ఇది నిజము కాదు. అపవాదము.

### ఉపమాన కిమర్థత

ఉదాహరణము—

ఉపమానమువలన ప్రయోజనమేమి? ఈయువతి ముఖము చూచిన పద్మమెందుకు? చంద్రుడెందుకు?
ప్రతీపమునకు ప్రాచీన కావ్యములందలి ఉదాహరణములు-

(1) మ॥ అలరుండీఁగలు, పూవుగుత్తులు కురంగాలోకముల్ పల్లవం
బులు పంచానన మధ్యముల్ మధుకరంబుల్ బింబముల్ దాడిమీ
ఫల బీజాదులు నద్రిజావయవ సౌభాగ్యంబుతో నీడు రాఁ
గలవో? లేవో? యటంచుఁ జూచుగతి నా గ్రావంబునం ద్రిమ్మరున్।

పై పద్యములో పరమేశ్వరుని పర్వతవిహారవర్ణన మున్నది. అందు పార్వతీ సౌందర్యసౌభాగ్యము భివర్ణితము. ఉపమేయములకు ఇచ్చట ప్రాధాన్య వివక్ష లేదు. ఉపమానములే వర్ణ్యములైనవి గావున ఇది ప్రతీపాలంకారము. ఇందు ఉత్ప్రేక్షకూడ తిలతండులన్యాయమునకలిసియున్నదనుట సుగమము.

[1]ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యము -1- 100

# 5

# రూపకము, పరిణామము

## 5. రూపకాలంకారము

ఉపమానోపమేయములకు అభేదమునుగాని, తాద్రూప్యమునుగాని నిరూపించుట రూపకాలంకారము. కాని ఈ యైక్యముచే ఉపమేయము కప్పబడదు. ఈ అలంకారమందు ఉపమానము తన రూపమును ఉపమేయమున కొసంగును. కావున రూపకమయ్యెను. సందేహము, అపహ్నుతి, భ్రాంతిమద తిశయోక్తుల యందు ఉపమేయము కప్పబడును. వానికి రూపకమునకుఁ గల భేదము అరయదగినది.

ఉదాహరణము—

అనీతి యను వృక్షమును ఛేదించుటకు ఇంద్రియనిగ్రహము గండ్రగొడ్డలి.

### రూపక భేదములు

మమ్మటుడు రూపకమును కింది విధముగ వింగడించియున్నాడు—



పై భేదములకు కొన్ని ఉదాహరణములు—

*శుద్ధనిరవయవ రూపకము*

బుద్ధి యనునది దీపము. దానిచే నంతయుఁ బ్రకాశవంతమగును. బుద్ధిలేమి చీకటి రాత్రి; అందు నేమియుఁ గానరాదు[1]

*సావయవ రూపకము*

రాత్రియను లేజవరాలు వెన్నెల యను చీరను, చుక్క లను నగలను, చీకటులను వేనలిని ధరించి శోభించుచున్నది.

*పరంపరిత రూపకము*

ఆపత్సముద్రమును దాటుటకు ధైర్యమనునది పెద్ద నావ. ఆపత్తుసముద్రము గుటచే ధైర్యము నావయగుట అపరిహార్యము.

*నిరవయవమాలారూపకము*

ఉ॥ విద్య నిగూఢగుప్తమగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశబంధువున్
విద్య విశిష్టదైవతము విద్యకు సాటిధనంబు లేదిలన్
విద్య నృపాలపూజితము విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే[2]

*మాలాపరంపరితరూపకము*

ఉ॥ కుముదవనాళికిన్ బలుపు, కోకములాటకు విల్లు, దిగ్వధూ
సమితికిఁ బూత, మేఁత నవశాబచకోరకరాజి కిందుకాం
తములకు ద్రావకంబగుచు దర్పకశాస్త్ర నిరూపితౌషధ
క్రమములఁ బండువెన్నెలలు గాసె ధరాస్థలి మోహనంబుగన్[3]

*అశ్లిష్టమాలాపరంపరిత రూపకము*

సీ॥ వైరి భూపాలక ప్రాణాపహరణోత్థ
బాహు భుజంగ విస్ఫార జిహ్వ
బలదర్పితారాతి వనపాటనక్రియా
ప్రచలితోజ్జృంభిత ప్రబలవాత్య
గర్విత పరరాజ కటక దాహోద్భూత
శౌర్యోగ్ర దహన విస్తార ధూమ్య
జయరమా సుందరీ సరసవిలాస న
ర్తనచాలిత భ్రూలతామతల్లి
ప్రముదితోర్వీ మయూరీ వివాస యష్టి
విశ్వ భవనార్గళియుఁగాఁగ వెలయునట్టి
ఖడ్గలతఁగేలఁగీలించి, కదనభూమి
క్రీడల నృల్పు కాకతితేఁడు సతము[4].

---

[1] రసగంగాధరము
[2] భర్తృహరిసుభాషితము — ఏనుగు లక్ష్మణకవి-నీతిశతకము - విద్వత్ పద్ధతి—16
[3] ధూర్జటి : శ్రీ కాళహస్తి మాహాత్మ్యము-ద్వితీయాశ్వాసము - 135
[4] ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము - 468 పుట.

రూపకమును ఆరు విధములుగా చంద్రాలోక కర్త వింగడించెను

రూపకము




పై ఆరు విధముల రూపకమునకు చంద్రాలోకకారు డిచ్చిన ఉదాహరణములు—

అధికాభేదరూపకము

శివుడు సమదృష్టిని స్వీకరించి విశ్వమును రక్షించుచున్నాడు.

న్యూనాభేదరూపకము

తృతీయ నేత్రము వినా ఈతడు శంభుడే!

అనుభయాభేదరూపకము

క్షణములో పురమును దహించిన ఈతడు సాక్షాత్తుగా ధూర్జటియే!

అధికతాద్రూప్యరూపకము

ఈ ముఖచంద్రుడు కళంకియగు చంద్రుని అతిశయించుచున్నాడు.

న్యూనతాద్రూప్యరూపకము

ఈ సాధ్వి సుధాసాగరమున జనింపని అపరలక్ష్మి

అనుభయతాద్రూప్యరూపకము

ఈ ముఖచంద్రునిచేతనే నేత్రానందము లభించుచుండగా ఇక చంద్రుడేల?

## 6. పరిణామాలంకారము

పరిణామాలంకారమునకు ఆంధ్ర చంద్రాలోకము చెప్పిన లక్షణమిది—

తే. గీ॥ విషయి విషయాత్మతను క్రియాన్వితమైన
నదియు పరిణామమనగ ఖ్యాతికెక్కు[1]

సంస్కృత చంద్రాలోకమున "పరిణామః క్రియార్థశ్చే ద్విషయీ విషయాత్మనా" అని యున్నది

విషయి (ఉపమానము) విషయ (ఉపమేయము) తాదాత్మ్యమును బొంది క్రియతోగూడి యుండినదైన పరిణామాలంకారము.

[1] ఆంధ్ర చంద్రాలోకము - 6

ఉదాహరణము—

తే గీ. అవనిరోనఁ బ్రసన్నేక్షణాంబుజముల
నాయతేక్షణ చూచెడి ననగ శర్వ[1]

"ప్రసన్నేన దృగబ్జేన వీక్షతే మదిరేక్షణా"-అని దీనికి మూలము చూచునది అంబుజముకాని నేత్రము గాదు. అంబుజమెట్లు స్వయముగా చూడ గలదు ? కావున అంబుజము నేత్రముగా పరిణమించెనని చెప్పవలయును విషయి విషయతాపరిణామము నొంది క్రియావిశిష్టమైయున్నది. కావున నిది పరిణా మాలంకారము. కొందరు ఆలంకారికుల మతములో పరిణామాలంకారము రూపక ప్రభేదమే.

పరిణామాలంకారమునకు ప్రాచీనకావ్యములందలి ఉదాహరణములు—

(1) మ॥ ఉదయగ్రావము పానవట్ట మభిషేకోదప్రవాహంబు వా
ర్ధి ధర ధ్వాంతము ధూపధూమము జ్వలద్దీప ప్రభారాశి కౌ
ముది, తారానివహంబు లర్పితసుమంబుల్గాఁ దమోదూర సౌ
ఖ్యదమై శీతగభస్తిబింబ శివలింగం బొప్పెఁ బ్రాచీదిశన్[2]

ఇందు విషయి - (ఉపమానము) విషయ - (ఉపమేయ) తాదాత్మ్యమును బొందినది. చంద్రబింబము శివలింగముగా పరిణమించుట సుగమము.

(2) క॥ నైలింపసతుల కౌఁగిటఁ
దేలటకై దివికి నేగు దృప్తారులకున్
నీలాల నిచ్చెనాయెను
నీలాలితహేతి యోబనృవనరసింహా ![3]

"స్వర్గలోకమునందలి స్త్రీలను అనుభవించుటకై దివి కేగు నీ శత్రురాజు లకు నీ ఖడ్గము నీలమణిమయమైన నిచ్చెనయైనది" - అని కవివర్ణన. ఇచట - ఉపమానోపమేయముల తాదాత్మ్యము నరయునది.

---

[1] ఆంధ్రచంద్రాలోకము-6

[2] శ్రీ కాళహస్తి మాహాత్మ్యము - 2-133

[3] కావ్యాలంకార సంగ్రహము 5-51

# 6
# ఉత్ప్రేక్ష

## 7. ఉత్ప్రేక్షాలంకారము

ఉత్ప్రేక్షాలంకారమునకు లక్షణమును కావ్యాలంకారసంగ్రహమున (5-62) భట్టుమూర్తి కింది విధముగా చెప్పెను.

క॥ ఉపమేయమునకుఁ గలిగిన
యుపమాన గుణక్రియాదియోగముచే నా
యుపమానమె యని తలఁచిన
నపు డది యుత్ప్రేక్ష యయ్యెః నదియును ధరణిన్.

ఉపమానగతములైన గుణక్రియాదుల సంబంధముచే ఉపమేయమును ఉపమానముగానే సంభావించుట ఉత్ప్రేక్ష. ఉపమానము సుప్రసిద్ధమైనది యగునేని యది ఉపమాలంకారమనియు అట్లుగాక అది అప్రసిద్ధము, కవికల్పితము అగునేని ఉత్ప్రేక్షయనియు ప్రతాపరుద్రీయకర్త అభిప్రాయము.

ఉదాహరణమునకు——

చీకటిని చక్రవాకియొక్క విరహాగ్నినుండి పుట్టిన పొగయని తలంచెదను[1]

ఇచ్చట చీకటి ప్రస్తుతము (విషయము); పొగ అప్రస్తుతము (విషయి) నల్లగ నుండుట, దృష్టిప్రతిరోధము కలిగించుట మొదలైన అప్రస్తుతమైన పొగయొక్క ధర్మములు (విషయ మందు) చీకటియందు నున్నవి.

ఉత్ప్రేక్ష వాచ్యమనియు, ప్రతీయమాన (గమ్య) మనియు రెండు విధములు ఉత్ప్రేక్షావాచకములైన తలఁచెద, అనునట్లు మున్నగు ఊహకు సంబంధించిన పదములు ప్రయుక్తములైనచో నది వాచ్యోత్ప్రేక్ష. లేనిచో ప్రతీయమానోత్ప్రేక్ష.

అభేద ప్రాధాన్యాలంకారములలో రూపకాదులు ఆరోపగర్భము లనియు ఉత్ప్రేక్షాతిశయోక్తులు అధ్యవసాయ గర్భములనియు "అలంకారసర్వస్వ" మతము. అభిన్నముగఁ ప్రతిభాసించుట అధ్యవసాయము. ఇది సిద్ధమనియు సాధ్య

---

[1] చంద్రాలోకము

మనియు ద్వివిధము. ఎచ్చట విషయికి అసత్యతాప్రతీతి కలదో అది సాధ్యము. ఇది అతిశయోక్తిలో నుండును. ఎచ్చట అసత్యమైన విషయికి సత్యతాప్రతీతి యుండునో అది సిద్ధము. అది ఉత్ప్రేక్షలలో గోచరించును.

అలంకార సర్వస్వములో ఉత్ప్రేక్ష అనేక విధముల విభజింపబడినది—




పై పట్టికలో జాతికక్ష్యకు వలెనే తక్కిన మూడు గుణక్రియా ద్రవ్య కక్ష్యలకును అవే ప్రభేదములు గలవు కావున వాచ్యోత్ప్రేక్షలు వెరసి 96.



ఇట్లు వాచ్య ప్రతీయమానోత్ప్రేక్షలు రెండును కలిసి $96 + 48 = 144$ భేదము లేర్పడినవి.

కావ్యాలంకార సంగ్రహమునందు వాచ్యోత్ప్రేక్ష 56 భేదములనియు గమ్యోత్ప్రేక్షతో కలిసి కాని తోంబదియాఱనియు చెప్పబడినది.

"ఇందు నేబదియాఱు భేదంబులం బొల్పు వాచ్యోత్ప్రేక్షకుం గొన్ని నామధేయంబు లెఱింగించెద పబదియాఱు భేదంబులకు నుదాహరణంబు లొనరించినం జాలనగు నను భయంబున దిఙ్మాత్రంబుగ లక్ష్యంబులు నిరూపించెద[1]"

అని భట్టుమూర్తి దిఙ్మాత్రముగ కొన్ని ఉదాహరణములను మాత్రమే నిరూపించెను. చంద్రాలోకమున స్వరూప, హేతు, ఫలోత్ప్రేక్షలని ఉత్ప్రేక్షా భేదములు చెప్పబడినవి.

### స్వరూపోత్ప్రేక్ష

వస్తువు కానిదానిని వస్తువుగా చెప్పుట వస్తూత్ప్రేక్ష లేక స్వరూపోత్ప్రేక్ష.

ఉదా : భూమిని కొలుచు కొలబద్దయో అనునట్లు హిమాలయములు వ్యాపించియున్నవి.

### హేతూత్ప్రేక్ష

హేతువు కాని దానిని హేతువుగ గ్రహించుట హేతూత్ప్రేక్ష.

ఉదా : గాంధీమహాత్ముని హత్యచే జాతీయదుఃఖమును చూడలేక యనగ సూర్యుడస్తమించెను.

గాంధీ హత్య సాయంసమయమున జరిగినది అది సూర్యాస్తమయ సమయము. సూర్యాస్తమయము గాంధీమహాత్ముడు జీవించియున్నను తప్పదు. కాని హేతువు కానిదానిని హేతువుగా పేర్కొనుటచే నిది హేతూత్ప్రేక్ష.

### ఫలోత్ప్రేక్ష

ఫలము కానిదానిని ఫలముగా పేర్కొనుట ఫలోత్ప్రేక్ష.

ఉదా : ఓ పడతీ నీ పదముతో నైక్యము పొందుటకు పద్మము నీటి యందు తపమాచరించుచున్నది.

పద్మముయొక్క జలావాసమునకు కామినీ పదైక్యము ఫలము కాదు.

ఉత్ప్రేక్షా ప్రభేదములకు నరసభూపాలీయమునందలి ఉదాహరణములు మచ్చునకు కొన్ని—

---

1 కావ్యాలంకార సంగ్రహము 5-68

### క్రియాహేతూత్ప్రేక్ష

చ॥ మొగము ముడించెఁ గచ్ఛపము, మో మఱవాంచె భుజంగపుంగవుం
డగము చలింపఁగా వెఱచె, నాదివరాహము మోరత్రోపునం
దెగువఁబయోధిఁజొచ్చె సుదతీమకరాంక నృసింహభూప! నీ
జగదభినంద్య భూభరణశక్తి కృతాభిభవంబుచేఁబలెన్[1]

నరసభూపాలుని భూభరణశక్తిచే గలిగిన పరాభవముచే కాబోలు ఆది కూర్మము మొగము ముడుచుకొన్నది ఆదిశేషుడు తలవాల్చెను. కులపర్వతము కదలలేకపోయెను. ఆదివరాహము మోరత్రోసికొనుచు సముద్రము దూరెను.

### ద్రవ్యస్వరూపోత్ప్రేక్ష

సీ॥ సటలెకా నొకకొంత చాలదు పౌరుషం
బాయుధ పౌఢి యింతైన లేదు
జననమెంచినఁబ్రదోషంబుపాలౌట, మా
టికిఁ బుట్టినట్టి చోటికిని జేటు
నెఱిఁదిన్నవాని కెన్నికగాని తన బల్మి
ద్వేషి గన్నను నోరు దెఱచుకొనుట
పాటంవనోరి బొబ్బాటమే వడిగాని
ఘోరాజిలో బుసకొట్టుచుంట
కొదవఁదనకంచుఁ గ్రమ్మఱ మదితుఁడై న
యల్లనరసింహుఁడును బోలె నసమసమర
సృమరఘోర ప్రతాపుఁడై చెలఁగుదౌర
సరసగుణహార! యోబయనరసధీర!

అలనాటి నరసింహావతారములోఁ గల లోపములు సవరించుకొనుటకో యన విష్ణువు తిరిగి నరసభూపాలుడయ్యెను.

[1] కావ్యాలంకార సంగ్రహము 5 - 89

# 7

# స్వభావోక్తి, యథాసంఖ్యము

## 8 స్వభావోక్త్యలంకారము

వస్తువులయొక్క విశిష్ట ధర్మమును ఉన్నది ఉన్నట్లుగా వర్ణించుట స్వభావోక్తి. దీనినే పూర్వాలంకారికులు 'జాతి'యనిరి. కావ్యాలంకారసంగ్రహము(5-112) నందు స్వభావోక్తి లక్షణ మిట్లున్నది—

క। సహృదయ హృదయంగమమై
మహి మన్నది నున్నయట్లు మాటల తేటల్
బహుళంబులుగాఁ జెప్పిన
మహితోక్తియె జాతియయ్యె మహినెట్లన్నన్.

ఉదాహరణములు—

(1) చ॥ కొమరునఁగర్ణతాళములు గొండిలిసల్ప మదాంబుధార గం
డము దిగజాఱ మస్తకము మాటికిఁదూల కరంబునాడఁ బా
దములను మూఁడు మోపి యిలదాపునఁగొండొక రీతి నిల్చు నా
సమద గజేంద్రమున్ గనుచు సంతసమొందును తేడు నిత్యమున్.[1]

(2) శా॥ వాలారుంగొనగోళ్ల వీవలసతన్ వాయింపుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్న మొదలున్ వీవంటమింతేః యా
యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాత వాతాహతా
లోలత్తంత్రుల మేళవింపఁగదవే లోలాక్షి దేశాక్షిన్.[2]

పై పద్యమునందలి భావమిది—

విరహిణియైన వరూధిని నిన్న నాటకు మేళవించిన వీణను నేటి ఉదయము వరకు స్పృశింపక ఉపేక్షించినది. అది ఇప్పుడు ప్రత్యూషపవనాంకురములచే తీగలు కదలి 'అవేళ' యందును ఆ యాలాపమే చేయుచున్నది ... లోలాక్షి వరూధిని వాలారుంగొనగోళ్లతో వీణతీగలను ఉదయకాలమున పాడుకొను

---

1 ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము - పుట 499.

2 మనుచరిత్రము 3-57.

'దేశాక్షి' రాగమునకు అనువుగా మేళవింప వలెనట. ఈ సన్నివేశము నందలి సహజసౌకుమార్య సౌందర్యములు ఈ పద్యమున స్వభావోక్తిగ వెల్లివిరియుట గమనింపదగును.

(౩) ద్వి. తొలుకోడి కనువిచ్చి నిలిచి మైపెంచి
జలజల ఱెక్కలు ఝాడించి నీల్గి
గ్రక్కున కాలార్చి కంఠంబు విచ్చి
ముక్కున నీకెలు చక్కొల్పి కడుపు
వెక్కించి మెడసాచి నిక్కి మున్సూచి
కొక్కొరో కుఱ్ఱని కూయకమున్నె [1]

(4) చ. గగనము నీరుబుగ్గ గొనగా జడివట్టిననాళ్లు భార్య క
న్బొగసొరకుండ నారికెడపుంబొరియల్ దవులించి వండ న
య్యగపలముంచి పెట్టుఁ గలమాన్నము నొల్చిన ప్రప్పు నాలుగే
న్బొగిపిన కూరలున్ వడియముల్ వరుగుల్ పెరుగున్ ఘృతప్లుతిన్.. [2]

(౫) ఉ. చక్కనిబొమ్మ నా ప్రతిమ చందముఁ దెల్పితి నింతెకాక నీ
చక్కదనంబుఁ గన్న యమునం దయిన న్నిలుపోవ శక్యమే
యక్కునఁ జేర్పుమంచు దయ యానతి యీఁదలఁపంచె, నంతలో
నెక్కడనుండి వచ్చెఁ దరళేక్షణకున్ నునుసిగ్గు దొంతరల్ [3]

(౬) సీ. కమనీయ కమలినీ కల్హార వీథులఁ
గదలు రాయంచల నడలయొప్పు
బహుపుష్ప పల్లవ ప్రకర చిత్రితములై
తనరారు తరులతా తతుల సొంపు
మకరంద రసపాన మదవిలోలంబులై
క్రాలెడి యెలదేటి గముల యులివు
పరిపక్వమంజుల ఫలసోద్ధితములై
పలుకు రాచిలుకల పటురవంబు
ప్రియుడు వేఱువేఱఁ బ్రీతిమైఁ జూపుచుఁ
జెప్పుచును జనంగఁ జిగురుఁబోడి
గనుచు వినుచు నిర్వికార సల్లాపము
పార నతని తెఱఁగు నరయుచుండె [4]

---

1 పాల్కురికి సోమన – పండితారాధ్యచరిత్రము.

2 ఆముక్తమాల్యద.

3 విజయ విలాసము 1-169.

4 ఎఱ్ఱాప్రెగ్గడ–భారతము–అరణ్యపర్వము ౭–21?

(7) సీ॥ వెలవెలఁ బారుచు వెగడొందఁ జెవుల
        తడియార నెంతయుఁ దల్లడిల్లు
    జల్లన నంగంబు లెల్లనిండఁ జెమర్పఁ
        బదములఁ గరములు గుదియఁబడఁగ
    హృదయంబు చటచట నదరఁగ బెగడుచు
        దీనదృష్టుల మోము దేఁడి చూచు
    నెలుఁగు గదిసిఁ దొట్రిల నేడ్చు విడుమని
        ప్రార్థించు మాట గీట్పాటు దోప
    నిష్కళంక కనకహేమంబు నిర్మలోజ్జ్వ
    లాష్ట వైడూర్యములుఁ దుర్గాధ్య రథము
    గంటి దశరత్నములుఁ నొసఁగెదఁ బదము సొచ్చి
    నపుడ యిచ్చెద నేను నార్తుఁడగుడ [1]

## 9. యథాసంఖ్యాలంకారము

దీనికి క్రమాలంకారమని పర్యాయనామము. ఉద్దేశ పదార్థములను ఒక ఆనుపూర్విలో క్రమబద్ధ మొనరించుట యథాసంఖ్యాలంకారము.

ఉదాహరణములు—

(1) రాజా! విక్రమము చేతను విద్యనుచేతను విలాసము చేతను శత్రువులకును, విద్వాంసులకును అంగనలకును తాపము, తనివి, మోహము పెంచుచు నీవొక్కడవే ముత్తెరగులవారి మనస్సునందున్నావు

(2) తే గీ॥ కసవుచే నీటిచే మోదములచేత
        బదుకు మృగమీన సజ్జన ప్రతతులకును
        శబరకైవర్తసూచక జనులు జగతి
        కారణములేని పగవారు గారె తలప [2]

(3) మ గతిమధ్యస్తన కుంతలస్తబక వీక్షాగర్వదుర్వార యీ
        పతిచే మానమె యోడుమయ్యె నిఁక నీప్పాలంపుఁ బ్రాణంబుఁ దా
        ల్పఁ దగుల్గాదని రోసి యాప్తపతి వాలుందూపుఁ గ్రొమ్మంట కా
        హూతియౌ బర్హిమృగేంద్రకుంభి చమరీయూథంబునేణంబులున్ [3]

---

1 తిక్కన-భారతము-విరాటపర్వము-ఉత్తర గోగ్రహణము.

2 భర్తృహరి సుభాషితములు ; ఏనుగు లక్ష్మణకవి-నీతిశతకము-దుర్జనపద్ధతి-50.

3 తెనాలి రామకృష్ణకవి - పాండురంగ మాహాత్మ్యము 3-86

# 8

# ఆక్షేపము, విరోధాభాసము

## 10 ఆక్షేపాలంకారము

అభిమతార్థమును ప్రతిషేధముతోఁ గలిపి వర్ణించినచో అది ఆక్షేపాలంకారము. ఉదాహరణములు—

(1) చంద్రుడా! నీ దర్శన మిమ్ము అటుగాని యెడల నా ప్రేయసి యున్నది లెమ్ము

ఇందు ముందు చంద్ర దర్శన మభిలషించినట్టుల గానిపించి పిమ్మట ఉదాసీనత వహించుట స్వవచోవ్యాఘాతము గనుక ఆక్షేపాలంకార మని దీనికి పేరు వచ్చినది.

అలంకార సర్వస్వమతమున నిషేధమాత్రము అలంకారము కాజాలదు. ఆ నిషేధ మాభాస మైనప్పుడే ఆక్షేపాలంకారము కాగలదు.

(2) ఓ ప్రియుడా నీవు దేశాంతరమునకు బొమ్ము! నీవు పోయిన నేమి, నే నక్కడ జన్మించి నీకు ప్రేయసిని కాగలను.[1]

## 11. విరోధాభాసాలంకారము

స్థూలదృష్టికి పరస్పర విరుద్ధమైన భావములుగా గోచరించి సూక్ష్మదృష్టితో మరల అనుశీలించిన ఆ వైరుద్ధ్యము సమసిపోవునెడల అది విరోధాభాసాలంకారము. ఉదాహరణములు—

(1) క॥ అతిలోక సమీక జయో
న్నతిచే ధర్మజున కింపొనర్చుచు వినయా
న్వితుఁడై సమస్త జన న
మ్మతుఁడై నరుడుండె విటుల మానుషచర్యన్[2]

ఇచ్చట నరుడు అను పదమునకు మనుష్యుడు అని అర్థము చెప్పినచో ఏర్పడిన విరోధము అర్జునుడు అను అర్థాంతర స్ఫూర్తిచే సమసిపోవును. అందుచే ఇది విరోధాభాసాలంకారము.

---

[1] చంద్రాలోకము - 32

[2] విజయవిలాసము - ప్రథమాశ్వాసము - 95

(2) సీ ధారాధరంబయ్యుఁదనరు నీ కౌక్షేయ
మనతవాహినికి జీవనదమయ్యె,[1]

ఓ రాజా! నీ కత్తి ధారాధరమయ్యు (మేఘమైనప్పటికి) శత్రుసేనలకు జీవనము (నీరు) నిచ్చునదికాదు.

ఇందు కన్పించు వైరుధ్యము : ధారాధరము (= మేఘము) ఎట్లు అజీవనదము (= నీటినీయనిది) అయ్యెను? అను శంకచే ఉద్భవించును. ఆ శంకను పరిహరించునది శ్లేషార్థమే. కత్తి (= ధారాధరము = వాడి అంచుగలది) జీవనమును ఈయలేనిది, మృత్యువు నిచ్చునది అజీవనదము అగుట సుగమమే. విరోధాభాసములు బహుళముగా శ్లేషసంశ్లిష్టములు.

(3) అమ్మహోత్సవ మజ ప్రధానమగుట విబుధపథంబోలియు మహాసురో
దారంబును, తమోవికృతి విధేయంబగుట విధుబింబంబునుం బోలియుఁ
దారావియోగ ముదితంబును, బహుళధ్వని పరీతంబగుట చక్రవిత్వంబునుం
బోలియు నసాధు పక్ష సంబాధ బంధురంబునయ్యె[2]

---

[1] కావ్యాలంకార సంగ్రహము - 5 - 125

[2] తెనాలి రామకృష్ణకవి - పాండురంగ మాహాత్మ్యము-నిగమ శర్మోపాఖ్యానము 3-76.

# 9

# విభావన, అసంగతి, చిత్రము

## 12 విభావనాలంకారము

కారణము లేకుండగనే కార్యము గలిగినట్లు వర్ణించుట విభావనాలంకారమగును. ఆంధ్రచంద్రాలోకములో చెప్పిన లక్షణమిది-

తే గీ॥ కారణములేక కార్యంబు గలుగ జెప్ప
నది విభావన మనఁగఁ బ్రథ వహించుఁ
దరుణిలాక్షారసానిషిక్తములుగాఁ
యరుణములు నీదు చరణంబు లున్నయట్లు [1]

విభావనాలంకారమునకు ఉదాహరణములు—

(1) వనితా! లాక్షారసము పూయకపోయినను నీ చరణములు అరుణములుగా నున్నవి.

(2) ఓ మన్మథుడా! నీ బాణములు పుష్పములైనను లోకములన్నిటిని జయించుచున్నవి.

(3) శంఖమునుండి వీణారవ ముద్భవించుచున్నది. (సుందరాంగియొక్క శంఖమువంటి కంఠమునుండి శ్రావ్యమైన సంగీతము వినవచ్చుచున్నది).

(4) ఆ తన్విని శీతాంశుకిరణములు తపింపజేయుచున్నవి (ఆమె విరహిణి).

(5) సీ॥ నలినారిలేని వెన్నెలలు రాతులలేని
తావులు, లతలేని కోరకములు,
కొలనులేని సితాబ్జములు, స్వాతిచినుకులు
లేని ముత్తెము, లేఱులేని నురువు
లలరు వెల్తురులేని వెలిమబ్బులు, హిమాద్రి
లేని మంచులు, వార్ధిలేని సుధలు,
గనిలేని వజ్రముల్ గంధాదిలేని గం
ధములు, దారములేని తారవితతు

తే. గీ॥ లౌర! నీ కీర్తిరుచులు మహానుభావ!
భావజాకార కారుణ్యభాసమాన
మానకురురాజ రాజన్యమకుట నిహిత
చరణరాజీవ! యోబభూపవరసింహ! [2]

---

1 ఆంధ్రచంద్రాలోకము

2 కావ్యాలంకార సంగ్రహము 5-135

(6) చం॥ జలధరింప లింగజాని జంపరు, పూయరు బూదిపూత మై,
నడుగరు భిక్ష, కట్ట రజినాంబరముల్, చరియింపఁబోరు పే
రడవుల, నగ్గిరింద్ర మహిమాతిశయంబిఁక నేమి సెప్పుదున్
బడయుదు రూరకుండియును బ్రాణులు చిత్రముగా శివత్వమున్।

## 13. అసంగత్యలంకారము

కార్యకారణములు భిన్నస్థలములందు, లేదా విరుద్ధస్థలములందు గోచరించినచో అసంగత్యలంకారము ఆంధ్రచంద్రాలోకములోని లక్ష్యలక్షణములు–

తే గీ అవు నసంగతి కార్యహేతువుల కతి వి
రుద్ధగయు భిన్నదేశత రూఢమైన
వనధరమ్ములు విషముద్రావంగఁ బధిక
కామినులు మూర్ఛచెందిరిన్ కలికశర్వ [2]

"జలధరములు విషము ద్రావినవి పథికాంగనలు మూర్ఛిల్లిరి" అను ఉదాహరణములో కారణము జలధర విషపానము కార్యము పథికాంగనల మూర్ఛ కార్యకారణములు భిన్నదేశములందున్నవి. అయినను విషమనగా నీరు. మూర్ఛిల్లుట అను మాట మోహపారవశ్యమును సూచించును. వర్షాగమమున పాంథస్త్రీలు మోహము చెందినారను అర్థము గ్రాహ్యము.

## 14 చిత్రాలంకారము

అపేక్షించిన ఫలమునకు విరుద్ధముగా గన్పించు యత్నమొనర్చుట చిత్రాలంకారము. ఉదాహరణము——

సమున్నతిని పొందగోరు సజ్జనులు వినమ్రులై యుందురు.
ఇందు కోరినఫలితము ఉన్నతి చేసిన యత్నము నమ్రత [వంగుట].

---

[1] ధూర్జటి-శ్రీ కాళహస్తి మాహాత్మ్యము 1-103

[2] ఆంధ్రచంద్రాలోకము-37

# 10

# అనోన్యమును, ఉల్లేఖము

## 15 అన్యోన్యాలంకారము

రెండు వస్తువులు పరస్పరాశ్రయముచే శోభించునట్లు వర్ణించుట అన్యోన్యాలంకారమగును. దీనికి చంద్రాలోకమందలి ఉదాహరణము—

రాత్రిచే చంద్రుడు శోభిల్లుచున్నాడు. చంద్రునిచే రాత్రి శోభిల్లుచున్నది.

## 16 ఉల్లేఖాలంకారము

ఒక వస్తువు నిమిత్తవశమున పలువిధంబుల భాసించుట ఉల్లేఖము.

ఉదాహరణములు——

(1) అతడు వాక్కులందు బృహస్పతి; కీర్తియందర్జునుడు; చాపమున భీష్ముడు.

(2) ఆతనిని మహిళలు మన్మథునిగను, యాచకులు కల్పతరువుగను, శత్రువులు యమునిగను జూతురు.

మొదటి ఉదాహరణమున భావించువారు పలువురు. రెండవదానిలో ఒకడే పలువిధముల భావించును ఎట్లైన నుల్లేఖమే.

(3) మ॥ రవిబింబంబుపమింపఁబాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలినుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమైవటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచో ![1]

(4) ఉ॥ కాముక హృద్ధధింగలఁచు కవ్వము; బువ్వము దేవకోటికిన్
వ్యోమపథంబు తేనెపెరకొప్పెడు పర్వము, మవ్వముత్పల
శ్రీమతికిన్, జకోరమహిషీ మధుపాళికిఁబోచునన్నమై
యామవతీశ బింబముదయాచల మెక్కెఁ బ్రభాళిపెక్కువన్

[1] పోతన భాగవతము

[2] ధూర్జటి శ్రీ కాళహస్తిమాహాత్మ్యము 4–92

(5) సీ. కెలఁకులనున్న తంగెటిజున్ను గృహమేధి
యజమాను డంకస్థితార్థపేటి
పండినపెరటికల్పకము వాస్తవ్యుండు
దొడ్డిఁబెట్టినవేల్పుగిడ్డి కాపు
కదలేని యమృతంపు నడబావి సంసారి
సవిధమేరునగంబు భవనభర్త
మరుదేశపథమధ్యమప్రప కులపతి
యాఁకటికొదవు సస్యము కుటుంబి

తే. గీ. బధిర పంగ్వంధభిక్షుక బ్రహ్మచారి
జటిపరివ్రాజకాతిథిక్షపణకావ
ధూత కాపాలికాద్యనాథులకుఁగాన
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె [1]

ఈ పద్యమునందు గృహస్థునియొక్క ఘనత నిరూపింపబడినది ఒక్క గృహమేధియే - అంకస్థితార్థపేటిగ, పెరటికల్పకముగ పలువిధములుగ ఉల్లేఖింపబడినాడు గావున ఉల్లేఖము

(6) శా. దేవబ్రాహ్మణభక్తి ప్రోవు ప్రియసత్యత్వంబుకాణాచి, వి
ద్యావైదుష్యము దిక్కు, ధర్మమునకున్ దార్కాణ, మర్యాదకున్
ఠా, వౌచిత్యము జీవగఱ్ఱ, హితశిష్టవ్రాత సంతోషణ
శ్రీ వజ్రాంగి, యజాతశత్రుఁడు మహీభృన్మాత్రుఁడే చూడఁగన్। [2]

(7) క. బాణుఁడవి కవులు; మురజి
ద్బాణుండవి విమతభూమిపాలురు సుమనో
బాణుఁడని సతులు దలఁపుదు
రేణాంకసమాను నోబళేంద్రునృసింహున్ [3]

---

[1] మనుచరిత్రము 1-66

[2] విజయవిలాసము - 1 - 85

[3] కావ్యాలంకార సంగ్రహము - 5 - 61

# 11

# అపహ్నుతి

## 17 అపహ్నుత్యలంకారము

క. ఉపమేయము గాదని యిది
ఉపమానమె యనఁగ నెంతయు నపహ్నవమౌ
నపుడిది ప్రాగారోపము
నపహ్నవారోపమును ఛలాదియు నయ్యెన్.[1]

విషయమును (ఉపమేయమును) నిషేధించుచు సామ్యముచే దానియందు విషయిని (ఉపమానమును) ఆరోపించుట అపహ్నుతి.

ఉదాహరణములు——

(1) ఇది ముఖమా ? కాదు చంద్రబింబము !

(2) మ॥ గురుచక్రప్రభగాని శౌర్యవిషమాంకూరంబుగా దిందు భా
స్వర కీర్తిద్యుతిపంక్తిగాదు గిరిజాంచత్పాంచజన్య ప్రభా
భరమౌ గా; నటుగాన విశ్వభరణ ప్రారంభముంగోరి యీ
నరసేంద్రాకృతి నుద్భవించెఁ గమలానాథుండు విశ్వంభరన్.[2]

(3) సీ॥ ఇంద్రచాపంబు గాదిది మౌళితలమున
నమరించు బర్హిపింఛంబు గాని
భిదుర ఘోషంబు గాదిది పాంచజన్య సం
జాత గంభీర ఘోషంబు గాని
ఆశ్రయించిన బలాకావళి గాదిది
హారి ముక్తాహార యష్టిగాని
ఇది కోలమెఱుఁగుగాదుదిరి బంగారంపుఁ
బసిమి గ్రమ్మెడు పచ్చపట్టుగాని

తే గీ వృష్టికాదిది కరుణాంబు వృష్టిగాని
నీలమేఘంబు గాదిది నీలవర్ణుఁ
డౌర నా మ్రోల ప్రత్యక్షమయ్యె ననుచు
హర్ష పులకిత తనువయ్యె నవ్వధూటి.[3]

---

[1] నరసభూపాలీయము - 5-58

[2] కావ్యాలంకార సంగ్రహము - 5-59

[3] తెనాలి రామకృష్ణకవి-పాండురంగ మాహాత్మ్యము - 4-31.

(4) ఉ॥ ఇతలు కన్నులుండ తెరువెవ్వరివేఁడెదు భూసురేంద్ర! ఏ
కాంతమునందు నున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించు లా
గింతయ కాక నీవెరుఁగవే మును వచ్చిన దారి చొప్పు నీ
కింత భయంబు లేకడుగ నెల్లిదమైతిమి మాట లేటికిన్.[1]

అపహ్నుత్యలంకారము మూడు విధములు :— 1. ప్రాగారోపము (ఆరోపించి నిషేధించుట), 2. అపహ్నవారోపము (నిషేధించి ఆరోపించుట), 3. ఛలాది పదప్రయోగము (నెపముపెట్టి నిషేధించుట).

ఉదాహరణములు—

*ప్రాగారోపము*

ఇది ఉప్పొంగిన నాలుగు సంద్రముల కలకలము కాని సైన్యరవము గాదు.

*అపహ్నవారోపము*

ఇది దుందుభికాదు; కల్పాంతమునందలి రుద్రుని ఢక్క !

*ఛలాది పదప్రయోగము*

ప్రతాపరుద్రుడను నెపమున సాక్షాత్తు రుద్రుడే రాజయినాడు, లేనిచో అతని చూపెట్లు శత్రువుల భస్మము చేయగల్గుచున్నది ?

---

[1] అల్లసాని పెద్దన - మనుచరిత్ర ; 2-41.

# 12

# అతిశయోక్తి

## 18. అతిశయోక్త్యలంకారము

(1) గోరంతలను కొండంతలు చేసి అభివర్ణించుట లేదా (2) ఉపమేయమును అధఃకరించి ఉపమానమునే అభివర్ణించుట అతిశయోక్తి. "ఉపమేయ మింత తడవక యుపమానమె నుడువ నతిశయోక్తి కవిమహోక్తిపుణోక్తి మూలమై తగు నపరిమితప్రౌఢి" యని నరసభూపాలీయమునందలి లక్షణము.

ఉదాహరణములు—

మ॥ కల గెం దోయధిసత్వరంబు గిరివర్గంబెల్ల నూటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మాశాచక్రమల్లాడెఁ గొం
దల మందెం ద్రిదశేంద్రు పట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె నా
కులమయ్యెన్ గ్రహతారకాకులము సంక్షోభించె నవ్వేధయున్.[1]

తే. గీ॥ తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరుఁ ద్రాగవచ్చుఁ
దిరిగి కుందేటి కొమ్ము సాధింపవచ్చుఁ
జేరి మూర్ఖుల మనసు రంజింప రాదు.[2]

### *ఉత్ప్రేక్ష : అతిశయోక్తి*

ఉత్ప్రేక్షయందును, అతిశయోక్తియందును విషయాధఃకరణము సామాన్యమే! రెండును అధ్యవసాయగర్భములే. ఉత్ప్రేక్షలో అధ్యవసాయము సాధ్యము అతిశయోక్తిలో సిద్ధము

### *అతిశయోక్తి భేదములు*

ఆలంకారికులు పలువిధములగు అతిశయోక్తి భేదముల నెన్నిరి. చంద్రా

---

[1] తిక్కన-భారతము (అర్జునుడు దేవదత్తమునొత్తుట) విరాటపర్వము - ఉత్తర గోగ్రహణము

[2] భర్తృహరి సుభాషితములు — ఏనుగు లక్ష్మణ కవి, నీతిశతకము - మూర్ఖపద్ధతి-౬

లోకమున అతిశయోక్తి ఎనిమిది విధములుగా విభక్తము. అవి 1. రూపక, 2 భేదక, 3 సంబంధ, 4. అసంబంధ, 5. అక్రమ, 6. చపల 7. అత్యంతాతిశయోక్తి

## రూపకాతిశయోక్తి

ఉపమేయమును మరుగుపరచి ఉపమానరూపముచే ఉపమేయాధ్యవసాయము చేయుట రూపకాతిశయోక్తియని చంద్రాలోకమతము. అనగా ఉపమేయములైన ముఖాదులను తద్వాచకములగు ముఖాదిపదములతో చెప్పక ఉపమాన భూతములైన పద్మాది పదములచే వానిని సూచించుటయే. ఉపమానమునందు ఉపమేయారోపణ ముండుటచే నిది రూపకాతిశయోక్తియైనది

రూపకాతిశయోక్తి శుద్ధ, సాపహ్నవ-అని రెండు విధములు

## శుద్ధరూపకాతిశయోక్తి

ఉదాహరణము—

"పశ్య నీలోత్పల ద్వంద్వాన్నిస్సరంతి శితాశ్శరాః"—

నీలోత్పలద్వంద్వమునుండి శితశరములు ప్రసరించుచున్నవి చూడుము !

## సాపహ్నవ రూపకాతిశయోక్తి

ఉదాహరణము—

"త్వత్సూక్తిషు సుధా రాజన్ భ్రాంతాః పశ్యంతి తాం విధౌ"

నీసూక్తులందు సుధ యున్నది రాజా ! అజ్ఞానోపహతులు సుధను చంద్రునియందు చూచుచున్నారు.

# 13
# తుల్యయోగిత, దీపకము

## 19 తుల్యయోగితాలంకారము

కేవలప్రకృతములకుగాని కేవలాప్రకృతములకుగాని ధర్మసామ్యము వలన ఔపమ్యము స్ఫురింపఁ జేసినచో తుల్యయోగితాలంకారము.

ఇది రెండు విధములు (1) కేవల ప్రకృతతుల్యయోగిత (2) కేవలాప్రకృతతుల్యయోగిత

*కేవల ప్రకృత తుల్యయోగిత*

**ఉదాహరణము—**

చంద్రోదయమువలన స్వైరిణీముఖములును, పద్మములును సంకోచము నొందెను.

ఇట సంకోచము తుల్యధర్మము. పద్మపరముగా ముకుళనము. వదన పరముగా వైవర్ణ్యము అని అర్థము.

*కేవలాప్రకృత తుల్యయోగిత*

**తే గీ॥** కాకతీంద్రుండు తేఁదయిఁ గ్రాలుచుండ
కూర్మపన్నగ దిగ్గజకులశిలోచ్చ
యములు పెంపటి యాత్మసారములుపోయి
తోఁచు నౌరౌర శ్రీ రుద్రదోర్బలంబు [1]

## 20 దీపకాలంకారము

ప్రకృతములకును అప్రకృతములకును సాధారణధర్మముచే ఏకాన్వయము కల్పించినచో దీపకాలంకారము

**ఉదాహరణము—**

**చం॥** బిసరుహగర్భుప్రాతయును విష్ణునిచక్రము వజ్రిపజమున్
దెసలను రాముబాణము యుధిష్ఠిరుకోపము కాలుదండమున్
మసకపుఁబాముకాటును కుమారుని శక్తియు మౌనిరోషమున్
బసవని రౌతుశూలమును పండితవాక్యము రిత్తపోవునే [2]

ఇందు అప్రకృతములకు ప్రకృతమైన పండితవాక్యముతో సంఘటితమైన ఏకాన్వయము సుగమము

---

1 ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము పుట - 515

2 వేములవాడ భీమకవి చాటువు

# 14

# ప్రతివస్తూపమ, దృష్టాంతము నిదర్శనము, పర్యాయము

## 21. ప్రతివస్తూపమాలంకారము

ఉపమానోపమేయములకు గల సమానధర్మమును విభిన్నశబ్దములచేత చెప్పిన ప్రతివస్తూపమ.

**ఉదాహరణము—**

మహాశయములు గలవాఁడు ఆపద్గతుఁడైనను నూతనమైన ఔదార్యమునే ప్రసరింపఁ జేయును. అగరుద్రవ్యము అగ్నిగతమైనను లోకోత్తరమైన పరిమళమునే ప్రకటించును.

## 22. దృష్టాంతాలంకారము

ఉపమానోపమేయవాక్యములందు భిన్నధర్మములు బింబప్రతిబింబ భావమున సమానధర్మముగ భాసించిన దృష్టాంతాలంకారము.

**ఉదాహరణము—**

(1) ఓ రాజా నీవే కీర్తిమంతుడవు, చంద్రుడే కాంతిమంతుడు.

(2) క॥ రంజనచెడి పాండవు లరి
భంజనులై విరటుఁ గొల్వఁ బాల్పడి రకటా!
సంజయ! విధినేమందును?
కుంజరయూధమ్ము దోమకుత్తుకఁ జొచ్చెన్[1]

(3) చ॥ అమృతము గ్రోలు జిహ్వ చవి యంచుఁ దలంచునె తేనె? నింటిలో
నమరమహీరుహంబుదయమైన నరుండవనీఱు వేఁడునే ?
యమిజనభాగ్యరూపమగు నాదిమహత్త్వముఁ గాళహస్తి దై
వము భజియించు మానసము వారవధూమదసౌఖ్య మెంచునే?[2]

---

[1] తెనాలి రామకృష్ణుని చాటువు

[2] ధూర్జటి - శ్రీ కాళహస్తి మాహాత్మ్యము 4-46.

*తుల్యయోగిత : దృష్టాంతము : ప్రతివస్తూపమ*

తుల్యయోగితయందు వాక్య మొకటేయుండును. ప్రకృతములకు గాని అప్రకృతములకు గాని ఏకధర్మముండును. దృష్టాంతమునందును ప్రతివస్తూపమయందును వాక్యములు రెండేసియుండును. ప్రతివస్తూపమయందు సమాన ధర్మమును భిన్నశబ్దములు తెలుపును. దృష్టాంతమునందు భిన్న ధర్మములను భిన్న శబ్దములు తెలుపును. అయినను బింబప్రతిబింబ భావముచే అవి సమానధర్మములుగా భాసించును.

## 23 నిదర్శనాలంకారము

సమానములైన వాక్యార్థముల కైక్యారోపణము చేయుట నిదర్శనాలంకారము

**ఉదాహరణములు—**

(1) ఓమదనాంతక అంతరాత్మలో ప్రకాశించుచున్న అనంతుడవైన నిన్ను తీర్థములందు వెదకు నజ్ఞులు కరమున వెలుగుచున్న చింతామణిని మరచి దుమ్ములో వెదకువారే [1]

(2) అరణ్యరుదితం కృతం శవశరీర ముద్వర్తితం
స్థలేఽబ్జమవరోపితం సుచిరమూషరేవర్షితం
శ్వపుచ్ఛమవనామితం బధిరకర్ణజాపః కృతో
ధృతోఽంధముఖ దర్పణో యదబుధోజనస్సేవితః[2]

"మూర్ఖులను సేవించుట— అనగా అరణ్యములో ఏడ్చుట; శవశరీరమునకు నలుగు పెట్టుట; భూమిపై తామరతీగ నాటుట; చవిటి నేలలో కుంభవృష్టి కురియుట; కుక్కతోకను సవరించుట; చెవిటి చెవిలో రహస్యము చెప్పుట; అంధునకు అద్దముచూపించుట - యగును"

(3) శా॥ శ్రీలాలిత్యము నిత్యశుద్ధియు గుణోత్సేకంబునుంగల్గి యు
ద్వేలస్ఫూర్తిఁ దలిర్చు తండ్రి యను నబ్ధింజంద్రుఁడై తోచినన్
బోలుంగాక భవాదృశుం డితరుఁడై పుణ్యంబులం బాసినన్
సాలగ్రామశిలన్ జనించునె గదా జాత్యల్ప పాషాణముల్ [3]

*సదర్థ బోధనరూప : అసదర్థ బోధనరూప*

ఒకానొకవస్తువు తనపనిచే ఇతరులకు సదర్థమునుగాని అసదర్థమునుగాని బోధించినచో అదియును నిదర్శనమే

1 రసగంగాధరము

2 కువలయానందము

3 తెనాలి రామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్యము । నిగమశర్మతో అక్కగారన్న మాటలు 3—34

ఇది 1 అర్థబోధనరూప 2 అదర్థబోధనరూప అని రెండువిధములు మొదటిదానికి ఉదాహరణము—

"సూర్యుడు తాన ఉదయించుటతోడనే పద్మములకు వికాసము కల్గించుచు సంపదలు ఉన్నందుకు ఫలము నెచ్చెలులను ఆదరించుటయే యని బోధించు చున్నాడు"

*నిదర్శనము:దృష్టాంతము*

దృష్టాంతమునందును నిదర్శనము నందును ఉపమానోపమేయ వాక్యములకు బింబ ప్రతిబింబ భావ ముండును నిదర్శన మందు రెండు వాక్యములను సాపేక్షములు ఒకదానికి రెండవదానితో అన్వయము ఉండును దృష్టాంతమున రెండువాక్యములు నిరపేక్షములు

## 24 పర్యాయాలంకారము

ఒక వస్తువునకే ఒక ఆశ్రయము పిమ్మట మరియొక ఆశ్రయము పర్యాయముగ అభివర్ణించినచో పర్యాయాలంకారమగును ఒకే ఆధారమున అనేక వస్తువు లున్నట్లు వర్ణించినను పర్యాయాలంకారమే

ఉదాహరణములు—

(1) కామినీ వదనకాంతి పద్మమును విడిచి చంద్రుని బొందినది

(2) వెనుక ప్రవాహమున్నచోట నిప్పు డిసుకతిన్నె యున్నది [1]

(3) శా ఆకాశంబుననుండి శంభుని శిరంబందుండి శీతాద్రి సు
శ్లోకంబైన హిమాద్రినుండి భువి భూలోకంబునందుండి య
స్తోకాంభోధి పయోధినుండి పవనా ధోలోకముంజేరె గం
గా కూలంకష పెక్కుభంగులు వివేకభ్రష్టసంపాతముల్ [2]

(4) సీ మానసీయానంత మణికాంతధామమై
ఇది హిమానీవేళ నింపునింపు
శోణప్రవాళ మంజులతా నికాంతమై
అలరించు నిది వసంతాగమమున
తరళముక్తాదీప్తి ధారాధివాపమై
వేసవి నిది మహోల్లాసమొసగు
ప్రబలవజ్రోపల ప్రాసాదభాసమై
తొలకరినిది కుతూహలము విలుపు
జనవరోత్తమ యిది సర్వసమయసౌఖ్య
జనకమిందలి ఆలేఖ్యసాధ్యసిద్ధ
కిన్నరాంగనలభిగీత గీతనృత్య
వాద్యములుసూపి నిలుతురు వలయునెడల [3]

---

[1] చంద్రాలోకము

[2] భర్తృహరి సుభాషితములు – ఏనుగు లక్ష్మణకవి నీతిశతకము – మూర్ఖపద్ధతి – 9,

[3] వసుచరిత్ర – విమానవర్ణన 3 – 15

# 15

# అర్థాంతరన్యాసము

## 25 అర్థాంతరన్యాసాలంకారము

విశేషమును సామాన్యముచేతగాని సామాన్యమును విశేషముచేతగాని సమర్థించుట అర్థాంతరన్యాసాలంకారము

### విశేషసమర్థనము

(1) హనుమంతుడు అబ్ధిని దాటెను మహాత్ములకు దుష్కర మే మున్నది?

(2) మ. జలజాతాసన వాసవాది సురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధుఁ గన్నతండ్రి శిరమచ్చో వామపాదంబునం
దొలగంద్రోచె లతాంగి యట్లయగు నాథుల్ నేరముల్ సేయఁ బే
రలుకం జెందిన కాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే [1]

### సామాన్య సమర్థనము

(3) గుణవద్వస్తు సంసర్గమువలన స్వల్పమునకును గౌరవమబ్బును పుష్ప మాలానుషంగముచే దారము శిరస్సున ధార్యమగుచున్నదిగదా!

క్రింది ఉదాహరణములందలి అర్థాంతరన్యాసము గమనించదగును —

(4) మ॥ అకలంకౌషధ సత్త్వముందెలియ మాయాద్వారకావంతికా
శి కురుక్షేత్ర గయాప్రయాగములు నే సేవింపకుద్దండ గం
డక వేదండ వరాహవాహరిపు ఖడ్గవ్యాఘ్ర మిమ్మంచుఁగొం
డకు రాఁజెల్లనె? బుద్ధి కార్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్ [2].

ఇచ్చట ప్రవరుడు — పాదలేప మాహాత్మ్యముచే హిమాలయమునకు వచ్చుట హిమాలయమందలి మంచుచే నాలేపము కరిగిపోవుట — తానచ్చట కదలలేక స్తంభించిపోవుట—చెప్పి, ఆ అంశమును అర్థాంతరన్యాసముచే

---

[1] పారిజాతాపహరణము

[2] మనుచరిత్రము 1–16

సమర్థించెను. సువిశాలవిశ్వములో ఎన్ని క్షేత్రములు లేవు! కాశి: ప్రయాగ... మున్నగునవి వదలి మంచుమలకే తాను రావలెనా! అది అతని బుద్ధిజాడ్యము మాత్రమే గాక శ్రోత్రియులందరికిని నది సామాన్యధర్మముగా చెప్పినాడు. ఇట్లు వ్యక్తినిష్ఠమైన విషయము సర్వశ్రోత్రియ సామాన్యమైనట్లు చెప్పినాడు.

ఈ విధముగా విశేషమును సామాన్యముచే సమర్థించెను.

(5) కం॥ తమ విద్య నెవ్వ రే మా
త్రము గనఁజాలుదురు వారి దండను దన్మా
త్రమ ప్రకటింతురు బుధు, లు
త్తముల మహిమ నీరు కొలది తామరసుమ్మీ[1]

విద్యాసాగరులైన పండితోత్తములు ఎదుటివారు ఎంత గ్రహింప జాలుదురో, అంతమాత్రమె తమ విద్యను ప్రకటించుట కద్దు. ఇది సామాన్య విషయము. ఆ ఉత్తముల మహిమ నీరుకొలది తామర సుమ్మీ అను విశేష విషయముచే దీనిని సమర్థించుట జరిగినది. చెరువులో నీరు అధికమైన కొలది తామర పెరుగుట సహజము. పండితులును ఎదుటివారిలోతు నరసి తమ పాండిత్యమును ప్రకటించుట కద్దు.

(6) చ॥ ఉతిపయి వట్టి ప్రాఁకులుఁ జిగిర్ప వసంతుఁడు దా రసోపగుం
భిత వదవాసనల్ నెఱప, మెచ్చక చంద్రుడు మిన్నునన్ ప్రస
న్నతయును సౌకుమార్యము గనంబడ బాల్గరగంగఁ జేసె నే
గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే గదా[2]

(7) చ॥ కదుకొని ధర్మతత్త్వమెఱుఁగంగ నశక్యము ధర్మబాహ్యా వి
న్నొరబడ విష్ణుఁడై కలపి యుత్తములుండఁగ వాసుదేవుఁ ద
న్నడునకుఁ బూజయిమ్మని విచారవిదూరుఁడు భీష్ముఁడెంతయున్
వెరఁగుదనంబునం బలిచె వృద్ధుల బుద్ధులు సంచలింపవే[3]

(8) చ॥ అనటయు మాటలేక హృదయాబ్జము జల్లన మోము వెల్లనై
కనలుచు నీరు దేఱు తెలిగన్నుల నాతనిఁ బుల్కుపుల్కునం
గనుఁగొని మాటలం బొదువు గద్గదికం దలయూచి అక్కటా
వనిత తనంతఁదా వలచి వచ్చినఁ జుల్కన గాదె యేరికిన్[4]

---

[1] శాపూర్ణోదయము

[2] విజయవిలాసము 1-210.

[3] నన్నయ భారతము· శిశుపాలుడు ధర్మజు నాక్షేపించుట, సభాపర్వము 2-9.

[4] మనుచరిత్ర వరూథినీ ప్రవర సంవాదము 2-66.

(9) తే గీ॥ తవిసిరే వేల్పు లుదధి రత్నములచేత ;
వెఱచిరే ఘోరకాకోల విషముచేత ;
విడిచిరే యత్నమమృతంబు వొడముదనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు.[1]

[1] భర్తృహరి సుభాషితములు. ఏనుగు లక్ష్మణకవి, నీతిశతకము, ధైర్యవద్ధతి-71

# 16

# వక్రోక్తి, పర్యాయోక్తి

## 26. వక్రోక్త్యలంకారము

తే. గీ. అవును వక్రోక్తి శ్లేషకాకువులచేత
వమర నవరార్థ కల్పనం బయ్యెనేని:
సూరకవి వేలుపెవ్వడు ? సోముఁ డుత్ప
లాప్తుఁడా ? కాఁడు గౌరి సహాయుఁడనగ.[1]

శ్లేషముచేతగాని, కాకుస్వరముచేతఁగాని యర్థాంతరము కల్పించినయెడల వక్రోక్త్యలంకారమగును.

"సూరకవి వేలుపెవ్వడు ?"
"సోముడు" (స + ఉమ అని విడదీయవచ్చును. అంతేగాక సోముడు = చంద్రుడు)
"ఉత్పలాప్తుడా ఏమి ?
"కాదు - గౌరి సహాయుడు"

పై ప్రశ్నోత్తరములందలి వక్రోక్తి శ్లేషవలన నేర్పడినది.
కాకు వక్రోక్తికి ఉదాహరణము —

శా. గంగాసంగమ మిచ్చగించునె మదిన్ గావేరి దేవేరిగా
నంగీకారమొనర్చునే? యమునతో నానందముం బొందునే ?
రంగత్తుంగ తరంగ హస్తముల నా రత్నాకరేంద్రుండు నీ
యంగం బంటి సుఖించునేని గుణభద్రా తుంగభద్రానదీ [2]

## 27. పర్యాయోక్త్యలంకారము

వివక్షితార్థము భంగ్యంతరముచేత ప్రతిపాదించుట పర్యాయోక్తి. ఇందు అంతరార్థము ప్రాముఖ్యము వహించును.

చంద్రాలోకమున పర్యాయోక్తము రెండు విధములుగా విభక్తము.

---

[1] అడిదము సూరకవి - చంద్రాలోకము — 93

[2] తెనాలి రామకృష్ణకవి-పాండురంగ మాహాత్మ్యము 1-139

(1) గమ్యార్థమునకు రూపాంతర వర్ణన (2) వ్యాజముచే ఇష్టసాధన. రెండవదానికి ఉదాహరణము —

"యామి చూతలతాం ద్రష్టుం యువాభ్యా మాస్యతామిహ"

నాయికా నాయకులకు సమాగమ మొనగూర్చి చెలికత్తె పలుకును—
"మీరిద్దరిచ్చట నుండుడు !

నేను గున్నమామిడిచెట్టును చూచుటకై వెళ్లుచున్నాను". ఆ చెలికత్తె వెళ్లుచున్నది - వారిద్దరి మధ్య తా నంతరాయముగా నుండకూడదని. ఆ మాటను భంగ్యంతరముగా చెప్పుచున్నదనుట సుగమము.

పర్యాయోక్తికి ప్రాచీన కావ్యములందలి ఉదాహరణములు—

(1) ఈ గంగాదిక తీర్థము
లీ గంగా నీవు నమ సమిద్ధాంబువులన్
దోఁగెడువారల గన గనఁ
గ్రాఁగెడు నంగార సింధు కల్లోలములన్[1]

[1] తెనాలి రామకృష్ణకవి : పాండురంగమాహాత్మ్యము - 1-160.

## 17. శ్లేషాలంకారము

ఒక్కమాటచే (ఏకశబ్దప్రయుక్తిచే) అనేకార్థములఁ బ్రతిపాదించుట శ్లేషాలంకారము.

ఉదాహరణము :-

(1) రాజా కువలయానందకరుఁడు

రాజు = రేఁడు, చంద్రుడు

కువలయము = భూమి, నల్లకలువ

చంద్రుడు కలువలకు ఆనందము కల్గించువాడు అనియు, రేడు భూవలయమునకు ఆనందము కల్గించువాడు అనియు, రెండర్థములును ఏకకాలమందే సిద్ధించుచున్నవి. శ్లేషాలంకారమునందు అనేకప్రభేదము లున్నవి.

(2) వాడు మాధవుడు

(1) వాడు + మాధవుడు = వాడు విష్ణువు

(2) వాడు + ఉమాధవుడు = వాడు శివుడు

(3) పార్వతీ పరమేశ్వరులు

(1) పార్వతీ + పరమేశ్వరులు = పార్వతీ పరమేశ్వరులు

(2) పార్వతీప + రమేశ్వరులు = శివకేశవులు

(4) మ॥ మహిమున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ దత్ ప్రాగల్భ్య మూహించెదన్.[1]

ఇందు వాగనుశాసనుడు (నన్నయ-బ్రహ్మ), కుండలీంద్రుడు (సోమయాజి-ఆదిశేషువు), శ్రీనాథుడు (శ్రీనాథకవి-విష్ణుదేవుడు), సోముడు

---

1 రామరాజభూషణుడు - వసుచరిత్ర - అవతారిక

(నాచనసోముడు - చంద్రుడు), భాస్కరుడు (భాస్కరకవి-సూర్యుడు). ఇందు రెండర్థములలో ఒకటి ప్రకృతము, రెండవది (ప్రపంచవర్ణనము) అప్రకృతము. అందుచే నిది ప్రకృతాప్రకృతశ్లేషము.

(5) ఉచ్చరద్ భూరికీలాలుడైన వాహినీపతి విరాజిల్లెను

(సేనాపతి, సముద్రుడు ఇద్దరి పరముగా రెండర్థములు అనుగమ్యమాన ములు) ఇది ప్రకృతాప్రకృతశ్లేషము

1. ప్రకృతశ్లేష 2. అప్రకృతశ్లేష 3. ప్రకృతాప్రకృతశ్లేష అని శ్లేష త్రిధా విభక్తము.

(6) ఉ॥ జీవన మెల్ల సత్కవి నిషేవిత; మాశయ మెల్ల నచ్ఛతా
పావనతాగభీరతల పట్టు; ప్రచారములెల్ల విశ్వధా
త్రీవలయ త్రికాలఫలదేశికముల్; నవకంబులెల్ల ము
క్తావళి విభ్రమాస్పదము లానది పెంపు నుతింపశక్యమే[1]

శ్లేషకవితాసార్వభౌముడుగ బహుళాంధ్రోక్తిమయప్రపంచమున సాహితీ ప్రాగల్భ్యము సంపాదించుకొని ప్రాతఃస్మరణీయుడైన రామరాజ భూషణమహాకవి వ్రాసిన అనేకపద్యరత్నములలో పై పద్యము ఒక మచ్చుతునక మాత్రమే.

ఆ నది పెంపు నుతింప శక్యముగాదు. జీవనము (బ్రదుకు - నీరు) సత్కవి (మహాకవులు - నీటి పక్షులు) ఆశయము (మానసము - మడుగు) పావనత్వమునకు, గభీరతకు (లోతునకు అగాధత్వమునకు)అటపట్టు. ప్రచారములు (ప్రవర్తనలు - జలప్రవాహములు) త్రికాలఫలదేశికములు (ముక్కారు పంటలు త్రికాలజ్ఞతా పాదకములు పండించునవి-). నవకంబులు =(నవ+కంబులు) = నవకములు - క్రొత్తశంఖములు), ముక్తావళి (యోగీశ్వరులు - ముత్యాలు) విభ్రమాస్పదములు.

1 రామరాజ భూషణుడు: వసుచరిత్ర శుక్తిమతీ-నదీ వర్ణన 2-105

# 18

# అప్రస్తుత ప్రశంస, సమాసోక్తి లలితము

## 18. అప్రస్తుత ప్రశంసాలంకారము

అప్రస్తుతవిషయము వివరించుటచే ప్రస్తుతవిషయము స్ఫురించుట అప్రస్తుత ప్రశంసాలంకారము

**ఉదాహరణమునకు—**

(1) **ఉ॥** స్థానవిశేషమాత్రమున తామరపాకున నీటిబొట్టు విన్
పూవిన మౌక్తికంబనుచు పోల్చిన మాత్రన వింతగర్వమా?
మానవతీ శిరోమణుల మాలికలందునఁ గూర్పవత్తువో
కానుక లియ్యవత్తువొ! వికాసమునిత్తువొ. విల్వవత్తువో![1]

(2) **ఉ॥** గ్రాసములేక స్రుక్కిన జరాకృశమైన విశీర్ణమైన పా
యాసమునైన నష్టరుచియైనను ప్రాణభయార్తమైన సం
త్రాస మదేభకుంభపిశిత గ్రహలాలసశీల సాగ్రహా
గ్రేసర భాసమానమగు కేసరి జీర్ణతృణంబు మేయునే.[2]

## 19. సమాసోక్త్యలంకారము

ప్రస్తుతవిషయముయొక్క విశేషణాదుల సామ్యమును బట్టి అప్రస్తుతమైన మరియొక విషయము స్ఫురించినచో సమాసోక్తి.

**ఉదాహరణము—**

(1) ప్రియా! ఐంద్రీముఖమును చంద్రుడు రక్తుడై చుంబించుచున్నాడు. చూడు!

చంద్రోదయవర్ణన ఇక్కడ ప్రస్తుతవిషయము ఇందు 'ముఖ' శబ్దమునకు 'అగ్రభాగము - వదనము' అను అర్థములును 'రక్త' శబ్దమునకు 'లోహితుడు కాముకుడు' అను అర్థములును సామాన్యములు. చంద్రశబ్దము పుంలింగము.

---

[1] ముక్కు తిమ్మన చాటుధార

[2] భర్తృహరి సుభాషితములు - ఏనుగు లక్ష్మణకవి-మానశౌర్య పద్ధతి - 21.

ఐంద్రీశబ్దము స్త్రీ లింగము. ఈ సామ్యములవలన రక్తుడైన కాముకుడు ప్రేయసీవదనమును ముద్దిడుచున్నాడను అప్రస్తుతవిషయము స్ఫురించుచున్నది. 'చుంబించు' శబ్దమునకు ముద్దిడు - స్పృశించు అను రెండర్థములు గలవు.

(2) క॥ కలకంఠరుతులఁ బిలుచుచు
ఫలములఁ జవిజూడుఁడనుచుఁ బదములఁ బెనఁగున్
బలమటిపరచు భవద్రిపు
లలనాతతిఁ గాంచి వింధ్యలతలు నృసింహా[1]

(3) సీ॥ చిగురు కెంగేలు సాచె రసాలవల్లరి
తేటిచూపులఁ జూచె తిలకలతిక
పికగీతిఁ బాడిచూపెఁ బ్రియాళులత, వల్కెఁ
గీరభాషలఁ గర్ణికారశాఖ
ముఖరక్తినింపె వింపుగల సంపఁగికొమ్మ
వన్నెగా నగియె లేఁబొన్నతీఁగె
మరళిశ్వసనంబు నెరపె సింధుకవల్లి
గ్రుచ్చెఁ దావుల సోఁకఁ గ్రోవిరెమ్మ
యాత్మరుచిరోపచారంబులధిపకల్ప
కంబునకుఁ దత్తదామోదగరిమఁ బెనువ
నంగనానిత్యకలితదోహదవిశేష
సన్నుతాచారములసదిసన్నకతన[2]

చిగురుకెంగేలు, తేటిచూపులు, కీరభాష లనుచోట రూపకము సిద్ధము. ఈ సీసపద్యములోని ప్రధానాలంకారము సమాసోక్తి. ప్రస్తుత విషయములగు తిలకలతిక - కర్ణికారశాఖ - రసాలవల్లరి అనువానివలన అప్రస్తుతమగు నాయికల దోహదవిశేషములు స్ఫురించుచున్నవి. కావున, ఇందలి అలంకారము సమాసోక్తి.

## 20 లలితాలంకారము

తే. గీ ప్రస్తుతం బగుచుండ వర్ణ్య వచనార్థ
మపుడు ప్రతిబింబవర్ణనం బయ్యేనేని
లలితమన నలరుచుమందు జలము దొలఁగఁ
గట్టకట్టెడి విదియను కరణి ధరణి[3]

ప్రస్తుతమందు వర్ణింపవలసిన విషయమును వర్ణింపక, ఆ విషయము స్ఫురించుమరియొక వాక్యము ప్రతిబింబకల్పమైనదానిని వర్ణించుట లలితాలంకారము.

---

[1] కావ్యాలంకార సంగ్రహము

[2] రామరాజభూషణుడు—వసుచరిత్ర 1–158

[3] అడిదము సూరకవి ఆంధ్రచంద్రాలోకము – 66

ఉదాహరణము—

(i) ఆమె గళజల సేతుబంధనమునకై యత్నించుచున్నది.

ఈ మాటలు ఒక చెలికత్తె తన నెచ్చెలి గూర్చి అన్న పలుకులు. ఆ నెచ్చెలి తన్ను బ్రతిమాలవచ్చిన నాయకుని కసరి పోనాడుకొని పిమ్మట దూతికను పంపుటకు యత్నించుచున్నదన్నమాట.

(ii) వలవకుఁ గూటికినై పీ
చుల వేదం బోదచౌరవఁ జొచ్చునతఁడు పూ
వుల ముడిచిన యంగళ్లనె
కలకల పీడెల్ల నవ్వఁ గట్టెలు మోపెన్[1]

1. తెనాలిరామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్యము, నిగమశర్మ వర్ణనము. 3-21

# 19

# వ్యతిరేకము, సందేహము, భ్రాంతిమంతము, స్మరణము

## 19. వ్యతిరేకాలంకారము

గుణవిశేషముచేత ఉపమేయోప ఉపమానములలో నేదేనొకటి ఆధిక్యముఁ కలదని వివరించిన నది వ్యతిరేకాలంకారము.

ఉదాహరణములు—

(1) ఆర్యులు శైలములవలె సమున్నతులు
కాని స్వభావముచేఁ గోమలులు[1]

ఇట ఉపమానము కొండలు, ఉపమేయ మార్యులు. కొండలకు లేని కోమలత్వము ఆర్యుల కున్నట్లు అభివర్ణితము. ఉపమేయాధిక్యము సుగమము. కావున నిది వ్యతిరేకాలంకారము.

(2) పరుషవచనము ముల్లువంటిది కాని గ్రుచ్చుకొనిన ముల్లు పాదమును క్షణకాలమే వేధించును. పరుషవచనమో హృదయమును చిరకాలము వేధించును.

పై ఉదాహరణమున ఉపమేయాధిక్యము ఉండుటవలన వ్యతిరేకాలంకారము.

(3) సీ॥ బహుతరాశాక్రాంతి బయలుప్రాఁకకయున్నఁ
గువలయద్వేషంబుఁ గోరకున్న
మీటి తమ్ముల విరిపోటు పేయకయున్న
దోషాభిభూతుఁడై తొలఁగకున్న
జగతినందఱకును బగలొనర్పకయున్న
వారుణీ సక్తివిఁ బాలకున్న
ద్విజరాజ పరిభవోద్వృత్తిఁ జేకొనకున్న
సరసుల వింకింపఁ జాలకున్న

[1] చంద్రాలోకము – 20

పాటియగు విశ్వవిమత శశ్వత్ప్రతాప
వైభవధ్వస్త దుర్వారవైరి వీరుఁ
డైన యోబయనరసింహ నమితభువన
భవనభృత తేజమున కబ్జబాంధవుండు[1].

ఇందు సూర్యునికన్న నరసభూపాలుని తేజ మధికతరమని చెప్పబడుటచే వ్యతిరేకాలంకారము. ఇందు ఉపమేయాధిక్యమే ఈ అలంకారమునకు "వ్యతిరేకము" అను పేరు వచ్చుటకు కారణము "భేదప్రధానసామ్యము" ఈ అలంకార విశిష్టత.

(4) ఉ॥ సారథి దానవుండు పడిసాగదు చక్రయుగంబు ప్రాతసం
చారపు గుఱ్ఱముల్ రథియు సౌఖ్యమునందరమానిసాత్మవి
స్తారము దండదండములు తానఁట మాసరియంచుఁ దత్పురిం
దేరులు నవ్వు శంకరుని తేరిని గేలన కింకిణీధ్వనిన్[2]

(5) ఉ॥ హర్తకుగాదు గోచర మహర్నిశమున్ సుఖపుష్టిఁ జేయు స
త్కీర్తిఘటించు విద్యయను దివ్యధనం బఖిలార్థి కోటికిం
బూర్తిగ నిచ్చినన్ బెరుగుఁ బోదు యుగాంతపు వేళనైన భూ
భర్తలు తద్ధనాధికులపట్టున గర్వము మానుటొప్పగున్[3]

(6) తే. గీ॥ బావ! నలరాజు గర్వఁ బుఁ బాపురూపు
వాఁడు! రేరాజుకళల మించాగు రేఖ
మేలు! నలరాజు సోయగమేలుఁ జెలువ
మమ్మ! యీరాజు ప్రతిగానమమ్మ! యెచట[4]

## 20 సందేహాలంకారము

ఉపమానోపమేయములకుఁ గల సాదృశ్యమువలన, 'ఇదియా' 'అదియా' యనికలిగిన తుల్యబలమగు సంశయము సందేహాలంకారము.

ఉదాహరణములు —

(1) సీ॥ రాకేందు బింబమో! రాజీవమో! మించు
టద్దమో! లేక నెమ్మద్దుమొగమొ![5]

---

1 నరసభూపాలీయము

2 తెనాలి రామకృష్ణకవి – పాండురంగమాహాత్మ్యము

3 భర్తృహరి సుభాషితములు: ఏనుగు లక్ష్మణకవి నీతిశతకము – విద్వత్పద్ధతి – 12

4 విజయ విలాసము–2–73

5 బిల్హణీయము.

2. సందేహాలంకారము (1) శుద్ధము (2) నిశ్చయగర్భము (3) నిశ్చయాంతమని ముప్విధము.

*నిశ్చయగర్భ సందేహము*

విద్యారణ్య స్వామినిగూర్చి—

(2) ఈతడు పరమేశ్వరుడా ! అయిన మూడు కన్నులు లేవే !
ఈతడు విష్ణుదేవుడా ! అయిన చతుర్భుజములు లేవే !
ఈతడు బ్రహ్మదేవుడా. అయిన నాలుగు ముఖములు లేవే !

అని పండితులు చిరకాలము తర్కించి, చివర కితడు శ్రీమూర్త్యంశమైన పరంజ్యోతియే యని నిశ్చయించిరి. దీనిని నిశ్చయగర్భసందేహాలంకారమునకు. ఉదాహరణముగ నెన్నవగును

*నిశ్చయాంత సందేహము*

(3) సీ॥ తలపోయ వల్లిమతల్లికే గతిఁ గల్గె
నలపాల పానూనయాన కలన
భావింప మణి సాలభంజిక కెటులబ్బె
లాలితాలాప లీలాకలాప
మూహింప విమల విద్యుల్లతకేలీల
నొదవె ధాత్రీ భాగయోగ గరిమ
మరయంగ మదన మంత్రాధిదేవతకునే
గతిఁ గల్గె నంగ సంగ ప్రసంగ
మనుచు శబరులు సందిగంబంది యంది
తెలియుదురు తోనెపి ధాటి కలికి తలఁకి
అహిత వనితలు వనధాటి నరలు చవికి
నరసుతాటోప యోబయనరస భూప![1]

నరసభూపాలునిశ్శత్రుకాంతలు అడవులపాలైరి. వారిని జూచి ఆటవికులు లత యెట్లు నడవనేర్చె ? సాలభంజిక యెట్లు మాటాడనేర్చె ! ...అని సందేహించి చివరకు వారు నరసభూపుని శత్రువులకాంతలని నిశ్చయించుకొనిరి. కావున నిశ్చయాంతసందేహమైనది.

ఉలూచి అర్జునుని నాగలోకమునకుఁ దెచ్చినది. అర్జునుఁడు కనులువిప్పి చూచినప్పుడు క్రొత్త ప్రపంచములోనున్న అతని భావపరంపర...

---

[1] నరస భూపాలీయము 5-55

సీ॥ దట్టంపుఁ దెలినీటి తరఁగ చాల్కడ కొత్తి
నెలతాల జగతి దా నిలుచుటేమి ?
కొలఁకుఁ దెమ్మెర గందములఁ గ్రిందఁ బడవైచి
కలవంపుఁదావి దాఁ గవియుటేమి ?
చివురు జొంపపు మావి జీబు మాయముసేసి
పసిఁడి యుప్పరిగ దాఁ బ్రబలుటేమి ?
పెద్దంపు టినుము తిన్నియ పాన్పుఁ దిగఁ ద్రోచి
యలరుల పాన్పు దా హత్తుటేమి ?
మసమసక సంజ కెంజాయ మఱుఁగు వెట్టి
మిసిమి కెంపులకాంతి దా మెఱయుటేమి ?
మొదలనే గంగతటినున్న యదియు లేదొ ।
మాయయో కాక యిదియంచు మరల చూడ[1]

(5) సీ॥ మోము పున్నమ చందమామ వెన్నెలగాయ
దెందంపుఁ గెందమ్మి గ్రిందుపడునొ ?
వాలుఁ జూపనియెడు వేలుపు తేనికై
దువఁ జాయగట్టు గట్టవియఁ బడునొ ?
కొప్పను చీఁకటిగుంపు గప్పుకొనంగఁ
దలఁపు తెర్వరి త్రోవదప్పి పడునొ ?
[2]రాయంచ నడపుల రాయిడిఁ దాల్మితా
మరతూడు దుమురుగా మరలఁ బడునొ ?
వలువ, తమగోల్వ వచ్చిన వఱకుఁ జెలువ
చెలువ మరయుచు, వలరాజు చిలుకు ములికిఁ
దలఁకి, మిన్నక యొకకొంత తడవు నిలిచె
మునుల దమతమ మొగములు కనుఁగొనంగ

## 21. భ్రాంతిమదలంకారము

సాదృశ్యమువలన నొక వస్తువును జూచి మఱియొక వస్తువుగా భ్రమించుట భ్రాంతిమదలంకారము.

భ్రాంతిమదలంకారము ప్రబంధకవుల అభిమానాలంకారము. భ్రాంతి అభివర్ణితమైనంతమాత్రమున అది భ్రాంతిమదలంకారము కాజాలదు. అందు అలంకారమునకు జీవనాడి యనదగిన చమత్కారము ముఖ్యము.

---

1 విజయ విలాసము 1-140

2 ధూర్జటి : శ్రీ కాళహస్తి మాహాత్మ్యము 2-10.

రూపకము : భ్రాంతిమంతము

భ్రాంతిమదలంకారమునందును రూపకమునందువలెనే ఉపమేయమందు ఉపమానారోపముండును. రూపకమునందు అది బుద్ధిపూర్వకము. భ్రాంతిమద లంకారమున భ్రమజన్యము.

ఉదాహరణములు—

(1) ఓకాంతా! మదించిన ఈ మధుపము నీ మొగమును కమలమనుకొను చున్నది.

(2) "తుమ్మెద మోదుగుపువ్వును భ్రాంతిచే చిలుకముక్కుపై బడుచున్నది. చిలుక తుమ్మెదను నేరేడుపండని భ్రమించి పట్టుచున్నది"
ఇందు పరస్పర భ్రాంతి.

(3) ఆముక్తమాల్యదలో బాతులగూర్చి శ్రీకృష్ణదేవరాయలు చేసిన వర్ణన ఎన్నదగినది.

మ॥ తలఁ బక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకులు దత్సామీప్యస్థ ప్రయాత ద్విజా
వలి పిండీకృత శాటికల్పవి తదావాసంబుఁ జేర్పంగ రే
వుల డిగ్గన్వెసఁ బాఱు వానిగని నవ్వున్ శాలిగోప్యోఘముల్.

అవి వరిమళ్ళు(కేదారములు). అచ్చట కాలువలప్రక్క బాతులు నిద్రించు చున్నవి. వానిని వేకువలో ఆరెకుల చూచి కాలువలో స్నానము చేయవచ్చిన విప్రులు ఉతుకుకొని పిండి యుంచిన వస్త్రములని భ్రమించినారు. పాపము ఆ విప్రులు మరాకున నా వస్త్రములను విడిచి యిండ్ల కేగియుందురు. ఆ వలువలను వారియిండ్లకు చేర్చుట ఆరెకులవిధి. కావున ఆ వస్త్రములను గైకొనుటకు ఆరెకులు దగ్గరకు వెళ్ళినారు. అవి పిండినగుడ్డలా? బాతులవి. ఆరెకులఁజూచి ఆ బాతులు పారిపోవుచున్నవి.

పిండి ఒడ్డున నుంచిన గుడ్డలవలె ఆ బాతులు గన్పించుచు నిద్రించు చున్నవి. ఎంతటి సహజసుందరమైన భ్రాంతి. ఈ భ్రాంతి స్పృహణీయమును చేసిన మరియొక సన్నివేశ మచటనే యున్నది ఆరెకుల భ్రాంతిని కాపువడుచులు చూచి నవ్వినారు. అది ఆపుకోవలేని నవ్వు వారు ఆరెకులు గావచ్చు. ఆరెకుల కధినేత యగు చక్రవర్తి గావచ్చు. ఆ నవ్వు సహజసుందరము.

"నవ్వున్ శాలిగోప్యోఘముల్" — అనునపుడు స్వభావోక్తి అలంకార మును గలదు.

రెండలంకారములు తిలతండులములుగఁ గలియుటచే సంసృష్టియనదగును।

## 22. స్మరణాలంకారము

ఒక వస్తువును జూచినప్పుడు సాదృశ్యముచేత మఱియొకటి స్మరణకు వచ్చినచో నది స్మరణాలంకారము.

ఉదాహరణమునకు—

> సౌమిత్రే! నను సేవ్యతాం తరుతలం చండాంశు రుజ్జృంభతే
> చండాంశో ర్నిశి కా కథా? రఘుపతే! చంద్రోఽయమున్మీలతి
> వత్సైత ద్విదితం కథంను భవతా? ధత్తే కురంగం యతః
> క్వాసి ప్రేయసి! హా కురంగ నయనే! చంద్రాననే! జానకి!

కావ్యాలంకార సంగ్రహవివరణమున ఉదాహృతము.

శ్రీరాముడు లక్ష్మణునితో అనుచున్నాడు—'లక్ష్మణా! ఎండ కాయుచున్నది చెట్టునీడకు పద'

లక్ష్మణుడు—'శ్రీరామా! రాత్రి సూర్యు డెక్కడ? చంద్రుడు వెన్నెల గాయుచున్నాడు.'

రాముడు—'నీకు చంద్రుడని ఎట్లు తెలిసినది?'

లక్ష్మణుడు—'అందు కురంగమున్నది.'

రాముడు—'హా! కురంగనయనా! సీతా! ఎటనుంటివి.

అని సీతాస్మరణము కలిగినది.

# 20
# సహోక్తి, వినోక్తి, వ్యాజోక్తి, లోకోక్తి

## 23. సహోక్త్యలంకారము

క॥ నిపుణత ముఖ్యాన్వితమౌ
నుపమేయంబును సహార్థయోగాన్వితమౌ
నుపమానంబును బెరసినఁ
బ్రపంచితంబగు సహోక్తి[1]

క్రియతో ముఖ్యాన్వయము గల ఉపమేయమును సహార్థయోగాన్వయము గల ఉపమానమును కలిసినచో 'సహోక్తి'. ఇక్కడ ఉపమేయోపమానములు రెండును ప్రకృతములే యగుట గమనింప దగినది.

**ఉపమ, సహోక్తి**

'ఉపమాలంకారము'న ఉపమేయము ప్రకృతము. ఉపమానము అప్రకృతము. 'సహోక్తి' యందు రెండును ప్రకృతములే. ఇది ఆ రెంటికిని గల భేదము

ఉదాహరణములు —

1. అతని శత్రువులతోపాటు అతనికీర్తి దిగంత విశ్రాంతమయ్యెను.

2. ఉ॥ అందము చిందిపోవు చెవియందలి చెందొవ జారుచుండ 'పూ
లందఁ గొమ్మం'టంచు సుమనోఞ్జలి ముందుకుఁ జాచి శైలరా
ణ్ణందన వంగె, చెంగున సుమాస్త్రుని చాపము వంగె, వంగె ఫా
లేందు ధరుండు కానుకలఁ గ్రహింపఁగ సన్నుతితోర్ధ్వకాయుఁడై

తే॥ గీ॥ తియ్యవిల్కాఁడు విల్లు సంధించె విడిచె
అక్షయమ్మైన సమ్మోహనాశుగమ్ము
గౌరికడగంటిచూపుతో కలిసిపోయి
గ్రుచ్చుకొనెనది ముక్కంటి గుండెలోన[2]

---

1 నరసభూపాలీయము 5–103

2 శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి ఉదయశ్రీ : తపోభంగము

గౌరి కడగంటిచూపుతో తియ్యవిల్కాడు సమ్మోహనాస్త్రము ముక్కంటి గుండెలో గ్రుచ్చుకొనుట చక్కని సహోక్త్యలంకారము

## 24. వినోక్త్యలంకారము

అల్పవస్తులోపమువలన వర్ణ్యమానవస్తువునకు హీనతనుగాని, రమ్యతను గాని చెప్పినచో అది వినోక్తియగును ఇది రెండు విధములు.

*(1) అల్పవస్తు లోపమువలన హీనత కలుగుట*

ఉదాహరణము—

చంద్రుడు లేని రాత్రి వినయము లేని విద్య, పరిమళము లేని పుష్పము, రసము లేని కావ్యము వ్యర్థములు

*(2) అల్పవస్తులోపమువలన రమ్యత కలుగుట*

ఉదాహరణము—

గర్వము లేనివాని చదువు రమణీయము వినోక్తి, సహోక్తికి ప్రతిద్వంద్వి

## 25. వ్యాజోక్త్యలంకారము

ఒకానొకకారణమువలన పొక్కిపోయిన విషయమును వ్యాజముచే దాచి చెప్పుట వ్యాజోక్తి.

క॥ "అయథార్థ కారణోక్తిన్
నయముగ నాకారగోపనము వ్యాజోక్తిన్
మెయిగిఱి మోవిం గఱచెన్,
ప్రియపడి యూచిలుక నేల పెంచితివె సఖీ [1]

సీ॥ వెలంది యీ పీదండ వెల యెంత? నాదండ
కును వెలం బెట్ట నెవ్వనితరంబు?
కలువందావులుగానమలికిదంటక వేణి?
కలువతావులు వాడకయ కలుగునె?
కడివోదు నాకిమ్ము వడంతి యీగేదంగి
నవం గడివోము ముందటికిం జూడు
జాతులేవంబుజేక్షణ? పద్మినులు సైత
మును మున్నుయెద జాతులవిశ యరుదె?

[1] శ్రీ వేదం వెంకటరాయశాస్త్రిగారు-అలంకార సార సంగ్రహము

యమచుఁడొరినుడి నభిలాష లెనయమూఁగి
వలుకు తోడనె నర్మగర్భంబుగాఁగ
నుత్తరము పల్లవశ్రేణి కొసగు చలరు
లమ్ముదురు పుష్పలావిక లప్పురమున

—ఆముక్తమాల్యద 2-19

రసికులు పుష్పలావికలను 'వెలది యీ నీదండ వెలయెంత' అని అడిగి నపుడు - ఆ పుష్పమాలికవెల వారి కెందుకు? ఆ ప్రశ్నయందలి అంతరార్థము సుగమము ఇది వ్యాజోక్త్యలంకారమునకు సుప్రసిద్ధమైన ఉదాహరణము. సరసులు కోరునది ఆదండనుగాక ఆమె దండఁ(పొందు)ను అనుట తెల్లము. దండ వెల అడిగెడి వ్యాజమున వారి ఉక్తికి ఉద్దిష్టార్థము వేరున్నది అట్లే పుష్పలావిక సముచిత సమాధానమును, ఆ నాలుగు సీసపాదములును నర్మగర్భముగనే నడచినవి అందుచే ఈ పద్యమందలి అలంకారము వ్యాజోక్తి

## 26 లోకోక్త్యలంకారము

లోకవ్యవహార సిద్ధమైన సామెతలను ప్రకరణశుద్ధితో గుదిగూర్చుట లోకోక్తి

ఉదాహరణములు—

(i) మన పూర్వీకుల ఘనతనే అనవరతము ఉగ్గడించి లాభమేమి?
మా తాతలు నేతులు త్రాగినారు మామూతులు వాసన
చూడుడు అన్నట్లుండును

(ii) ఇంత ఆలస్యముగా యత్నించి లాభమేమి?
దొంగలు పడిన ఆరునెలలకు కుక్కలు మొఱిగినట్లున్నది.

ఇది అలంకారమే కాదను లాక్షణికు లున్నారని విస్మరింపరాదు.

# 21
# పరికరము, పరికరాంకురము, ముద్ర

## 27. పరికరాలంకారము

సాభిప్రాయములైన విశేషణముల ప్రౌఢ ప్రయోగము పరికరాలంకారము.

ఉదాహరణమునకు—

(i) చంద్రుని శిరస్సున ధరించిన శివుడు మీతాపమును బోగొట్టుగాక

(ii) ఓ ర్వాకయింతలేని వికచోత్పలలోచన చిత్తవీథిచ
ల్లార్పగ నీలనీరద నిభాంగుడు వేచనుదెంచెనంచు కరం
దర్పహుతాశనున్ వెలిదార్చ నఖండమును బోలె వేడని
ట్టూర్పు దళంబుగా నిగిడె మన్మిథాపరబాంశు కాంతమై[1]

ఇచ్చట నీల నీరదనిభాగుండు సాభిప్రాయప్రయోగము.

## 28 పరికరాంకురాలంకారము

విశేష్యములను సాభిప్రాయముగ నుపయోగించినయెడల పరికరాంకురాలంకారము.

ఉదాహరణము—

నీగుణములను వర్ణించుటకు ఆదిశేషుడును వ్రాయుటకు హైహయార్జునుడును చూచుటకు ఇంద్రుడును కావలెను

ఆదిశేషునకు వేయి నాలుకలు, హైహయునకు వేయి చేతులు, ఇంద్రునకు వేయి కన్నులుండుట సుప్రసిద్ధము

ఇది పరికరాలంకార ప్రభేదమనియే కొందఱు లాక్షణికుల అభిప్రాయము

## 29 ముద్రాలంకారము

ప్రకృతార్థపరములైన పదములచే ప్రకృతమునకు సంబంధములేని సూచ్యార్థమును వివరించుట ముద్రాలంకారము

---

[1] పారిజాతాపహరణము -తిమ్మన

తే గీ। మిత్రు డొక్కఁడు వీణియ మీటుచుండ
విబుధవరు లిద్దరర్థంబుఁ జెప్పిచెప్ప
ఇనులు నిద్దరు వినుచుండ నేఁగతిని
తేటగీతంబు మాటను వాటమయ్యె[1]

ఇది తేటగీతి లక్షణము ఒక కథగా వర్ణితము

[1]అప్పకవీయము.

# అర్థాపత్తి, తద్గుణము, అతద్గుణము

## 30 అర్థాపత్త్యలంకారము

దీనికి కావ్యార్థాపత్త్యలంకారమని పేరు

"ఒక ఉత్కృష్టవస్తువే సాధింపబడుచున్నప్పుడు తక్కువ వస్తువును సాధించుట యెంతపని యని వర్ణించినచోఁ గావ్యార్థాపత్తి"।

ఉదాహరణములు—

( ) తే. గీ. శక్రనీల తిరస్కారిచారుచికుర
గెలిచెఁ దనదుముఖంబుచే జలజరిపుని
బింబజంబుల వార్తఁ జెప్పంగనేల
యనెదు చందాన శైలకన్యాసహాయ

(2) కలఁడొకబోయ తన్నికట కాననభూమి, నతండు విల్లు న
మ్ములు ధరియించి కల్మష సమూహము లెత్తిన మేనుఁబోలెఁ బే
రలుక వహించెనేని హృదయంబు గలంగు ధరాధరస్థలీ
విలయవశత్కరీంద్రులకు, నిక్కము తక్కుమృగంబు లోర్చునే 3

## 31 తద్గుణాలంకారము

క॥ స్వగుణత్యాగంబున న
న్యగుణావాప్తి యగునేని యది తద్గుణమౌఁ
దొగకంటి నత్తును త్తెము
వగడము పలె దోఁచె నధరభాభాసితమై 4

"తనగుణము విడిచి యన్యము
వనఘ గుణముఁ గొనుట తద్గుణాఖ్యము" 5

---

1 శ్రీ వీరేశలింగంగారి అలంకార సంగ్రహము-59
2 అదిదము సూరకవి-ఆంధ్ర చంద్రాలోకము-59
3 తెనాలి రామకృష్ణకవి - పాండురంగ మాహాత్మ్యము-5-13
4 అదిదము సూరకవి ఆంధ్రచంద్రాలోకము-125
5 భట్టుమూర్తి - కావ్యాలంకార సంగ్రహము 5-120

ఉదాహరణములు:—

(1) కానంకేగి నీ విమత కాతరలోచన ప్రాణనాథులుం
దాను భుజింపఁగా ఫలవితానముఁ గోసెదనంచు బోయి నా
నా నిరవద్య కోకనదసద్మ నఖాంగుళి పాటలాంశు రే
ఖానిబిడంబులైన కసుగాయలె కోయు నృసింహభూవరా [1]

(2) ప్రాతఃకాల తుషారశీకరచయ ప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారములట్లు చెల్వెసఁగుఁ దద్బిందుచ్ఛటా జాతిభ
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు విహరిత్సోద్దీర్ఘ గేహంబులై
లూతాకల్పిత తంతుసద్మములు వొల్పెంజెప్పఁ జిత్రంబులై [2]

## 32 అతద్గుణాలంకారము

... ... ...“పరగుణం
బనయము హేతువుగలిగియు
నెనయమియ యతద్గుణాఖ్యము [3]...”

ఉదాహరణము—

(i) నాథా రాగయుక్తమైన నా చిత్తమునందు నీవు చిరకాలము నుండి
నప్పటికి రక్తుడవు కాలేదు.

అనగా అంతరార్థము:

ఓనాథా నేను చిరకాలమునుండి నిన్ను ప్రేమించుచున్నను నీకు నా యందు
ప్రేముడి కలుగలేదు

ఇచ్చట రాగయుక్త మనునప్పుడు - ఎఱ్ఱరంగు గలిగిన [అను అర్థాంతరస్ఫూర్తి] చిత్తములోనుండి రక్తుడు గాకపోవుట [ఎఱ్ఱరంగు గలవాడు కాకుండుట] అతద్గుణము

(ii) బలరిపుశైల యోబనరపాల నృసింహ! భవద్యశంబుచేఁ
దెలుపగు నిందులాంఛనము, తెల్పగుఁ గాంచనశృంగి శృంగముల్
తెలుపగు రుద్రకంధరము; తెల్పగు శారదికొప్పు; కాని త్వ
ద్బలరిపు దుర్యశోరుచి వితానము తెల్పయి యుండదెప్పుడున్ [4]

---

1 కావ్యాలంకార సంగ్రహము 6–12

2 ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యము 2–96

3 కావ్యాలంకార సంగ్రహము 6–122

4 కావ్యాలంకార సంగ్రహము 6–162

# 23

# విషమము, సమము
# సారము, అధికము, ఏకావళి

### 33. విషమాలంకారము

తే॥ గీ॥ తగని వస్తుద్వయంబు సంధిల్ల మెచట
నైన వర్ణింపఁబడెనేని నదియ విషమ
మనఁగఁదగు నీ శిరీషమృద్వంగి యెడ ?
అట్టి మనసిజ జ్వరమేడ ? యనఁగఁ జెల్లు ।[1]

చంద్రాలోకమున విషమాలంకారము మూడు విధములుగా విభక్తము.

(i) అననురూపఘటన (ii) విరూపకార్యోత్పత్తి (iii) ఇష్టార్థమునకు పోగా అనిష్టము దాపురించుట.

ఉదాహరణములు—

*అననురూపఘటన*

దిరిసెన పూవు వంటి సుకుమార శరీరముగల ఈ కోమలి యెడ ? విరహతాప మేడ ?

*విరూపకార్యోత్పత్తి*

నీ నల్లని కత్తి తెల్లని కీర్తి నీనుచున్నది.

*ఇష్టార్థమునకు పోగా అనిష్టము దాపురించుట*

ఎలుక భక్ష్యములకై యత్నించి పాము పెట్టెను దొలిచినది. ఆ పాము ఎలుకను భక్షించి, ఎలుక దొలిచిన రంధ్రముగుండా పెట్టె చెఱనుండి విముక్తి గాంచినది.

విషమాలంకారమునకు ప్రాచీన కావ్యములందలి ఉదాహరణములు.

(1) చం॥ ఎదనొకయింత లేని నెఱచక్కఁదనంబుల నెల్లఁ గూర్పఁగాఁ
గొదవయినట్టి ధన్యుఁడవు భోగివి పూలకాఁడవిట్టి నీ
వెదవక నిష్ఠురత్వమున కెట్లలవాటుగఁ జేసి తక్కటా
పదఁ దలమీఁదనేయ రతివయ్యెదకున్ సమ మైన చేతులన్ [2]

---

1 ఆంధ్ర చంద్రాలోకము - అడిదము సూరకవి - 38

2 మనుచరిత్ర-వరూథినీ విరహోపాలంభనము 3-48

(2) ఉ. రాతిరి మూషికంబు వివరంబొనరించి కరండబద్ధమై
శ్రీతిలి చిక్కి యాసచెడి పెద్దయుడస్సిన పామువాత సం
పాతముఁజెందె దానిఁదిని పాముదొలంగె బిలంబు త్రోవనే
యేతటి హానివృద్ధులకు నెక్కటిదైవము కారణంబగున్[1]

## 34 సమాలంకారము

అనురూపములైన అంశములకు సంఘటన సమకూర్చినచో అది సమాలంకారము. ఇది విషమాలంకారమునకు ప్రతిద్వంద్వి.

ఉదాహరణములు—

(1) లక్ష్మి! జలములో పుట్టిన నీకు నీచాసక్తత సహజమేకదా.

(2) పిశాచముల వివాహములయందు గార్దభములు గాయకులు.

(3) అంబురుహాక్షి! రతిని దమయంతినలున్ నలువొంద ముందుగా
నలువ సృజించి యందుకతనం దన చేయికి కెల్లదీటి నే
ర్పలవడ నో లతాంగి! నరనాధిపు నిన్నునుగూర్చి ప్రేమ సం
కలితముగాఁగ దంపతులుగా నొనరింపఁగఁబోలు: మెచ్చితిన్[2]

## 35 సారాలంకారము

ఉత్తరోత్తరము నుత్కర్షమును అభివర్ణించినచో సారాలంకారమగును.

ఉదాహరణము—

(1) తేనె మధురము; దానికంటె అమృతము మధురము, దానికంటె కవి వాక్కులు మధురములు.

(2) చ. అటు జగదేకసుందరికినై యతివేషముఁబూని వచ్చినాఁ
డట; తనచేయు భాగ్యమున నప్పువుఁబోడియె చెంత సేవ చే
యుటకయి వచ్చియుండునట; యొక్కొకపట్టున నొంటిపాటు నౌ
నట; అతఁడెవ్వఁడెవ్వఁడను టబ్బురమే మది తత్తరించుచున్[3]

పూర్వవస్తువునకంటె ఉత్తరవస్తువునకు అపకర్ష చెప్పినను సారాలంకారమే!

(3) గడ్డిపరకకంటె దూది చులకన
దూదికంటె యాచకుడు చులకన

1 భర్తృహరి సుభాషితము: ఏనుగు లక్ష్మణకవి
నీతిశతకము దైవపద్ధతి : 82

2 కావ్యాలంకార సంగ్రహము 5—147

3 విజయవిలాసము 2—146.

## 36 అధికాలంకారము

ఆధారాధేయములలో ఆధారముకంటె ఆధేయమునకు గాని ఆధేయముకంటె ఆధారమునకుగాని ఆధిక్యమును వర్ణించుట అధికాలంకారము

తే. గీ. తోరమైన యాధారవస్తువులకంటె
ఘనత యాధేయమునకుఁ గూర్చిన నధికము
నలువ యెయ్యెడనో నీటమునుగు నచట
మలుగఁబడవు భవద్గుణంబులను కరిణి

ఉదాహరణము—

సమస్తవిశ్వములను తనలో లీనము చేసికొనియున్న విష్ణువు నీహృదయములో నున్నాడనిన నీహృదయమువిస్తార మెంతదో !

## 37. ఏకావళ్యలంకారము

గృహీతముక్తరీతిచేఁ గూర్పఁబడిన పంక్తి ఏకావళ్యలంకారము. గృహీతముక్తరీతి అనగా గ్రహించినదానిని విడిచిపెట్టుట.

ఉదాహరణములు—

(i) చోళమహారాజునకు కన్నులాకర్ణవిశాలములు కర్ణములు బాహువులవరకు నుండునవి బాహువులు మోకాళ్లవరకు నుండునవి మోకాళ్లు సుందరమైన మణిదర్పణమువంటివి.

విశేష్యవిశేషణభావములకు లంకె గల శృంఖలయును ఏకావళియే.

(ii) దేవా ధర్మముచే నీబుద్ధి పరిశుద్ధము. బుద్ధిచే లక్ష్మి నిరుద్ధము. లక్ష్మిచే జనము సంతుష్టము జనముచే నీ కీర్తి సకలభువనవ్యాప్తము.

1 ఆంధ్రచంద్రాలోకము-41 అడిదముసూరకవి

# 24

# విశేషోక్తి, కారణమాల, అనుమానము కావ్యలింగము

## 38 విశేషోక్త్యలంకారము

ప్రస్ఫుటకారణము లున్నను కార్య ముత్పత్తి కాలేదని వర్ణించుట విశేషోక్త్యలంకారము.

"... ... ... పెక్కుల్
కారణములయ్యుఁ గార్యము
చేరకయుండుట మహిన్ విశేషోక్తి యగున్"[1]

ఉదాహరణములు —

(1) మన్మథదీపము వెలుగుచున్నప్పటికి స్నేహక్షయము కాలేదు

[ఇచ్చట స్నేహమనగా మైత్రి మఱియు తైలము (చమురు) అను అర్థముగూడ కలిసివచ్చినది]

(2) బ్రహ్మకుఁ బట్టంపు రాణివాసంబయ్యు
రాజసక్రీడాభిరతులఁ బోక
జగదేక సౌందర్య సౌభాగ్యయయ్యును
నణుమాత్రమును గర్వగుణము లేక
సంపూర్ణ యౌవన సంపద గలిగియు
మదవికార స్ఫూర్తి పొదలనీక
వ్యాహార సింహాసనారూఢయయ్యును
బహువిధ వ్యాపృత్తిఁ బ్రౌఢగాక

మగని ముందరఁ దన మహా మహిమలెల్లఁ
గానఁబడకుండ నడఁకువ గలిగి, కించి
దవనతాననయై బొలుపారఁ గన్ను
గందు మీలకు విలుకదఁ గఱపి కదియ[2]

[1] కావ్యాలంకార సంగ్రహము 5-135

[2] ధూర్జటి - శ్రీ కాళహస్తి మాహాత్మ్యము -సరస్వతీ వర్ణన.

(3) పెక్కు దివియలున్న జక్కవచెలియున్న
రిక్కరాయడున్నఁ జుక్కలున్న
చిన్ని లేడి చూడ్కి చేడియ నెడబాయ
నవ్వుడంధకారమయ్యె జగతి[1]

(4) ఉపనిషత్తుల అర్థము తెలిసికొనినాను. భగవద్గీత పారాయణముచేసినాను బ్రహ్మసూత్రములను భాష్యముతోపాటు పఠించినాను. కాని విషయోపభోగములనుండి మనస్సు మరలింపలేకున్నాను.

ప్రస్ఫుటకారణము లున్నను సిద్ధింపవలసిన కార్యము సిద్ధింపలేదు కనుక ఇది విశేషోక్తి.

## 39. కారణమాలాలంకారము

"వరుస దప్పని కారణావళులతోడఁ
గీలు కొల్పినఁ గారణమాల యగును"[2]

ఉత్తరోత్తరకారణభూత పూర్వపూర్వవస్తువులచేతఁగాని పూర్వపూర్వ కారణ భూతములైన యుత్తరోత్తరవస్తువులచేతగాని రచన సల్పినచో కారణమాలాలంకారమగును.

ఉదాహరణములు—

(1) నీతిచేత సంపద, సంపదచేత త్యాగము, త్యాగముచేత యశము కలుగును.

(2) నరకములు పాపముచేత, పాపము దారిద్ర్యముచేత దారిద్ర్యము దానమియ కుండుటచేత సంభవించునుగాన దానపరుడవు గమ్ము[1]

(3) పెద్దలు లేనిది సభకాదు
ధర్మము చెప్పనివారు పెద్దలుగారు.
సత్యములేనిది ధర్మము కాదు
కపటముతో గూడినది సత్యముగాదు

## 40. అనుమానాలంకారము

సాధనమునుబట్టి సాధ్యమును నిశ్చయించుట అనుమానాలంకారము.

ఉదాహరణములు—

(1) గూండ్లకు చేరుచున్న పక్షులవలనను, ముకుళించుచున్న పద్మములవలనను విచ్చుచున్న జాజిపూవులవలనను చల్లగాలిమూలమునను సూర్యుడస్తమించుచున్నట్లు తెలియవచ్చుచున్నది.

---

[1] భర్తృహరి సుభాషితములు-ఏనుగు లక్ష్మణకవి
శృంగార శతకము - శ్రీ పద్యం-15

[2] అడిదము సూరకవి - ఆంధ్ర చంద్రాలోకము-46.

(2) కమలాక్షుఁడీ మేటి కాబోలుఁ గాకున్న
కరముల శంఖచక్రములు గలవె ?
కమలారి యీ రాజు కాబోలు కాకున్న
సకల కళావిలాసములు గలవె ?
కమలాప్తుఁ డీ ప్రోఢ గాబోలు కాకున్న
నధిగత మండల వ్యాప్తి గలదె ?
కమలజుఁడీ స్వామి కాబోలు కాకున్న
చతురాననపదప్రశస్తి గలదె ?
అనుచు గొనియాడుదురు నిన్ను నంగ వంగ
మాళవా వంతి గౌళ నేపాళ చోళ
కుకురు కురుపాండ్య శకముఖ క్షోణిపతులు
నరనుతాటోప ఓబయ నరస భూప!

## 41. కావ్యలింగాలంకారము

ఒకవిషయమును సమర్థించుటకు గారణముగ మఱియొక విషయమును జెప్పుట కావ్యలింగాలంకారము

క॥ హేతువు వాక్యార్థంబై
యాతత విస్ఫూర్తితోఁ బదార్థంబునునై
ఖ్యాతిగనఁ గావ్యలింగం
బై తగు సత్కృతులయందు...2

ఉదాహరణములు—

(1) అరుదై పొల్పగు పోచిరాజు నరసింహాయన్న యష్టాక్షరీ
వరమంత్రం బది యెల్లకాలము నరుల్ వా కువ్వ సిద్ధించుఁబో
కమలాందోళిక లశ్వముల్ విభవముల్ గ్రామంబు లత్యుజ్జ్వలాం
బరముల్ సొమ్ములు వల్లకీల్ పరిణయ ప్రారంభ సంరంభముల్ 3

(2) నేను మన్మథుని జయించినాను
నా మనస్సులో శంకరుఁ డున్నాడు!.

---

1 కావ్యాలంకార సంగ్రహము 5- 81
2 కావ్యాలంకార సంగ్రహము 5-182
3 కావ్యాలంకార సంగ్రహము ; 5- 183

(3) మృగమద సౌరభ విభవ
ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధ
స్థగితేతర పరిమళమై
మగువ మొలపుం దెలుపు మారుత మొలసెన్[1]

(4) తే గీ ఆది తప్పని ధర్మజు నను గుదమ్మ
దారుమూరకుఁ జితివాహనున కపుడు
వంశకరుగా నొసగి వేడ్క వారిచేత
నంపకముఁ గాంచెఁ దీర్థయాత్రాభిరతిని[2]

(5) సుకృతాత్ములు రససిద్ధులు
సుకవీంద్రులు విజయనిధులు సుమ్ము తదీయా
ధిక కీర్తి శరీరంబులు
వరిట జరామరణ జన్మ భయ రహితంబుల్[3]

కావ్యలింగము అనుమానాలంకారములకు గల భేద సామ్యములు గమనింప దగును కావ్యలింగమునందు కారణము కారకరూపము, అనుమానమునందు జ్ఞాపన రూపము

---

[1]మనుచరిత్రము 1-24

[2]విజయ విలాసము : 2-41.

[3]భర్తృహరి సుభాషితములు - ఏనుగు లక్ష్మణ కవి
నీతి శతకము - విద్వత్ పద్ధతి - 20

# 25

# వ్యాజస్తుతి, వ్యాజనింద

### 42 వ్యాజస్తుత్యలంకారము

తే గీ నిందచే స్తుతి, స్తుతిచేత నిందదోప
నదియు వ్యాజస్తుతి యనంగ నలరుచుండు।

ఉదాహరణములు—

(1) తే గీ॥ గంగ నీకు వివేక మెక్కడిది? స్వర్గ
మందఁ జేసెదు పాపాత్ములైన జనుల [2]

(2) శా॥ ఈ పాండిత్యము నీకుదక్క మఱి యెందే గంటిమే? కామ శా
స్త్రోపాధ్యాయివి నా వచించె: వు మేలోహో త్రయీ ధర్మముల్
పాపంబుల్, రతి పుణ్యమంచు నిక నేలా తర్కముల్ మోక్ష ల
క్ష్మీ వశ్యాగమ సూత్రవంక్తికవెపో మీ సంప్రదాయార్థముల్ [3]

ఉ॥ ప్రాఁతలమీద గప్పినఁ గృపామతి నోర్చితి నీచు పొత్తునన్
ప్రీఁతి మెసంగి తీవు, మునుభక్తుడు కుంచెనఁ బంపఁ బోతి మై
పూఁత యొనర్చుకొంటి శవభూతిఁ గపాలమునన్ భుజించి తీ
రోఁతలు పెక్కులుండ నిట రోయుదువే యిఁక భక్తవత్సలా! [4]

### 43 వ్యాజనిందాలంకారము

తే గీ॥ నిందచే నింద విస్ఫూర్తి నెగడె నేని
వ్యాజనింద యనంగ వఖ్యాతికెక్కు [5]

ఉదాహరణములు—

(1) నన్నిట్లు దుఃఖములను అనుభవింపుమని లిఖించిన బ్రహ్మదేవుడు నింద్యుడు గాడు ఆతని శిర మొకట్టిమాత్రమే ఖండించిన శివుడే నింద్యుడు.

---

1 ఆంధ్రచంద్రాలోకము-10 - అదిదము సూరకవి

2 ఆంధ్రచంద్రాలోకము - 30 అదిదము సూరకవి

3 మనుచరిత్రము - వరూథినీ ప్రవర సంవాదము 2-64

4 ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యము 3-100

5 ఆంధ్రచంద్రాలోకము· 32 - అదిదము సూరకవి.

(2) సీ॥ ఏ మహాత్ములు గల్గ భూమీశసభలలోఁ
గవులకు నధిక విఖ్యాతి గలె
ఏ కృతారులు గల్గ నెల్ల పామరులకు
గణన మీరు ప్రబంధకములు గల్గె
ఏ వాఙ్నిధులు గల్గ విరవొందు రసికుల
కమిత లీలావినోదములు గల్గె
ఏ ప్రవీణులు గల్గ నిల నలంకృతి కృతో
ద్యములకు దోషలక్ష్యములు గల్గె

నేదయాళులు బుధవచో హేతిచకిత
విసరదపశబ్ద భరణ లాలస ముఖాబ్జు
లట్టి నిఖిలోపకార ధీరాత్ములైన
సకల కవి ధూర్వహులకు నంజలి మొనర్తు 1.

1 కావ్యాలంకార సంగ్రహము 1-8

# 26

# సంసృష్టి, సంకరము

### 44. సంసృష్ట్యలంకారము

ఒకేచోట రెండుమూడలంకారములు తిలతండులన్యాయమున కలిసినచో నది సంసృష్టి.

### 45 సంకరాలంకారము

క్షీర నీరన్యాయమున రెండు మూడలంకారములు చేరినచో సంకరము

ఉదాహరణము—

(1) చీకటి తన యంగములను పూసుపూయుచున్నట్లున్నది.
ఆకాశము కాటుకను కురియుచున్నది
అసత్పురుష సేవవలె చూపు నిష్ఫలమగుచున్నది[1]
(ఉత్ప్రేక్ష + ఉపమ) = సంసృష్టి

(2) బ్రహ్మదేవు డీ సముద్రమును గంభీరముగను, రత్నపూర్ణముగను, స్వచ్ఛకాంతి కలదిగను జేసి సరసపానీయముగ జేయకపోయెను గదా[2]
(అప్రస్తుత ప్రశంస + సందేహము) = సంకరము

(8) కద్రువయు వినతయు వినోదార్థంబు విహరించువారు కరిమకర నికరాఘాత వాతోద్ధూత తుంగతరంగాగ్ర సముచ్ఛలజ్జల కణాసారచ్ఛటాచ్ఛాదిత గగన తలంబైనదాని (సముద్రమును), నుద్యానవనంబునుంబోలె బహువిద్రుమలతాలంకృతంబైన దాని, నాటక ప్రయోగంబునుంబోలె ఘనరసపాత్ర శోభితరంగరమ్యంబైన దాని, దివంబునుంబోలె నహిమకర భరితంబైనదాని[3] -

ఇందు ఉపమేయమైన సముద్రమునకు మూడుపమానములు గలవు

1 ఉద్యానవనంబు 2 నాటక ప్రయోగము 8 దివము సమాన ధర్మము శ్లేషవలన సిద్ధించుట గమనింపదగిన విశేషము ఆ శ్లేష సభంగము

---

[1] మృచ్ఛకటికము

[2] కావ్యప్రకాశము

[3] నన్నయ భారతము ఆదిపర్వము ద్వితీయాశ్వాసము—27

మఱియు అభంగమును. అహి+మకరధరిగాను అని సముద్రపక్షమున, అ+హిమకర ధరితము అని దివసపక్షమున అందుచే నిది శ్లేషాను ప్రాణితమైన ఉపమాలంకారమని చెప్పవచ్చును.

నన్నయ ప్రయోగించిన అలంకారములలో నిది యెన్నదగినది. ఇందు శ్లేషము, ఉపమ క్షీర నీరన్యాయమున కలియుటచే సంకరము

తెలుగు ప్రబంధములు : సంకర సంసృష్టులు

ఆంధ్ర ప్రబంధములలో అర్థాలంకారములు రెండుమూడు ఒకే పద్యమునందు తిలతండుల న్యాయముగ లేదా క్షీరనీరన్యాయముగ కలసియుండుట కద్దు. అందుచే సంకరసంసృష్టులు అని చెప్పనొప్పు అలంకారములు తెలుగు పద్యములలో బహుళములు. అంతేకాక, ఒకే పద్యమునందు ప్రాచీన సంస్కృతాలంకారికులు గూడ విభిన్నాలంకారములను గుర్తించిరనుమాట విస్మరింపరాదు ప్రాచీన లాక్షణికులు-ఒకే అలంకారమునకు భిన్ననామ నిర్దేశములు చేయుటగూడ జిజ్ఞాసువులు అనుశీలింపదగిన విషయము.

అలంకారములు తిలతండులన్యాయముగా, క్షీరనీరన్యాయముగా కలిసినవి, ప్రాచీన కావ్యములందలి ఉదాహరణములు కొన్ని అనుశీలింపనగును.

ఉ॥ ఎంత తపంబు చేసి జనియించినవారొకో మర్త్యభామినుల్
కాంతుడవజ్ఞ సేసినను గాయమువాయుదురే నమర్త్యనై
చింతల వంతలందెపుడు సిగ్గరితిన్ మృతిలేని నాదుచె
ల్వింతయు శూన్యగేహమునరెత్తిన దీపికయయ్యె సక్కటా![1]

ఇందలి అలంకారములు పరికరాంకురము—నిదర్శనము.

(2) ఉ॥ కమ్మవి కుందనంబు కపుగందవి మే నెలదేటి దాటులన్
బమ్మెరపోవదోలు తెగజాలెడు పెంద్రుకలిందు బింబమున్
గిమ్మనసీదు మోము గిరిక్రేపులు మూపులు కౌనుగానరా
దమ్మక చెల్ల వాని వికచాంబక ముల్ కరవర్తి భైక్ష్యముల్[2]

ఇందలి అలంకారములు ఉపమ - రూపకము - అతిశయోక్తి.

(3) మ॥ తరుణీ! రేపును మాపు హవ్యములచేతం ద్రుప్తుడౌ వహ్ని స
త్కరుణా దృష్టినొసంగు సౌఖ్యము లెఱుంగన్ శక్యమే నీకు నా
కరణుల్ దర్పలు వగ్నులుం ప్రియములై నట్లన్యముల్గా పాదర్
తిరమే చెప్పకుమిట్టి తుచ్ఛసుఖముల్ మీపాలంపై తేనియల్[3]

ఇందలి అలంకారములు వ్యతిరేకము - ప్రతివస్తూపమ

---

[1] మనుచరిత్రము 3-8
[2] మనుచరిత్రము 2—6
[3] మనుచరిత్రము 3—65

(4) ఉ॥ ఇంతిమృదూక్తి మాధురికి విషురసంబెన వోంతాలకా
ద్యంతమునోడి మధ్యమ గుణాశ్రయమై నెఱకొక నెన్నిజ
న్మాంతరముల్ వహించియుఁ దనంతనె ఖండములయ్యెఁగావి యా
వంతయుఁబూవదెంతవోడి - యయ్యు వఖండ తదీయ సంపదన్1

ఇందలి అలంకారములు (శ్లేషోత్థాపిత) వ్యతిరేకము, కావ్యలింగము, సమాసోక్తి

(5) ఉ॥ సరయవఖావసారితరసాధర! యాధరణీంద్రకోటిలో
నరియుదుఁ బెద్దగాఁ బృథునరాధిపుఁగొంత తదీయశక్తిపీ
చరణనఖాంచలంబునకు పాటియె వేయునునేల మద్భుతాం
తరవవి రేఖ పీ యడుగునంబడ దే శుభలక్షణాకృతిన్

ఇందలి అలంకారములు కావ్యలింగము, అతిశయోక్తి, అపహ్నవము, అర్థాపత్తి.

తే॥గీ॥ వెంఁది కెమ్మోవిగని జపావృత్తిమఱచె
తరుణి లేగొనుగని హరిస్మరణ మఱచె
గదమయననేల వేసమొక్కటియతక్క
మఱచె నన్నియు నాకృత్రిమ త్రిదండి3

వృత్త్యనుప్రాసము-పరికరము-శ్లేష ఇందలి అలంకారములు.

(6) తే.గీ॥ లలితమైనట్టి లీల లీలావతులకు
సహజమది మాధునకు మది సందడించు
పద్మినికి రాగగరిమ స్వాభావికంబు
తేటి భ్రమపడి దానిలో తిరుగుచుండు4

ఇందు రెండు వాక్యములలో బింబప్రతిబింబ భావసామ్యమువలన దృష్టాంత మేర్పడినది. రాగగరిమ=ఎఱుపు, అనురాగము శ్లేషవలన కల్గిన అభేదాధ్యవసాయముచే అతిశయోక్తి యైనది. తేటిభ్రమపడుట భ్రాంతిమంతము ప్రస్తుతములైన పద్మములో తేటి తిరుగుట అప్రస్తుతములైన కామినీవిటులను తోపించుటచే సమాసోక్తి ఉజ్జీవితమైనది. కావున ఇందలి అలంకారములు దృష్టాంతము, అతిశయోక్తి, శ్లేష, భ్రాంతిమంతము, సమాసోక్తి వలనసైన సంకరము.

1వసుచరిత్రము 2—46
2వసు చరిత్రము 3—7
3విజయ విలాసము 2—148
4భర్తృహరి సుభాషితములు - ఏనుగు లక్ష్మణకవి శృంగార శతకము - కామినీ గర్హణము - 47

(7) చ. రయవిచలత్తురంగమ తరంగములన్ మదనాగ నక్రసం
చయముల సంచలచ్చటుల సైనిక మత్స్యములన్ భయంకరం
బయి యదు వృష్టి భోజకుకురాంధక వాహినియుం గలంగె ని
ర్దయతర రోషమారుత నితాంత సమీరితమై క్షణంబునన్[1]

ఇందలి అలంకారములు శ్లేష-పరిణామము.

అట్లే భాగవతమునందలి ఈ క్రింది పద్యములో శ్లేష రూపకముల నరయదగును.

మ. లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజ శ్రేయమై[2]

(8) చ. తిమిర దినేంద్రజాలములఁ దెచ్చి యజాండఘటంబు నందుఁ బో
సి మరలఁ బశ్చిమాశయను చెల్వవహించిన పద్మరాగ కుం
భముగతి సూర్యుడుం జనియెఁ బ్రాకృతి వెన్నెల వేల్పుచేటితో
యము వడబోయ హేమకలశాకృతిఁ జంద్రుఁడు నొప్పెనయ్యెడన్[3]

పై పద్యములందలి రూపకపరంపర-ఉత్ప్రేక్షలు అరయదగినవి.

---

[1] నన్నయ భారతము సభాపర్వము 2—33
[2] పోతన - భాగవతము - అవతారిక
[3] ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యము 4—91

# 27

# సమీక్ష

సాహితీపరిణామవికాసములతోపాటు అలంకారములసంఖ్య దినదినాభి వృద్ధి గాంచుట సహజము. ప్రాచీనాలంకారికులు పలువురు పలువిధములగు అలంకారములు నిరూపించియున్నారు.

ఒకేపద్యమునందు ప్రాచీనాలంకారికులు భిన్నవిభిన్నాలంకారములను నిరూపించుట వింతగాదు. అర్థాలంకారములను పేరులోనే, వ్యాఖ్యానముపై అలంకారనిరూపణము ఆధారపడునునుట తెల్లము అయినను అలంకార ప్రకరణ మును, భారతీయాలంకారికులు, శాస్త్రీయముగ తీర్చిదిద్దుటలో విశ్వసాహితీ జగత్తులోని మేధావుల పొగడ్తల నందుకొనగల్గిరి.

అయినను, అలంకారములు అలంకారములే. రసప్రతీతిలో వానిపరిధి పరిమితమైనదేగాని కావ్యానుశీలనమున అద్వితీయప్రాముఖ్యము నార్జించినవన్న మాట చిరస్మరణీయము.

అలంకారశాస్త్రమును సాంగోపాంగముగ అనుశీలించి, సింహావలోకన ప్రాయమైన "సమీక్ష" చేయవలసివచ్చినప్పుడు, శ్రీ కాళహస్తీశ్వరశతకమందలి ధూర్జటి వాక్కులు శరణ్యములుగా స్వీకరింపనగును.

శా॥ ఏ లీలన్ నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షా ధ్వనివ్యంగ్య శ
బ్దాలంకార విశేషభాషల కలభ్యంబైన నీ రూపమున్;
చాలుంజాలు కవిత్వముల్ నిలుచునే సత్యంబు వర్ణించుచో
ఛీ! లజ్జింపరు గాక మాదృశకవుల్ శ్రీ కాళహస్తీశ్వరా.

కావ్యాత్మయైన "రసము" – ఆ రసస్వరూపుని తత్వమువలె వాక్కులకు అప్రాప్యము, మానవ మనస్సునకు అగమ్యము, అనుభవైకవేద్యము.

"రసో వై సః"

# 1

# తెలుగు కవిత - ఛందస్సు

## 1. తెలుగు కవిత - ఛందస్సు

ఛందో హీనో న శబ్దోఽస్తి
నచ్ఛంద శ్శబ్దవర్జితమ్

ఛందోహీనమైన శబ్దములేదు, శబ్దవర్జితమైన ఛందస్సులేదు. అని భరతముని ప్రవచనము ఛందస్సునకు శబ్దమునకుఁ గల అవినాభావ సంబంధమును ఈ విధముగా ప్రాతః స్మరణీయుడైన భరతముని, నాట్య శాస్త్రమునందు వివరించియున్నాడు.[1]

ప్రాచీన కాలమునుండి లాక్షణికులు శబ్దమును ప్రస్తరించి ఛందస్సును పలురీతుల వింగడించి వివరించియున్నారు.

ప్రపంచమునందలి ప్రప్రథమగ్రంథముగా ప్రశస్తికెక్కిన ఋగ్వేదము ఛందోబద్ధము. అది వృత్త నిబద్ధము. సామవేదము గీత్యుపేతము యజుర్వేదము గద్యాత్మకము. ఋగ్వేదమున గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్పు, పంక్తి, జగతి మున్నగు ఛందస్సులు ప్రయుక్తములు వేదాంగములలో ఛందస్సు ఒకటి.

శిక్షా కల్పశ్చ వ్యాకరణం నిరుక్తం ఛందసాం చయః
జ్యోతిషామయనంచైవ వేదాంగాని షడేవతు

వేదపురుషునకు ఛందస్సు పాదమని ప్రాచీనుల మతము.

తే. గీ. "వేదమునకుఁ బాదంబులై వెలయుకతన
ఛంద మన్నింటిలో నవశ్యంబుగాదె
పురుష దఖిలాంగయుతుడయ్యు చరణయుగము
లేక నడవ సమర్థుడే లోకమునకు"[2]

అని అప్పకవి పేర్కొనెను.

---

1నాట్య శాస్త్రము - డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావుగారు-14-45
2అప్పకవీయము - చతుర్థాశ్వాసము

## తెలుగు ఛందస్సు

ఛందస్సునకు, కావ్యశిల్పమునఁ గల స్థానమునుగూర్చి 'కావ్యాలోకము' ప్రకరణాంతరమున సవిస్తర సమీక్ష గలదు. ఇతర సారస్వతముల మాట యెట్లున్నను తెలుగు వాఙ్మయములో పద్యమున కేర్పడిన ప్రత్యేక స్థానము సకలజన సంవేద్యము. తెలుగు పద్యమునకు ఉచ్ఛ్వాస నిశ్వాసములు యతిప్రాసములు తెలుగులోనికి యతిప్రాసలు సంస్కృతమునుండి అవతరింపలేదు. సంస్కృత యతి స్వరూపమునకును తెలుగు యతిస్వరూపమునకును గల భేదము సుస్పష్టము. సంస్కృతములో యతి విశ్రాంతి. తెలుగులో యతి అక్షరమైత్రి. తమిళ వాఙ్మయమున క్రీస్తుకు పూర్వము వెలసిన వ్యాకరణచ్ఛందోఽలంకార లక్షణ గ్రంథమగు "తొల్కాప్పియము"న పద్యములకు 'యతి మోనై ప్రాసము యదుకై' అను నియతి ద్వయము గలదు. అచ్చటను యతి అక్షరమైత్రియే కన్నడమునందలి ప్రాచీనతమ లక్షణ గ్రంథము 'కవిరాజ మార్గము' (క్రీ. శ. 814-877) సంస్కృత పద్ధతిలో నడచినది. అందు ప్రాసనియతి గలదు. యతి నియతి లేదు సంస్కృత వృత్తములతోపాటు అందు షట్పది, త్రిపది, రగడ మున్నగువానికి లక్షణములు గలవు. తెలుగున ఛందస్సులో సంస్కృత పద్ధతితోపాటు దేశి పద్ధతిగూడ సంగమించినది. చంపకమాల, ఉత్పలమాల, మున్నగు తెలుగు పద్యములు సంస్కృతానుసరణములు. వానికి వృత్తములని పేరు. కందము, ద్విపద, తరువోజ, అక్కర, మున్నగువానికి జాతులని పేరు. సీసము, ఆటవెలది, తేటగీతి పద్యములకు ఉపజాతులనిపేరు.

సంస్కృత వృత్తములకు మూడక్షరములతో నేర్పడిన ఎనిమిది గణములు య, మ, త, ర, జ, భ, న, స, అనునవి మూలములు. వృత్తములలో మూడక్షరముల గణములే ఎక్కువ. జాతులలో ఉపజాతులలో మాత్రాగణములును సూర్యేంద్ర చంద్ర గణములును ప్రయుక్తములు. కందము సంస్కృతానుసరణమని అందలి ఆర్యా ప్రభేదమని కొందరు లాక్షణికుల మతము. సీసము, ఆటవెలది, తేటగీతి అనువాని లక్షణములు కన్నడమున ఛందోంబుధిలో చెప్పబడినవి. వృత్తములు సంస్కృతానుసరణములనుట సుస్పష్టము.
సీసము, ద్విపద, తేటగీతి, ఆటవెలది, తరువోజ, అక్కరలు మున్నగునవి దేశీయములైన ఛందములని తెలుగు లాక్షణికులు ప్రాచీన కాలమునుండియు గుర్తించి యున్నారు.

క 'వెలయంగఁ దెలుగు బాసకుఁ
దలమయ్యెడు సీసములును దరువోజలు గీ
తులు నక్కరలును ద్విపదలు
పొలుపొందఁగరే చఁడిష్టమున నొనరించున్[1]'

---

1 కవిజనాశ్రయము - జాత్యధికారము.

తెలుగులో కావ్యములు ఛందోబద్ధములై పద్యములలో నుండుటమాత్ర మేగాక-వ్యాకరణాలంకార లక్షణ గ్రంథములు, ఛందస్సు, నిఘంటువులు, వైద్య జ్యోతిష , వాస్తు, రత్న పరీక్షాది శాస్త్ర గ్రంథములు గూడ పద్యరూపమున వెలయుట గమనింపదగిన విశేషము. నన్నయయుగమునకు చెందిన పావులూరి మల్లన గణిత శాస్త్రమును తెలుగున పద్యములలో వ్రాసెను. నన్నయకు పూర్వము, తెలుగులో శాసనములు పద్యరూపమున వెలసినవి. ఇతర భాషలలో పద్యములు లేవా ? అన్ని భాషలలో ఛందోబద్ధములైన రచనలుండుట సహజము. సంస్కృతమున శ్లోకములు సుప్రసిద్ధములు. సంస్కృత శ్లోకములలో ప్రాస నియతి లేదు. యతినియతి యున్నను, సంస్కృతమున యతి యనగా విరతి, లేక విశ్రాంతియే. అక్షరమైత్రిలో, వర్ణసాజాత్య రూపకమైన తెలుగు యతి లోని మాధుర్యము, ఏకాక్షర ప్రయోగ పౌనఃపున్య రూపకమైన ప్రాసములోని నాదగాంభీర్యము కలిసి తెలుగు పద్యమునకు ప్రపంచ భాషలలో అనన్య సామాన్యమైన విశిష్టతను కల్పించినవి ఆంధ్ర పద్య కవితాగానమునకు తెలుగు యతిప్రాసలు మృదంగ నినాదమును సమకూర్చుచున్నవి.

"కోణక్కె మతి యిల్ల, కన్నడక్కె యతి యిల్ల" -

కోణంగికి మతిలేదు. కన్నడ పద్యమున యతి లేదని ఒక లోకోక్తి. ప్రాచీన కన్నడమున చంపకమాలాది పద్యములున్నవి. కాని వాటికి యతి లేదు. సాహితీ సమరాంగణ సార్వభౌమ బిరుదాంకితుడైన శ్రీకృష్ణదేవరాయలు, తన ఆస్థానమున వివిధ భాషలు వాసిల్లుచున్నప్పుడు "దేశభాషలందు తెలుగు లెస్స". అని ముక్తకంఠముతో సింహ పీఠికనుండి గర్జించి ప్రతిపాదించుటకు ముఖ్య కారణము, శ్రవణసుభగమైన పద్యశిల్పమే. సహజ సాహితీ కవచకుండలము లతో ఉద్భవించిన తెలుగు పద్యము కర్ణపేయము. కవితా వపుః పరిపుష్టము..

ఆధునిక తమిళకవి, 'భారతి' ఒక వెన్నెల రేయిలో సింధు నదిలో మలయాళ కన్యక తన ప్రక్కనుండగా 'సుందర తెలుంగు' కవిత ఆలపించు చుండగా నౌకా విహారము సలుపవలెనని ఒక కమ్మని కల గనెను. తెలుగుభాషకు దేశభాషలలో 'లెస్స' యను విఖ్యాతి గల్పించినది, తమిళ భారతినోట సుందర మనిపించినది — తెలుగు పద్యమే. తెలుగు ఛందస్సును భక్తితో అనుశీలించుట ఆంధ్ర వాఙ్మయానుశీలనము చేయు సహృదయులందరకు అవశ్యకర్తవ్యము.. తెలుగు ఛందస్సునకు మూలము గురు లఘు విభాగము.

# 2

# గు రు ల ఘు వు లు

*గురులఘువిభాగము*

గురువు అనగా బరువగునది యనియు లఘువనగా తేలికయైనదనియు వర్ణముల ఆధారమున గురు లఘు విభాగ మేర్పడినది. ఉచ్చారణ ఆధారముగా నేర్పడిన గురు లఘువులు తెలుగులో ఛందస్సునకు ఆద్యప్రకృతులైనవి. ఏక మాత్రకాలమున నుచ్చరింపదగునది లఘువు. ద్విమాత్రకాలమున నుచ్చరింపదగునది గురువు.

ఛందస్సులో గురులఘువులకు ఏర్పడిన ప్రత్యేక సంజ్ఞలు సుప్రసిద్ధములు
గురువు = U లఘువు = I

*గురు లఘు నిర్ణయము*

(1) హ్రస్వాక్షరములు లఘువులు : దీర్ఘాక్షరములు గురువులు.

(2) పొల్లుతోగాని, పూర్ణబిందువుతోగాని, విసర్గముతోగాని కలసిన అక్షరము గురువు.

**ఉదాహరణములు—**

U U — U I — U I I
(1) వానిన్ (2) అంత (3) దుఃఖము

(3) సంయుక్తాక్షరములకు ముందున్న అక్షరములు గురువులు.

U I I — U I I — I U I I I
(1) విశ్వము (2) అర్థము (3) మణిస్థగిత

I I I — I I I — I I I — I

**గమనిక :-** స్థలము ఖగము ఋషము, స్య్వ్ర అను అక్షరమువంటిది ఒకవేళ ఉన్నచో అది ఛందశ్శాస్త్రములో లఘువుమాత్రమే అని యెరుంగునది. అది హ్రస్వాక్షరము. కనుక సంయుక్తాక్షరములన్నియు గురువులు గాజాలవు

I I I — U I I I — U U I I
స్థలము స్వస్థలము స్వస్థానము = స్వ గురువగుటకు కారణము స్థా అను సంయుక్తాక్షరమునకు ముందుండుట. స్థా గురువగుటకు కారణముదీర్ఘాక్షరము గనుక.

స్వస్థలమునందు (స్వ స్థలము) 'స్వ' గురువగుటకు హేతువు స్థ అను సంయుక్తాక్షరమునకు ముందుంటయే. 'స్థ' లఘువే. హ్రస్వాక్షరము గనుక. 'అమృతము' నందు అ లఘువని మరువరాదు. వట్రువసుడి "ృ" గల అక్షరములు సంయుక్తాక్షరములని భ్రమింపరాదు.

క్ + అ = క      మ్ + ఋ = మృ

రసైకలోలుడు — సై సంయుక్తాక్షరము కాదు.
స్ + ఐ = సై. సంయుక్తాక్షరమనగా రెండుహల్లులతో కూడిన అక్షరము అక్షరమనగా హల్లు(లు) + అచ్చు. రెండచ్చులు ఒకే అక్షరమున నుండవు.

*విశేషవిధులు*

మిశ్ర సమాసమునందును, ఆచ్ఛిక సమాసమునందును సంయుక్తాక్షరమునకు పూర్వాక్షరము గురువుకాదు. ఆదిజుడైనబ్రహ్మ—ఇచ్చట "న" లఘువుచే. ఆదిజుడైన ఒక మాట బ్రహ్మలోని బ్ర సంయుక్తాక్షరముయొక్క బరువు 'న' మీద పడదు. అట్లే అతని స్వగృహము అనునప్పుడు 'ని' గురువు కాదు. 'ఒక్కడుణము' అనుచో క్క లఘువే. 'హరిక్షేత్రము' -- సిద్ధసమాసముగ స్వీకరించినచో హరిక్షేత్రము రి గురువు. కొండొకచో నది సాధ్యసమాసముగ నెంచి, కొందరు 'రి' ని లఘువుగ స్వీకరించిన వారున్నారు. భిన్నపదములందు సంయుక్తాక్షరము పూర్వపదమును గురువుచేయలేదు. 'నరవర! జ్ఞానసుతన్ గనినవాడు' అనుచో నరవర యనునది సంబోధనము. ర గురువు కాదు. 'రావణుని ద్రోహిని చంపె'నను నప్పుడు ని గురువుకాదు.

[ఏక పదము నందు సంయుక్త పూర్వము గురువగుట నిత్యము. చక్రము వక్రము మున్నగుచోటుల క్ర కు ముందున్న అక్షరములకు వైకల్పిక గురుత్వము లేదు అవి సర్వదా గురువులే.]

తే॥ గీ॥ ద్విత్వమున కాది వర్ణంబు తెనుఁగు నందు
మాఁద కుండును వలసిన మాఁది యుండు,
జానకీ వల్లభుఁడు క్షమాశాలి యనగ (ఇందు డు లఘువు)
దశరథాత్మజుఁడు స్వామి ధాత్రికనగ[1] (ఇందు డు గురువు)

---
1 అనంతుని ఛందోదర్పణము - 68వ పద్యము

'చెలువుడు వచ్చిన క్షణమె' — (రుక్మాంగద చరిత్రము) ఈ చంపకమాల పద్య పాదమున "న" గురువుకాకతప్పదు.

సారాంశము :—సంస్కృత సిద్ధ సమాసములందు సంయుక్తాక్షరములకు ముందున్న అక్షరములు గురువులగుననియు, తెలుగు సమాసములందు మిశ్రసమాసములందు కొండొకచో సిద్ధసమాసము లందును సంయుక్తాక్షర పూర్వాక్షరములు వైకల్పికముగ గురువులగుననియు నెంచవచ్చును.

సంస్కృత సమాసములందును రేఫసంయుక్తమునకు ముందున్న అక్షరము వికల్పముగా లఘువగునని ప్రాచీనాంధ్రకవి ప్రయోగములవలన సిద్ధము ఉదాహరణకు—

ఉ॥ కావున కామక్రోధముల(గ్రాచుచు1

ఇచ్చట 'మ' లఘువే.

గీత వాద్యవినోద క్రియల(దనరు

ఇచ్చట 'ద' లఘువే.

*ఛందస్సు - అరసున్న*

ఛందస్సులో, "(" అర్ధబిందువునకు పరిగణనము లేదు. కావున అరసున్న ఉన్నను లేనట్లుగనే ఛందస్సులో భావింపనగును.

(1) (2) తెలుగులో ఛందోరీతులు (శ్రీ రావూరి దొరిసామి శర్మగారి) గ్రంథమునకు ఉదాహృతములు 1 భారతము - శాంతిపర్వము 2 కాశీఖండము.

*శిథిలద్విత్వము*

తెలుగుభాషలో కొన్ని శబ్దములు సంయుక్తాక్షరములైనను నవి ఉచ్చారణమున అసంయుక్తములే. అద్రుచు, ఎద్రుచు, పద్రుచు, విద్రుచు కద్రుచు మున్నగు శబ్దములలో అ, ఎ, ప, వి, క ... అక్షరములు లఘువులే.

అ॥ వె॥ 'చెల(గె సకల భువనవలయ మద్రువ'1

తే॥ గీ॥ భీష్మతేరెత్తికొని పాటె పృథివి యద్రువ2

చం॥ ఎద్రిచిన కాలపాకమున నీ గతి నీ మది(గ్రోధ వల్లికం
బద్రిచినవారు మన్నిశిత బాణపరంపర నైన మిణ్గురుల్
విద్రువ(గ( దత్ఫలంబుల చవిం జరితార్థులుగా శరీరపుం
జిద్రుపలు చేరు( దత్ప్రతుల చేతుల(గాక కులంబు వాతులన్3

---

1 భారతము - ఆదిపర్వము 5- 24

2 భారతము - భీష్మపర్వము 2-82

3 ఉత్తరహరివంశము 4-109.

# 3

# యతిస్వరూపము

సంస్కృతమున యతి యనగా విశ్రాంతి; విచ్ఛేదము. "యతి ర్విచ్ఛేద సంజ్ఞకః" అని వృత్తరత్నాకర నిర్వచనము.

శ్లో॥ పూర్వాంభోనిధి కాళహస్తినగరీ । శ్రీమన్మహేంద్రాచల
శ్రీశైలప్రముఖత్రిలింగశిఖర ప్రాతర్నవోషస్విసీ
కృష్ణాకంకణకింకిణీఝుణఝుణద్ గోదావరీ కాంచికా
ద్రాక్షాపేశలవాఙ్మయీ విజయతాం త్రైలింగపృథ్వీస్థలీ[1]

పై సంస్కృత శ్లోకము శార్దూలవిక్రీడితము. ఇందు పండ్రెండు అక్షరము లతో పదచ్ఛేదమగుచున్నది. 13వ అక్షరముతో ప్రత్యేక పదగుంఫన మారంభించు చున్నది. ఇట్టి పదవిచ్ఛేదమే సంస్కృతములో యతి తెలుగులో యతి అనగా పదవిచ్ఛేదముగాదు. యతి అనగా మొదటి అక్షరమునకును నిర్ణీతస్థలమందలి అక్షరమునకును గల మైత్రి.

"ప్రాంప్రాంశు వినోజ్జ్వలత్కవచు శశ్వత్కుండలోద్భాసితున్"

పై తెలుగుపద్యము శార్దూల విక్రీడితమే. ఇచట యతి పండ్రెండ-క్షరముల పిమ్మట అనగా పదుమూడవ అక్షరమున కలదు సా — శ్వ యతి శశ్వత్ అని పదమధ్యమం దుండుట గమనింపదగినది.

యతిలో గల వర్ణమైత్రి అచ్చుమైత్రి + హల్లుమైత్రియు. అనగా స్వరవ్యంజనముల రెంటికి పొసగియుండవలెను యతిస్థానమున సంయుక్తాక్షర మున్నచో అందలి యొక హల్లునకు వ్యంజనమైత్రి యేర్పడిన చాలును. పై ఉదాహరణమున 'స' కును 'శ్వ' లో శకారవ్యంజనమునకును యతిమైత్రి చెల్లినది. అట్లే "వ" వ్యంజనమైత్రికూడ చెల్లవచ్చును. యతిస్థానమున నొకచో అచ్చు ఉన్నచో తిరిగి యతిస్థానమున అచ్చే రావలెను. హల్లున్నచో స్వరవ్యంజనముల మైత్రి పాటింపనగును.

తే గీ॥ అందుకొనవయ్య మా స్వాగతార్ఘ్యమీవ

---

[1] తారాతోరణము-అవతారిక, (నండూరి రామకృష్ణమాచార్య)

ఇచ్చట "అం" కును అర్ఘ్యములోని 'అ' కును (స్వాగత+అర్ఘ్యము) యతి చెల్లుట గమనింపదగినది. ఉభయము అచ్చులే.

స్వరయతికి ఉదాహరణము—

ఉ॥ ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపల నుండు లీనమై
ఎవ్వనియందు డిందు పరమేశ్వరుఁడెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వము తానయైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్ [1]

ఇది ఉత్పలమాల. యతి ఒకటి పదియవ యక్షరములకు ఇందు ప్రథమ పాదమున యతి-ఎ-ఎ 'ఎ' కు 'మె' కు కాదు జగము+ఎవ్వని యందు=జగ మెవ్వనియందు యతి సంధిగతమైన ఎ కారమునకు, తొలి ఎకారమునకు చెల్లు చున్నది. అల్లే రెండవ పాదమున మొదటి అక్షరము "ఎ" - కును మరియు "ఈ" కును, "మే" కు కాదు! పరమ+ఈశ్వరుడు=పరమేశ్వరుడు అను నప్పుడు సంధిగతమైన "ఈ" కును పాదారంభమునందలి "ఎ" కను యతి చెల్లుచున్నది. తృతీయ పాదమున యతి పాదారంభమునందలి ఎ కును (బె కాదు కారణంబు+ఎవ్వడు=కావున ఎ పాదారంభమందలి అక్షరము ) యతి స్థానము నందున్న (లయుడు+ఎవ్వడు=లయుడెవ్వడు) సంధిగతమైన "ఎ" కును యతి చెల్లుచున్నది. చతుర్థపాదమున (వాడు+ఎవ్వడు)వా డెవ్వడులోని 'ఎ' కును యతిస్థానమందలి ఈ (శ్వరున) కును యతి ఇచ్చట యతి "డె"కు"నీ"గాదు

సారాంశము సమీక్షించినచో సంస్కృతయతి విశ్రాంతి, విరామము పద విచ్ఛేదము అనియు తెలుగుయతి వర్ణమైత్రి అనియు నిర్వచింపనగును.

తెలుగులో వేమన పద్యములలో నెల్లెడ తెలుగుయతి+సంస్కృత యతి కానవచ్చును.

ఆ వె॥ ఉప్పు కప్పురంబు నొక్కపోలికనుండు— (ఉ+ఒ)
చూడచూడ రుచుల జాడ వేరు—(చూడ జాడ ప్రాసయతి)
పురుషులందు పుణ్య పురుషుందు వేరయా
విశ్వదాభిరామ వినుర వేమ

వేమన పద్యములలో యతిస్థానమున నెల్లెడ విరతి గాననగును, అంతే గాక తెలుగుయతియైన వర్ణమైత్రియు గలదు అధోరేఖాంకిత స్థలముల యతి ప్రదర్శితము.

[1] పోతన — భాగవతము - అష్టమస్కంధము - 73.

## యతిమైత్రి

స్వరమైత్రి

(1) అ ఆ ఐ ఔ
(2) ఇ ఈ ఋ ౠ ఎ ఏ
(3) ఉ ఊ ఒ ఓ

వ్యంజనమైత్రి :

(1) క ఖ గ ఘ క్ష
(2) చ ౘ ఛ జ ౙ ఝ శ ష స క్ష
(3) ట ఠ డ ఢ
(4) త థ ద ధ
(5) ప ఫ బ భ వ
(6) అ య హ
(7) ర ఱ
(8) ల ళ
(9) న ణ
(10) ఞ న
(11) ఋ రి
(12) పు ఫు బు భు ము
(13) పొ ఫొ బొ భొ మొ

ఉదాహరణమునకు దిఙ్మాత్రముగ కొన్ని యతులు ప్రదర్శితములు. యతి స్థానమున అ ఉన్నచో-నిర్ణీతస్థలమున నే యక్షరములుండవచ్చును ?

**అకు - అ, ఆ, ఐ, ఔ - అం - అః హ - హా - హై హౌ - హం హః - య యా - యై యౌ యం యః**

అట్లే క్య, హ్రా, క్యా, క్వై... హకార యకార సంయుక్తములు, అ-ఆ-ఐ-ఔ-అచ్చులతో కూడినచో చెల్లును.

క్రి-కి యతి చెల్లు అక్షరములు : కి కీ కృ కౄ కె కే, ఇట్లే గి గీ గృ-గౄ గె గే పై వానితో నేర్పడిన ద్విత్వాక్షరములు, గ్వి గ్లి ... గ్వే ... మున్నగునవి. రి రే అనునవియు.

4

# ప్రాసవిశేషములు

## ప్రాస

తెలుగు పద్యములందు ప్రతిపాదమునందును ద్వితీయాక్షరము ప్రాస స్థానము.

"...ద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు ...
ప్రాస స్సర్వేషు చైకఏవ స్యాత్"

అని ఆంధ్రశబ్దచింతామణి నిర్దేశము ప్రాసలక్షణముల నిట్లుక్రోడీకరింపదగును—

(1) ప్రతిపాదమునందును రెండవ అక్షరము ఒకే గుణితబద్ధమై యుండ వలెను. ఉదాహరణకు—

క - కి - కు - కె
కా - కీ - కూ - కే—ఇత్యాదులు

(2) ప్రాసమున హల్ మైత్రి చాలు యతిలో స్వరవ్యంజనములు రెండును ప్రధానములు ప్రాసమున ఆ అక్షరమే రావలెను యతిలో వర్ణమైత్రి చాలు

(3) ప్రాసమున ద్విత్వముగాని, సంయుక్తముగాని, బిందు పూర్వకము, విసర్గపూర్వకమునగు అక్షరముగాని ఒకచోనున్న యెడల తక్కినపాదము లందును అట్లే ఉండవలెను. ఉదాహరణకు—

క॥ ఇందు గల డందులేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలడు దానవాగ్రణి వింటే [1]

(4) ప్రాసపూర్వాక్షర మొక పాదమున లఘువైనచో తక్కినపాదము లందును లఘువే కావలెను. అట్లే గురువైన తక్కినపాదములందును గురువే యుండవలెను. దీనికి ప్రాసపూర్వాక్షరనియతి యనిపేరు. ఈ ప్రాసపూర్వాక్షర నియతి కొన్ని పట్ల వర్తింపదు.

---

1 పోతన భాగవతము - సప్తమస్కంధము 275

(5) సంధిగతమగు అక్షరము వచ్చినపుడు, ఆగమాదులగు అక్షరములకే ప్రాసముచెల్లును ఉదాహరణకు— ఆయంగన ... ... (ఆ + అంగన) అనుచో యకారప్రాసము చెల్లును ఇంకొక ఉదాహరణ—

శా. సింగం బాకటితో గుహాంతరమునం జేట్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథ దర్శన సముద్యత్ క్రోధమైవచ్చునో
జంగాంతారనివాస ఖిన్నమతి అస్మత్సేనపై వీఁడెవ
చ్చెం గుంతీసుత మధ్యముఁడు సమరస్థేమాభిరామాకృతిన్.[1]

వచ్చెన్ + కుంతీసుతమధ్యముండు సంధివశమున 'వచ్చెంగుంతీ సుతమధ్యము' డయినది. అందుచే ఇచ్చట బిందుపూర్వక గకారప్రాసము చెల్లుచున్నది శంకా సంకుచితాంతరంగుడు...అని శార్దూల విక్రీడితవృత్తము నారంభించి-వచ్చెంకుంతీ సుతమధ్యముండు-అనిప్రాసము రెండవపాదమున వేయరాదనుట సుగమము

సంయుక్తప్రాసముతోఁ గ్రారవడి కలిగినహల్లునకుఁ గ్రాగవడిలేని హల్లునకు ప్రాసముచెల్లును ఉదాహరణకు—

శ్రీ కర......
నీ క్రియ......

స-ష, స-శ, న-ణ, ద-ధ-థ, ఋ-ర, ల-ళ-డ లకు సయితము ప్రాసచెల్లునని కొందరిమతము. "అ"కు-"ర"కు ప్రాస చెల్లుననుట కొందరిమతము.[2]

## సామాన్యప్రాసములు

ప్రతిపదపాదము నందును రెండవ అక్షరము ప్రాసస్థానమనియు, అదిహల్మైత్రిబద్ధమనియు ప్రాసనియమము అయినను, వ్యవహారమునుబట్టి లాక్షణికులు అనేకప్రాసభేదములను నిరూపించియున్నారు.

### పూర్ణబిందుప్రాసము

మొదటిప్రాసము పూర్ణబిందుపూర్వకమైనచో తక్కిన పాదములందును పూర్ణబిందు పూర్వకములైన ప్రాసములే యుండవలెను అదిపూర్ణబిందు ప్రాసము ఉదాహరణము—

క. ఇందీవరాక్షి భీష్మక
నందనఁజేకొనియె నంద నందనుఁడనగన్ [3]

---

1 తిక్కన భారతము . విరాటపర్వము 1- 95

2 ఈ విషయము ప్రకరణాంతరమున సవిస్తరముగా చర్చింపబడినది.

3 అప్పకవీయము తృతీయాశ్వాసము 301.

### అర్ధబిందుప్రాసము

ప్రాసము అర్ధబిందుపూర్వకమగుచో నెల్లెడ ప్రాసస్థానముల నట్లేయుండుట అర్ధబిందుప్రాసము.

ఉదాహరణము—

**వీఁకతోఁ గడుఁ బూచు + మ్రాఁకులవిటపము**[1]

అర్ధబిందుప్రాసమును నన్నయభట్టు అస్ఖలితముగ పాటించెనని పరిశోధకుల అభిప్రాయము. అర్ధబిందువు తెలుగు శబ్దములందున, అందును పరుషసరళములకు ముందే కానబడును అయినను, ఏశబ్దములు అర్ధబిందు సంయుతములో ఏవి కావో నిష్కర్షగ నేడు నిశ్చయించి తెలుపుట కష్టము

### ఖండాఖండప్రాసము

ప్రాసస్థానమున నొకయక్షరము ఖండబిందుపూర్వకమై మరియొకపాదమున ఖండబిందుపూర్వకము గానిచో ఖండాఖండప్రాసము. అనంతుడు పంటలకు మాత్రమే యీప్రాసము చెల్లునని చెప్పినాడు.

కం॥ మేటులగు రథికులము నొక
నాఁటి వేవుర వధింతు[2]

తే॥గీ॥ అర్ధబిందువు నిర్బిందువగు పదంబు
ప్రాసముల దీర్ఘముల మీఁదఁ బలుకఁజెల్లు
మూఁడు మూర్తుల నేకమై కూడె ననఁగ
సోఁకు మూఁకల నణఁచె విష్వకుఁ డనఁగ[3]

ప్రాచీనకాలమున శాసనములలో నరసున్నకు బదులు పూర్ణబిందువును పూర్ణబిందువునకు తరువాతి అక్షరము ద్విరుక్తమగుటయు సంకేతము.

| | | |
|---|---|---|
| వీంక | ... | శాసనభాష |
| వీఁక | ... | నేటిభాష |
| వల్లభుండ్డు | ... | శాసనభాష |
| వల్లభుండు | ... | నేటిభాష |

అరసున్న వ్రాత 800 సంవత్సరములకు ముందు లేదని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి అభిప్రాయము[4]

ఖండాఖండ ప్రాసమునకు ప్రాచీనకావ్యములలో అనేకోదాహరణము లున్నవి.

---

1 భారతము సభాపర్వము

2 భారతము-ఉద్యోగపర్వము 4-407

3 కవి సంజీవని-ముద్దరాజురామన

4 శ్రీ రావూరి దొరసామిశర్మగారు-'తెలుగులో ఛందోరీతులు'లో ఉదాహృతము.

క॥ వీఁకఁ బలు తెంచి నల్గడఁ
దాఁకినఁ గడు నలిగి ఘోరతరశరహతి న
మ్మూఁకలు విరియఁగ నర్జునుఁ
డాకరమున నేసె నుగ్రుఁడై రణభూమిన్[1]

క॥ నా కోఁకఁ దీర్చి వచ్చితి
నీ కోఁకయ యింక సూతునింటెగఁ జూడన్
లోకము వంచింపఁగ నగు
చీఁకటిరేయొంటె నేమి సేయుదొ చెపుమా।[2]

క॥ లపన్నగముఖ్యులఁ దన
వీఁపున బెట్టుకొని వడిఁ విపినములు మహా
ద్వీపములు గిరులు సకల ది
శాపాలపురములఁ జూపెఁ జనివారలకున్[3]

## సంయుతా సంయుత ప్రాసము

రేఫముతోఁగాని లకారముతోఁగాని శ్లిష్టమైన హల్లునకు రేఫలకారసంయుక్తి లేని హల్లుతో ప్రాసము ఘటించనగును. ఉదాహరణకు—

ఉ॥ క్షత్రియవంశ్యులై ధరణిఁగావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియ వైశ్యశూద్రులనఁగాఁదగు నాలుగు జాతులన్ స్వచా
రిత్రముఁ దప్పకుండఁగఁ బరీక్షితుఁగాచిన యట్లు రామమాం
ధాతృరఘుక్షితీశుల ముదంబునఁ గాచితె యేయుగంబునన్[4]

తే॥గీ॥ పాఁడి ద్రచ్చఁగా నిమ్మ నా తండ్రి కృష్ణ
వేఁడు కొనియెద నందాక పండ్లు దినుము।
దుండగపుఁ జేష్టలును నోటిగాండ్రతనము
మెండుగాఁ జొచ్చె నీకునై దేండ్ల కనఁగ[5]

పై పద్యమున పాఁడి - తండ్రి.
వేఁడు - పండ్లు
దుండగపు - గాండ్రతనము
మెండు - ఏండ్ల

---

1 ఆంధ్రమహాభారతము . నన్నయ ఆదిపర్వము 8-203
2 ఆంధ్రమహాభారతము . తిక్కన విరాటపర్వము 2-271.
3 ఆంధ్రమహాభారతము . నన్నయ ఆదిపర్వము 2-42
4 నన్నయభట్టు : భారతము ఆదిపర్వము 2-178
5 అప్పకవీయము : తృతీయాశ్వాసము-315

అనుజంటలలో రేఫలకారయుక్తములగు నక్షరములకు రేఫలకార రహితములైన అక్షరములకు ప్రాసము వేయుట గమనింపదగును. అప్పకవి ప్రాసనియమము లేని తేటగీతిపద్యమునందు ప్రాసమునకు లక్ష్యము చూపనెంచి, ప్రాసమునకు బదులు తత్తుల్యమైన ప్రాసయతిని చూపినాడు.

### 5. వికల్ప ప్రాసము

అనునాసిక సంధియందు ఆదేశానునాసికమునకు, ఆ వర్గ తృతీయాక్షరమునకుఁ ప్రాసము వేయనగును. ఉదాహరణకు—

తే గీ దిఙ్మహితకీర్తి అర్జున + యుగ్మభేది.

దిక్ + మహిత = దిఙ్మహిత, దిగ్మహిత రెండురూపములు వికల్పసంధి వశమున నేర్పడును.

### 6. ఉభయ ప్రాసము

వ్యాకరణసూత్రములచే నాదేశములగు షకార ణకారములకు శబ్దగత సకార నకారములకు ప్రాసమైత్రి చెల్లును.

(1) వసుధా ......
విషమ ......

(2) అనుటయు ......నారా
యణ .........

ఇట్లనుటచే సహజ నణలకుగాని సహజ షసలకుగాని ప్రాసము చెల్లదని సిద్ధించును. ప్రాచీనకవుల ప్రయోగము లెట్లున్నను అర్వాచీనులు నణలకు బహుళముగను షసలకు సకృత్తుగను ప్రాసము పాటించినారు.

ఈ విధముగా, సష ప్రాసము నొప్పుకొనిన అప్పకవి శస ప్రాసము నంగీకరింపలేదు. అంతేగాక శసలను తారుమారుచేసి చదువుట వలన నవ్వుపుట్టునని ఆతడాక్షేపించినాడు. శకలము - సకృత్తు అనుపదములను సకలము - శకృత్తు అని చదువుట హాస్యాస్పదమని ఆతడు తెలిపినాడు. ఇట్లు తెలుపుటవలన ఆతనికి శస ప్రాసము సైతము అంగీకార్యము కాదని యూహింపవచ్చును.

కాని - లక్షణదీపిక, లక్షణశిరోమణి మొదలైన లక్షణ గ్రంథములు శ - స ప్రాసము నంగీకరించినవి. ఇందుల కనేక ప్రయోగములున్నవి.

ఉదాహరణములు :-

ఉ। కంసుని బాధలంబడు ... ... శ
ధ్వంశము వేగ

అను ప్రయోగము ఎఱ్ఱన చేసినాడు

కం ఏసియు పైచియు కేశా
కేశి...

అనునది నన్నెచోడుని ప్రయోగము

శా॥ సంసారభ్రమ...
వంశంబీ పరిపాటి

అనునది శ్రీనాథుని ప్రయోగము

పై ప్రయోగములందున్న శ — సలు రెండును శబ్ద సిద్ధము లే. యగుట గమనింపదగినది. వికృత పదాలలో 'శ' వర్ణముండదు. అందువలన వికృత పదములలోనుండు స వర్ణమును శ వర్ణముగా మార్చి ప్రాస స్థలములందు వాడ రాదని అప్పకవి నిష్కర్షించినాడు.

## 7. అనునాసిక ప్రాసము

ద్విత్వములైన నకార మకారములకు క్రమముగా పూర్ణ బిందు పూర్వక నకార మకారములతో ప్రాసము చెల్లును. ఉదాహరణకు —

కమ్మనిలతాంతముల + కుమ్మొనసి వచ్చుమధు + పమ్ముల...[1]

కుంమొనసి యని యుండవలయునుగాని మకారము పరమైనప్పుడు బిందువు వ్రాయునాచారము కనవచ్చుట లేదు.

## 8. ఱ. ర. ప్రాసము

ర - ఱలకు ప్రాసమైత్రిగాని - యతి మైత్రిగానికూడదని ప్రాచీన లాక్షణికులు పలువురు, కూచిమంచి తిమ్మన మున్నగువారు ప్రవచించిరి కాని ప్రాచీన కావ్యములందు ఱ- ర లకు ప్రాసమునకు యతిమైత్రికి బహుళ ప్రయోగములున్నవి.

(1) చీర చించుచు విప్రు - లాఱడివైచి — బసవపురాణము

(2) తరులోలిఁదప్పక - నఱుకంగఁ జొక్కె - ఎఱ్ఱన హరివంశము పూ. 6-5

(3) వరవర యిఱు బంధచ్యుతి - కొఱకగు - ఆముక్తమాల్యద 3-86

## 9. ఋ ప్రాసము

తెలుగు సంధిలో ఋకారము రేఫ తుల్యము కాన ఋ, ర, ఱలకు ప్రాస మైత్రి ఘటింపనగును.

కం॥ ఆ ఋషిపుత్రుఁడు గట్టిన
చీరలు నతిమృదులములు విచిత్రములు మనో
హారము వావి బృహత్కటి
భారము నందొక్క కనక పట్టము వెలుఁగున్[2]

తే॥గీ॥ 'ఆయజాని తంద్రి ఫణిరాజ - శాయి యనగ'

---

1 నన్నయ భారతము ఆదిపర్వము 5-138.

2 నన్నయ భారతము అరణ్యపర్వము 3-104.

## 10 లఘు యకార ప్రాసము

సిద్ధ యకారమునకును సంధిగత లఘు (అగము) యకారమునకును ప్రాసము చెల్లును ఉదాహరణకు.

## 11. అభేద ప్రాయము

ల=ళ=లు, ల - ళ - డలు ప్రాసములోఁ జెల్లును ఉదాహరణకు

ఉ॥ వ్రల్లదమేది యిట్లు శిశుపాలుఁడు వజ్రహతాద్రిత్రుయ్యదై
  త్రెళ్లడు [1] ... ...

ఇట్లే ల - ర లకు ప్రాసము చెల్లును

క॥ సిరి దా వచ్చిన వచ్చును
  సలలితముగ నారికేళ సలిలము భంగిన్ [2]

## 12. సంధిగత ప్రాసము

ప్రాసమున వ్యంజనము ప్రధానముగావున, సంధివశమున ఆగమా దేశములుగా వచ్చిన వ్యంజనములకును శబ్ద సిద్ధములైన వ్యంజనములకును ప్రాసము ఘటించుట సంధిగత ప్రాసము యడాగమ విధిచేత యకారమాగమముగాను, గసడవాదేశ విధిచేత గసడదవలాదేశములుగాను వచ్చును.

శా॥ ఆవాలంగనుదోయి యూనగు మొగఁబాగుబ్బపాలిండ్ల పెం
  పావేశీభరమాతనూ విలసనం బాయొవ్వరేఁ జెప్పినం
  గైవారంబగుఁగాదె కేవలశరః కంపంబు కల్పించి యా
  వాఃపుట్టింపదె యిషధమ్వనకు వయ్యబ్జాక్షి సీక్షించినన్ [3]

ఆహా + పుట్టించు = ఆహా వుట్టించు. వ్యాకరణము ప్రకారము 'ఆహా పుట్టించు' లో ని "వు" ప్రాసగతమైనది గావున వకార ప్రాసముచెల్లినది.

---

1 ఆంధ్రమహాభారతము నన్నయ . సభాపర్వము (2-69)

2 సుమతి శతకము

3 శృంగార శాకుంతలము ద్వితీయాశ్వాసము - 187
అప్పకవి ఈ పద్యము కళా పూర్ణోదయములోనిదిగ ఉదాహరించెను కాని, ఇది పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగార శాకుంతలములోనిది ద్వితీయాశ్వాసము-187వ పద్యము అప్పకవీయమున తృతీయాశ్వాసమున - 374వ పద్యముగ ఉదాహృత మ్జా

## 13. పూర్ణార్ధ బిందు ప్రాసము

పూర్ణ బిందువునకు నర్ధబిందువునకు ఘటించు ప్రాసము, ఉదాహరణకు

క॥ పోఁడిగ నగజతపశ్శిఖి
మూఁడు జగంబులను దీవ్రముగఁ బర్విన బ్ర
హ్మాండము గాఁచిన కాంచన
కాండము క్రియఁ దాల్చెఁ దత్ప్రభాభాసితమై [1]

అప్పకవి కిది ... ...

ఆ వె॥ సకలవసుమతీశ మకుటలసద్రత్న
కిరణరుచి విరాజి చరణుండయిన
నిజభుజ ప్రధాని వెజయిత దేవని
కూంతు సరియ పోల్పం <u>గాంత</u>లెందు[2]

ఇందు కూఁతు రూపమును కూంతుగ స్వీకరింప వలను పడదు. శాసనలేఖన సంప్రదాయము ననుసరించి "కూంత్తు" అని యున్నచో నపుడు పూర్ణబిందువు కాని శాసనమున కూంతు అనిమాత్రమే యుండుటచే నది అర్ధబిందువే యని విద్వాంసుల వాదము

## 14. శాంత ప్రాసము

లాక్షణికుల, నిర్దేశానుసారము తెలుగులో <u>ప్రా</u>సమున నెన్నిహల్లులున్నవో అన్నిహల్లులు అన్ని పాదముల పునరావృత్తము కావలెను. కాని శివకవులు కడి పయ హల్ సామ్యమున్న చాలునని తలపోసిరి దీనికి శాంత ప్రాసమని పేరు.

కం సర్పంబు పడగ నీడను
కప్పవసి చిన విధంబు గదరా సుమతీ [3]

"సర్పంబును" సప్పంబుగా దిద్దినచో శాంతప్రాసమున కది ఉదాహరణము కాజాలదు. సర్పమునకు వికృతి సప్పముగ స్వీకరింవనగును.

కాని శివకవులలో శాంత ప్రాసమునకు ఉదాహరణములు కొల్లలు—

(1) ద్వి॥ మర్త్యలోకమునకు కర్తయున్నాఁడె
(2) ద్వి॥ అక్షణంబునఁ బంచ భక్ష్యముల్ గుడిపి

---

1 కుమార సంభవము షష్ఠాశ్వాసము-1౯7
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన కుమార సంభవములో (సంపాదకులు డాక్టర్ కోరాడ మహదేవ శాస్త్రిగారు)
పోండిగ నగజ తపశ్శిఖి
మూండు జగంబులను ...... అని యున్నది

2 రాజరాజ నరేంద్రుని కూఁతురు సోమలదేవి ద్రాక్షారామ శాసనము శాసనపద్యమంజరి

3 సుమతి శతకము.

(3) క సర్వజ్ఞ భక్తి విరహితుఁ
దెవ్వఁడు మత్కృష్ట జాతుఁడేటికిఁ గొఱయే [1]

## 15. స్వవర్గజ ప్రాసము

తే గీ గ్రంథ మంథ శబ్దంబులఁ గల ద్వితీయ
వర్ణములు రెండును నఘోష వర్ణములగు
నైన నిజవర్గ భవ చతుర్థాక్షరముల
గవియఁ బ్రాసంబులను స్వవర్గజములనఁగ [2]

ఉదాహరణములు—

(1) ఉ అంధక వృష్ణి భోజ కుకురాన్వయ భూవరు లెల్ల నీదెసన్
బాంధవ సౌహృద ప్రణయ భక్తి విశేషములొప్ప నీమనో
గ్రంథి యడంగఁజేయు నెపరంబునఁ బూనినవారు లోభమో
హాంధులు ధార్త రాష్ట్రులు నయమ్ము మెయిన్ మనకిర్వ రిత్తురే [3]

క సింధురముమదోద్రేక మ
దాంధంబై వచ్చునోజ నాచార్యునిపై
గంధవహసుతుఁడు గవయ గ
మంథరగతి నెవ్వఁడాగు మన యోధులలోన్ [4]

### విశేషప్రాసములు

ప్రాసమును లాక్షణికులు దుష్కర ప్రాసము సుకర ప్రాసము, ద్వంద్వ ప్రాసము త్ర్యక్షరప్రాసము, చతుప్ప్రాసము అంత్య ప్రాసము, అనుప్రాసము మున్నగు రీతుల శబ్దాలంకార దృష్టితో వింగడించి యున్నారు.

## 1. దుష్కర ప్రాసము

దుష్కర ప్రాసమనగా వాఙ్మయమున సులభ సిద్ధముగాని అక్షరములకు సంబంధించినది. అనేక హల్లులతో గూడిన దనియు చెప్పనగును.

కం॥ దుష్కృత గిరివజ్రాయుధ
పుష్కరసదనాధినాథ బుధనుత దవశో
చిష్కేశ వారయనన్
దుష్కరమని దీనిఁబలుకుదురు ప్రాసజ్ఞుల్ [5]

---

1 శివతత్త్వసారము : కవిత్రయము-(నండూరి రామకృష్ణమాచార్య) లో ఉదాహృతములు పుట 13 టిక్కన.

2 అప్పకవీయము తృతీయాశ్వాసము-345

3 ఆంధ్రమహాభారతము—అరణ్య పర్వము - 4-160

4 తిక్కన భారతము — ద్రోణ పర్వము 1-88

5 అప్పకవీయము తృతీయాశ్వాసము-383

(2) ద్వంద్వ ప్రాసము :

ప్రాసముగ రెండవ అక్షరముతో పాటు మూడవ అక్షరమునుగూడ స్వీకరించి రచించిన ద్వంద్వప్రాసము. ఉదాహరణకు

ఉ॥ హారికి నందగోకుల విహారికిఁ జక్ర సమీరదైత్యసం
హారికి భక్తదుఃఖ పరిహారికి గోపవితంబినీమనో
హారికి దుష్టసంపదవ హారికి ఘోషకుటీపయోపహృ
హారికి బాలక గ్రహమహాసురదుర్వనితాప్రహారికిన్ [1]

(3) త్ర్యక్షర ప్రాసము :

ప్రాసముగ రెండవ అక్షరముతో పాటు మూడు నాలుగక్షరములను స్వీకరించి రచించిన త్ర్యక్షరప్రాసము. ఉదాహరణకు—

క॥ తిరమగుఁ ద్రిప్రాసము సుం
దరమగు మురవైరి రూపు తరుణులకు మనో
హరమగు దానవులకు భీ
కరమగుఁ దవసులకు ముక్తికరమగు నవినన్[2]

(4) చతుష్ప్రాసము:

ప్రాసముగ రెండవ అక్షరమునేగాక మూడు నాలుగయిదవ అక్షరములను స్వీకరించి పద్యము నల్లుట చతుష్ప్రాసము ఉదాహరణకు—

క॥ ధీరుఁడు కమనీయకుభా
కారుఁడు కమలా వధూటికా మృదుహృదయా
ధారుఁడు కుమతి జనాధిక
దూరుఁడు కమలాక్షుఁడనఁ జతుష్ప్రాసమగున్ [3]

(5) అంత్యప్రాసము :

ప్రాసమును పాదాంతము నందుంచుట అంత్యప్రాసము ఉదాహరణకు-

కం॥ నందాంగనా కుమారా !
మందరగిరి ధీర దనుజమదసంహారా
బృందా గహన విహారా!
కందర్పాకార రాధికాస్త్రీ జారా!

---

1 పోతన - భాగవతము - అవతారిక — షష్ఠ్యంతములు —1-29
2 అప్పకవీయము 3_385
3 అప్పకవీయము 3—386
4 అప్పకవీయము 3—389

## ప్రాసయతులు

తే॥గీ॥ గీతముల సీసములను సంగీతములను
విరతి విడనాడి యొక్కొక్క చరణమునకు
రెంటికివి ప్రాస వర్ణంబు నంటఁ బలుకఁ
ప్రాస విశ్రాంతులంద్రు కబ్బములవారి [1]

యతికి బదులు ప్రాసమునువాడుట ప్రాసయతి గీత పద్యములందు సీసము మున్నగు వానియందు ప్రాసయతి చెల్లుట తెలుగు సంప్రదాయము. ప్రాస లక్షణములు - ప్రాస పూర్వాక్షర నియమము మున్నగునవి ప్రాసయతికిగూడ వర్తింపజేయవలెను[2] ఉదాహరణమునకు—

ఆ వె దేవకీ కుమార! గోవర్ధనోదార
తోయజాక్ష పాండవేయ పక్ష
ఘన విపీల గాత్ర మునిజనస్తుతి పాత్ర
యదుకులాబ్ధి సోమ! కదన భీమ [3]

1 అప్పకవీయము 3-258

2 ప్రాసయతి స్వరూపము ఈ గ్రంథమున ప్రకరణాంతరమున విపులీకృతము

3 అప్పకవీయము 3-259

# 5

# సూర్య–ఇంద్ర–చంద్రగణములు

తెలుగు ఛందస్సులలో సూర్యగణములు, ఇంద్రగణములు, చంద్రగణములు ప్రయుక్తము లు. కన్నడమున వీనికి మారుగా బ్రహ్మ విష్ణు రుద్ర గణములు గలవు.

*సూర్యగణములు*

(1) U I= గలము
(2) I I I= నగణము

*ఇంద్రగణములు :*

గురువుతో మొదలిడునవి మూడు :—(1) U I I=భగణము
(2) U I U=రగణము
(3) U U I=తగణము
లఘువుతో నారంభించునవి మూడు:—(4) I I I I=నలము
(5) I I I U=నగము
(6) I I U I=సలము

సూర్యగణములు, ఇంద్రగణములు తెలుగు పద్యములలో బహుళప్రయుక్తములు.

*చంద్రగణములు :*

(1) U I U U= రగము
(2) I I I U U=నగగము
(3) U U I U=తగము
(4) I I U I U=సవము
(5) U I I U=భ+ గురువు
(6) I I I I U=నవము

(7) U U U I=మ+లఘువు

(8) I I U U I=సహము

(9) U I U I=రలము

(10) I I I U I=నహము

(11) U U I I=తలము

(12) I I U I I=సలలము

(13) U I I I=భలము

(14) I I I I I=నలలము

తెలుగు పద్యములలో రెండు భేదములున్నవి. (i) జాతులు (ii) ఉపజాతులు.

కందము, ఉత్సాహము తరువోజ, మధ్యాక్కర, మంజరి ద్విపద త్రిపద, చతుష్పద, రగడ, కళిక, ఉత్కళిక-ఇవి జాతులు. సీసము, తేటగీతి, ఆటవెలది-ఇవి ఉపజాతులు.

జాతులందు ప్రథమపాదముఖమున గురులఘువులలో నేదియుండునో నాలుగు పాదములందును నదియేయుండవలెను. ఉపజాతులందు అట్టినియమము లేదు జాతులందు ప్రాసము, యతి యుండును ఉపజాతులందు ప్రాసముండదు. ప్రాసయతి వేయవచ్చును.[1] జాతులు మాత్రాగణ బద్ధములు లఘువు ఏకమాత్ర గురువు రెండు మాత్రలు. ఉపజాతులందు సూర్యేంద్రగణములు ప్రయుక్తములు.

1 అప్పకవీయము – చతుర్థాశ్వాసము – జాత్యుపజాతి నామములు 446–447–448–449.

# 6
# జాతులు

*కంపము :*

కందము చతుర్మాత్రాగణబద్ధము. అనగా కందమునందలి గణములు నాలు గేసి మాత్రలు గలిగియుండును అనగా UU, UI, IUI, IIU IIII [గగ, భ జ, స, నల] అను అయిదు గణములు మాత్రమే కందమునందు ప్రయోగింపనగు

కందమునందు నాలుగు పాదములుండును బేసిపాదములందు మూఁడేసి, సరిపాదములందు అయిదేసి గణములుండును

సరిపాదముల చివరి అక్షరము గురువై యుండవలెను. భంగ్యంతరమున కందమునందలి రెండు నాలుగు పాదముల తుది గణము UU = గగముగాని సగణము = IIU గాని యై యుండవలెనని చెప్పవగును.

కందమునందు బేసిగణము జగణము ( IUI ) కారాదు. అనగా కందము నందు మొత్తము 16 గణములలో 1, 8, 5, 7, 9, 11, 18, 15 గణములలో జగణము వాడరాదు.

కందమునందలి ఆరు, పదునాలుగు గణములు జగణముగాని నలముగాని కావలెను.

ప్రాస నియతి గలదు. ప్రాస యతి చెల్లదు. బేసి పాదముల యతి నియతి లేదు.

సరిపాదములలో (అనగా రెండు నాలుగు పాదములలో) యతి ప్రథమ చతుర్థ గణముల మొదటి అక్షరములకు యతి మైత్రి చెల్లవలెను.

ఉదాహరణకు

| | | | | |
|---|---|---|---|---|
| నల | జ | భ | | |
| కమలము | లనీట | బాసిన | | |
| స | స | జ | నల | గగ |
| క్రమలా | పృవిర | శ్మిసోక | క్రమలిన | భంగిన్ |
| నల | నల | భ | | |
| తమతమ | నెలవుల | తప్పిన | | |
| స | స | జ | భ | స |
| తమమి | త్రులె శ | త్రులౌట | తథ్యము | సుమతీ |

ఇది కంద పద్యము. కందము చతుర్మాత్రా గణబద్ధము. ఇందు నల, భ, జ, స, గగ ములను గణములు ఇందు ప్రయుక్తములు.

ఈ కంద పద్యమునకు నాలుగు పాదములున్నవి బేసి పాదముల మూడు సరిపాదముల ఐదేసి గణములున్నవి.

సరిపాదముల చివరి అక్షరము (2వ పాదమున గిన్ నాలుగవ పాదమున తీ గురువులు.

కందమునందు బేసిగణములలో జగణముండరాదు. ఇందలి 1, 3, 5, 7, 9, 11, 13, 15 గణముల జగణములేదు.

కందమునందలి 6, 14 గణములు జగణముగాని నలముగాని కావలెను. ఇందు ఆరు పదునాలుగు గణములు శ్మసోకి, త్రుళొట జగణములే

కందమున ప్రాస నియతి గలదు. ఇందు మకార ప్రాసము చెల్లుచున్నది

కందమున ప్రాసయతి చెల్లదు ఈ పద్యమందెచ్చట ప్రాసయతి లేదు.

కందమున బేసి పాదముల యతి నియతి లేదు.

ఇందు సరిపాదముల 1, 4 గణముల మొదటి అక్షరములకు యతిమైత్రి చెల్లుచున్నది. రెండవ పాదమున యతిమైత్రి క - క. నాలుగవ పాదమున యతిమైత్రి త - త. అధోరేఖాంకిత స్థలముల యతి ప్రదర్శితము.

తెలుగు బాసలో కందమునకు విశిష్ట స్థానమున్నది. కందము చతుర్మాత్రా గణబద్ధము గావున అది తాళములో పాడుట కనువైనది కందము వ్రాయని వాడు కవిగాడను లోకోక్తి సుప్రసిద్ధము.

### ఉత్సాహము :

ఉత్సాహ పద్యములో నాలుగు పాదములుండును ప్రతి పాదమునందు 7 సూర్యగణములు (హ, న) + చివర ఒక గురువు నుండవలెను. రెండు సూర్యగణములును ప్రయోగింపవలెను.

1, 5 గణముల మొదటి అక్షరములకు యతి చెల్లును. ప్రాసనియతి గలదు. ప్రాసయతి చెల్లదు.

ఉదాహరణకు :—

ఊహ మీఱ సూర్యగణములేడు గాంతమైన యు
త్సాహవృత్తమనఁ గఁగృతులఁజాగుచుండు సక్రవి
వ్యూహనుతులఁగాంచి కృష్ణుఁడొదిసి కాళ్లువట్టి పెన్
ద్రోహి చావుమనుచు ఐరువిఁద్రోచెఁగాళ్ళ మీదుగన్।

---

1 అప్పకవీయము 4-460

ద్విపద :

దేశికవితకు ఆటపట్టుగా జాను తెలుగునకు పుట్టినిల్లుగా ప్రస్తుతికెక్కినది ద్విపద

ద్విపద = సీసపద్యము / 2 = (6 ఇంద్ర + 2 సూర్యగణములు) / 2 = 3 ఇంద్ర + 1 సూర్యగణము

ద్విపద = 3 ఇంద్ర + సూర్య + 3 ఇంద్ర + 1 సూర్యగణము = ఒక తరువోజపాదము అనగా తరువోజ = 4 ద్విపదలు

ద్విపదకు రెండు పాదములుండును. ప్రతి పాదమునందును 3 ఇంద్రగణములు + 1 సూర్యగణము నుండును. యతి 1, 3 గణముల మొదటి అక్కరములకు చెల్లవలెను ప్రాసనియతి గలదు ప్రాసయతి చెల్లదు కాని కొందరు కవులు ప్రాసయతిని ప్రయోగించిన వారున్నారు. ప్రాసనియతి లేనిచో ద్విపదకు 'మంజరి' అని పేరు. మంజరిలో ప్రాసయతి వాడవచ్చునని లాక్షణికులందరు అంగీకరించిన విషయము "చిన్నన్న ద్విపద కెరగును" అను ప్రశస్తి వడసిన తాళ్ళపాక చిన్నయ్య అష్టమహిషీ కల్యాణమున ద్విపదకు చెప్పిన లక్షణము—

ద్విపదకు ద్విపదకుఁ దెగచెప్పవలయు
నెపుడు సంస్కృతమున నితర భాషలను
యతులలోపలఁ బ్రాసయతి దక్క సకల
యతులు చెల్లును బ్రయోగాతిశయమున
ద్విపదతో ద్విపద సంధిలనేకశబ్ద
మపుడు వెంటను గూర్చినదియయుక్తంబు"

| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | సూర్య | యతి |
|---|---|---|---|---|
| U | U U | U | U | |
| వెలిగించు | కాగడా | వెలిగింప | వోయి | — వె-వె |
| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | సూర్య | |
| I U | U | U U | U | |
| ప్రళయరు | ద్రునిఫాల | భాగంబు | నందు[1] | — ప్ర-భా |

ఇది ద్విపద. ద్విపదకు రెండు పాదములుండును. అట్లే యున్నవి. 1, 3 గణముల మొదటి అక్షరములకు యతిమైత్రి చెల్లవలెను. అట్లే చెల్లుచున్నది. అధోరేఖాంకిత స్థలముల యతి ప్రదర్శితము. ప్రాసనియతి కలదు. లకార ప్రాసము చెల్లుచున్నది ప్రాసయతి చెల్లదు.

1. శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి

(4) మంజరీ ద్విపద :

| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | సూర్య | యతి |
|---|---|---|---|---|
| అధికార | దృష్టం | కర్థమ | తులకు | — అ-అ |
| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | సూర్య | |
| భోగదా | సిగమన్న | భూదేవి | కొలకు ! | — భో-భూ |

ఇది ప్రాసనియతిలేని ద్విపద. దీనికి మంజరి అని పేరు.

(5) తరువోజ :

తెలుగులో పురాతన పద్యములలో తరువోజ ఎన్నదగినది. ఈ పద్యము ప్రాఙ్నన్నయ యుగమునుండి విలసిల్లినదే

తరువోజకు నాలుగు పాదములుండును. ప్రతి పాదమునందును 3 ఇంద్ర + 1 సూర్య +3 ఇంద్ర+1 సూర్యగణములుండును. 1, 3, 5, 7, గణముల మొదటి అక్షరములకు యతి చెల్లును ప్రాసనియతి గలదు. ప్రాసయతి చెల్లదు

తరువోజ = 4 × 2 మంజరి ద్విపదలు + ప్రాసనియతి సీసము నందు వెరసి 6 ఇంద్రగణములు + 2 సూర్యగణములుండును. తరువోజలో వెరసి 6 ఇంద్రగణములు + 2 సూర్యగణములుండును. కాని వాని అను పూర్విలో నించుక భేదము గలదు.

ఈ పద్య యతి విషయమున లాక్షణికులలో నించుక మతభేదము గన్పించుచున్నది. నన్నయ భారతములో తరువోజలందు—

| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | సూర్య |
|---|---|---|---|
| అనవర | తవ్రతా | + యాసభే | దమున |
| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | సూర్య |
| + నతిక్రశం | బగుచున్న | + యంగంబు | నందు |

ఇందు 3 ఇంద్ర + 1 సూర్య + 3 ఇంద్ర + 1 సూర్యగణము లున్నవి. యతి 1, 3, 5, 7 గణముల మొదటి అక్షరములకు పాటింపబడినది.

అ — యా — అ — అం.

ఇల నింద్రగణములు + నినునితో గూడ, నాలుగు గాఁజేసి + నయము తోడుతను, గలయంగ నెనిమిది + గణములై రెండు + గణముల తుద యతి + గా నిల్పియమర[2]

---

1. శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి

2 కవిజనాశ్రయము-జాత్యధికారము - 19

పై ఉదాహరణమునుబట్టి తరువోజలో నేకాక్షరయతి పాటింప నవసరము లేదని కొందరు లాక్షణికుల మతమని తేలుచున్నది. తరువోజలో సీసమునందు వలెనే 1, 3 మరియు 5, 7 గణముల మొదటి అక్షరములకు యతి చెల్లవచ్చునని కొందరు లాక్షణికుల మతము తరువోజ పాదమున రెండు దళముల భిన్నయతిని పాటించుట అప్పకవికి సమ్మతముగాదు

*రగడలు :*

రగడలు తాళ విశిష్టములైన దేశి రచనలు

రగడలలో అనేక భేదములున్నవి గాని నవవిధ రగడలు లాక్షణిక ప్రోక్తములు సుప్రసిద్ధములు రగడలకు రెండేసి పాదములకు ఆద్యంత ప్రాసములుండవలెనని లాక్షణికులు చెప్పిరి. ఇది రగడల ప్రత్యేక లక్షణము

*(6) హయప్రచార రగడ :*

ప్రతి పాదమునందును 4 సూర్యగణములు 1, 3 గణముల మొదటి అక్షరములకు యతిమైత్రి చెల్లును అనగా ఆరేసి మాత్రలుచేరి ఒక దళమగును పాదమున రెండు దళములుండును.

**ఋతువిరామ మిమలునల్వు**
**రక్షక నొక్క యంఘ్రిచెల్వు**
**దనర హయతఁ దార్క్ష్యుఁడంచు**
**దనుజహరణ దక్షుఁడంచు**
**మునుశుకాది మునులు వొగడఁ**
**జను హయప్రచార రగడ** [1]

*(7) తురగవల్గన రగడ :*

హయప్రచారమునకు రెట్టింపు. పాదమునకు 8 సూర్యగణములు 1, 5 గణముల మొదటి అక్షరములకు యతి. అనగా 12 మాత్రలపై బడి యతి.

**ఇరవుల్న హయప్రచార మిమ్మడించి కృతులఁ జెప్ప**
**దురు విదూరితాగ్నివరణ తురగవల్గనాఖ్య మొప్పు** [2]

*(8) విజయమంగళ రగడ :*

**తురగవల్గనంబురెంటి తోడవిజయమంగళంబు**
**ధూర్తకంసతూలదహన తుహినహీర సదృశకీర్తి**

---

1 అప్పకవీయము చతుర్థాశ్వాసము - 481
2 అప్పకవీయము చతుర్థాశ్వాసము - 482
3 అప్పకవీయము చతుర్థాశ్వాసము - 483

తురగవల్గనమునకు రెట్టింపు పాదమునకు 16 సూర్యగణములు 1, 5, 9, 13 గణముల మొదటి అక్షరములకు యతిమైత్రి చెల్లును.

*(9) ద్విరదగతి రగడ :*

కరమొప్పు నంచలఘు గణచతుష్టయముచే
విరమంబురెంటిపై ద్విరదగతిపేరిచే [1]

ద్విరదగతి పంచమాత్రా గణబద్ధము. 1, 3 గణముల మొదటి అక్షరములకు యతి మైత్రి.

*(10) విజయభద్రరగడ :*

ద్విరదగతికి రెట్టింపు

ద్విరదగతి రెట్టింప విజయభద్రముచెల్లు
విదురపూజితపాద వేదసన్నుతనామ [2]

*(11) మధురగతి రగడ :*

మధురగతి రగడ చతుర్మాత్రాగణ బద్ధము. జగణము నిషిద్ధము. 1, 3 గణముల మొదటి అక్షరములకు యతి మైత్రి చెల్లును.

విరహిణిరాధిక విహరించె నహో

*(12) హరిగతి రగడ :*

మధురగతికి రెట్టింపు 1, 5 గణముల మొదటి అక్షరములకు యతిమైత్రి చెల్లును.

న ల స భ గ గ ములలోపల నేపైనను నెనిమిది నాల్గిటిపై విరమము
గలసిన హరిగతి చెలువగు గృతులం గవివరులౌనని చెప్పిన నియమము

*(13) హరిణగతి రగడ :*

పాదమున 14 మాత్రలు. అనగా 4 + 3 + 4 + 3- 1, 3, గణముల మొదటి అక్షరములకు మైత్రి.

నరహరి పదియు నాలుగు లములు
కరియతి హరిణగతికి నెళవులు [4]

సూర్యగణముపై గ గ భ స న ల లందొకటి యని మతాంతరము.

---

1 అప్పకవీయము చతుర్థాశ్వాసము - 484
2 అప్పకవీయము చతుర్థాశ్వాసము-485
3 అప్పకవీయము చతుర్థాశ్వాసము-487
4 అప్పకవీయము చతుర్థాశ్వాసము-488

ఉదాహరణకు—

శ్రీనివాసు భజింతునేనని
పూని కుజనుల పొంతబోనని ¹

(14) వృషభగతి రగడ :

హరిణగతికి రెట్టింపు. 14 మాత్రలు దాటి యతి.

ఇరువదియెనిమిది లఘువులు పది యేనిట విశ్రాంతియుగూర్చిన
విరవగువృషగతివద్మాధిప యిదివినుమా౯రమునముదమున ²

## అక్కరలు

"అక్కరలు ఐదు" అని లాక్షణికుల నిర్దేశము

(15) మహాక్కర :

1 సూర్య + 5 ఇంద్ర + 1 చంద్రగణములు యతి 1, 5, గణముల తొలి అక్షరములకు.

మధ్యాక్కర:

2 ఇంద్ర+1 సూర్య+2 ఇంద్ర+1 సూర్య గణములు. యతి 1, 4 గణముల తొలి అక్షరములకు.

మధ్యాక్కర విషయమున అప్పకవి అభిప్రాయము ఎన్నదగినది.

మునుపుగాఁబాసంబుగూర్చి మూటిపైవిరమంబు నిల్పి
చన నింద్రయుగళంబుమీద జలజాప్తునొక్కనిఁజేర్చి
ఇనుమడించిన నాలుగణములెనసిన నొక్కపాదంబుఁ
దనర వక్కాణించినంతఁదగునట్లు మధ్యాక్కరంబు ³

అప్పకవి మధ్యాక్కరకు 1, 4 కణముల మొదటి అక్షరములకు యతిమైత్రి సంఘటించునని చెప్పియున్నాడు.

అక్కరలన్నిటికి ప్రాసనియతి గలదు.

నన్నయకు పూర్వమే యుద్ధమల్లుని బెజవాడ శాసనమున మధ్యాక్కర లున్నవి. అందుమాత్రము యతి 1, 5 గణముల మొదటి అక్షరములకే చెల్లుచున్నది.

---

1 అనంతుని ఛందోదర్పణము

2 అప్పకవీయము చతుర్థాశ్వాసము–489

3 అప్పకవీయము చతుర్థాశ్వాసము–48

స్వస్తిశ్రీనృపాంకుశాత్యంతవత్సల సత్యత్రిణేత్ర
విస్తర శ్రీయుద్ధమల్లుఁడనవద్యవిఖ్యాతకీర్తి
ప్రస్తుత రాజాశ్రయుండు త్రిభువనాభరణుండు సకల
వస్తు సమేతుండు రాజసల్కి భూవల్లభుండర్థి ¹

ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషమున మధ్యాక్కర వాడినను, యతిని 1, 4 గణముల తొలి అక్షరములకే పాటించుట గమనింపదగినది శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, నన్నయపద్ధతిని, ఎఱ్ఱన, లాక్షణికుల మతములను సమన్వయించి శ్రీమద్రామాయణ కల్పవృక్షమున యతిని 1. 4, 5 గణముల మొదటి అక్షరములకు పాటించిరి.

"దశరథ ధాత్రీశ గర్భ ధాత్రినం ద్రమదవై పుట్టి
దశకంఠ రుచికంఠ నాశ దక్షనక్ర త్యంబులం బేర్చి" – (బాలకాండము)

మధ్యాక్కర యొక్కటే తెలుగున ప్రసిద్ధము.

*మధురాక్కర:*

1 సూర్య+3 ఇంద్ర+1 చంద్ర గణములు. యతి 1, 4 అక్షరములకు.

*అంతరాక్కర:*

1 సూర్య+2 ఇంద్ర+1 చంద్రగణములు. యతి త్రిగణాంత వర్ణము

*అల్పాక్కర:*

2 ఇంద్ర+1 చంద్ర గణములు. యతి 1, 3 గణముల తొలి అక్షరములకు,

---

1 శాసన పద్యమంజరి యుద్ధమల్లుని బెజవాడ శాసనము.

# 7

# ఉ ప జా తు లు

## (1) తేటగీతి :

తే॥ గీ॥ "సూర్యు డొక్కరుండు సురరాజు లిద్దరు
దినకర ద్వయంబు తేట గీతి"

తేటగీతికి నాలుగు పాదములుండును ప్రతిపాదమునందును ఒకసూర్య గణము + రెండు ఇంద్రగణములు + రెండు సూర్యగణములుండును ఒకటి నాలుగు గణముల మొదటి అక్షరములకు యతిమైత్రి చెల్లవలెను ప్రాసనియతి లేదు. ప్రాసయతి చెల్లును ఉదాహరణకు—

| | | | | |
|---|---|---|---|---|
| సూర్య | ఇంద్ర | ఇంద్ర | సూర్య | సూర్య |
| U I | U U | U U | U | |
| అ మ్మ | పీ చే తి | తా లిం పు | క మ్మ | ద న ము |
| సూర్య | ఇంద్ర | ఇంద్ర | సూర్య | సూర్య |
| | U U | | | U |
| భ ర త | దే శా న | గు మ గు మ | వ రి మ | లిం చె । |

ఇది తేటగీతి పద్యభాగము తేటగీతికి నాలుగుపాదములుండవలెను ప్రతి పాదమునందును ఒక సూర్యగణము+ రెండు ఇంద్రగణములు+ రెండు సూర్య గణములు ఉండవలెను. ఇందల్లేయున్నవి.

ప్రథమ చతుర్థ గణాద్యక్షరమునకు యతిమైత్రి చెల్లనగును. మొదటి పాదమున ప్రాసయతి చెల్లుచున్నది - అమ్మ - కమ్మ - రెండవ పాదమున భ - వ అధోరేఖాంకిత స్థలములందు యతి ప్రదర్శితము. ప్రాసనియతి లేదు. ప్రాసయతి వాడవచ్చును.

## (2) ఆటవెలది :

ఆ వె ''ఇన గణత్రయంబు నింద్రద్వయంబును
అర్క పంచకంబు నాటవెలది''

ఆటవెలదికి నాలుగు పాదములుండును. బేసిపాదములందు 3 సూర్యగణ ములు+ 2 ఇంద్రగణములు సరిపాదములందు 5 సూర్యగణములుండును. ప్రథమ

1 కరుణశ్రీ

చతుర్థ గణాద్యక్షరములకు యతిమైత్రి చెల్లును ప్రాసనియతి లేదు. ప్రాసయతి వాడవచ్చును. ఉదాహరణకు—

| సూర్య | సూర్య | సూర్య | ఇంద్ర | ఇంద్ర | యతులు |
|---|---|---|---|---|---|
| U | | U | U U | U | |
| సంస్క | రింప | నేల | సంఘమం | తయునీవు | — స - స |
| సూర్య | సూర్య | సూర్య | సూర్య | సూర్య | |
| U | U | | U | | |
| సజ్జ | నుంచ | వగుము | స్వార్థ | ముడిగి | — స - స్వా |
| సూర్య | సూర్య | సూర్య | ఇంద్ర | ఇంద్ర | |
| U | U | | U U | U | |
| ఒక్క | నీచు | డపుడె | ఉర్వి లో | తగ్గను | — ఒ - ఉ |
| సూర్య | సూర్య | సూర్య | సూర్య | సూర్య | |
| U | U | U | U | U I | |
| రమ్య | హాస | లోల | రామ | కృష్ణ[1] | — ర - రా |

ఇది ఆటవెలది. ఆటవెలదికి నాలుగు పాదములుండును. అల్లే యున్నవి బేసిపాదములందు 3 సూర్యగణములు + 2 ఇంద్రగణములు. సరిపాదములందు 5 సూర్యగణములుండును. అల్లేయున్నవి

ప్రథమ చతుర్థ గణాద్యక్షరములకు యతిమైత్రిచెల్లును. అధోరేఖాంకిత స్థలముల యతి ప్రదర్శితము ప్రాసనియతిలేదు ప్రాసయతి వాడనగును

(3) సీసము :

సీసము తెలుగు బాసలో వాసికెక్కిన దేశిపద్యవిశేషము. నన్నయకు పూర్వమే శాసనములలో సీసపద్యములుండుట గమనింపదగిన విశేషము

సీసపద్యమున నాలుగుపాదములుండును ప్రతిపాదమునందును 6 ఇంద్ర గణములు + 2 సూర్యగణములుండును

1, 3 మరియు 5, 7 గణముల మొదటి అక్షరములకు యతిమైత్రి చెల్లును యతి విషయమున సీసపద్యపాదమును పూర్వఖండముగ ద్వితీయఖండముగ పరిచ్ఛేదముచేసి భిన్నయతులను వాడనగును.

ప్రాసనియతి లేదు ప్రాసయతివాడవచ్చును.

సీసపద్యము చివరనెత్తుగీతి—ఆటవెలదిగాని తేటగీతిగాని చేర్పనగును.

| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | | |
|---|---|---|---|---|---|
| U U | U U | U U | U I I | | |
| దీనార | టంకాల | దీర్ఘమా | డించితి | | |
| ఇంద్ర | ఇంద్ర | సూర్య | సూర్య | | |
| I U | U U | U I | U I | | |
| దక్షవా | టీశుము | త్యాల | శాల[2] | | |

1 స్వకీయము
2 శ్రీనాథుడు.

ఇది సీసపద్య పాదము సీసమునకు నాలుగు పాదములుండును ప్రతిపాదము నందును 6 ఇంద్ర + 2 సూర్యగణమునుండును అట్లేయున్నవి యతి 1, 3 మరియు 5 7 గణములకు విడివిడిగా చెల్లనగును అట్లేచెల్లుచున్నది. అధో రేఖాంకితస్థలముల యతిప్రదర్శితము. పూర్వార్ధమున దీ - తీ ఉత్తరార్ధమున ద-త్యా.

ప్రాసనియతిలేదు. ప్రాసయతి వాడవచ్చును.

సీసపద్యము చివర తేటగీతిగాని ఆటవెలదిగాని చేర్పవలెను.

## సీసభేదములు :

లాక్షణికులు పలువురు విశేషవిధులను స్వీకరించి పలువిధములగు సీసములను పేర్కొని యున్నారు. వాటి నన్నింటిని సమన్వయించి అప్పకవి సీసభేదముల నొక సీసమాలికలో గుది గూర్చి చెప్పినాడు

వ. "సీసంబులనునవి సమవిషమంబుల రెండు దెఱంగులయ్యె వాని విశేషంబు లెట్టివనిన—

సీ. యతినైనఁ బ్రాసంబునందైన నొకటితోఁ
జెప్పరేనియు సమసీసమగును
నియమముల్ దీనిపై నిలిపిన సీసంబు
లాఱుదెఱంగులై యతిశయిల్లు
నెనిమిదంఘ్రులఁ బ్రాసమెక్కించ నొక్కటై
సర్వతః ప్రాససీసంబనంగఁ
బ్రాసమాఱంఘ్రులఁ బదిలంబు గావింప
నక్కలి ప్రాససీసాఖ్యమనగ
వాది నేవడి నిల్పి రావడే పదమెల్లఁ
జేయ నయ్యాది వడిసీసమనఁగఁ
బదఖండములయందుఁ బ్రత్యేక యతులుగా
స్థిర నవకలి వడి సీసమనఁగఁ
గుదురుగా నుత్సాహ తుదయందు గీతంబు
చెప్పిన విషమాఖ్య సీసమనఁగఁ
గడవెల్ల లఘువులే కల్పించి రెద్దాన
సరవి సర్వలఘు సీసంబు ననఁగ

సప్త విధములివియ శబ్దశాసనుండు
పంచమామ్నాయ పక్కిలోఁ బల్కెఁగాని
కడమ కవులాఱు సీసముల్ విడిచిపెట్టి
చెలఁగి సమసీసపద్యమే చెప్పినారు [1]

1 సీసమాలిక అప్పకవీయము 4-521

సర్వతః ప్రాససీసము :

సీ॥ వేదండవరదుండు వేదాండగాంగుండు
కాదేన శయముండు యాదవేంద్రుఁ
డాదిత్య వంద్యుండు నౌదాస సులభుండు
వేదాంత వేద్యుండు కాదవీలఁ
డాదితేయుఁడు బిందునాద కళాతీతుఁ
డాదిత్యకులజుండు బాధితారి
మేదినీ శ్రీకుండు భూదార గాత్రుఁడు
శ్రీదమిత్ర సఖుండు ద్వాదశాత్మఁ
డాదిదేవుఁ డాశ్రిత గంధమాదముండు
చేది సౌంభక వైదర్భ సూదనుండు
మేదుర మురళీనాద వినోదు డనుచుఁ
జెప్పనను సర్వతఃప్రాససీసమగును [1]

అక్కిలి ప్రాససీసము :

సీ ఉరగతల్పునిగాని యుల్లంబులో నిల్ప
శరధి తల్పునిగాని సన్నుతింప
మురసంహరునిగాని మ్రొక్కులఁ గయిసేయ
నర మృగేంద్రులఁ గాని నమ్మికొలువ
గరుడవాహను పేరుఁగాని వీనులఁ గొన్నఁ
బురుషోత్తముని గాని పూజసేయ
హరిప్రసాదముఁగాని యర్థిమైఁ గొననొల్లఁ
బరమాత్ము వనిఁ గాని భక్తిఁబూన
ధరణి వివి నాదు నిత్యవర్తనము లనుచుఁ
బరఁగు ప్రతిఁగాని నీవు చేపట్టవనిన
జరుగు నక్కిలి ప్రాస సీసంబు కృతులఁ
బరభృతాతసి పుష్పాభ పద్మనాభ [2]

అక్కిలి ప్రాససీసమునకు అనంతుడు చెప్పిన లక్షణము వేరు. అప్పకవిది వేరు. అప్పకవి, "ప్రాసమాటంఘ్రులఁ బదిలంబు గావింప నక్కిలి ప్రాస సీసాఖ్య మగును" అని చెప్పెను. కాని, అనంతుడు 12 పాదములకు ప్రాస వేసిన యెడల అక్కిలి ప్రాస సీసము అగునని చెప్పి పై పద్యమును ఉదాహరణముగ నిచ్చెను.

1 అప్పకవీయము 4-625

2 ఛందోదర్పణము - తృతీయాశ్వాసము-30.

(6) వడి సీసము :

గ్రహదంష్ట్రనో(కవి గ్రహరాజ ప్రియవచః
కథనంబు నేర్చిన కల్పభూజ
మలరు( దూపులు కేలనంటవి కందర్పు(
దమ్ముచే వింతవి యంబురాశి
కన్నుల పెక్కుల గల్గని యింద్రుండు
కళంకేది వంగవి కనకనగము
తనువెత్తి త్రాలెడు ధర్మదేవత రూపు(
దాల్చిన రాజవిద్యా విభూతి

నయవిదుండు రాజనారాయణుఁడు విశ్వ
నాథు( డనుచు వర్ణనములు సేయ
వరుసనిట్లు కృతుల వళిసీసమన నొప్పు
వసుధ వైభవాలవాలమగుచు[1]

(7) అక్కలి (అవకలి) వడిసీసము :

పద్మాక్షి యాతఁడే బలి రసాతల మేలు
మని వంప నేర్చిన యధికబలుఁడు
హరిణాక్షి యాతఁడే యల విభీషణు లంక(
బట్టంబు(గట్టిన బల్లిదుండు
తొయ్యలి యాతఁడే ధ్రువుని మన్ననతనదం
బున( బ్రతిష్ఠించిన భూరియశుఁడు
ధవళాక్షి యాతఁడే ధనువు( దుంచినయట్టి
రఘువంశ తిలకుండు రాఘవుండు

బాణబాహు విఖండన ప్రముఖు( డితఁడు
నీలగళ సుప్తికర బాణ నిపుణు( డితఁడు
ననుచు నక్కలి వడిసీస మమరవేల్పు(
బడఁతు లభినుతింతురు విన్ను( బద్మనాభ

అప్పకవి, అక్కలివడి సీసమును పేర్కొనలేదు. అతడు పేర్కొనినది అవకలి వడి సీసము. "పద ఖండములయందు( బ్రత్యేక యతులుగా స్థిర నవకలి వడిసీసమనగ" అని అతని లక్షణము. అనంతుడు దీనినే అక్కలి వడిసీసమనెను.

[1]కావ్యాలంకార చూడామణి 8 – 44.

[2]ఛందోదర్పణము – తృతీయాశ్వాసము-32

"అర్ధమర్ధమునకు యతులు వేరై చనఁ జెప్ప నక్కిలి వడి సీసమయ్యె" నని అనంతుడు చెప్పి పై ఉదాహరణము నిచ్చెను.

## (8) సర్వలఘుసీసము :

సీసపద్యమంతయు లఘువులతోడనే రచించుట సర్వలఘుసీసము. అనగా "నల" గణములతోడనే సీసము నిర్మింపవలసియుండును. కాని సర్వలఘుసీసమున గణము పంచమాత్రాగణబద్ధము అందు గురువులు వాడరాదు. అనగా గణము "నలము" గాదు, నలలము. అనగా I I I I. అనగా ప్రతిపాదమునందును 30 + 6 = 36 లఘువులుండును గీతపద్యముగూడ లఘుమయమే గావచ్చును.

కూచిమంచి తిమ్మకవి రాజశేఖర విలాసములో సర్వలఘుసీసమునఁ దేట గీతిని లఘుమయముగా వ్రాయుటమాత్రమేగాక, అందు ఇంద్రగణము-నలము నకు బదులు - నలలము నే ప్రయోగించుట గమనింపదగినది.

తే గీ ధరణి - రథ తరణి - శతసదృశ - హరత్రి నయన
గరళ - గళధనద - సఖశుభద - గగన చికుర
వరసు - గుణనికర - మృదుహృదయ - శరధి శరధి
యురగ - వరభరణ - ధరపరమ - పురుష గిరిశ

పోతన భాగవతమున సర్వలఘుసీసమును రచించెను. ఎత్తుగీతిని గూడ లఘుమయమొనర్చెనుగాని, అందు ఇంద్రగణములకు "నల"ములను మాత్రమే వాడెను.

సీ॥ నవవికచ సరసిరుహ నయనయుగ నిజచరణ
గగన చరదివిజనుత నిగమ వినుత
జలధిసుత కుచకలశ లలిత మృగమదరుచిర
పరిమిళిత నిజహృదయ ధరణి భరణ
ద్రుహిణముఖ సురనికర విహిత నుతికలిత గుణ
కటిఘటిత రుచిరతర కనకవసన
భుజగరిపు వరగమన రజత గిరి పతివినుత
సతత జపరతనియమ సరణి చరిత

తిమిక - మఠకిటి - నృహరిము - దిత బలినిహి
తపద - పరశుధ - రదళవ - దన విదళన
మురద - మన కలి - కలుష ను - ముదపహరణ
కరివ - రద ముని - వరసుర - గరుడ వినుత

అనంతుడిచ్చిన పద్యము—

సీ॥ మృగమదము తిలకమును నగుమొగముచెలువమును
నలఁతి పవడముఁదెగడు నధర పుటము
వలుద జఘనములు బొలుపలరు కనకపు వలువ
కలితకర చరణ మణి కటకములును
విరులతురుమును నమిలిపురి సొబగుమకరికము
రచన నెనఁగిన చెవుల రవణములును
కరకమలయుగళధృతమురళియును ద్రివిధమగు
విలుకదయు విటలతటి నెఱయుకురులు
తే గీ॥ తెల్ల దమ్మి రేకుల భంగి నల్లసిల్లు
వెడద కన్నులు గల గోపవేషశౌరి
నాశ్రయించెద నమచు విట్లమరఁజెప్ప
సర్వ లఘుసీసమగునంద్రు జలజనాభ 1

అనంతుని ఉదాహరణమున నెత్తుగీతి సర్వలఘువుగాదనుట గుర్తింపదగినది. అప్ప కవి సర్వలఘుసీసమునగూడ ఇంద్రగణమునకు "నల"ములనే వాడెను. ఎత్తుగీతి సర్వలఘువు గాదు.

సీ చిఱుతయగు కొడుకునకెదర*యి మృతికి మొదలగు
దొరులవలన విని రుషరుషఁడగుచు
చరమ శరధి జలముల తరణి మునుగక మునుపు
దురమున మరువడి బలుదురుసు పరచి
కెరలిగొనయము దురిమి మురిగుణము మొరయిడగ
విరికినశిత శరములు పరువ విడుచ
జఱిగి నెళవెళిఁగొదిగి మఱుగున నిలిచిన కురు
(•) పతి మఱదిని నెరి మరు మగమ దలఁచి
చేసినట్టి ప్రతిజ్ఞ శాసింపఁగోరి
సవ్యసాచి శతాంగంబు సైంధవములఁ
దోలు గోవిందునుతులచేఁ దొడరుఁగృతుల
సర్వ లఘుసీస పద్యంబు సాగుచుండు 2

---

1 ఛందో దర్పణము తృతీయాశ్వాసము-38

* కెదురయి (ప) ర - అ ప్రాసయతి అప్పకవికి ర - అ ప్రాస సమ్మతము గాదను విషయము ఇట స్మర్తవ్యము.

• యతి భంగము.

2 అప్పకవీయము 4-531

ప్రాసనీసము :

వృత్తములందువలె సీసపాదములు నాల్గింట ప్రాసయుతముగ చెప్పినచో నది ప్రాససీసము. ప్రాససీసము=ప్రాసముగలసీసము. అయినచో ప్రాససీసమునకు నాలుగు పాదములకు ప్రాసముచాలునని కొందరు లాక్షణికులు. ఎత్తుగీతిలో రెండు పాదములుకలిసి ఒకప్రాసముచొప్పున ఆరుపాదములకు ప్రాసములు ఘటింపవలెనని మరికొందరు లాక్షణికులు నిర్దేశించినారు. కావ్యాలంకారచూడామణి ప్రకారము 18 పాదాలకు ప్రాసవేసిన అక్కిలిప్రాససీసము. ఆరుపాదాలకు ప్రాసవేసిన ప్రాస సీసము. అనంతుని ప్రకారము నాలుగు పాదాలకు ప్రాసవేసిన ప్రాససీసము. 12 పాదాలకు ప్రాసవేసిన అక్కిలిప్రాససీసము.

ప్రాససీసమునకు విన్నకోట పెద్దన నిర్వచనము.

క సీసమునకు నాలుగులఁ
ప్రాసములిడి యొలి సర్వపద ఖండములన్
భాసురముగ వళ్లలవడఁ
జేసిన నది కృతులఁ బ్రాససీసంబయ్యెన్ [1]

ఉదాహరణము—

సీ కామినిచే మన్నపట్టుతోరముఁజూచి
ప్రల్లదంబునఁద్రెంచి పాఱవైచి
యామని ద్రోహమత్యంతమైతనుఁబట్టి
యతి దరిద్రునిజేయ నార్తినొంది
భూమి వెల్వడిపోయి పురపురఁ బొక్కుచుఁ
బుండరీకాక్ష యోభువనవంద్య
సామి నాయపరాధ శతసహస్రంబుల
సైరింపవే కృపాజలధియనుచు
ప్రేమఁడించు కౌండిన్యుని భీతిఁబాపి
పృథులసౌఖ్యంబులొసఁగి గాంభీర్యమమరఁ
బాముపైఁబవ్వళించిన ప్రభుఁడవవిన
ప్రాససీసంబు విలసిల్లఁబద్మనాభ [2]

నమసీసము :

నన్నయభట్టు సీసపద్యములలో పాటించిన శిల్పము అనుశీలింపదగినది. సర్వత్ర యతినియమమో, ప్రాసయతినియమమో నన్నయ పాటించెను. ఒకే సీసమున నన్నయ రెండింటిని వాడడు అప్పకవి చెప్పినట్లు నన్నయసీసము

---

1 విన్నకోటపెద్దన : కావ్యాలంకారచూడామణి 8 ఉల్లాసము 39 పద్యము.

2 ప్రాససీసము : ఛందో దర్పణము తృతీయాశ్వాసము-27

లన్నియు సమసీసములే. సర్వత్ర యతినియమము పాటించిన క్రిందిపద్యము సమ సీసమునకు చక్కని యుదాహరణము—

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
        యధ్యాత్మవిదులు వేదాంతమనియు
    నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
        కవివృషభులు మహాకావ్యమనియు
    లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
        యైతిహాసికు లితిహాసమనియుఁ
    బరమ పౌరాణికుల్ బహు పురాణసముచ్ఛ
        యంబని మహిఁ గొని యాడుచుండ
      వివిధ వేదతత్త్వవేదివేదవ్యాసుఁ
      డాదిముని పరాశరాత్మజుండు
      విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
      పరఁగుచుండఁ జేసె భారతంబు[1]

ప్రాసయతిసీసము :

సీసపద్యమునందు ప్రాసయతినే వాడుటలో శ్రవణపేయమైన మాధుర్య మేర్పడుట సహజము. ఏపాదమున కాపాదమున ప్రత్యేకముగా ప్రాసయతినే వాడుచు వ్రాసిన సీసమునకు కరుణశ్రీగారు ఈకృతికర్తపై రచించిన పద్యమును చూడదగును.

సీ. ఎవ్వాని గళములో నవ్వు కొన్నది నంద
        నారామ మధుర మందార వల్లి
    ఎవ్వాని కలములో నివ్వటిల్లెను విశ్వ
        భారతీ మంజు మంజీర రవము
    ఎవ్వాని చెలిమిలో నివ్వాళు లెత్తెను
        పర్వాలు లేని పౌర్ద లక్ష్మి
    ఎవ్వాని కలిమిలో పవ్వళించెను సుప్త
        గుప్తదాన వ్రత ప్రాప్త తృప్తి
తే. గీ. అతడు వందూరి వంశపయః పయోధి
      చంద్రముడు రామకృష్ణమాచార్యసుకవి
      గద్య పద్యతారాతోరణాద్యనేక
      కావ్యనిర్మాణచాతురీ సవ్యసాచి 2

---

1నన్నయ భారతము ఆదిపర్వము అవతారిక 1-31

2 (శ్రీ) జంధ్యాల పాపయ్యశాస్త్రి కరుణశ్రీ : తారాతోరణము – అవతారిక

# 8

# గేయములు

### గేయము : పదము

మాత్రాగణబద్ధమై తాళలయాన్వితమైన రచనలకు గేయములని పేరు. పాడుటకు అనువుగ నుండునది గేయము. ఇందు గానాంశకు ఎక్కువ ప్రాధాన్యము

భావనా ప్రధానమైనది పదము. పదకవితలో కవితాంశకు ఎక్కువ ప్రాధాన్యము.

తెలుగు అజంతభాషకావున, ప్రాచ్యభాషలలో ఇటలీభాషవంటిదని పాశ్చాత్య విద్వాంసులచే ప్రస్తుతికెక్కినది. (**Telugu is the Italian of the East**). అజంతభాషలలోఁగల గానసౌలభ్యము సంగీతవిద్వాంసులందరకు అనుభవ పునరుక్తము.

### పద్యకవిత : పదకవిత

పద్యములు రాగమున కనువైనవనియు, పాటలు తాళలయాన్వితము లనియు స్థూలముగ పద్యకవితకు పదకవితకుగల భేదము నెన్నవచ్చును. కాని సూక్ష్మదృష్టితో పరిశీలించిన పద్యములుగూడ అంతర్యమున తాళమును, మాత్రలను నాధారముగాఁజేసికొని ఉద్భవించినవే. ఎల్లైన సాహితీ జగత్తులో పద్యములు చదువుచున్నారు పాటలను పాడుచున్నారు. పద్యములకు రాగము చేర్చనగును పాటలో తాళబద్ధములు అందుచే వ్యవహారసిద్ధమైన ఈభేదమును సాహితీ నిరూఢిగ నెంచనగును. తెలుగులో మొట్టమొదట ఉద్భవించినది పదకవితయేయని నన్నయకు పూర్వమే - తుమ్మెదపదములు - వెన్నెలపదములు మున్నగునవి వెలసి యున్నవని కొందరు విద్వాంసుల అభిప్రాయము ఏ వాఙ్మయము నందైనను మొదట పాట—తరువాత పద్యము — పిమ్మట — గద్యము — చివరకు వచనము ఉద్భవించుట సహజము

దేశికవితాశాఖకు చెంది మాత్రాగణబద్ధములైన ద్విపద-తరువోజ మున్నగునవి పద్యకవితకు పదకవితకు మధ్య వెలసిన ఛందోవారధులు.

### పదము - ఛందస్సు

నన్నయకు పూర్వమునుండి నేటివరకు — అజంతభాషయైన తెలుగులో పదకవితకు ప్రజాహృదయములలో సముచిత ప్రాధాన్యము లభించుట సహజము.

పదకవితను లక్షణనిబద్ధము చేయుటకు సల్పిన ప్రయత్నములే ద్విపదలు తరువోజలు మున్నగునవి. ముత్యాలసరములును అట్టివే

తెలుగుభాష వాగ్గేయకారులకు కన్నతల్లిగా ప్రఖ్యాతికెక్కినది అన్నమాచార్యులు, క్షేత్రయ్య–త్యాగరాజు తెలుగులో గేయప్రబంధములు వ్రాసి, దక్షిణాపథమునంతటిని ఆంధ్రసంగీతమునకు అధినివేశ సామ్రాజ్యముగా జేసినారు.

పాటను తాళలయబద్ధమొనర్పవచ్చుగాని—ఛందోబద్ధము చేయుట సుకరము గాదు. ఎందుచేతననగా తాళలయలు ఛందస్సు పరిధిని దాటి విహరించుట సహజము

అయినను దిఙ్మాత్రముగ—పదకవితాలక్షణముల అనుశీలింపనగును పదకవిత యనగనే సాహిత్యపు పొలిమేరలు దాటి సంగీతములో ప్రవేశింపక తప్పదు. పదకవితలో లఘువనగా ఒకమాత్ర. గురువనగా రెండుమాత్రలు మూడు మాత్రల—ఎన్నైనమాత్రలు కావచ్చు పదములు మాత్రాగణబద్ధములు. అందుచే పదములను గురులఘు విభాగనిబద్ధమైన ఛందస్సులో బంధించుట సాధ్యముగాదు.

## రగడ విశేషములు

అప్పకవి జాతులలో ఉపవిభాగముగా లాలిపాట పెండ్లిపాట సువ్వాలే మొదలైన రగడ విశేషములను పేర్కొనెను

ఇందు లాలిపాటకు రెండేసిపాదాలచివర 'లాలి'యను మకుటమును పెండ్లి పాటకు గౌరీకల్యాణ వైభవమే అను మకుటమును, 'సువ్వాలే'కు సువ్విసువ్వాలే అను మకుటమును నుండును. ఇవియన్నియు చతురస్రగతిలో నడచును. వీనిని మధురగతి రగడలే యనవచ్చును అప్పకవి వీని లక్షణములను నిర్దిష్టముగా చెప్ప కున్నను అతడిచ్చిన లక్ష్యములను చూచినచో లక్షణము తెలియును. అప్పకవి లాలిపాటకు ఇచ్చిన ఉదాహరణము—

అక్షర హరి వికచాంబురుహాక్ష
యక్షప సఖనుత యదుకుల దక్ష
రక్షక సురవిదుర ద్విప రక్ష
రాక్షస విదళన ప్రరుచిర వక్ష
...లాలి[1]

ఆపాటకే చివర 'గౌరీ కల్యాణవైభవమే' అనిచేర్చిన పెండ్లిపాటయగును. 'సువ్విసువ్వాలే' అని చేర్చిన సువ్వాలేపాటయగుననని అప్పకవి ప్రవచించెను.

పై పాటయందు చతుర్మాత్రాగణములు, దళమునకు ఎనిమిదేసియున్నవి ప్రాసయున్నది 3 5, 7 గణముల మొదటి అక్షరములకు యతిమైత్రి — అప్పకవి ఉదాహరణములను మాత్రమే యిచ్చుటచే లక్షణములను ఊహించుకొనవచ్చును.

1అప్పకవీయము - చతుర్థాశ్వాసము-308

అది తాళలయాన్వితమైన మాత్రాచ్ఛందోబద్ధమైనది కాబట్టి రచయిత యథోచితముగ వ్రాయవచ్చునని అప్పకవి మతము గేయములు ఛందస్సునకు అతీతమైనవే గాని ఛందోరహితములైనవిగావని మరువరాదు.

### ఆధునికచ్ఛందస్సులు

తెలుగులో జాతులయందు మాత్రాగణములు ప్రయుక్తములు. అందు లఘువు వెనువెంటనే గురువుగల I U = వ, I U I = జ, I U U =య గణములు అప్రయుక్తములు.

కాని ఆధునిక కవిత్వములో అభ్యుదయకవితా మహోద్యమప్రవర్తకుడైన (శ్రీ)(శ్రీ)కవి-ఆతని అనుయాయులు మాత్రాచ్ఛందస్సులలో జగణము (I U I)ను గూడ వాడి క్రొత్తలయను సాధించినారు. ఉదాహరణము—

మరో ప్రపంచం మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది

ముత్యాలసరము :

నేడు ముత్యాలసరముగా ప్రసిద్ధమైన గేయమునందు పాదమునకు 3 మాత్రలు + 4 మాత్రలు + 3 మాత్రలు + 4 మాత్రలు చొప్పున మూడుపాదము లుండి చివరపాదమున 3 + 4 + 2 మాత్రలు కనిపించుచున్నవి. ఉదాహరణకు—

మేలుకొనుమో భరతవీరా
మేలుకొనుమో పూత చరితా
మేలుకొనుమో సర్వమానవ
సౌఖ్య వేదాంతీ!

"తెల్లవారెను కోడికూసెను" వంటిపదములు ఈకోవకు చెందినవే. ఈపదమును పునరుద్ధరించి ముత్యాలసరమని నామకరణము చేసిన గురజాడ వేంకట అప్పారావుగారు ఇట స్మరణీయులు.

పాటలు :

సినిమా, రేడియోల ప్రభావమున ఆధునిక కవులు మనోరంజకములయిన పాటలనెన్నిటినో వ్రాసినారు. ఉదాహరణకు కింది పాటను చూడదగును.

సుక్కలన్ని కొండమీద
సోకు శేసుకునే వేళ—
వంటబోది వరిమడితో
వకవక వచ్చేవేళ—
సల్లగాలి తోటకంత
సక్కలిగిలి పెట్టువేళ—

మొక్కజొన్న తోటలో
ముసిరిన చీకట్లలో
మంచెకాడ కలుసుకో
మరువకు మామయ్యా [1]

ఇచ్చట 6 + 6 మాత్రలు ఒకపాదమైనవి.

U U U U
సుక్కలన్ని | కొండమీద

1, 3 గణముల మొదటి అక్షరములకు యతిచెల్లుచున్నది.

'సు' కు 'సొ' కు

U U U U
మొక్కజొన్న | తోటలో

U U U
ముసిరిన చీ | కట్లలో

U I U
అనునపుడు—తోటలో—అయిదుమాత్రమే ఉన్నవి అరవమాత్ర "శేషం రాగేన పూరయేత్"— రాగ ప్రస్తారములో కలసివచ్చును. దీనిని రూపకతాళములో పాడనగును.

ఇట్లే పాటనంతటిని ప్రస్తరింపనగును.

చీకటి మిణుగురు జోతుల
చిటిలి చిల్లులడకమునే—
సద్దుల రాగాలు చెవుల
నిద్దుర తీయకమునుపే—
ఆకాశపు టొడిని తోట
ఆవలింత గొనకమునే—
పొద్దువాలు గంటనే
పుంత దారివెంటనే
సద్దుమణగ వచ్చి రా!
ముద్దుల మామయ్యా.

"సద్దులరాగాలు చెవ్వల నిద్దుర తీయకమునుపే" అనుచోట—ప్రాసయతి ప్రయుక్తము.

1 శ్రీ కొనకళ్ల వెంకటరత్నం బంగారి మామ పాటలు

U I I U U U
చివరి పాదమున—ముద్దులమామయ్యా — అనునపుడు రెండవగణమున నాలుగు మాత్రలేయున్నవి కోరవడిన రెండుమాత్రలు— మామయ్యా—అనుదీర్ఘములో పాదాంతము గనుక రాగమున హృదయంగమముగ కలిసిపోవును.

గొడ్డుగోద మళ్లేసే
కుట్టు కుంకలకు గాసీ—
కలుపు తీతలయి మళ్లే
కన్నె పశువులకుగాసీ—
బుగ్గమీస మొడివేసే
భూ కామందుకు కాసీ—

తోవ కెదురు వస్తివా,
దొంగచూపు చూస్తివా,
తంటా మనయిద్దరికే
తప్పదు మామయ్యా !

కంచెమీది గుమ్మడిపువు
పొంచి పొంచి చూస్తాది !
విరబారిన తొన్నపొట్ట
వెకిలి నవ్వు నవ్వుతాది ;
తమలపు తీగెలు కాళ్లకు
తగిలి మొరాయిస్తాయి ;

బెదిరిపోకు మామయా బెదిరిపోకు మామయా !
సదురుకో నీ పదును గుండె సక్కని మామయ్యా !

పనలుకట్టి నన్ను పలుకరించబోయి నపుడు—
చెఱుకుతోట మలుపుకాడ చిటికివేసి నవ్వినపుడు—
మోటబావి వెనక నాతో మోట సరసమాడినపుడు—
కసరి తిట్టినానసీ, విసరి కొట్టినానసీ
చిన్నబోకు నలుగురిలో సిగ్గది మామయ్యా !

ఇట్లు ఆరు మాత్రలతో సాగెడి పాటలు కొన్ని.కొన్ని నాలుగుమాత్రలతో, కొన్ని మూడు + నాలుగు మరికొన్ని అయిదుమాత్రలు...... రెండుమాత్రలతో వివిధ తాళానుగుణముగ సాగుట కద్దు.

## పదకవిత : పండితులు

పదకవితను లాక్షణికులు గుర్తించినను, అందలి స్వారస్యమును గ్రహించియు దానికి పద్యకవితతో సమప్రాధాన్యము నివ్వకపోవుటకు ముఖ్యకారణము

నూహింపవచ్చును. పదకర్తలు వ్యాకరణనియమములకు కట్టుబడియుండరు అంతే గాక అవి శుద్ధసాహిత్యప్రక్రియలుగావు. అవి వాఙ్మయములో అర్ధనారీశ్వరములు. పదమునకు సగముదేహము సాహిత్యము. సగముదేహము సంగీతము

"ముదివిటులు విధవలంజెలు
పదకవితలు మారుటాస బాపన వారల్
చదువని పండితవర్యులు
కదనాస్థిర వీరవరులు కడిది పురమునన్"

అను చాటువు పదకవితలపై శ్రీనాథుని అధిక్షేపణగా సుప్రసిద్ధము. విద్వత్ కవులు పదకవితలపై అప్పుడప్పుడు ఛలోక్తులు విసరుట సహజము. ఎందుచేత ననగా పదకర్త నిష్ఠ, సాహిత్యముమీదకంటె సంగీతముపై అధికమగుటచే ఆ అధిక్షేపణ కేవలకవులు చేయుటకద్దుకాని ఆ పద్యకవులకు మాత్రము పదకవిత యందలి స్వారస్యము తెలియదనుకొనుట పొరపాటు. శ్రీనాథుడే పదకవితా శాఖకు పట్టుగొమ్మయైన పలనాటి వీరచరిత వ్రాసిన సంగతి విస్మరింపరాదు. అధిక్షేపణ చేయువారికి ఒక పదకవిత యననేల ? 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అని కవిత కవితనంతటిని నిరసించినవారు లేరా ?

## 9

# అక్షర, మాత్రాగణములు

గణమనగా గురు లఘువులకూడిక. గణములు అక్షర గణములనియు, మాత్రాగణములనియు రెండువిధములు.

అక్షర గణములలో ప్రధానమైనవి త్ర్యక్షరగణములు. "గురులఘువులు మూఁడు గూడికొన గణములగున్" అని మూడక్షరగణములగూర్చి, కవిజనాశ్రయ కారుని ప్రవచనము వీనికి నిసర్గ గణములనియు వాడుక గలదు.

గ - అన గురువునకు ల - అన లఘువునకు సంకేతములు. గగ అనగా రెండు గురువులు (UU). గలము అనగా గురువు, లఘువు (UI). "గా" అన్నను గగమే.

ద్వ్యక్షరగణములు:

UU = గగము, II = లలము, UI = గలము, IU = లగము.

త్ర్యక్షరగణములు

ఇక గురులఘువుల రెంటిని మూడక్షరములుగా ప్రస్తరించినచో ఎనిమిది గణము లేర్పడును.

(1) UUU = మ గ ణ ము (సర్వగురువు)
(2) III = న గ ణ ము (సర్వలఘువు)
(3) UII = భ గ ణ ము (ఆది గురువు)
(4) IUI = జ గ ణ ము (మధ్య గురువు)
(5) IIU = స గ ణ ము (అంత్య గురువు)
(6) IUU = య గ ణ ము (ఆదిలఘువు)
(7) UIU = ర గ ణ ము (మధ్యలఘువు)
(8) UUI = త గ ణ ము (అంత్యలఘువు)

శ్లో॥ ఆదిమధ్యావసానేషు యరతాయాంతి లాఘవం
భజసా గౌరవం యాంతి మనౌతు గురులాఘవౌ

'యమాతారాజభానస' అను సూత్రము గణవ్యుత్పత్తి విధానమును సులభముగా తెలియుచున్నది. పరిశీలింపుము.

| | | |
|---|---|---|
| య I | మా U | తా U |
| I స | | U రా |
| I న | U భా | I జ |

(1) య మా తా = IUU = యగణము

(2) మా తా రా = UUU = మగణము

(3) తా రా జ = UUI = తగణము

(4) రా జ భా = UIU = రగణము

(5) జ భా న = IUI = జగణము

(6) భా న స = UII = భగణము

(7) న స య = III = నగణము

(8) స య మా = IIU = సగణము

సంస్కృతఛందశ్శాస్త్రములో గణములు పది. అవి 'మ య ర స త జ భ న గ ల' లు. ఈవిధ సంకేతములతో పాటు మ=మగణము, భ=భగణము, గ=గురువు, ల=లఘువు, భా=భగణము+భగణము, గా=గురువు+గురువు, యాయ=యగణము + యగణము + యగణము, న్య=నగణము + యగణము, న్న=నగణము+నగణము-అను సంకేతములను లాక్షణికులు వాడినారు.

UI = గల = హగణము

IU = లగ = వగణము అని నామాంతరములు.

మాత్రాగణములు:

లఘువు=ఒక మాత్ర, గురువు=రెండు మాత్రలు.

(1) ఏకమాత్రాగణము - I ల. (2) ద్విమాత్రాగణములు - II = ల లను U = గ. (3) త్రిమాత్రాగణములు = III = న, UI = హ, IU = వ.

(4) చతుర్మాత్రా గణములు, IIII = నలము, U U = గగము, UII = భగణము, IUI = జగణము, IIU = సగణము.

(5) పంచమాత్రాగణములు - IIIII = నలలము, UIII = భ ల ము, IUII = జలఘువు, IIUI = సలము, IIIU = నగము, UUI = తగణము UIU = రగణము, IIU = యగణము.

సంస్కృతమున నిసర్గగణములని పేరుగాంచిన త్ర్యక్షరగణములు బహుళ ప్రచారములోనున్నవి. మాత్రాగణ నిబద్ధములగు ఆర్యాగీతిజాతులు కొన్ని సంస్కృతోక్తములున్నవి.

# 10

# సంస్కృతాంధ్రవృత్తములు

## సంస్కృత వృత్తములు

సంస్కృతమున వృత్తములు అసంఖ్యాకములు. వృత్తమునకు నాలుగు పాదములుండును. సంస్కృతమున నేపాదమున కా పాదము విరిగి నిలుచును. అనగా సంస్కృతమున పాదాంత యతి నియతము సంస్కృతమున యతి యన్న విరామము, విచ్ఛేదము. పాదమునందలి అక్షరములనుబట్టి గురు లఘు ప్రస్తారము వలన నెన్నియైన వృత్తము లేర్పడుటకు వీలున్నది.

ఏకాక్షర వృత్తములు రెండుండవచ్చును. ఒకటి లఘువు రెండవది గురువు. ఇట్లే రెండవ ఛందమున, అనగా రెండక్షర పద్యములు నాల్గుండును. UI, UU, IU II

ఇట్లే మూడవ ఛందమున 8 వృత్తములు ఏర్పడును. సంస్కృతమున లాక్షణికులు 26 అక్షరములవరకు వృత్తములఁ బేర్కొనిరి. అనగా 26వ ఛంద మున 67108864 వృత్తములు ఏర్పడును. ఒకటవ ఛందమునుండి 26వ ఛందము వరకు 134217726 (పదమూడు కోట్లపైబడి) వృత్తములేర్పడును. ఈ వృత్త ములు సమవృత్తములు, అర్ధ సమవృత్తములు, విషమ సమవృత్తములుగ మూడు రెట్లు కాగలవు. పర్యవసానము వృత్తములు కోటానుకోట్లు. అసంఖ్యాకములు. గణిత సిద్ధాంతానుసారము వృత్తములు కోటానుకోటులు ఏర్పడవచ్చునుగాని సంస్కృతములో లాక్షణికులు చెప్పినవి కొన్ని మాత్రమే. కావ్యములందు సుప్రతిష్ఠతములైనవి అల్ప సంఖ్యాకములే.

## తెలుగు వృత్తములు

తెలుగులో వాడిన వృత్తములు ముఖ్యమైనవి వ్రేళ్లపై లెక్కింపదగినవి తెలుగు వృత్తములలో సంస్కృత గణములనే వాడినను కొన్ని ముఖ్యమైన మార్పులు చేర్పులు గమనింపదగినవి.

(1) తెలుగు వృత్తములలో పాదాంత యతి (అనగా సంస్కృత పద్ధతిలో విశ్రాంతి = విచ్ఛేదము) లేదు.

(2) తెలుగులో మొదటి పాదముతో పదము విరుగదు సరిగదా, రెండవ పాదములోనికి చొచ్చుకొనిపోవును. ఉదాహరణకు—

ఉ॥ పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నా
రాయణునట్లు వాణసధరామరవంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడున్ దనకిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడునైన వాఁడభిమత స్థితి తోడయి నిర్వహింపగన్

పై పద్యములో నారాయణ శబ్దము, సహాధ్యాయుడు శబ్దమును రెండేసి పాదములలో సర్దుకొని పోయిన సంగతి సుగమము. అది తెలుగు వృత్తమునకు శోభాయమానమని పలువురు కవులు తలపోయుట కద్దు. మూడవ పాదమున యతిగూడ విరుగక రాయణభట్టు ... ... ధురంధరుడున్ అని సాగి పోవుట గమనింపదగినది. సంస్కృత యతి స్వరూపము వేరు. తెలుగు యతి స్వరూపము వేరు.

(8) సంస్కృతములో లేని ప్రాసనియతిగూడ తెలుగు వృత్తములలో అపరి హార్యనియమము.

4. తెలుగు ఛందస్సులని పేరుగాంచిన సీసము, తేటగీతి, ఆటవెలది పద్యములలో ప్రాసనియమము లేదుగాని వృత్తములలో ప్రాసము నిత్యవిధి యగుట గమనింపదగినది.

తెలుగువారు సంస్కృతమునుండి వృత్తములను స్వీకరించిన వానికి తెలుగు ఆహార్యమునే ధరింపజేసినారు. తెలుగులో వృత్తములు ప్రాఙ్నన్న పార్యయుగమునుండి సాక్షాత్కరించుచున్నవి. కన్నడమందును వృత్తములు గలవు పంపభారతమున చంపకమాల, ఉత్పలమాలాది వృత్తములు గలవు. నన్నయ నారాయణభట్టు సాహచర్యమున కన్నడ భాషాప్రభావము వలన వృత్తములను తెలుగులో ప్రవేశపెట్టెనను వాదమొకటిగలదుగాని, కామసాని గూడూరు శాసనమున - నన్నయకుముందే తెలుగులో చంపకమాలాది వృత్త ములు గలవనుటకు సాక్ష్యము లభించినది. ఉత్పలమాల చంపకమాల మున్నగు వృత్తములకు తెలుగులోఁగల బహుళ ప్రచారము సంస్కృత వాఙ్మయమందును గనుపింపదు. ఆవృత్తములు తెలుగునకు వలసవచ్చి, స్థిరనివాస మేర్పరచుకొని తెలుగుదనములో లీనమైపోయినవి.

తెలుగు వృత్తములను ప్రస్తరించినచో (1) గణములు (2) యతి (3) ప్రాసము - అను విభాగము లేర్పడును. అందు గణములు మాత్రమే సంస్కృత పద్ధతిలోనివి. యతి ప్రాసములు అచ్చముగా తెలుగునకు సంబం ధించినవే అంతేగాక, పాదాంతమున విచ్ఛేదము లేకపోవుట సంస్కృత సంప్రదాయము నతిక్రమించుటయే. అందుచేత వృత్తములను సంస్కృత చ్ఛందస్సులని నూత్రీకరించుట తెలుగుదనమునకు న్యాయముచేకూర్చక పోవు టగునేకాగలదు.

---

1 నన్నయ భారతము - ఆదిపర్వము, 1-24

వృత్తములుగూడ, యథార్థమునకు తెలుగు ఛందస్సులే, కోట్లకొలది వృత్తములు పుట్టినను అందు ఛందః కర్తలు పేర్కొనినవి సుమారు నాలుగైదు వందలుమాత్రమే. అందునుకవులు వాడినవి సుమారు 50. తెలుగులో కవులు వాడినవృత్తాలలో ఉత్పలమాల, చంపకమాల, శార్దూల విక్రీడితము, మత్తేభము ముఖ్యములు. స్రగ్ధర, మహాస్రగ్ధర, మందాక్రాంత, మానిని, మత్తకోకిల తరలము, పంచచామరము, సుగంధి, క్రౌంచపదము, మంగళమహాశ్రీ వృత్తములకు ఎడనెడ ప్రచారము గలదు.

లాక్షణికులు పెట్టిన పేరులలో - యతిస్థాన నిరూపణములలో నెడనెడ ఈషద్భేదములు గన్పించుచున్నవి. సంస్కృతములో యతి స్థానమునకును తెలుగులో యతిస్థానమునకును నెడనెడ వ్యత్యాస మేర్పడినది మందాక్రాంతకు సంస్కృతమున 5, 11 స్థలముల రెండు యతులు. తెలుగులో 11 మాత్రమే యతి.

### యతులు - మతభేదాలు

కవిత్రయము వారిలోనే ఛందో లక్షణానుసరణమున కొన్ని భేదములు కన్పించును. ఉదాహరణకు—

పృథ్వి : నన్నయ 12 యతి, ఎఱ్ఱన 9 యతి మధ్యాక్కర : నన్నయ యతి 1, 5 గణములు, ఎఱ్ఱనయతి 1 - 4 గణములు. మాలిని : నన్నయ 18 (ఒకయతి), ఎఱ్ఱన 7 - 13 - 19 (మూడుయతులు). సుప్రసిద్ధ పద్యములైన చంపకమాల, ఉత్పలమాల, శార్దూల విక్రీడితము మత్తేభములలో మాత్రము తెలుగున మత భేదములు లేవు.

# 11

# వృత్తలక్షణములు

తెలుగున వృత్తలక్షణములను పలువురు చందోగ్రంథకర్తలు సోదాహరణముగా నిరూపించియున్నారు. తెలుగుకవులు వాడిన ప్రసిద్ధవృత్తముల నామములను, గణములను యతిస్థానములను ఈ ప్రకరణమున గమనింపదగును

మొదటి తొమ్మిది ఛందస్సులకును యతినియమములేదు. ఈ విషయమును అప్పకవి సుస్పష్టముచేసెను.

**తే గీ॥ అడుగులకు వర్ణములు గొంచెమగుటఁజేసి**
**యందును క్త్రాప్రభృతి నవచ్ఛందములను**
**బాదమువృత్తములకు నెల్ల వడులు లేవు**
**నాల్గుపదములఁ బ్రాసముల్ నడచుగాని** [1]

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | విద్యున్మాల | — | మ మ గ గ | ... | ... |
| *తొమ్మిదవ ఛందస్సు:* | | | | | |
| 2. | మణిబంధము | — | భ మ స | ... | ... |
| *పదవఛందస్సు:* | *(వృత్తముపేరు)* | | *(గణములు)* | | *(యతి)* |
| 3. | మయూరసారి | — | ర జ ర గ | .. | 7 |
| 4. | మణిరంగము | — | ర స సగ | ... | 6 |
| 5. | రుగ్మవతి | — | భ మ స గ | ... | 6 |
| 6. | చంపకమాల | — | ,, | ... | 7 |
| 7. | మాణిక్యమాల | — | న య భ గ | ... | 7 |
| *పదకొండవ ఛందస్సు:* | | | | | |
| 8. | ఇంద్రవజ్ర | — | త త జ గా | ... | 8 |
| 9. | ఉపేంద్రవజ్ర | — | జ త జ గా | ... | 8 |
| 10. | దోదకము | — | భ భ భ గ గ | ... | 7 |
| 11. | రథోద్ధతము | — | ర న ర వ | ... | 7 |
| 12. | చంద్రిక | — | న న ర న | ... | 7 |

1 అప్పకవీయము - చతుర్థాశ్వాసము — 175

| | | | | | |
|---|---|---|---|---|---|
| 13. | స్వాగతము | — | ర న భ గ గ | — | 7 |
| 14. | మందారదామము | — | త త త గ గ | — | 7 |

పన్నెండవ ఛందస్సు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 15. | స్రగ్విణి | — | ర ర ర ర | — | 7 |
| 16. | భుజంగప్రయాతము | — | య య య య | — | 8 |
| 17. | తోటకము | — | స స స స | — | 9 |
| 18. | ద్రుతవిలంబితము | — | న భ భ ర | — | 7 |
| 19. | తోదకము | — | న జ జ య | — | 8 |
| 20. | జలోద్ధతగతి | — | జ స జ స | — | 8 |
| 21 | కుసుమవిచిత్ర | — | న య న య | — | 7 |
| 22. | మణిమాల | — | త య త య | — | 7 |
| 23. | మౌక్తికదామము | — | జ జ జ జ | — | 9 |

పదమూడవ ఛందస్సు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 24. | మత్తమయూరము | — | మ త య స గ | — | 8 |
| 25. | ,, | — | న న భ భ గ | — | 8 |
| 26. | ప్రహర్షిణి | — | మ న జ ర గ | — | 8 |
| 27. | మంజుభాషిణి | — | స జ స జ గ | — | 9 |
| 28. | కందుకము | — | య య య య గ | — | 7 |
| 29. | ఊర్వశి | — | న త త ర గ | — | 8 |

పదునాలుగవ ఛందస్సు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 30. | వనమయూరము | — | భ జ స న గా | — | 9 |
| 31. | వసంతతిలకము | — | త భ జ జ గా | — | 8 |

పదిహేనవ ఛందస్సు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 32. | మాలిని | — | న న మ య య | — | 9 |
| 33. | మణిభూషణము | — | ర న భ భ ర | — | 10 |
| 34. | సుగంధి | — | ర జ ర జ ర | — | 9 |
| 35. | మణిగణనికరము | — | న న న న స | — | 9 |

పదునారవ ఛందస్సు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 36. | పంచచామరము | — | జ ర జ ర జ గ | — | 10 |
| 37. | పద్మకము | — | న భ జ జ జ గ | — | 11 |
| 38. | ఫలసదనము | — | న న న న స గ | — | 10 |
| 39. | అశ్వగతి | — | భ భ భ భ భ గ | — | 10 |
| 40. | గజవిలసితము | — | భ ర న న న గ | — | 8 |

పదునేడవ ఛందస్సు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 41. | శిఖరిణి | — | య మ న స భ వ | — | 13 |
| 42. | హరిణి | — | న స మ ర స వ | — | 12 |
| 43. | మందాక్రాంత | — | మ భ న త త గా | — | 11 |
| 44. | పృథ్వి | — | జ స జ స య వ | — | 12 |
| 45. | నర్కుటము | — | న జ భ జ జ వ | — | 11 |
| 46. | సుగంధి | — | ర జ ర జ ర వ | — | 11 |
| 47. | మత్తకోకిల | — | ర స జ జ భ ర | — | 11 |

పదునెనిమిదవ ఛందస్సు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 48. | కుసుమిత లతావేల్లిత | — | మ త న య య య | — | 12 |
| 49. | వేణునాదము | — | ర న జ భ న స | — | 10 |

పందొమ్మిదవ ఛందస్సు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 50. | శార్దూలము | — | మ స జ స త త గ | — | 13 |
| 51. | తరళము | — | న భ ర స జ జ గ | — | 12 |
| 52. | మేఘ విస్ఫూర్జితము | — | య మ న స ర ర గ | — | 13 |
| 53. | కవికంఠభూషణము | — | స జ స స స జ గ | — | 9 |
| 54. | పాంచజన్యము | — | ర జ న న న న గ | — | 10 |
| * 55. | పంచచామరము | — | న న స జ ర జ గ | — | 10 |

ఇరువదవ ఛందస్సు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 56. | మత్తేభవిక్రీడితము | — | స భ ర న మ య వ | — | 14 |
| 57. | ఉత్పలమాల | — | భ ర న భ భ ర వ | — | 10 |
| 58. | అంబురుహము | — | భ భ భ భ ర స వ | — | 13 |

ఇరువదియొకటవ ఛందస్సు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 59. | చంపకమాల | — | న జ భ జ జ జ ర | — | 11 |
| 60. | వనమంజరి | — | న జ జ జ జ భ ర | — | 14 |
| 61. | స్రగ్ధర | — | మ ర భ న య య య | — | 8+15 |
| 62. | లాటీవిటము | — | స స స స మ త య | — | 13 |

* 16 అక్షరముల పంచచామరము గలదు. అదియే ప్రసిద్ధము.

ఇరువదిరెండవ ఛందస్సు :

| | | | |
|---|---|---|---|
| 63. | మహాస్రగ్ధర | — స త త న స ర ర గ | — 9+16 |
| 64. | భద్రకము | — భ ర న ర న ర న గ | — 12 |
| 65 | మానిని | — భ భ భ భ భ భ భ గ | — 18 |
| 66 | విచికిలితము | — 21 లఘువులు+గ | — 18 |
| 67. | తురగము | — న న న న స జ జ గ | — 15 (కొందరు 8+15) |
| 68. | సుగంధి | — భ జ స న భ జ స గ | — 8+8 |

ఇరువదిమూడవ ఛందస్సు:

| | | | |
|---|---|---|---|
| 69. | కవిరాజవిరాజితము | — న జ జ జ జ జ జ వ | - 8 - 14 - 20 |
| 70. | పద్మనాభము | — త త త త త త త గ గ | — 18 |

ఇరువదినాలుగవ ఛందస్సు:

| | | | |
|---|---|---|---|
| 71. | సరసిజము | — మ త య న న న న స | — 10 — 18 |
| 72. | అష్టమూర్తి | — మ న త స ర భ జ య | — 9 — 17 |
| 73. | క్రౌంచపదము | — భ మ స భ న న న య | — 11 — 19 |

ఇరువదియైదవ ఛందస్సు:

| | | | |
|---|---|---|---|
| 74. | బంధురము / సింధురము | — న న న న స భ భ భ గ | — 16 |
| 75. | భాస్కరవిలసితము | — భ న జ య భ న న స గ | — 18 |
| 76. | సాధ్వి | — భ న జ న స న న భ గ | - 8 - 15 - 22 |

ఇరువదియారవ ఛందస్సు:

| | | | |
|---|---|---|---|
| 77. | మంగళమహాశ్రీ | — భ జ స న భ జ స న గ గ | — 9 - 17 |

# 12

# వృత్తముల మార్పులు

శార్దూల మత్తేభములు, మత్తకోకిల తరలములు స్రగ్ధరామహాస్రగ్ధరలు మానినీ కవిరాజ విరాజితములు, దోదకతోదకములు జంటవృత్తములుగ నెన్న దగును. శార్దూలమునందు పాదమందలి మొదటి గురువును రెండు లఘువులు చేసిన మత్తేభమగును. అట్లే మత్తేభమందలి మొదటి రెండులఘువులను ఒక గురువు చేసినచో శార్దూలమగును. అట్లే జంటవృత్తములను ఒకదాని నుండి మరియొకదానిలోనికి మార్చనగును.

**చంపకోత్పలములు**

*చంపకమాల :*

ప్రాచీన కావ్యములలోని సుప్రసిద్ధ పద్యములలో చంపకమాల ఒకటి. ఇందు ప్రతిపాదమునందును III, IUI UII, IUI, IUI, IUI, UIU, న, జ, భ, జ,జ,జ,ర, అను గణములు వరుసగానుండును 21 అక్షరములు. ప్రాసనియతి గలదు. యతిమైత్రి I II అక్షరములకు చెల్లును. ప్రాసయతి చెల్లదు.

విశేషములు - (1) చంపకమాలలో రెండు గురువులు ఎచ్చటను వరుసగా రావు.

(2) చంపకమాల నాలుగు లఘువులతో నారంభించును. తిరిగి మూడు అక్షరములపైన మూడు లఘువులు వచ్చును.

(3) చంపకమాలలో మొదటి రెండు లఘువులను ఒక గురువుగా మార్చినచో ఉత్పలమాల యగును.

(4) నాలుగు లఘువులు వరుసగ నున్నచో అక్కడ ముందు ఒక గీత గీచి పిమ్మట మూడక్షరములు, పిమ్మట మూడు లఘువులు కన్పించినచో నది చంపకమాల కావచ్చునని సులువుగ గుర్తుపట్టనగును. ఉదాహరణకు-

నా. వ లు కు లు  వి శ్వ సిం | పు ము వి వ మ్ము ల లో కు ల  గా వు మె ల్ల ర వ్

కావున "నా" వెనుకటి పాదములోనిదని గుర్తింపనగును.

ఉత్పలమాల :

ప్రాచీన కావ్యములలోని సుప్రసిద్ధ పద్యములలో ఉత్పలమాల ఒకటి ఇందు ప్రతిపాదమునందును UII UIU III, UII, UII U U IU భ, ర, న, భ, భ, ర, వ అను గణములు వరుసగా నుండును ప్రాసనియతి గలదు యతి మైత్రి 1, 10 అక్షరములకు చెల్లును మొత్తము పాదమున 20 అక్షరములు. ప్రాసయతి చెల్లదు.

విశేషములు - (1) ఏకపాదమున రెండు గురువులు వరుసగా రావు (2) ఉత్పలమాలలో రెండు గురువులు ఉన్నచో ఆ రెంటిమధ్య నిలువుగీత గీచిన గీత వెనుకటిది ఒకపాదము, ముందునది మరియొకపాదమనుట సుస్పష్టము. ఉదాహరణకు—

నన్నయభట్టు తెమ్ఁగునన్ మహా భారత సంహితా రచన బంధురుడయ్యె
జగద్ధితంబుగన్

(3) మూడు గురువులు ఉత్పలమాలా పద్యములో నెచ్చటను వరుసగ రావు

(4) ఉత్పలమాలలో మొదటి గురువును రెండులఘువులు చేసినచో చంపకమాల యగును.

## శార్దూలమత్తేభములు

*శార్దూల విక్రీడితము*

ప్రాచీనాంధ్ర సాహిత్యమున సుప్రసిద్ధపద్యములలో శార్దూల విక్రీడిత మొకటి ప్రతిపాదమునందును UUU IIU, IUI, IU, UUI UUI U=మ స జ స త త గ అను గణములు వరుసగా నుండును. 19 అక్షరములు. ప్రాసనియతి గలదు. యతి 1, 13 అక్షరములకు యతిమైత్రి చెల్లును. ప్రాసయతి చెల్లదు.

విశేషములు - (1) శార్దూల విక్రీడితము మొదటి గురువును రెండు లఘువులు చేసినచో మత్తేభమగును (2) శార్దూల విక్రీడితము-మత్తేభము, రెండు పద్యములమధ్య III U U U వరుసగా వచ్చును ఆ లఘువులకు వెనుక 5 అక్షరములకు వెనుక తిరిగి మూడుగురువులు U U U వచ్చినచో నది శార్దూల విక్రీడితము. (3) మూడు గురువుల మధ్యగురువు యతి (4) శార్దూల విక్రీడితమందున నాలుగు గురువులున్నచో UUUU - ఒక గురువు వెనుకటి పాదములోనిదిగ గుర్తింపనగును. ఉదాహరణకు-

తేజోబల, ప్రాధాన్యమ్ముగలట్టి రాచకొడుకుల్ పౌరవ్య వంశాగ్రణీ

పై శార్దూల విక్రీడితమందున తేజోబల అను అక్షరములు వెనుకటి పాదములోనివనుట సుగమము.

**మత్తేభము :**

ప్రాచీనకావ్యములందు సుప్రసిద్ధ పద్యములలో మత్తేభమొకటి ప్రతిపాదము నందును U U U U U U U U U U స-భ-ర-న-మ-య-వ అను గణములు వరుసగా నుండవలెను. 20 అక్షరములు. ప్రాసనియతి గలదు. 1, 14, అక్షరములకు యతి మైత్రి చెల్లును ప్రాసయతి చెల్లదు.

విశేషములు : 1. మొదటి రెండు లఘువులను ఒక గురువుగ మార్చినచో శార్దూల విక్రీడితమగును. 2 ప్రతిపాదమును U U లతో ఆరంభించును. మధ్యలో U U U వరుసగ వచ్చును. అట్టి మధ్య గురువునకు యతి. 3. నాలుగు గురువులుగాని, నాలుగు లఘువులుగాని వరుసగా మత్తేభ పద్యమం దెచ్చటరావు. ఉదాహరణకు—

I U U U U U U U U U U
వలటం దెక్కడఁ జూచెనొం డెడన సేవ్యశ్మ జముల్ పుట్టవే

**మత్తకోకిల తరళములు**

**మత్తకోకిల :**

మత్తకోకిల వృత్తమై దశమ ప్రవర్తిత విశ్రమా
యుత్తమై రసజాభరేఫల నచ్చమై కడు నొప్పగున్

అని కావ్యాలంకార చూడామణి (8 ఉల్లాసము) లో నున్న లక్షణము. ప్రతిపాద మునందును, ర-స-జ-జ-భ-ర లు గణములు. య 1, 11 అక్షరములకు. దశమ ప్రవర్తిత విశ్రమమనగా య పదిపైనని, అనగా ఒకటి పదునొకండవ అక్షరములకని తెలియుచున్నది.

విశేషములు : 1 ప్రతిపాదమును U U U U U U U U విభజింపనగును. అనగా మూడు మాత్రలు+నాలుగుమాత్రలు మూడువరుసలలో వచ్చి చివరకు మూడుమాత్రలు+రెండు మాత్రలు గ విడివడును. 2. మొదటి గురువును రెండు లఘువులు చేసినను మాత్రలలో భేదమురాక తరల మగును. పాటగా పాడినచో రెండు పద్యములు ఒకే తాళమున నడచుట గమనింపదగినది.

**తరళము :**

నభరసంబులు జాగవర్గము నచ్చి యీశ్వర విశ్రమ
ప్రభవమై తరలంబనంజను రాజవంశ శిఖామణీ !

అని కావ్యాలంకార చూడామణి (8 ఉల్లాసము) లక్షణము ప్రతిపాదము నందును న-భ-ర-స-జ-జ-గ, అనుగుణములుండును. యతి 1-12 అక్షరము కు వేయవలె.

## స్రగ్ధరామహాస్రగ్ధరలు

*మహాస్రగ్ధరావృత్తము :*

సకల శ్రీవిశ్వ భూపా సతతనసరరాస్తక్తమై యగ్రగాప్తిం
ప్రకటింపన్ దంతిశైల ప్రచుర యతి మహా స్రగ్ధరావృత్తమయ్యెన్

అని కావ్యాలంకార చూడామణి (8 ఉల్లాసము) లక్షణము ఇందు ప్రతి పాదమునందును స–త–త–న–స–ర–ర–గ గణములుండును యతి దంతి 8, శైల 7 పైన అనగా 1–9–16 అక్షరములకు యతిమైత్రి చెల్లును ప్రాస నియతి గలదు ప్రాసయతి చెల్లదు

విశేషములు–మహాస్రగ్ధరలో మొదటి రెండు లఘువులను ఒక గురుపు చేసినచో నది స్రగ్ధరావృత్తమగును.

*స్రగ్ధర :*

ప్రతిపాదమున మ–ర–భ–న–య–య–య గణములుండును. 1–8–15 అక్షరముల యతిమైత్రి చెల్లును మొదటి గురువును రెండు లఘువులు చేసినచో మహాస్రగ్ధర యగును.

## మానినీ కవిరాజవిరాజితములు

*కవిరాజ విరాజితము :*

క్షలయఁగనేక నకార షడుక్త జకార వకార వికారయ విర
ర్ధ కగతిచే నల రంగవిరాజ విరాజిత వృత్తము రమ్యమగున్

అని కావ్యాలంకార చూడామణి (8ఉల్లాసము) లక్షణము. ఇందు ప్రతి పాదమునందును న-జ-జ-జ-జ-జ-జ-వ అను గణములుండును 1-8-14-20 అక్షరములకు యతి ప్రాసనియతిగలదు ప్రాసయతి చెల్లదు.

విశేషములు —1. కవిరాజ విరాజితము చతుర్మాత్రాబద్ధము, ఆదితాళగతి. 2 మొదటి రెండు లఘువులను ఒక గురువుగా మార్చినచో కవిరాజ విరాజితము మానినీవృత్తమగును.

*మానిని :*

కామిని సప్త భకారము లొల గకారమునై వరికల్పితమై
నేమముగావడి నిల్పినఁ బెక్కుల నిల్పిన మానిని నిక్కమగున్.

అని కావ్యాలంకారచూడామణి (8 ఉల్లాసము) లక్షణము. ఇందు ప్రతి పాదమునందును భ–భ–భ–భ–భ–భ–భ–గ అను గణములుండును. 1-7-13-19 అక్షరముల యతిమైత్రి చెల్లును. ప్రాసనియతి గలదు ప్రాసయతి చెల్లదు.

విశేషములు–1. మానిని చతుర్మాత్రాగణబద్ధము. ఆదితాళగతి 2 మానినియందలి మొదటి గురువును రెండు లఘువులుగా మార్చినచో కవిరాజ విరాజితమగును.

# 13
# మాలికావృత్తములు

సంస్కృతలాక్షణికులు ఇరువదియారు అక్షరములవరకే వృత్తములు చెప్పియున్నారు ఇరువదియారక్షరములు మించిన వానికి **మాలికా** వృత్తములని పేరు వచ్చినది అవి— 1 లయగ్రాహి 2. లయవిభాతి 3. లయహారి 4. త్రిభంగి 5 దండకము

## (1) లయగ్రాహి :

లయగ్రాహికి నాలుగు పాదములుండును ప్రతిపాదమునందును, భ-జ-స-న-భ-జ-స-న-భ-య అను గణములుండును అనగా ముప్పది అక్షరములు, ముప్పది తొమ్మిది మాత్రలు ఉండును

ఇది వృత్తమైనను, అప్పకవి ప్రతిపాదమునకు ముప్పది తొమ్మిది మాత్ర లుండవలెనని నిర్దేశించెను "ముప్పది తొమ్మిది మాత్రల ముప్పది అక్షరముల పదము" (అప్పకవీయము 4—434) కావున మాత్రాగణ విభజనచేసినచో ఇది పంచమాత్రాగణ విశిష్టమైనదని చెప్పవచ్చును ఆ పద్ధతిలో ప్రతిపాదమునందు అట్టిగణములు 7 + 1 చతుర్మాత్రాగణము లేర్పడును 1 3, 5, 7 గణములకు ప్రాసయతి చెల్లును నన్నయ భారతమునందలి లయగ్రాహిపద్యములు ఉదాహరింపఁదగును.

(1) కమ్మని లతాంతముల కుమ్మొనసివచ్చు మధు
పమ్ముల సుగీతనినదమ్ము లెసగెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధ వకు
ళమ్ములను నానుచు ముదమ్మొనర వాచా
లమ్ములగు కోకిల కులమ్ముల రవమ్ము మధు
రమ్మగుచు వీచె ననిశమ్ము సుమనో భా
రమ్ములనశోక నికరమ్ములను జంపకచ
యమ్ములను గింశుకవనమ్ములను నొప్పెన్

(2) చందన తమాల తరులందు నగరుద్రుమము
లందుఁ గదళీవనములందు లవలీమా
కంద తరుషండములయందున నిమీలదర
విందసరసీవనము లందువనరాజీ
కందళిత పుష్పమకరంద రసముందగుల
చందనువు సౌరభమునొంది జన చిత్తా
నందముగఁ బ్రోషితుల డెందముల లందురుఁగ
మందమలయానిల మమందగతి వీచెన్.[1]

---

1 ఆంధ్రమహాభారతము - ఆదిపర్వము. పంచమాశ్వాసము (138-139)

(2) లయహారి :

కం॥ ముప్పది తొమ్మిది మాత్రలు
ముప్పది యేడర్ణము పదము తదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు
గుప్పిన లయహారి యనఁగఁ గొమరొందు హరీ.

అని అప్పకవి నిర్వచించెను [1]

లయహారికి నాలుగుపాదములు ప్రాసనియమముగలదు

ప్రతిపాదమునందును

"న-న-న-న-న-న-న-న-న-న-న-స-గ"

అనుగణములుండును.

మిగిలిన అంశములు లయవిభాతి, లయగ్రాహులకు వలెనే స్వీకరింపనగును.

నగణములు పదు నొకదు సగణమును గురువునిడి
మిగుల నలువుఅయతులు దగులు లయహారిన్,
బెగడి శతధృతి పరిపరిగతుల మొలయిడిన మ
రిగిరుష తనువుఁ బొదివి నిగిడిచని యంతన్,
నిగమములు గొనిచెసను జగములద్రువఁ బలచియొ
దిగి కదవలిజదధిమునిగిన నభియాతిన్
బెగడుచు నొడిసికరిచి తెగఁగొవిన తురగగఖఁ
డగుహరి నఁగ సుకవులగణుతి చెలఁగున్ [2]

(3) లయవిభాతి :

లయవిభాతికి నాలుగు పాదములుండును. ప్రతిపాదమునందును వరుసగా న-స-న-న-స-న-న-స-న-న-స-గ అను గణములుండును. ముప్పదినాలు గక్షరములు. ముప్పది తొమ్మిది మాత్రలు మిగిలిన అంశములన్నియు లయగ్రాహికి వలెనే పాటింపనగును ప్రాసనియతి నాలుగు పాదములందు పాటింపనగును. పింగళిసూరన రచించిన లయవిభాతులు ఉదాహరింపదగినవి.

చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము
గలిగినను, సౌరభముఁ జలువయు దలిర్పన్
బొలుపెసఁగు కప్పురవుఁ బలుకులకుఁ గోమలత
నెలకొనిన సౌరభముఁ జలువ వసయుం గో
మలతయుసుగలిగి జనములమిగులఁబెంపెసఁగు
మలయపవనంపుఁగొద మలకు మధురత్వం
బలవడిన పీడుమటి కలదనఁగవచ్చుఁ గదు
వెలయగలయీసుకవి పలుకులకు నెంచన్ [3]

---

1 అప్పకవీయము చతుర్థాశ్వాసము - 438

2 అప్పకవీయము చతుర్థాశ్వాసము - 439

3 కళాపూర్ణోదయము పథమాశ్వాసము-83

ఆలికులము నీలముల చెలువము వహింప నవ
దళములు హరిన్మణుల పొలుపునఁ దలిర్పం
దలిరుఁగమి కెంపులుగఁ బలుదెఱఁగు క్రొవ్విరుల
విలసనము ముత్తియపు గుళికలకుఁ దక్కం
గలమణులకుం బసిఁడి కళుకులకు నీడగుచు
వెలయఁగఁ బరాగములు లలితపు వితానం
బులఁ గృహముఖ్యముల చెలువు ప్రతిబింబములు
బలెఁ బురమునన్దెసల బొలుచును వనంబుల్.[1]

*త్రిభంగి:*

క ఇది నేత్రాంబుధిలము ము
ప్పది నాలుగు వర్ణములను పాదంబగుఁ ద
త్పద చాతుర్థికములచే
నొదవుఁ ద్రిభంగి యను వృత్తమూర్వరలోనన్[2]

త్రిభంగికి, ప్రతిపాదమునందును "న న న న న న స స భ మ స గ" అను గణములుండును.[3] అట్టివి నాలుగుపాదము లుండవలెను. నాలుగు పాదములకు ప్రాసనియమము పాటింపవలెను

ఉదాహరణము—

<u>గురు</u>మత సహితులు దురిత విరహితులు <u>సురు</u>చిర
2 3

సజ్జన <u>వర్తుల్</u> ధ్రువకీ<u>ర్తుల్</u> శాంతసుమూ<u>ర్తుల్</u>
1 2 3

విశేషములు : ప్రతిపాదమునందును (1) ప్రథమ ఖండమందు <u>మూడు</u> ప్రాసయతులు (1-2 9-10, 17-18 అక్షరసంబంధములైనవి)

(2) ద్వితీయ ఖండమందు <u>మూడు</u> అనుప్రాసనములు (24-25, 28-29, 33-34 అక్షర సంబంధములైనవి) గమనింపదగినవి. అందుచే 'త్రిభంగి' పేరు సార్థకమైనది.

(3) ప్రతిపాదమునందును మొదటి ఇరువది అక్షరములును వరుసగా లఘువులే.

త్రిభంగికి అప్పకవి యిచ్చిన ఉదాహరణము అనుశీలింపనగును.

---

1 కళాపూర్ణోదయము ప్రథమాశ్వాసము-10.

2 అప్పకవీయము చతుర్థాశ్వాసము-4,0

3 త్రిభంగి గమనము ఆదితాళబద్ధము. అందు ప్రతిపాదమున పదిచతుర్మాత్రాగణములు + ఒకగురువుగా వింగడింపవచ్చును ఆ పద్ధతిలో యతినిరూపణము సుకరము. పూర్వఖండమున 1,3 5 గణములలో ప్రాసయతి ప్రయుక్తము. ఉత్తరఖండమున మూడు అనుప్రాసలు ప్రయుక్తములు.

విసువక సుకవులు రసఁ బ్రతిపదమున హాసగగ మూఁడొకతీరై మఱివేఱై మూఁడొకతీరై రసనగణములును స స భ మ స గ లును బొసగిన షడ్యతిసంగిన్ రణరింగిన్ జెల్లఁ ద్రిభంగిన్ మసలెడు వ్రజమున దుసికిలిమధురకుఁగసికి సమృద్ధ శుభాంగిందగు భంగిం జేరి త్రిభంగిన్ వెసమనిచిన నవబిసరుహానయన యని సభల వేడ్క గురింతున్ వినుతింతున్ నిచ్చలుఁ గాంతున్.

*దండకము :*

ఇరువదియాఱక్షరములకు మించినదగుటచే దండకమును లాక్షణికులు మాలికావృత్తములలోఁ జేర్చినారు సంస్కృతమునుండి అవతరించినను దండకము తెలుగులో మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. ఆదికవి నన్నయ ఆరణ్యపర్వములో నొక దండకమును రచించెను (1-324).

సంస్కృతమున నగణములతో నారంభించి, అనేక రగణములు రచించినది దండకము. తెలుగులో తగణము లనేకములు వ్రాసి గురువుతో ముగించుట గాన నగును

క దండకవిధములు పెక్కులు
దండిగ గలవవి చతుష్పద స్ఫురితములై
యుండెడి వనేక పదముల
నుండెడివిన్ వాని విను సమున్నతచరితా [1]

తొలుత వరుసగా సనహాఁగణములు, పిమ్మట యథేచ్ఛగ తగణములు రచించిన నది దండకము—అవసానమున గురువుండవలెను. ఇది కవిజనాశ్రయకారుడు చెప్పిన దండకలక్షణము తెలుగులో తగణదండకమే సుప్రసిద్ధము. నన్నయభట్టు దండకము. అర్జునుఁడు పరమేశ్వరుని స్తోత్రము సేయుట—

శ్రీ కంఠ లోకేశ లోకోద్భవస్థాన సంహారకారీ, మురారిప్రియా చంద్రధారీ మహేంద్రాది బృందారకానంద సంధాయి పుణ్యస్వరూపా విరూపాక్షదక్షాధ్వర ధ్వంసకా దేవ నీదైన తత్త్వంబు భేదించి బుద్ధిం బ్రధానంబు కర్మంబు విజ్ఞాన మధ్యాత్మయోగంబు సర్వక్రియాకారణంబంచు నానాప్రకారంబులన్ బుద్ధిమంతుల్ విచారించుచున్ నిన్నుభావింతురీశాన సర్వేశ్వరా శర్వసర్వజ్ఞ సర్వాత్మకా నిర్వికల్ప ప్రభావా భవానీపతీ నీవు లోకత్రయీ వర్తనంబున్ మహీవాయుఖాత్మాగ్ని సోమార్కతోయంబులం జేసి కావించి సంసార చక్రక్రియా యంత్రవాహుండవై తాదిదేవా మహాదేవ నిత్యుఁడు నత్యంత యోగస్థితిన్ నిర్మలజ్ఞాన దీప ప్రభాజాల విధ్వస్త నిస్సార సంసారమాయాంధకారుల్ జితక్రోధరాగాది దోషుల్ యతాత్ముల్ యతీంద్రుల్ భవత్పాద పంకేరుహధ్యాన డిండీరధారానుభూతిన్ సదాతృప్తులై నిత్యులై రవ్యయా భవ్య సేవ్యా భవా భర్గభట్టారకా భార్గవాగస్త్యకుత్సాది నానామునిస్తోత్ర దత్తావధానా లలాటేక్షణోగ్రాగ్ని భస్మీకృతానంగ భస్మానులిప్తాంగ గంగాధరా నీప్రసాదంబునన్ సర్వగీర్వాణ గంధర్వులున్ సిద్ధసాధ్యోరగేంద్రా సురేంద్రాదులున్ శాశ్వతైశ్వర్య సంప్రాప్తులై రీశ్వరా విశ్వకర్తా సురాభ్యర్చితా నాకు నభ్యర్థితంబుల్ ప్రసాదింపు కారుణ్యమూర్తీ త్రిలోకైకనాథా నమస్తే నమస్తే నమః [2]

---

1 చిత్రకవి పెద్దన-లక్షణసారసంగ్రహము.

2 నన్నయభారతము-అరణ్యపర్వము ప్రథమాశ్వాసము-324.

# 14

# క్రౌంచపదవృత్తము

పేరునకు క్రౌంచపదము సంస్కృతవృత్తమేయైనను, తెలుగులో పేరొ్కన దగిన ప్రత్యేకప్రాముఖ్యము నార్జించినది. సంస్కృతమున క్రౌంచపదమున ప్రతి పాదమునందును భ — మ — స — భ — న — న — న — న — గ అను గణములు వరుసలో నుండును

తెలుగులో " భ — మ — స — భ — న — న — న — య " అను గణములు ప్రతిపాదమునందునువరుసలో నుండును

సంస్కృతమున చివరినగము తెలుగులో యగణమైనది అనగా అవి అయిదు మాత్రలే. నడక ఒకటే. యతివిషయమున తెలుగులో మతభేదములేర్పడినవి.

పంచశరాభా — సంచితపుణ్యా—
భ మ స భ న న న య పరిమితమైనన్
క్రౌంచపదాఖ్యంబంచితమయ్యెన్
గమయతి దశవసుకలితముగాఁగన్

అని కవిజనాశయకారుని మతము (వృత్తాధికారము-119)

పాంచితతేజః—కుంచితవైరీ—భ మ స భ న న న య + పరిచితరీతిన్.
అంచితమయ్యెన్—గ్రౌంచపదాఖ్యం—బమగతహరిదిభ + యతినభివృత్తిన్॥

అని కావ్యాలంకారచూడామణి (156) కారునిమతము

కాంచన భూషా + సంచయ మొప్పన్ + ఘనకుచభరమున + గవునసియాడన్.
చలనేత్రల్ + వంచనతోడన్ + సముచితగతివెను + చనితనుఁగొల్వన్
అంచిత లీలల్ + మించిన శౌరిన్ + హరిదిభపరిమిత + యతులొనగూడన్
ముంచి రచింపం + గ్రౌంచ పదంబి + మ్మొగి భ మ స భ న న + ములనయలొందున్.

అని ఛందోదర్పణకారుని మతము-(ద్వితీయాశ్వాసము-111).

పైలక్షణములను బట్టిచూచినచో

క్రౌంచపదమున ప్రతిపాదమున 24 అక్షరములుండును. భ—మ—స—భ—న న—న—య గణములు వరుసలో నుండును.

ఇక యతి విషయము —

క్రౌంచపదము చతుర్మాత్రాబద్ధమగుట సుస్పష్టము చతుర్మాత్రా గణ పద్ధతిని యతిని నిరూపించుట సుకరము అప్పుడు 1, 3 గణములకు విధిగా ప్రాస యతి వాడనగును. 5, 7 గణములకు సామాన్యయతి వాడవలెను. ప్రాసము . ప్రాసము సర్వవృత్తసామాన్యముగ నాలుగుపాదములందు నుండును అంతేగాక ప్రతిపాదమునందును మూడవగణములకు, మొదటిగణములకు చెల్లిన ప్రాసమే చెల్లవలెను ఛందోదర్పణము నందలి ఉదాహరణములో బిందుపూర్వక చకారప్రాసము పద్యములో మొత్తము 8 చోట్ల చెల్లుచున్నది.

తిక్కన భారతములో[1]—

కౌరవ సేనా + వీరుల లావుం + గడిమియుఁజలమును + గర్వము లెల్లన్.
ధీరతసొంపుం + గ్రూరతపెంపుం + దెగువయునెలవగ + దెరలక వీఁకన్
బోరన దోవం + గ్రార భయంబే + పును గలితనమును + బొలుపువహింపన్
వారు భయంబుం + గూరుచుకుంగా + పెలసెను రుధిరము + పెద్దనము సేర్పన్

అధోరేఖాంకితస్థలముల యతి ప్రదర్శితము

యతివిషయమున క్రౌంచపదమును 8 చతుర్మాత్రాగణములుగ విభజించిన క్కన 1, 5 గణములకు నాలుగుపాదములలో ప్రాసయతినిపాటించుట గమనింప దగినది. మరియు 5, 7 గణములకు విడివిడిగ సామాన్య యతులు ప్రయో గించుట గమనింపదగినది క్రౌంచపదమునందు తిక్కనవలెగాక ఎఱ్ఱన నాలుగు పాదములందు సామాన్యయతినే పాటించుటయు గమనింపదగిన విశేషము—

సారవివేకా + సౌఖ్యవిలోకా + సకలరిపుభయద + సమద సమీకా
రమణీయా + బంధు విధేయా + * పరహితకరుణా + పలసదుపాయా
పురచరిత్రా + దీపితగోత్రా + ద్విజనగసదృశ + ధృతియుత + గాత
వీరవరేణ్యా + విశ్రుతపుణ్యా + వినయగుణవిజయ + విలసనగణ్యా

హరివంశము 9-259

---

[1] తిక్కనభారతము-పూర్వము 1-166

* పరహితకరుణా — పరహితసకరుణ అనురీతి సవరించుకోవలె ముద్రితప్రతులలో పరిష్కర్త లీగణభంగమును గుర్తింపలేదని శ్రీ రావూరి దొరస్వామి శర్మగారి సూచన గమనించదగినది. గురులఘువుల అనుపూర్విని బట్టి ఆ సవరణఅవసరమే కాని క్రౌంచపదము అంతస్తత్త్వమున చతుర్మాత్రాబద్ధముగావున అసవరణచేయక పోయినను గణభంగముగాని తాళభంగముగాని జరుగదు

ఎఱ్ఱన క్రౌంచపదమునకు పాటించిన యతిగమనింపదగినది క్రౌంచపదమును చతుర్మాత్రాగణములుగ విభజించిన 1, 3 5, 7 గణముల మొదటిఅక్షరములకు యతిచెల్లినది. అంతేగాక 5 10, 24 అక్షరములు అనుప్రాసఘటితములై, ఒకే అక్షరములైనవి

## అప్పకవి మతములో క్రౌంచపదము

ప్రపంచమకేళుండిచ్చిన భాస్వ + ద్వరమున మనమున + బ్రవరము గోరన్
వంచనతో బాణాసురహ స్త + వ్రజములు దళిగెను + ప్రదిహరియంచున్
క్రాంచితలీలన్ శంకరనంద + ప్రకటిత విరతులు + భ్రమసభ నాన్యల్
క్రౌంచపదీవృత్తమ్మునఁజెన్నా + ర్గ గఁబలుకుదురిల + గవివరులెల్లన్ [1]

అప్పకవి ప్రతిపాదమునందును 1, 11, 19 అక్షరములకు సామాన్యయతిని పాటించినాలుగుపాదముల ప్రాసయతి ఘటించెను. నన్నిచోడుని కుమారసంభవము లోని క్రౌంచపదమునందలి యతియొకవిలక్షణమగు పద్ధతిలోనున్నది.

చంచలనాస్వా + దించుచులేఁదూండ్లకరువు ప్రియులకు + నలదుచుమైరో
మాంచములోలిం + గంచుకితంబై పొడమ నలరుచు + బులినములంగ్రీ
డించుచు సంభా + షించుచుఁ బ్రీతిన్ + బొఁడచుచుఁజెలగుచు + బొలయుసముద్యత్
క్రౌంచగతుల్ పీ + డించుచు భాస్వ జ్జ్వలనుడు శరవణ + సరసికి వచ్చెన్.

ఈ క్రౌంచమును చతుర్మాత్రాగణము లుగ విభజించినచో 1, 3 గణముల ప్రాసయతి, నాలుగుపాదములకు నియతము మరియు 5, 7 గణములకుసామాన్య యతి పాటింపబడినది తిక్కన క్రౌంచపదమునకు నన్నిచోడుని క్రౌంచపదమునకు గల భేదము నరయదగినది తిక్కన 1, 3 పదముల ప్రాసయతిని నాలుగు పాదములవేసి మరియు ఒకేపాదమున 1, 3, 5, 7 గణములకు ఏకసామాన్య యతిని పాటించెను

నన్నిచోడుడు ప్రతిపాదమును రెండుదళములుచేసి రెండవదళమున విభిన్న యతులు ప్రయోగించెను అనగా పాదారంభమునన్న అక్షరముతోనిమిత్తము లేకుండ 11, 19 అక్షరములకు ప్రతిపాదము నందును యతి మైత్రి గూర్చుట నన్నిచోడుని క్రౌంచమునందలి విశేషము

విశేషము—

తెలుగు క్రౌంచపదము = రుగ్మవతీపాదము + కమలవిలసిత పాదము

తెలుగుక్రౌంచము పూర్వార్ధము రుగ్మవతీవృత్తము, ఉత్తరార్ధము కమలవిలసితము.

---

1 అప్పకవీయము - చతుర్థాశ్వాసము - 357.

# 15

# యతి భేదములు

తెలుగులో యతి వైలక్షణ్యమును వైశిష్ట్యమును పూర్వోక్తము.

కం॥ ఎన్నిట యతి రావలెనని
రన్నిట సంస్కృతమునందు నగు విచ్ఛేదం
బెన్నిట యతి రావలెనని
రన్నిటఁ దెలుగునకు మొదలియక్షర మమరున్.

అని ఛందోదర్పణమున అనంతుడు తెలిపెను.[1]

క॥ చరణ చరణమున కాద్య
క్షరములు వళులయ్యె నవియె క్రమ్మఱఁ దత్త
చ్చరణములోనఁ జెప్పిన
యిరవులఁ బొందింపవలయు నెల్లకృతులలోన్

అని అప్పకవీయమున నున్నది[2]

తెలుగులో, యతి వర్ణమైత్రి వలన నేర్పడినదనియు, నది ఆయాపాదముల నిర్ణీతస్థలములం దమరనగునని లాక్షణికసంప్రదాయము. లాక్షణికులు యతి, వడి అను పదములను పర్యాయములుగ ప్రయోగించియున్నారు. లాక్షణికులు యతి విశేషములను పలువిధముల వింగడించియున్నారు

క॥ భీమన వడి చెప్పె ననం
తామాత్యుఁడు చేసె వెనుక యతు లిరువదినా
ల్గామీఁద కొందఱు కవి
గ్రామణు లిరువదియు నేడు గావించి రొగిన్

అని అప్పకవి ఘోషించెను.

---

1 ప్రథమాశ్వాసము – 129

2 తృతీయాశ్వాసము – 5.

3 తృతీయాశ్వాసము – 7.

అప్పకవి 41 యతి విశేషముల నిరూపించెను. కవిజనాశ్రయమున 10 యతు లున్నవి. భీమనకృతముగా ప్రశస్తికెక్కిన చాటువు 10 యతులను నిరూపించుచున్నది.

సీ॥ అబ్జిగర్భ శివస్వరాధ్య పూజ్యపదాబ్జ
    కమలాక్షమౌని వర్గ ప్రసన్న
వైభవాఖండ దేవాదిదేవ కృపాబ్ధి
    అఖిల దిక్పాలక ప్రాదినిలయ
నుతపుణ్యహాస బిందుయుతాననాంభోజ
    యతి దయాప్లుత విజాత్మామహాత్మ
స్వచ్ఛపౌరుషకీర్తి సంయుక్త సంచార
    మహిమ నెక్కటియైన మాన్యచరిత
పోల్పనీ పోలికకు దైవములను గలరె
సరస నుతి పాత్ర భక్త రంజన చరిత్ర
ప్రాస నిర్భిన్న చండతరా సురేంద్ర
యలఘుయతి గణ్య రఘురామ యఘవిరామ!

భీమకవినాటినుండి అప్పకవినాటికి యతులు ఎట్లుపెరిగినవి? అను ప్రశ్నమునకు సమాధానము కవుల ప్రయోగ పరిణతియే కాక లాక్షణికుల ప్రస్తార ప్రవృత్తియు కారణమని చెప్పనగును. అప్పకవి 41 యతులలో క్రొత్తగ చేర్పనవసరము లేనివియు గలవు అతడు విడిచిపెట్టినవియు లేకపోలేదు. అయినను — యతి విశేషనిరూపణమున ఉగ్గడింపదగిన పరిశ్రమచేసిన అప్పకవిప్రణాళికనే ప్రాతిపదికగ అనుశీలింపనగును. కవిజనాశ్రయములో చెప్పిన స్వరయతి, అప్పకవీయమున అష్టావతారములెత్తి, 1. స్వరమైత్రివడి, 2. స్వరప్రధానవడి, 3. లుప్తవిసర్గక స్వరవడి, 4. ఋవళి, 5. ఋత్వసంబంధవళి, 6 ఋత్వసామ్యవళి, 7 వృద్ధివళి, 8. ప్రాణివిరామయతులైనవి.

కావున, పూర్వలాక్షణికుల యతిప్రణాళికలను సమీక్షించినపిమ్మట, తెలుగు యతులను ఈక్రిందివిధముగ వర్గీకరింపనగును.

1. స్వరయతులు
2 వ్యంజనాక్షరయతులు
3. ఉభయయతులు
4. ప్రాసయతులు
5. అప్పకవి చెప్పనియతులు - అప్పకవికి సమ్మతముగాని యతులు

# 16

# స్వరయతులు

## (1) స్వరమైత్రి యతి :

ఉదాహరణములు—

అ, ఆ, ఐ, ఔ,

ఇ, ఈ, ఋ ౠ, ఎ, ఏ,

ఉ, ఊ, ఒ, ఓ,

అప్పకవి రచనలు—

(1) ఆ. వె. అబ్జపత్ర నేత్ర ! ఆర్తావన చరిత్ర !
అత్రశాయిజైత్ర ! ఐంద్రమిత్ర !
ఐందవప్రగోత్ర ఔర్వశేయ స్తోత్ర !
యనుచుఁ జెప్పనొప్పు యతుల కృష్ణ

(2) ఆ. వె. ఇందు వంశసోమ ! ఈశ్వరీనుతనామ !
ఈడితాంగధామ ! ఋషభ భీమ !
ఋక్షజాభిరామ ! ఎటులైన నమాభామ !
ఎడఁగటాక్షముంచి ఏలుమనగ ।

(3) ఆ వె. ఉరగరాజశాయి ! ఊర్ధ్వవిష్టపదాయి !
ౠద్ధిశోరుకీర్తి ! ఒదలికార్తి
ఒదవకుండఁ బ్రోచి ఓలిదాసులఁగాచి
చేరి కనకకశిపుఁజీరి తనఁగ।

## (2) స్వరప్రధానయతి :

అచ్చునకు సంధిగతమైన పరపదాది స్వరమునకు మైత్రి సంఘటించుటచే వేర్పడిన యతికే స్వరప్రధానయతి యని పేరు.

---

[1] అప్పకవీయము - తృతీయాశ్వాసము 12, 13, 14

అప్పకవి రచన—

తే. గీ. అతులగుణధామ! భానువంశాబ్ధిసోమ!
ఇనతనూభవమిత్ర! లంకేశ జైత్ర!
ఉరుగుణ కలాప! శకలీకృతోగ్రచాప
నాఁగనిట్లు స్వరప్రధానవళులొప్పు[1].

(3) లుప్తవిసర్గక స్వరయతి:

విసర్గ లోపించినపుడు పరస్వరమునకు యతి వేయుట. దాసః అహమ్ = దాసోఽహమ్ - ఇచ్చట అ కు యతి.

తే. గీ. దైవ భాషనదంత సాంతములమీద
నత్తు మొదలను గల శబ్దములకు వేళ
నమరు నోత్వంబునకు జెల్లు అయహలిపులు
జగతి లుప్త విసర్గక స్వరవళులన

అని అప్పకవీయము (తృ-17) లోని లక్షణము.

ఉదాహరణములు—

(1) అప్పకవి రచన—

తే. గీ. అంబుదశ్యామ! తవ కింకరోఽహమనగ
యామినీచరగర్వతమోఽర్క యనగ
హరి సుతుండును నీవు అన్యోన్యమిత్రు
లయి ప్రవర్తింతురనగ లక్ష్యంబులయ్యె[2]

(2) తిక్కన రచన—

ఉ. దైన్యము దక్క దూత యుచితంబుగఁ బాండునృపాలు పాలు రా
జన్య వరుండు ధర్మజుడు సమ్మతివేడెడు నన్నలోకసా
మాన్య విధం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొంద మ
న్యోన్యవిరుద్ధ భాషణము లాడినఁ దిత్పుల మాతఁడందెడిన్[3].

(4) ఋయతి (ఋవళి):

ఏ, ఋ ౠ, - రి రీ రే లకు యతి చెల్లుట. ఉదాహరణములు-

(1) నన్నయ రచన-

సీ. ఋత్విజుండవి విచారించి పూజించితే?
ద్వైపాయనుండుండ ధర్మయుక్తి[4]

---

1 అప్పకవీయము తృతీయ-16
2 అప్పకవీయము - తృతీయాశ్వాసము-18
3 తిక్కనభారతము-ఉద్యోగ పర్వము 1-32
4 నన్నయ భారతము సభాపర్వము 2-11

(2) చేమకూర వేంకటకవి రచన-

ఉ॥ ఆణిమెరుంగుముత్తెపు టొయారపు ముగ్గులు రత్నదీపికా
శ్రేణులు ధూపవాసనలు హృద్యనిరంతర వాద్యఘోషముల్
రాణఁ బొసంగఁ బ్రోలు మిగులం గనువిందొనరించు నిత్యక
ల్యాణముఁ బచ్చతోరణమునై జనులందఱు నుల్లసిల్లగన్. [1]

(5) ఋత్వాసంబంధయతి.

వట్రువ సుడికి, ౄ - ఇ ఈ ఋ ౠ ఎ ఏ లకు యతి. ఉదా-

(1) అప్పకవి రచన-

ఆ. వె. ఇనతనూభవుండు పృషదశ్వసుతునేసె
ఋషనదీ సుతుండు కృష్ణునేసె!
ఏమి చెప్పనపుడు ద్రుపద శక్తిశల్యుండు
హీనబలునిఁ జేసె వృష్ణికులుని[2].

(2) శ్రీకృష్ణదేవరాయల రచన—

చం॥ హితులు, భిషగ్గ్రిహజ్ఞబుధ బృందకవీంద్ర పురోహితుల్, హితా
హితులు, ధనార్జనాది నృపకృత్యనియుక్తులు, వెండి కేవలా
హితులు, దశాదశార్పిత సమృద్ధ రమాచరణేప్సులౌట నా
హితము నటులగాఁ బతురప్రవృత్తిఁ జరించుట నీతి వేదికిన్[3].

(6) ఋత్వాసామ్యయతి.

వట్రువ సుడి (ృ) తో కూడిన హల్లులకు పరస్పరము యతిచెల్లుట. ఉదాహరణము—కృ-శృ.

శ్రీకృష్ణదేవరాయల రచనలు—

మ॥ గృహ సమ్మార్జనమో, జలాహరణమో, శృంగార పల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో, వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాతపత్రధృతియో, ద్రాగ్దీపికారోపమో,
నృహరీ వానిములేల? లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్[4].

తే. గీ॥ తిరుగు హరిపురిసురతరు సురలమరగి
బహుళ హళహళీ భృతకలబరిగ నగర
నగరపురవర పరివృఢ జవనయవన
పృతన భవదసి ననిఁ దెగి కృష్ణరాయ![5]

---

[1] విజయవిలాసము 1-357
[2] అప్పకవీయము 3-57
[3] ఆముక్తమాల్యద (4-273)
[4] ఆముక్తమాల్యద (2-9)
[5] ఆముక్తమాల్యద 1-41

(7) వృద్ధియతి :

వృద్ధిసంధిలో నుభయస్వరములకు యతి చెల్లును.

లోకైక=లోక+ఏక ఏ ఐ-రెండు అచ్చులలో నేదే నొకదానికి యతి వేయనగును. అట్లే ఓ ఔలకు గూడ

(1) అప్పకవి రచన-

తే. గీ. ఇభ భయవిదార ! సర్వలోకైక వీర !
అఖిలభువన ప్రశస్త జితైణహస్త !
ఉదధి శాశితవక్ష భక్తౌఘరక్ష
హృతపరానీక ! నందవ్రజైక ! యనగ[1]

(2) శ్రీకృష్ణదేవరాయల రచన

మ॥ గురుగుంజెంచలి తుమ్మిలేడగిరి పొతుం దింత్రిణీ వల్లవో
త్కరముం గూడ బొరంటి నూవియలతో గట్టావికుట్టారికో
గిరముల్ మెక్కితమిం బసుల్ పొలమువో గ్రేపుల్ మెయిన్నాకమే
త్తైరువుం గుంపటిమంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తిపెద్దజ్జడిన్[2]

(3) తిక్కన రచన-

ఉ॥ ఆకమాలాక్షిరూప మహిమాతిశయంబు మనోహరంబు; లో
గైకవరాయణుల్ పురుషపుంగవు లప్రతిమానచేష్టిత
స్వీకృత లోకు లట్లగుట జేటు పురంబున వారికెమ్మెయిన్
గాకెటుబండు నిట్టి అవగాథపుటొత్తు మనంగవచ్చునే[3]

భాస్కరుని రచన-

శా॥ నీ కంఠార్పితకాలపాశము శిరోనిర్ఘాతపాతంబు లం
క్రౌంచప్రపంచయకాళరాత్రి గళబద్ధోదగ్ర కాలాహి క
న్యాకారాగత మృత్యువీజనకకన్యన్ వేగనొప్పించి లో
కైకత్రాణుని రామునింగనుము నీ కీబుద్ధి గాకుండినన్[4]

(5) అయ్యలరాజు రామభద్రుని రచన-

క రాజమనోజా ! విద్యా
భోజా ! దీనార్థికల్పభూజా ! రిపునం
ఙ్ఞాజా వైభవ విజిత వి
డౌజా ! రవితేజ ! గుత్తి అప్పలరాజా !

---

[1] అప్పకవీయము 3-38

[2] ఆముక్తమాల్యద (చతుర్థాశ్వాసము. 184)

[3] తిక్కనభారతము - విరాటపర్వము 3-32

[4] భాస్కరరామాయణము సుం - 448

# 17

# వ్యంజనాక్షరయతులు

**(8) ప్రాణియతి :**

హల్లునకు యతి గూర్చుచో అచ్చునకు + హల్లునకు కూడ యతి మైత్రి ఘటింపవలెను. క-కా కి-కీ... కై-కే కృ-కౄ

ఉదాహరణములు—

అప్పకవిరచన

సీ॥ క్షీరవారాశి గంభీర కాంచనాచలధీర!
కాళియోరగ వైరి కైటభారి!
కైలాసపతి మిత్ర కౌశికస్తుతి పాత్ర
కిల్బిషాద్రి సురేంద్ర! కీర్తి సాంద్ర
కీలాలరుహనాభ! కృష్ణజీమూతాభ.
కృతవర్మతో నేగి కేలకులాగి
కైరలి వైద్యుడు చూడఁ గేకియుల్ గొనియాడఁ
గుండినేశుని పట్టిఁ గూడమెట్టి
కూర్మివలకేల సింగంపుఁగొదమ లీలఁ
గోని శతాంగంబు పై మంచి క్రొక్కుమించి
ద్వారకకు వచ్చు నీ విభవంబుఁ బొగడ
శక్యమే యనఁగాకు లక్ష్యంబులయ్యె[1]

అట్లే తక్కిన హల్లులకు లక్ష్యముల నరయదగును.

**(9) వర్గజయతి :**

అనునాసికాక్షరములుగాక తక్కినవర్గాక్షరములకు అన్యోన్యయతిచెల్లును. అనగా కవర్గములోని అక్షరములు 'క ఖ గ ఘ' లకు అన్యోన్యము యతిచెల్లును. అట్లే చ వర్గములోని అక్షరములు 'చ ఛ ఛ జ జ ఝ' లకు అన్యోన్యము యతి చెల్లును. ట వర్గములోని అక్షరములు 'ట ఠ డ ఢ' లకు అన్యోన్యము యతి చెల్లును. త వర్గములోని అక్షరములకు 'త థ ద ధ' లకు అన్యోన్యము యతి

---

[1] అప్పకవీయము 3-47

చెల్లును. ప వర్గములోని అక్షరములకు 'ప ఫ బ భ' లకు అన్యోన్యము యతి చెల్లును.

(1) అప్పకవి రచన—

ఆ వె క్రౌంచ మధ్యగేహ ! ఖండితారి సమూహ !
ఖంజనాభదేహ ! గాన మోహ !
గరుడ పక్షివాహ ఘనవాహజస్నేహ !
ఘర్గవినుత ! యనిన వర్గయతులు[1]

తక్కిన వర్గములందలి అక్షరములకు ఇట్లే లక్ష్యము లరయ నగును.

## (10) బిందు యతి :

అనునాసి కాక్షరములకు ఆయావర్గాక్షరములు బిందు పూర్వకములగుచో యతి చెల్లును. (1) అప్పకవి రచన—

తే గీ. జ్ఞానవేద్యాయ ! త ప్తకాంచన విభూష
ణాయ ! మేచకవర్ణ కంర ప్రియాయ !
నగధరాయ ! నమోస్తు సౌందర్య విజిత
మనసిజాతాయ ! గోవిండాయ ! యనఁగ[2]

## (11) తద్భవ వ్యాజయతి :

లక్షణము చూడదగును—

సీ॥ విజ్ఞానమునకు భావింప విన్నాణంబు,
విజ్ఞాపనమునకు విన్నపంబు
సంజ్ఞకు సన్న, యజ్ఞమునకు జన్నంబు,
వాజ్ఞ ప్రికానతి, యాజ్ఞ కాన,
యని యిట్లు సంస్కృత వ్యాహార మధ్యాన
పానంబుల ద్వితీయ సరళమునకు
పడుగువఁగల కాఠజామనాసికములు
తద్భవంబున ద్రుతత్వంబు గొంది
వెలయుటను దద్భవ వ్యాజ విశ్రమమున
జరిగి నణలకు రెంటికి జ్ఞా తనర్చు
జ్ఞానిచేతోంబుజాత శోణ కర ! యనఁగ
జ్ఞాతివిద్వేషి నృపనాశనకర ! యనఁగ[3]

ఇట్లు ణ-న-జ్ఞ లకు యతి చెల్లుట తద్భవ వ్యాజ మిశ్రయతి

---

[1] అప్పకవీయము 2-50
[2] అప్పకవీయము 3-53
[3] అప్పకవీయము 3—54

(1) పావులూరి మల్లన రచన—

ఉ॥ శ్రీనిధియైన శివ్వనను జిమ్మనమన్ మఱి సూర్యదేవునిన్
ధీనిధిఁబోల నార్యులను దేజమునన్ రవితుల్యులైన యా
సూమల నల్వురంబరఁపె సూరి జనస్తుత సత్యభారతీ
జ్ఞానులఁబద్మ వదనంబులు నాలుగుఁబోలె వారిలోన్

## (12) విశేషయతి :

జ్ఞ కు క, ఖ, గ, ఘ లకు యతి చెల్లును లక్షణము—

తే గీ॥ ప్రౌఢ కవులు కొందరు జ్ఞకారంబుఁకును
ప్రథమ వర్గంబు తొలియక్కరములు నాల్గు
నిడుదురు ప్రబంధముల నొక్కయెడ విశేష
వళులనుచు సోమయాజులు వాడు కతన ।

(1) శ్రీనాథుని రచన—

సీ॥ జ్ఞానేంద్రియ జ్ఞాన కళకాదు సౌరుగా [2]

(2) తిక్కన రచన—

కం॥ జ్ఞానము కేవల కృపన
జ్ఞానికి నుపదేశవిధిఁ *ప్రకాశము పేయం
గా నది సకలధరిత్రీ
దానంబునకంటె నధికతరఫలదమగున్ [3]

## (13) అనుస్వారసంబంధయతి :

"ంట వర్గునకును" "ంత" వర్గునకును యతిచెల్లును.

(1) అల్లసాని పెద్దన రచన-

శా॥ శీలంబుం గులమున్ శమంబు దమముం జెల్వంబు లేఁప్రాయముం
బోలంజూచి యితండపాత్రుఁడని యే భూపాలుఁడీ వచ్చినన్
సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు మాన్య క్షేత్రముల్ పెక్కుచం
ద్రాలంబందు నొకప్పుడుం దరుగఁదింట్రం బాడియుం బంటయున్ [4]

---

1 అప్పకవీయము 3—56

2 కాశీఖండము 1—139.

* ప్రజనితము అను పాఠాంతరము గలదు

3 తిక్కన భారతము శాంతి పర్వము 4—255

4 మనుచరిత్రము 1—55

(2) రావిపాటి తిప్పరాజు రచన—

మ॥ సరిబేసై రిపుడేల భాస్కరులు భాషానాథ!, పుత్రా! వసుం
ధర వందొక్కడు మంత్రియయ్యె, విను కొండ్రనామయామాత్య భా
స్కరుడో? యౌ, నయితే సహస్ర కరశాఖల్లే, వదే యన్నవే
శిరమైదానము వేయుచో రిపులహేతిన్ వ్రేయుచో వ్రాయుచో।

(*14*) అనునాసికాక్షరయతి :

"ంట" వర్గమునకు న; "ంత" వర్గమునకు ణ యతి చెల్లును. లక్షణము-

తే గీ॥ అల ద్రుతంబునకును మధ్యమానునాసి
కమునకునుఁ జెల్లు ననునాసికయతులనగ
దాపలను బూర్ణములు గల్గు ట ఠ డ ఢ లను
త థ ద ధ లను గ్రమంబున దానవారి!

(1) అప్పకవి రచన-

క॥ మను సంతతి మండన! ఖం
డన నిర్జిత కార్తవీర్య నరనాయక ఖం
డన. పంక్తిస్యందన నం
దన చందన శక్రవారణలసత్ కీర్తీ [2]

మ॥ కల మాన్నంబు ఘృతంబుఁ బాయసము శాకవ్రాతముల్ పిండి వం
టలు బార్తేనియ జున్ను వెన్న యిది యానాలుక్కెంటిల్ చక్కెరల్ [3]

(3) పరమయోగి విలాసమునందు

సీ॥ నిగమ చోరకుని ఖండించిన యలతయో,
యబ్ధిలో గిరి మోచి నట్టి యలంతో [4]

(4) రచన

సీ॥ పల్లవారుణ జటాపటల భారముతోడ
నవ్యపలాశ దండంబుతోడ [5]

(*15*) ము విభక్తియతి :

(విభక్తి) ము – పు – ఫు – బు భు లకు యతి చెల్లును.

---

1 అప్పకవీయము 3–62
2 అప్పకవీయము 3–63
3 రాజశేఖర చరిత్రము 2–157.
4 పరమ యోగి విలాసము 2–104.
5 హరిశ్చంద్రోపాఖ్యానము 1–8

(1) అప్పకవి రచన

తే గీ॥ పుష్కరము సూక్ష్మమధ్యమముగ నొనర్చె
పుల్లపంకేరుహము వక్త్రముగ నొనర్చె
బొండు మల్లెలు దరహాసముగ నొనర్చె
భోజనృపనందనకు నిక్కముగ నజుండు[1]

ప్రాక్తకాలమున తత్సమ తద్భవ శబ్దములకు మువిభక్తితోపాటు ప్రథమావిభక్తిలో 'బు' కూడ ఉండెడిదనుట ఈ యతికి మూలహేతువు కానోవు.

(2) నన్నయ రచన

క॥ ఎట్టి విశేషకులంబునఁ
బుట్టిన సద సద్వివేకములు గలిగినఁదాఁ
గట్టిన కర్మ ఫలంబుల
నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్[2]

## (16) ముకారయతి :

ము (వర్ణము) నకు పు - ఫు - బు - భు లకు యతి చెల్లును.

(1) నాచన సోమన రచన

క॥ అత్తఱి విట నాగరకులు
చిత్తమున వసంతకేళి చిగురొత్తంగా
మొత్తములు గట్టి తెచ్చిరి
ముత్తెపు ఝల్లరులతోడి బుఱ్ఱట కొమ్ముల్[3]

(2) గౌరన రచన

ద్వి॥ ముందు మీఱెఱిగిన భూతలాధీశు
లందు రాజ్యంబుఁ బోనాడి క్రమ్మఱను[4]

(3) శ్రీరంగ మాహాత్మ్యమునందు

చ॥ పరిచరుఁగాఁగ నేలె నిరపాయ చరిత్రునిఁ బాపకానన
స్ఫురదురు వీతిహోత్రుని సముజ్జ్వలమేరు సమాన గాత్రునిన్
బరమ పవిత్రునిన్ మునిసుపర్వ పరస్తుతి పాత్రునిన్ మనో
హరఫల శేముషీ కబళితాంబుజ మిత్రుని వాయుపుత్రునిన్[5]

---

1 అప్పకవీయము 3-70

2 నన్నయ భారతము - ఆదిపర్వము 5-58

3 వసంత విలాసము.
ఇది నేడు ఉపలభ్యముగాదు ఈ ఉదాహరణము అప్పకవిది 3-73

4 ద్విపద హరిశ్చంద్రకథ

5 శ్రీరంగ మాహాత్మ్యము.
అప్పకవిది 3-73.

## (17) మ వర్ణయతి :

మ - ంయ - ంర - ంల - ంవ - ంశ - ంష - ంస - ంహ లకు యతి చెల్లును.

(1) అప్పకవి రచన—

సీ॥ మర్దితదైత్య సంయమిమనోబ్జాదిత్య !
మహితమేఘాభ సంరక్షితేభ !
మాయాప్రవర్తి సంలబ్ధ నిర్మలకీర్తి.
మణిహార సురవశంవద విహార !
మందర ధైర్య వంశనినాదచాతుర్య
మాభూప యువతి పుంషండరూప !
మంజుల స్వాంత కంసధరా వరకృతాంత !
స్మరహరారాధ్య సింహవిభమధ్య

తే గీ॥ యనుచు జరమానునసికంబునకు నిట్లు
గ్రాంథికృతుల మవర్ణవిరామములన
దండి సున్నలు దాపలనుండె నేవి
పెఱచ వంతస్థములు నూష్మములును గృష్ణ [1]

(2) అనంతుని రచన—

తే గీ॥ యరలవలు శషసహలును నాదిబిందు
యుతములై మకారవిరామ యుక్తిఁదనరు
మారు తాత్మజుఁడరిది సంయమియనంగ
మదనజనకుండు దనుజ సంహారుఁడనగ [2]

## (18) ఋజుయతి :

య—హ లకు యతి చెల్లును.

(1) అప్పకవి రచన—

తే.గీ॥ మొదలియంతస్థవర్ణంబు తుదినిబొదలు
నూష్మమును ఋజుసంజ్ఞచే నొకటి కొకటి
యతులగు నపార శూర సంహార యనగ
హరముఖార్చిత పాదతోయజ ! యనంగ [3]

---

1 అప్పకవీయము 3–76

2 అనంతుని ఛందము 1–117

3 అప్పకవీయము 3–79

(19) ప్రత్యేకయతి :

చేతి + అది = చేతియది స్వరమైత్రి; చేతిది-వ్యంజనమైత్రి చెల్లును.

(1) అప్పకవి రచన

తే.గీ॥ అరయ శార్ఙ్గంబు హరిచేతి యదియునాక
దివ్యచాపంబు తూలి చేతిదియనంగ 1

(20) భిన్నయతి :

ధరియించు – స్వరమైత్రి ధరించు వ్యంజనమైత్రి చెల్లును.

(1) అప్పకవి రచన–

తే గీ॥ ఎదను లచ్చిని హరి ధరియించెననఁగ
రిపుల నెల్లను ఘోర హరించెననఁగ 2

(2) చేమకూర వేంకటకవి రచన

ఉ॥ చిత్తజుఁదల్గి తూపుమొనఁజేసినఁ జేయగ నిమ్మపై ధ్వజం
బెత్తిన నెత్తనిమ్మ వచియింపెదఁగల్గిన మాట గట్టిగా
నత్తరళాయతేక్షణ కటాక్ష విలాస రస ప్రవాహముల్
కుత్తుక బంటి తామరలకుందలమున్కలు గండు మీలకున్ 3

ఉ॥ ఎట్టి ప్రదోషవేళ జనియించిన వాఁడవొ గాక చంద్రమా.
—విజయ విలాసము

వెఱయతి – ఆగమము రానందుకు

(4) శ్రీరంగ మాహాత్మ్యమునందు

ఉ॥ గందపుఁ గొండ నెత్తములఁ గందువ మేలిమి తీవయిండ్లలోఁ
గెందలి రాకు పాన్పున సుఖించి నితాంతరతి శ్రమంబునుం
జెందిన చెంచు గుబ్బెతల చెక్కులఁ జిమ్ముజవాది వాసనల్
విందులు సేయుచున్ మెలగువేఁకువఁగోమల గంధవాహముల్ 4

తే గీ॥ గుడుసుపైఁ గ్రియ నడుమ నాగుడుసువచ్చి
భిన్నయతి యగు రానిచోఁబెఱయతి యగు"

నని అప్పకవి ప్రతిపాదించెను. తెలుగు క్రియలలో ఇంచుగాగమము వచ్చి రెండు రూపము లేర్పడును. 1. ధరించు 2. ధరియించు.

---

1 అప్పకవీయము తృతీయాశ్వాసము—80

2 అప్పకవీయము 3—81

3 విజయ విలాసము 3—15

4 శ్రీరంగ మాహాత్మ్యము, అప్పకవీయము 3—84

ధరించు అనునపుడు రికి వ్యంజన యతి భిన్నయతి గాదు. ధరియించు అనునపుడు 'యిం' కు యతి స్వరయతియే. ధరించు అనుచోట వెఱయతి యని పేరు పెట్టి వ్యంజనమైత్రిని మాత్రమే నిర్దేశించుటచేత అప్పకవికి ధరించు అను ఇంచుగాగమ శబ్దములలో రి మున్నగు వ్యంజనములకు ఉభయ యతిమైత్రి (స్వరమునకు వ్యంజనమునకు) ఘటించుట సమ్మతముగాదనుట సుస్పష్టము.

కాని ఇంచుగాగమ శబ్దములందు సుఖించు ధరించు వరించు మున్నగు శబ్దములలో నుభయయతిని పాటించిన పూర్వకవు లనేకులున్నారు.

(5) నన్నయ రచన

ఉ॥ వీరలు దైవశక్తిఁ బ్రభవించిన వారగుటేమి సంది యం
బీరమణీయ కాంతి నుప మింపఁగ వేల్పుల కారె [1]

(6) గరళపురీ ఛందమునందు

తే.గీ॥ కెరలుదీముల సిరుల సుఖింపజేసి
యెలమిఁబరకార్యములను ఘటింపఁజేసి
ఇలను దన మహిమంబు జనింపజేసి
గరళపురి నాథుఁడనగ లక్ష్యంబులయ్యె

(7) కేతన రచన

కం॥ మించి మదించినరిపుల హ
రించక సత్కీర్తి యీ మహీతలమెల్లన్
నించక దీనులదయఁబో
షించక ప్రఖ్యాతిగల్గునే నరనాథా [2]

(8) ప్రద్యుమ్నోపాఖ్యానమునందు

కం॥ పంచశరుండనఁగను నా
లించి మహా ప్రధనభూమి నీక్షించి మదో
దంచితుఁడై శంఖముఁ బూ
రించెం గుల గిరులు దిక్కరి వ్రజమదరన్

ఇందు రెండవ పాదమున స్వరమైత్రి, నాలుగవ పాదమున వ్యంజన మైత్రి ఘటింపబడినది.

(9) ఎఱ్ఱన రచన

సీ ఏను దియ్యమున నటించిన హరుడైన [3]

---

1 నన్నయ భారతము ఆదిపర్వము 5–151

2 దశకుమార చరిత్రము.

3 నృసింహపురాణము 2–56

(10) నారాయణకవి రచన
తే.గీ. ఎఱిగి విశ్లేషముగ నడగించు టురవు[1]

## (21) ఏకతరయతి :

ర ఱ లకు యతి చెల్లదు.

ర ర లకు; ఱ ఱలకు యతి చెల్లునని అప్పకవి మతము. ర - ఱ - ల యతి మైత్రి అప్పకవికి సమ్మతముగాదు.

(1) అప్పకవి రచన-

ఆ. వె॥ రా ర బాలకృష్ణ ర చ్చల గమిగూడి
ఱా(గయనుచు విమ్ము ఱవ్వ( బెట్టు
వాం(డ్ర యిండ్లకేగి వాదేల( దెచ్చెద
వనిన నేక తరములై పొసంగు[2]

పెక్కురు కవులు సాధురేఫమునకు శకట రేఫమునకు యతిని ఘటించి. యున్నారు. పోతన అట్లు ఘటించుటచే భాగవతమును లాక్షణికులు ప్రామాణిక గ్రంథముగ నెంచలేదని అప్పకవి భావము.

(2) పెద్దన రచన-

శ్రీ ఱుల్ గట్టినబోంతరాశమున( బాటెన్ బక్షులు ... ...
—మనుచరిత్రము

తెలుగు యతికి మూలము వర్ణ మైత్రి అయినను ర-ఱ లకు యతిని అప్ప కవి అంగీకరింపకపోవుటయేకాక అట్టి యతి యుండరాదని సమర్థించెను.

తే గీ॥ జ్ఞాతి వైరంబునొంది ప్రాసంబులందు
విక్రమములందు( దమలోన వేఱుగలిగి
దేవదానవులట్లన తెలుగు లందు
మించి రేఫ ఱ కారముల్ మెలగు( గృష్ణ[3]

## (22) అభేద యతి :

వ - బ; ల — డ; ల - ళ; ల కు యతి చెల్లును.

బలాహక=వలాహక, జలధి=జడధి, వ్రీడ=వ్రీళ, పరిమల=పరిమళ, కలంక= కళంక. సంస్కృత భాషలో వ బ లకు ల డ లకు ల ళ లకు అభేదము వర్తించును. వెడలు - వెళలు; దళము - దడము; తెనుగునను నీ సంప్రదాయము కలదు.

---

1పంచతంత్రము — సంధి 344
2అప్పకవీయము 2-86
3అప్పకవీయము ద్వితీయాశ్వాసము - 229.

తే. గీ। వేదముఖమున 'వ బ యోరభేద' యనుట
వలన వబలొక్కటొక్కటి విలుచు విరతి
కవవి లదలకు లకలకు నట్ల కలిమిఁ
జేసి తమలోన విచియును. జెల్లుచుండు

అని అప్పకవీయము (3-87) లోని లక్షణము.

(1) అప్పకవి రచన—

ఆ॥ వె॥ వసుమతీ కళత్ర బక జైత్రగాన క
ళాలసత్ కలాపదంభ గోవ
లలిత దేహ పింగళపుర దక్షిణ గేహ
యన నభేద విరతు లమేయ।

(2.) భీమకవి రచన—

చ। విసరుహ గర్భుప్రాతయును విష్ణుని చక్రము వజ్రివజ్రమున్.

(23) అభేదవర్గ యతి :

ప — ఫ — బ — భ — వ లకు యతి చెల్లును.

(1.) నన్నయ రచన—

ఉ॥ ప్రల్లదు డైన యొక్క కులపాంసను చేసినదానఁ దక్కులం
బెల్లను దూషితంబగుట యేమి యపూర్వము కావునన్ మహీ
వల్లభ తక్షకాధము నెపంబున సర్పములెల్ల నగ్నిలోఁ
ద్రెళ్లగఁ సర్పయాగ మతిధీయుత ! సేయుము విప్రసన్నిధిన్

క। కోరి యనేక యుగంబు ల
పార తపోయుతులైన వారికిఁ బడయన్
దూరము నీ సభమటి నీ
కారుణ్యము నంతకంటెఁ గడుదవ్వేందున్[3]

(24) ఊష్మ యతి :

శ - ష - స లకు యతి చెల్లును.

1. అప్పకవి రచన—

తే గీ॥ శతమహోపల భూషామ షంగ యనఁగ
షడ్జయుత వేణునాద ప్రసంగ యనగ

---

1అప్పకవీయము 3-88

2నన్నయ భారతము ఆదిపర్వము—1-128.

3 నన్నయ భారతము, అరణ్యపర్వము 1-371.

## (25) సరస యతి

అ- య - హ లకు, చ - ఛ - జ - ఝ - శ - ష స లకు, న - ణ లకు యతి చెల్లును.

1. అప్పకవి రచన—

తే. గీ హరి హయాది సురాధ్యక్ష ! అంబుజాక్ష !
యతి జనమనోంబుజ విహార ! అఘవిదూర !
నరక దైత్యవిరోధి ! ఘృణా పయోధి !
యనగ సరసాఖ్యవళ్యుదాహరణములగు[1]

తే. గీ. శకట దానవ సంహారి చక్రధారి
షట్పదశ్యామమూర్తి స్వేచ్ఛాప్రవర్తి
స్వర్ణ పటపరిధాయి భుజంగ శాయి
కరుణ నను( బ్రోవు మననయ్యె సరసవళులు [2]

## (26) సంయుక్త యతి :

సంయుక్తాక్షరములలో నేదోయొక హల్లునకు యతి మైత్రి ఘటింపనగును.

అప్పకవి రచనలు—

1. తే॥ గీ క్ష్మాధరం బాతపత్రంబుగా ధరించి
క్ష్మా కుమారుని బోరను సంహరించె
క్ష్మారుహంబునకై నిలింపపతి నొంచె(
జక్రి నిన సంయుక్త విశ్రామములగు [3]

అల్లే బహు యతులున్నను

2. జయభద్ర రగడ :—

క్ష్మాపు తిశాలోల కమనీయ గుణజాల ఘననీల
యని చెప్పగా బహు విరతులొప్పు

3. విజయమంగళ రగడ :—

వైరి మదతమః పతంగ । స్వజన పోషితాంతరంగ ।
వ్రజ వధూభుజంగ । యనగ వలయు( బెక్కు వడులయెడల [4]

## (27) అంత్యోష్మసంధి యతి :

వాక్ + హరి = వాగ్ఘరి

వర్గహల్లులకు పొల్లులగు క చ ట త ప లకు పరమైన హకారమునకు ఆయా వర్గ చతుర్థాక్షర మాదేశమగు. ఇట్టిచో లోపించిన హకారమునకుగాని వర్గ హల్లునకుగాని య తిపాటింపనగును.

---

1అప్పకవీయము 3-106
2అప్పకవి ము 3-107
3అప్పకవీయము 3-109
4అప్పకవీయము 3-114

(1) అప్పకవి రచనలు—

[1]"దేవకీ నందనుడు జగద్విదితుడనంగ"

[2]హలధరుడు సంగరాంగణోద్ధతుడనంగ

దీనికి అనంతుడు వికల్ప యతి యని పేరుపెట్టెను.

(28) వికల్ప యతి :

తే. గీ వ్యాకరణ సూత్రముల సంధు లరుకునపుడు
రెండు విధముల రూపంబు లుండెనేని
వసుధ నయ్యక్కరముల కవ్వల వికల్ప
సంధి విరమణ మన రెండు పొసగుచుండు.

అని అప్పకవీయమునందలి (3-116) లక్షణము

(1) అప్పకవి రచన

తే గీ నంద సుకుమార ! గూఢపాన్మంద విహార !
దళిత శిశుపాల ! గోత భిన్మణి వినీల !
నాగ పర్యంకశాయి ! సన్మార్గదాయి !
ధాతృనుత నామ ! యోగి హృన్మధ్యధామ ![1]

(2) ఆదిపురాణమునందు-

మ ఒకనా డిందుధరుండుఁ బార్వతియు లీలోద్యాన కేళీసరి
న్నికటానేక వన ప్రదేశముల దైతేయేంద్ర కన్యావ్వరో
వికురుంబంబులు పారిజాత కుసుమానీకంబుపైఁ జల్లద
ర్పక బాణంబుల కెల్లవెల్లయగు సౌభాగ్యంబు శోభిల్లగన్.[2]

(3) పెద్దన రచన :-

మ కలంకౌషధ సత్త్వముందెలియ మాయాద్వారకావంతికా
శికురుక్షేత గయాప్రయాగములనే సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహవాహరిపు ఖడ్గవ్యాఘ్రము మిమ్మంచు క్రొం
దకు రాఁజెల్లునె బుద్ధి జాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోతియుల్[3]

తే. గీ హలధరానుజ మయటి నిత్యమ్మటంచుఁ
బలుకు వాక్యంబుచే మయ పదముగూడు
నప్పుడమనాసికంబె నిత్యమయి నిల్చు
నలిన లోచనుమేను చిన్మయ మనంగ

అని అప్పకవీయము (3-120) చెప్పుచున్నది.

---

1 అప్పకవీయము 3-117

2 అప్పకవీయము 3-118

3 మనుచరిత్రము2 -16

# 18

# ఉభయ యతులు

అచ్చులతో సంధివశమున గూడిన శబ్దములు, ఏక శబ్దములవలె దోచు నపుడు, స్వర వ్యంజనములలో నుభయములకు నైచ్ఛికముగ యతి ఘటింప నగును.

(1) యుష్మదస్మచ్ఛబ్దయతి :

(1) క॥ ప్రస్తుత ఫణి సత్రభయ
త్రస్తాత్ముల మైన అస్మదాదుల కెల్లన్
స్వస్తియని పలుక నవసర
మస్తికునకయ్యె విప్రు దంబుజనేత్రా ![1]

(2) క॥ చతురానన నందన ది
వ్య తపోధనవర్య ! యుష్మ దాగమనమునన్
గృతకృత్యుఁడ నైతి ! నే
వ్రతి పావనమయ్యె నస్మదన్వయమెల్లన్[2]

(2) పరరూపయతి :

శకంధ్వాదులలో స్వరవ్యంజనములకుభయములకు యతి చెల్లును.

శక + అంధు = శకంధు— ఇది సవర్ణ దీర్ఘ సంధికి అపవాదము. సవర్ణ దీర్ఘ సంధి ప్రకారము 'శకాంధు' కాలేదు. వేదండ - సారంగ - మార్తండ శబ్దము లీగణమునందే గ్రాహ్యములు. ఉదాహరణములు—

1. వేదండ శబ్దమునకు—

మ॥కో॥ దండితాహిత వీర ! సూరి విధాన ! దాన వినోద ! కో
దండ పార్థ ! పరాక్రమ ప్రియధామ ! దిక్పూరితా
ఖండ పాండు యశోనిధీ . పరగండ భైరవ ! వైరివే
దండ గండ విదారి ! ఘోరతరాసి ధారి భుజార్గళా ![3]

---

1 నన్నయ భారతము, ఆదిపర్వము 2–249

2 పాంటోపాఖ్యానము, అప్పకవీయము 3–123.

3 నన్నము, ఆదిపర్వము 3–228.

ఉ॥ పాండునృపాల నందనులు పావని ముందుగఁ దాకనట్లు భీ
ష్మాందు గడంకమై నడుచు చోటికిఁ జక్కటి గాఁగఁద్రోచి యొం
డొండఁ గడంగి సేన తమ యుబ్బున కుబ్బగ నన్యసైన్యవే
దండ ముఖాంగముల్ తృణ వితానముగాఁగొని విర్విళారులై [1]

(2) సారంగ శబ్దమునకు

ఉ॥ జంగమ రోహణాద్రి సదృశంబులు తత్పురిఁగల్గు భద్రసా
రంగ వరేణ్యముల్ వయికి హస్తములించుక సాచి యవ్వియద్
గాంగ ఝురంబు పీల్చి మఱి తద్యమధుప్రకరంబు దప్పి వా
యంగనొసంగు రంగుగ విశాఖ్య వహించిన చాతకాళికిన్ [2]

ఉ॥ అంగద నాథు మ్రింగిన వృకావళి దన్వెసఁ జుట్టుకొన్న స
ర్వాంగములుం జలింప బెగడందుచు దిక్కులు సూచుచున్న పా
రంగియవోలె నుండెఁ గురురాజ ! భవత్పృతు సేన భీష్మనా
శం గడిశించి పాండవులు జృంభిత విక్రమలీలఁ బొల్చుటన్ [3]

(3) ప్రాదియతి :

శ్లో॥ ప్రపరాప్రతి పర్యత్యధ్యభ్య వానూప సంస్వప
ని వి నిర్దురుదప్యాజిత్యుపసర్గాస్తు వింశతిః

ప్ర - పరా - ప్రతి - పరి — అతి - అధి - అభి - అవ—అను
ఉప - సమ్ - సు - అవ - ని — వి — నిర్ — దుర్ — ఉత్
అపి — అజ్

అను ఇరువదియు సంస్కృతమున ఉపసర్గలు.

ఈ ఉపసర్గలతో అతికినపుడు ఏర్పడు అక్షరములకు - అచ్చులకు గాని హల్లులకు గాని ఉభయములకు యతిమైత్రి ఘటింపనగును.

ఉదా :— అబ్జయోని రజోగుణ ప్రాప్తిఁ దనరు.

ప్ర + ఆరంభ = ప్రారంభ; ప్ర + అన = ప్రాణ; ప్రతి + అర్థి = ప్రత్యర్థి అప + ఇత = అపేత; సమ్ + అంచిత = సమంచిత దుర్ + ఆత్మ = దురాత్మ; నిర్ + అంతర = నిరంతర; అతి + అంత = అత్యంత; అధి + అక్ష = అధ్యక్ష: వి + ఈక్ష = వీక్ష, పరి + ఈక్ష = పరీక్ష, అభి + ఈప్సిత = అభీప్సిత, అను + అయ = అన్వయ; అవ + ఆప్తి = అవాప్తి, సు + ఉక్తి = సూక్తి;

1 తిక్కన భారతము, భీష్మపర్వము 1-234.

2 చంద్రికాపరిణయము, అప్పకవీయము 3-129

3 తిక్కన భారతము — ద్రోణపర్వము 1-17

ఉత్ + అచింత = ఉదంచిత; పరా + ఇత = పరేత, ఉప + అయ = ఉపాయ - అనురీతి ప్రాదులకు (ప్ర మొదలగు ఉపసర్గలకు) అచ్చుల చేర్పుచే నేర్పడు సంధులందు ఉభయ యతి చెల్లును. ప్రాచి యతులకు కవిత్రయ ప్రయోగములు. మఱియు మహాకవి ప్రయోగములు ననేకములు గలవు.

(1) ఉ॥ ఆవిపినాంతరంబున నిరంతర నిష్ఠ [1]

ఉ॥ మూఁకు నతిప్రియుండవు సమస్త విదుండవు [2]

## (4) నిత్య సమాన యతి :

స్వర సంధి గల్గియు స్థూల దృష్టికి ఏక పదములవలె గోచరించు పద గుంఫనములకు నిత్యసమాసములని పేరు. అవి కర్ణాట (కర్ణ + అట) రామాయణ రామ + అయన) మొ॥ నవి. ఇట్టిచో ఉభయ యతులు వాడనగును. వివిధ లాక్షణికు లొసంగిన నిత్యసమాస ఘటిత శబ్దముల పట్టిక—

కర్ణాట - వనౌక - ద్వీప - అంతరీప - నాస్తి - పదార్థ - అనేక -అనాది - అనంత - అనంగ - అనూరు - అన్యోన్య - జనార్దన - నాక - విశ్వామిత్ర - అపోశన - స్వాంత - ఏకాంత - సిద్ధాంత - రాద్ధాంత - లతాంత - ప్రాంత నిశాంత-నారాయణ - వాతాయన - ఉపాయన- రసాయన - రామాయణ-పరాయణ – పలాయన - బాదరాయణ - సాంఖ్యాయన - శాకటాయన - కాత్యాయన - వాత్స్యాయన - బోధాయన - దక్షిణాయన - ఉత్తరాయణ - మార్తాండ – బ్రహ్మాండ - శుద్ధాంత - ద్వార - సాంగ – గవాక్ష - సాంబ - సాదర - అక్షోహిణి - అక్షౌహిణి - కాసార - కూర్మ - కేశవ - లలాట - మేఖల - - కాదంబరి - శలాటు - కేశ – కమల – శృంగాటక - సేన - కుఠార - బిబ్బోక - రసాల - శృంగార - బృందారక - మయూర - శక్రాణి - ఇంద్రాణి - మృదంగ - వృకోదర - దామోదర - కాకోదర - జమదగ్ని - ప్రభృతి శబ్దములు

(1) కర్ణాట శబ్దమునకు —

శా లాటీచందన చర్చ చోళమహిళా లావణ్య సామగ్రి క
ర్ణాటీ గీతకళా సరస్వతి కళింగాంతః పురీ మల్లికా
వాటీ మంజరి గౌళవామనయనా వక్షోజహారాళియై
పాటింపందగు నీదుకీర్తి రథినీపాలాగ్రణీ! సాహిణీ। [3]

గాంచినన్ వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనన్ గంటిరే. అను ప్రయోగ మరయదగినది.

---

1 ఆంధ్ర భారతము-నన్నయ సభాపర్వము ప్రథమాశ్వాసము—138

2 ఆంధ్ర మహాభారతము-నన్నయ ఆదిపర్వము సప్తమాశ్వాసము—156

3 భాస్కర రామాయణము కిష్కింధ కాండము-826.

(2) ద్వీపశబ్దమునకు—

ఉ॥ ద్వీపులఁ ద్రుంచు విశ్వజగతీపతి యుత్తమ శక్తి జాంబవద్
ద్వీపమునందు గోవులకు విమ్మగఁ జేయుటయుం బ్రసన్నయై [1]

(3) 'నాస్తి' పదమునకు

తే॥గీ॥ నాస్తికాధమ యోరి యన్యాయవృత్తి
"నాస్తి తత్త్వం గురోఃపర"మ్మనగవినవె౽

(4) అన్యోన్య శబ్దమునకు—

ఉ॥ ధర్మ్యుఁడు విశ్వభూవిభుఁడు ధారుణి నేలఁగ భూజనంబుల
న్యోన్య హితత్వ సంపదల నొందిరి దంపతు లింపునింప న
న్యోన్య సుఖామకూలతల నోమిరి విప్రులు వేల్పు పింకు న
న్యోన్య సుపుష్టి తుష్టి కుశలాదుల నొందిరి నాడు నాటికిన్ [3]

(5) రామాయణ శబ్దమునకు—

తే గీ॥ మౌని జల్పితమైన రామాయణంబు
స్వరలయగ్రామ మూర్ఛనాసరణి లెక్కి
గానశక్తులు మెఱసి సాక్షాత్కరింపఁ
బాడి రాలాపములఁ ద్రిపత్తములు మట్ట [4]

ఉ॥ ఏ యెడ నర్థగౌరవ సమృద్ధియు శబ్ద విశుద్ధియుం దిరం
బై యనవద్యతం బరఁగ సంభ్రవచస్స్రుతి భారతంబు రా
మాయణమున్ రచించిన మహాత్ముల నాత్మఁ దలంచెద నగ
ద్గేయుల నన్నపార్యువిని దిక్కన నెఱ్ఱన భాస్కరాఖ్యునిన్ [5]

(6) నాక శబ్దమునకు

ఉ॥ ప్రాకట దర్పులై సకలరాయవి లక్కనృపాలు నాజిలోఁ
దాఁకు విరోధిసైన్యము ముదం బొదవన్వరియింపవచ్చుచో
నాకసమెల్లఁ గ్రమ్మకొను నంచితదివ్యవిమాన సంచర
న్నాక విలాసినీ చరణహంసకభూరి రుణంరుణధ్వనుల్. 6

1 కావ్యాలంకార చూడామణి 7–65
2 శృంగార షష్ఠము–అప్పకవీయము 3–146
3 కావ్యాలంకార చూడామణి. 7–68
4 జైమిని భారతము (6–96)
5 రాఘవ పాండవీయము (6–96)
6 గౌరరాజా చాటువద్యము

కం॥ మును వెఱకు నేయ మీఁదల
నను నేసినఁగాని యనుడు నాకేశ సుతున్
దమరాచార్యుఁడు దెబ్బది
సునిశిత బాణముల నేసెఁ జూపఱు వొగడన్[1]

(7) విశ్వామిత్ర శబ్దమునకు—

ద్వి॥ ఎక్కడా గురుఁడవి యెఱుఁగవి నీకు
అక్కటా గురుఁడు విశ్వామిత్రుడయ్యె

మ॥ హరకోదండ విఖండనుఁడు జనకక్ష్మాధీశు జామాత భా
స్కర వంశాగ్రణి జాఁకిప్రియుడు విశ్వామిత్ర యాగాహితా
మర సంహారి విరాధకాలుఁడు ఖరాసుధ్వంసి మారీచ సం
హరుఁ డన్యప్రమదా పరాఙ్ముఖుడయోధ్యా నాయకుం డాదటన్.[2]

(8) ఏకాంత శబ్దమునకు—

ఉ॥ అంతట నొక్కనాడు ధవళాంబుజ నేత్రుఁడు వచ్చి రుక్మిణీ
కాంత గృహంబులోన శశికాంత శిలామయ వేదిమీఁద నే
కాంతమునందుఁ గొందరు మృగాయత నేత్రలు గొల్వ జూద మ
త్యంత వినోద కేళిమెయి నాడుచునుండగ అద్భుతంబుగన్[3]

సీ॥గీ॥ కామ సంగమములకు నేకాంతగృహము.
బొలిచి సొలిచియు ధర్మార్థములకు నిదియ
యాస్పదంబన వర్గత్రయామరమ్య
లైన జనుల కెంతయు నొప్పు నప్పురంబు,[4]

(9) స్వాంత శబ్దమునకు—

స్వాంతము శాహంగర్వ ఘనసంతమసాంధముగాఁగ శంక యా
వంతయులేక కీచకుఁడహంకృతి ముంగలి నాగమంటపా
భ్యంతర సీమఁ జొచ్చి దరియంజని యారసి పెఱ్ఱఁగాంచి య
త్యంతముదావహంబగుడు నందు రయంబునఁ గేలుసాచినన్[5]

1 ఆంధ్రమహాభారతము - తిక్కన విరాటపర్వము (5-124)
2 భాస్కర రామాయణము సుందరకాండము (263)
3 పారిజాతాపహరణము.
4 ఆంధ్రమహాభారతము ఆదిపర్వము-8-74
5 ఆంధ్రమహాభారతము — తిక్కన విరాటపర్వము (2-331)

తే.గీ॥ అధికరోష కషాయిత స్వాంతుఁడైన
నరపతికి విన్నవింపకు నాయవస్థ
పైత్య దోషోదయంబునఁ బరుసనైన
జిహ్వకును బంచదారయుఁ జేఁదు గాదె[1]

ఇక్లే తక్కిన శబ్దములకు ఉదాహరణ యథోచితముగ నరయ వచ్చును.

సంస్కృత వ్యాకరణమున యమాన, యిత, యిష్యమాణ ప్రత్యయములు పరమగునేని పూర్వాచ్చునకు దీర్ఘము వచ్చును. వీనిని "క్యజ్" ప్రత్యయాంతములందురు. ఇట్టిచో ఆ దీర్ఘమునకు వ్యంజన మైత్రియే పాటింపనగును గాని ఉభయ యతులను వాడరాదు.

ఉ॥ ఆయము గర్వమున్ విడిచి యన్యవతుల్ పనిసేయనిట్లు గాం
గేయభుజాశ్రయంబున నికృత్త విరోధి సమాజుఁడై కుమా
రాయిత శక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండెన
త్యాయత కీర్తితోఁ దనకు హస్తిపురంబది రాజధానిగన్ [2]

ఇచ్చట 4వ పాదమున రా కు రాకు యతి ప్రయుక్తము. 'రా'కు అచ్చు ఆ తో మైత్రి స్వరమైత్రి వేయరాదు తిక్కన విరాట పర్వములో మొదటి పద్యములో నిట్టి యతి గలదు. తిక్కన గూడ వ్యంజనయతినే పాటించెను.

ఉ॥ శ్రీయన గౌరి నాఁబరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపముదాల్చి "విష్ణురూ
పాయ నమశ్శివాయ" యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్.[3]

"ఈ రెండు పద్యములందు నన్నయ తిక్కనలు కుమార భద్ర శబ్దములు క్యజ్ ప్రత్యయాంతములు చేసి సంయుక్తవిశ్రామంబులుగా ప్రయోగించిరి. అది గనుక కొందఱా రెండు శబ్దముల మీదనున్న ఆకారములను నిత్యసమాస విశ్రాంతులని భ్రమయుదురు. శబ్ద సూత్రముల వలన వానికే దీర్ఘములు వచ్చినవి గాని అందులోపల అతులులేవు" అని అప్పకవీయము (తృతీయాశ్వాసము-189) వివరించుచున్నది.

(5) దేశ్యానిత్యా సమాన యతి :

"దేశ్య నిత్యసమాస సంధికిఁ బొసంగు
వడి స్వరంబైన వ్యంజన వర్ణమైన"

అని లక్షణము. దేశ్య నిత్య సమాసముల పట్టిక—

1 శృంగారనైషధము - శ్రీనాథుడు ద్వితీయాశ్వాసము - 82.
2 నన్నయ భారతము - ఆదిపర్వము 5-6.
3 తిక్కన భారతము విరాటపర్వము 1-1.

రూపఱు; పెంపఱు; పెల్లఱు, ఏపఱచుట; క్రిక్కిఱియు, క్రచ్చఱ; చూపఱు, ఉక్కఱు, కఱకరి, కల్లడంబు; కట్టిడి తెమ్మెర; ఓలమాస, ఎసలారు; ఉల్లఱుకు, ఆఱడి, వీఱిడి; రజ్జులాడు; గ్రక్కరలు; అక్కఱ; బోరన, గ్రక్కన మున్నగునవి. వీనికి ఉభయ యతులు చెల్లును. జూదరి - తెరువరి - చదువరి-ఇవిగూడ యథోచితముగ పై ఆకృతి గణములోఁ జేర్పనగును.

తే. గీ॥ అసుర వీరులనెల్ల నుక్కఱ వధించె
భానుకులుఁడు రావణుని నేవ్వఱచెననగ. 1

కం॥ ఎఱకలు గల కులశైలము
తెఱఁగు మెఱయ నంత నతఁడు దివికి నెగసి బి
ట్టుఱుము జలధరము క్రియను
క్కఱఁ దద్వనమెల్ల నద్రువ నార్చుచుఁగడిమిన్. 2

చ చిఱునగవొప్ప గాండివము చెచ్చెర సజ్యముఁజేసి సేనలు
క్కఱ రథసంబుమై నడరఁ గ్రవ్వడి ద్రోణియు నీడఁబోక య
త్తఱిఁ దఱుమంగ నస్త్రములు దందడిఁ దార్కొవి మండుచుండెఁ జి
చ్చఱ పిడుగుల్ వడిన్ దొరఁగు చాడ్పున నంబరవీథి నుగ్రమై. 3

చ॥ ఎఱిఁగితి విన్ను నేను విబుధేంద్రుఁడవీవు జగత్త్రియంబు గ్ర
చ్చఱ భవదీయ రక్షణము నంద వెలుంగుచునుండు నట్టి వి
న్నుఱవుగ నేను వేడుకొన నుత్తుఁడగాక మొఱంగి నన్ను న
క్కఱపడి నీవు వేడు తిది కర్జమె నిర్జిత దైత్య! చెప్పుమా. 4

చ॥ తఱియగు నంతకున్ రిపు మదగ్రత సైచుట నీతి నీవు నా
కఱపిన యట్లు సేయుము తగంజవి యాతని గాంచి నన్ను నె
త్తెఱఁగున నైనఁ బొందఁగ మదిం గలదేనియు నింతయేల క్ర
చ్చఱ ముని వర్గవాహనుఁడవై చనుదెమ్మనుమంతఁ దీటెడున్. 5

## (6) నిత్యయతి :

ఏని శబ్దము పరమగుచో నేఁడు సంధ్యక్షరమునకు ఉభయ యతి వాడ నగును. రాముడేని (రాముడు+ఏని) ఇందు డే కును ఏ కును గూడ యతి వేయవచ్చును

1 అనంతుని ఛందము 1-101.
2 ఆంధ్ర మహాభారతము - అరణ్యపర్వము 6 - 345.
3 తిక్కన భారతము - విరాటపర్వము 5-143.
4 ఆంధ్ర మహాభారతము - అరణ్యపర్వము 7-367.
5 తిక్కన భారతము - ఉద్యోగపర్వము 1-176.

క॥ మెట్టఁడు నారక మార్గం
బెట్టి మహా క్రూరకర్ముఁడైనియుఁ దుద ని
ట్టట్టనక నెమ్మనంబున
నెట్టన హరితలఁపు గలిగెనేని మహాత్మా !¹

## (7) రాగమసంధియతి :

తెలుగులో రు గా గ మ సంధి (జవర్ణాలు మున్నగునవి) లో ఉభయ యతులు వాడనగును ('రా'కు 'అ'కు).

ఉ॥ ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర ! యే
కాంతము నందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
గింతియెకాక నీవెఱుఁగవే మును వచ్చిన త్రోవచొప్పు నీ
కింత భయంబులే కరుగ నెల్లిదమైతిమె మాటలేటికిన్ ? ²

క॥ ఈలలన వేలుపుంజవ
రాలో యచ్చరయొ కిన్నర వధూమణియో ! ³

రుగాగమ సంధికి ఉభయ వళులు చెప్పిన లాక్షణికులు టుగాగమసంధి విషయము చెప్పలేదను సంగతి గమనింపదగినది.

## (8) విభాగయతి :

ఏసితో చేరిన సంధిలో నుభయ యతులు వేయవచ్చును.

తే.గీ॥ ఋషుల పాలిటి వేయింతలేసి పనులు ⁴

ఆ.వె॥ కృష్ణుఁడిచ్చు నాలుగేసి చీరలు కూర్మి
నింతులకును నాలుగేసి మణులు
శీవితోద దోపెఁడేసి మాదలు కదు
నింపెఁసంగ గంపెఁడేసి సొమ్ము. ⁵

ఏసికిఁ జెప్పిన యుభయ యతి, "ఎడు" అను పరిమాణార్థకమునకు రెండవ, మూఁడవ మున్నగు 'అవ' శబ్ద ప్రయోగములకుగూడ చెల్లనగును. వీనినిగూర్చి అప్పకవిగాని పూర్వ లాక్షణికులుగాని చెప్పలేదు. కాని ప్రయోగములు గలవు.

---

1 అప్పకవీయము 3_214.

2 మనుచరిత్రము-ద్వితీయాశ్వాసము-41.

3 చారుదేష్ణచరిత్రము - అప్పకవీయము 3-217,

4 కాశీఖండము 2_101.

5 కావ్యచింతామణి-అప్పకవీయము 3-220.

"చెలఁగి కుచేలుఁడొక్క పుడిసెండటుకుల్"[1]

అప్పకవియే 'మూఁడవ' అనుచో వ్యంజనమైత్రి గూర్చియున్నాడు.

కనకలతావృత్తము పదుమూఁడవయెడ విరతిఁ బొనగిన బెద్దగదరుఁగనకలతన్.[2]

## (9) *నామాఖండ యతి :*

తెలుగులో శ్లేషార్థకంబులైన అన్నాదులు పరంబగునపుడు సంధి నిత్యము. అట్టిచో ఉభయ యతులు వాడనగును.

ఆ.వె॥ అప్ప, అయ్య, అన్న, అర, సవ్వ, అ, మ్మక్క
ఆయి యను పదంబు లదుకు సంధు
లుభయమునకుఁ జెల్లుచుండు నామాఖండ
వళులనంగ నూడఁబడఁక యెన.[3]

కం॥ చిన్నన్న ద్విపద కెఱగును
బన్నుగఁ బెద తిరుమలయ్య పదమున కెఱఁగున్
మిన్నంది మొరసె నరసిం
గన్న కవిత్వంబు పద్య గద్య శ్రేణిన్.[4]

తే.గీ॥ అంకితము సేయు వీరభద్రయ్యపేర[5]

తే.గీ॥ ప్రహినయోధ్యకు రాజురామయయనంగ
అతని పట్టంపు దేవి సీతమ యనంగ.[6]

ద్వి॥ ఆకార చంద్ర రామయ భాస్కరేంద్ర.[7]

కం ఆ సంపద సాల్వకోనమరుసున కెనయే.[8]

ఆ.వె॥ గోలకొండ మలక గోవుల భక్షించు
కొండవీటి విప్రకులము నెల్ల
బాచమరుసు చేరి భక్షించుచున్నాఁడు
మలక మేలొ ? బాచమరుసు మేలొ ?[9]

---

1 భాస్కరశతకము.
2 అప్పకవీయము 4-345.
3 అప్పకవీయము 3-221.
4 తెనాలిరామకృష్ణుని చాటువు.
5 కాశీఖండము 1-3
6 అనంతునిఛందము 1-120.
7 రుక్మాంగద చరిత్రము - అప్పకవీయము 3-229.
8 అల్లసానిపెద్దన చాటువు - అప్పకవీయము 3-230.
9 పలకలూరి గోపన చాటువు - అప్పకవీయము 3-231.

**(10)** *పంచమీ విభక్తియతి :*

పంచమీ విభక్తులగు కంటె, కన్న పరమగునపుడు క్త కు ఉభయ యతులు చెల్లును.

క॥ విన్నఁజెలఁగొన్న హైహయు
కన్నన్ దోర్వీర్య మెక్కుఁడగు భార్గవులీ
కన్నర్థించిన రాముని
కన్నను తూరుఁడు ముజ్జగంబునఁ గలదే।[1]

పంచమీ విభక్తి ప్రత్యయములైన కన్న కంటెలకు ఉభయయతిని చెప్పిన అప్పకవి చతుర్థీ విభక్తి ప్రత్యయములగు కై - కయికి చెప్పలేదు. కాని ప్రయోగములున్నవి.

తే గీ॥ అనఘ ! మామామ శకుని నాకై కడంగి [2]

**(11)** కాకు స్వరయతి :

కాకు స్వరములలో నుభయ యతి చెల్లును.

మ అకటా ఏమని దూరు దాన విను నాథా। [3]
మ॥ అవమానింపక తోడఁబుట్టులనె కాదాతున్మిఁతూటాడె।[4]
ఉ॥ ఇంకెవ్వెరిగాఁతు జెప్పగదవే తెరువెద్ది ఋభంబు వీఁగున్ [5]
శా॥ ఓరీ రాజకులాధమా ! నృపుల లేరో ! వేట రారో। [6]
ద్వి॥ అట్టె నామీద నీవా అలిగెదవు।[7]
ఉ॥ ఉల్లమః ఇట్లు నీకు తగునో తగదో పరికించి చూడుమా![8]

**(12)** ప్లుతయుగ యతి :

ప్లుత స్వరములు రెండింటికి యతిమైత్రి ఘటింపవగును.

ఉ॥ శ్రీ గజగామినీమణిని సీతమగా విరహాయిగాఁద్రిలో
కీ గృహమేధిఁగా గరుడకేతనుఁగా భవరోగ వైద్యుగా
నా గురునాన విన్నె మదినమ్మితి వేరొకవేల్పుఁగొల్వ నీ
వే గతి కావవే రఘుపతీ శరణాగత వజ్ర పంజరా ![9]

వే - తీ లకు యతి చెల్లదు. కాని ఇచ్చట వే లో ప్లుతస్వరమున్నది. తీ లో ప్లుతస్వరమున్నది. ఆ రెండు స్వరములకు యతిమైత్రి ఇచ్చో సంఘటితము.

1 చమత్కార రామాయణము - అప్పకవీయము 3-239.
2 ఆంధ్ర మహాభారతము — సభాపర్వము 2-174
3 కళాపూర్ణోదయము 4-112.
4 తిక్కన భారతము — శాంతి పర్వము 1-287.
5 మనుచరిత్ర - ద్వితీయాశ్వాసము.
6 హరిశ్చంద్రోపాఖ్యానము 2-147.
7 రంగనాథ రామాయణము - అప్పకవీయము 3-248
8 విజయసేనము - అప్పకవీయము 3-254.
9 వజ్రపంజర శతకము - అప్పకవీయము 3-257.

# 19
# ప్రాసయతి

యతికి బదులు ఛందస్సున కనుగుణముగ ప్రాసము నెలకొల్పుట ప్రాసయతి. ప్రాసలక్షణములు ఇచ్చోటఁగూడ చెల్లనగును ప్రాస పూర్వాక్షర నియమము, సబిందుకతానియతి మున్నగునవి ప్రాసమునకు వలెనే పాటింప నగును. ఉదాహరణము—

ఆ.వె॥ దేవకీ కుమార ! గోవర్ధనో ద్ధార !
తోయజాక్ష ! పాండవేయ పక్ష !
ఘనవినీలగాత్ర ! ముని జనస్తుతి పాత్ర !
యదుకులాబ్ధిసోమ ! కదన భీమ ! [1]

వృత్తములలో ప్రాసయతి చెల్లదు. ప్రాసనియతి లేని పద్యములందు సర్వ సాధారణముగ ప్రాసయతి చెల్లును. ద్విపదకు ప్రాసనియతి కలదుగావున, ప్రాసయతి వేయరాదనియే లాక్షణికులలో అధిక సంఖ్యాకుల మతము

ఉదాహరణము :—

తే గీ॥ తరపి వెన్నెల ఆణిముత్యాల సొబగు
పునుగు జవ్వాది ఆమని పూలవలపు
ముద్దు రవళులు కస్తూరిపరిమళములు
కలిసి యేర్పడె సుమ్మ మా తెలుగు బాస [2]

పై తేటగీతి పద్యములో ప్రథమ పాదమున, 1, 4 గణముల మొదటి అక్షరములకు అనగా "త" - "త్యా" లకు యతి చెల్లుట సుగమము. అట్లే రెండవపాదమున "పు" — "పూ" లకు యతి చెల్లచున్నది. కాని మూడవ పాదమునందు యతిస్థానమునందలి "ము" — "ప" లకు, నాలుగవ పాదము నందలి "క" - "తె" లకు స్థూలదృష్టికి యతి కుదురదు. కాని యతికి బదులు యతిస్థానములందు ప్రాసనిల్పుట ప్రాసయతి యనబడును.

పై పద్యమున 3, 4 పాదములందు ప్రాసయతి చెల్లుచున్నదనుట సుగమము.

ప్రాసయతి — ఛందశ్శాస్త్రము అంగీకరించు స్థలములందే ప్రయుక్తము కాదగునను మాట మరువరాదు. [3]

---

1 అప్పకవీయము 3-269.

2 ప్రగతిగీత; అవతారిక-నండూరి రామకృష్ణమాచార్య

3 ప్రకరణాంతరముల, ప్రాసయతికి ఈ గ్రంథమున ఉదాహరణములు కొల్లలు.

# 20

# రలయతి, ఋకార యతి, అఖండయతి

అప్పకవి తెలుగులో యతి పరిణామ క్రమ వికాసమును సవిస్తరముగ సోదాహరణముగ సాంగోపాంగముగ సమీక్షించి వివరించియున్నాడు. అప్ప కవికి సమ్మతముగాని యతులలో ముఖ్యముగ పేర్కొనదగినవి—ఇందుగాగమయతులు

ఈ విషయము సవిస్తరముగా భిన్నయతులు అను శీర్షిక క్రింద "వెలయతి" వివరణమున "ఇంచుగాగమయతులు" సమీక్షింపబడినవి. తెలుగులో బహుకవి జనామోదమును బొందిన ఈ యతులను అప్పకవి అంగీకరింపలేదు.

(1) "ర-ల"లకు యతి :

అప్పకవి ర ల లకు యతి నంగీకరింపలేదు కాని పూర్వకవి ప్రయోగములు గలవు.

శా॥ లోకుల్ మెచ్చ వ్రతంబు నాతలపు తీర్పున్[1]

శా। లీలా హాస్య కళా ప్రసంగముల నుద్రేకించి[2]

రాజకుమారు దేలంగ గలడు[3]

"ఉ - ఫ" లకు యతి

గో, పుల గణియింప ధాతయును నోపడు[4]

(2) ఋకారయతి :

క్ష ప్తి లేదు శౌరి గుణావళికి ననంగ[5]

అనగా ఇ, ఏ — ఎ ఏ లంగూడిన ల శ లకు ఋకారమునకు యతి చెల్లును.

---

1 కాళహస్తీశ్వర శతకము.

2 కాశీఖండము 6-20.

3 శ్రీనాథుని సునంద చరిత్ర.

4 భాగవతము 5-462.

5 ఛందోదర్పణము 1-90.

సీ॥ అతనివంశమున వా రతిధనలబ్ధులై
కృత వీర్యుడనమెల్లి క్ల ప్తి చేసి॥[1]

సీ క్షృత పయోరాశి సం క్లప్తా వధిక మైన
చంచత్కుశ ద్వీప జగతిఁజేరి [2]

## (3) అఖండయతి :

అచ్చులకు అచ్చులే యతి చెల్లుట - స్వర ప్రధాన యతిగా పాటించుట తెలుగులో సంప్రదాయము. య-హ అక్షరములకు అచ్చులతో యతి ఘటింప దగును. నిత్య సమాసయతులు - ఉపసర్గయతులు (ప్రాది యతులు) మున్నగు నవి అఖండములుగ నెంచి ఉభయములకు - స్వరములకుగాని వ్యంజనములకుగాని యతి ఘటింపనగును.

అట్లుగాక - సంధిగతమైన అచ్చును అఖండముగ చాటించి సంధిస్థలమున నిలిచిన వ్యంజనాక్షరమునకు యతి గూర్చుట అఖండయతి. అఖండయతి నిల్పు శబ్దమందు స్వరయతి నిల్పుటకు ఏ అభ్యంతరమును లేదు. అప్పకవి అఖండయతిని అంగీకరింపలేదు. కవిజనాశ్రయకారుడు - అఖండ యతిని అంగీకరించెను. కవిజనాశ్రయములోని ఉదాహరణ పద్యము—

ఉ. మానుగ విశ్రమాక్షర సమంచితమై స్వరమాదినం దదీ
యాను గుణాక్షరంబ కొనియైనను జెప్పఁగ నొప్పు నీక్రియన్
దాను సహస్ర భాస వృషభాధిపుఁడన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండవడి పొల్పగు నాది కవి ప్రణీతమై

ఇచ్చట స్వాముతో కలిపిన వృషభ + అధిప = వృషభాధిప అని యున్నది గావున పాదాది భాకును సంధిగత భాకును అఖండ యతి యని అఖండయతి అంగీకరించువారి వాదము.

కాని - అప్పకవి కవిజనాశ్రయ పద్యమును (నిత్యసమాస యతి భేదమైన) ఉపసర్గయతికి ఉదాహరణముగా నెన్ని వృషభ + అధి + ప అని విరిచి అధి : ఉప సర్గ కావున ఆ యతి చెల్లుననియు, అట్టి ఉపసర్గవిరహితమైన సంధియైనచో - వ్యంజనమునకు యతి వేయరాదని ప్రతిపాదించెను. పృథక్ ప్రయోగార్హములు గాని శబ్దములు సంధించినపుడే అఖండమగు ఉభయ యతి చెల్లునని అప్పకవి మొదలగు లాక్షణికుల వాదము.

1 నన్నయభారతము - ఆదిపర్వము - 7-133.

2 కాశీఖండము 5 - 281.

కూచిమంచి తిమ్మన-రామాయణాదులనుండి ఉదాహరణములు చూపియు, "ఇట్టి ప్రయోగములు కలవుగాని, అఖండయతికి త్రికవుల ప్రయోగములు లేవు గనుక నిది సుప్రయోగముగాదు" అని తీర్పు చెప్పెను. అఖండవడి సుప్రయోగము గాదని నిరసించిన కూచిమంచి తిమ్మన రచనయందే అఖండయతి ప్రయోగములు గోచరించుచున్నవి.

గురునాథ జంగంబు గోరినవస్తువు
నెద్దియైన ముదంబు నివ్వటిల్ల"

మున్నగు ప్రయోగములు శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు ఉదాహరించినారు.[1]

అఖండయతికి భారతములో గూడ ప్రయోగములు చూపువారున్నారు. కాని ప్రతివాదులు వానికి అఖండయతిగాని పాఠాంతరములు చూపుచున్నారు.

శా తంత్రము లాచరించి వసుధామర ముఖ్యులు[2]
సీ కమ్మని, కఖిలార్థ లాభంబు కలుగుచుండు[3]
సీ। మూ చకమ్మకు దీర్ఘమాయురస్తు[4]
చ। వైన వసుధా స్థలంబునఁ గవీంద్రులు[5]
తే గీ కాశి యణిమాది సిద్ధుల కాటపట్టు[6]

అఖండయతికి పై ప్రయోగములను శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు తెలుగు ఛందోరీతులలో చూపినారు.

అఖండ యతిని అంగీకరింపజాలని కవి పండిత బృందము నేటికిని లేక పోలేదు. అఖండయతిని అంగీకరించువారును ప్రయోగవైరళ్యమును గమనించినవారే.

శ్రుతి సుభగమైన వర్ణమైత్రి తెలుగు యతికి ఆద్యప్రకృతి. తెలుగు యతిస్వరూపములో అంతస్తత్వమునకు విరుద్ధముగాకుండ ఏర్పడిన క్రమపరిణామ వికాసము సహృదయులకు అనుభవ పునరుక్తము. తెలుగువారికి 'యతి' ప్రియతమమైనదనుటకు, సహజ సిద్ధమైనదనుటకు తెలుగు బాసలోని సామెతలే సాక్ష్యము.

యతి ప్రాసలు కవితాగానమునకు మృదంగ వ్యాపారము నిర్వర్తించును.

---

1 తెలుగులో ఛందోరీతులు.
2 కాశీఖండము.
3 పోతన భాగవతము
4 క్రీడాభిరామము.
5 భీమఖండము
6 కాశీఖండము

